# గంధర్వరాజగానం

రచయిత:

ఉభయభాషాప్రవీణ, అష్టావధాని

శ్రీ శిష్ట్లా లక్ష్మీకాంత శాస్త్రి,

తెలుగుపండితులు

లీలాపబ్లిషర్సు విజయవాడ 2.

శ్రీలా ప్రచురణలు
ప్రథమ ముద్రణ
1960

సంపాదకుడు
యం. జగన్నాధరెడ్డి

వెల : రూ. 5-00

ముద్రణ :
శ్రీలా ప్రెస్,
విజయవాడ-2.

# ఇందులో

వేదస్తంభుడు

రత్నప్రభ

శ్రీధరుడు

గోపాలుడు

జ్యోత్స్నావళి

దీపకము

# ఒకమాట

నేను 'గంధర్వరాజు' అనుపేరుతో నిదివరకొక నవ ప్రాసియుంటిని. దానిని సంకుచితముగావించి, యీరూపమున ప్రకటించితిని. దీనిని ప్రథమముద్రణ గావించుటకులీలా ప్రక టనాలయమువారి కొసంగితి. వారు దీనిని ముద్రించి ప్రక టించినందులకు నా కృతజ్ఞతలు. అసలునవల కొలదికాల ములో ప్రకటింపగలను.

గ్రంథకర్త

ఉ॥ శా॥ ప్రవీణ శిష్ట్లా లక్ష్మీకాంతశాస్త్రి.

అష్టావధాని.

# వేదకుంభుడు

"నాయనా! వేదా! నామాట వినుము. నీ తండ్రికీ సంగతి తెలిసినచో క్షణమైన నింట నుండనీయడు. రాజెరింగిన నిన్ను తప్పక దండించును. అందు మూలమున నీతండ్రి కపకీర్తియు నీకు కీడును రాగలదు. లేక లేక పుట్టిన యొక్క కుమారుడువు. అల్లారు ముద్దుగా పెంచుకొన్న బిడ్డవు. నీ యగచాట్లుచూచి నేనెట్లు సహింప గలుగుదును. పవిత్రమైన బ్రాహ్మణ వంశమున పుట్టితివి. నీతాత ముత్తాతలు దేశ దేశములందు పేరుపొందిన పెద్ద పండితులు. నీతండ్రి వేద విద్యలు నేర్చిన శాస్త్రవిదుడు. యజ్ఞయాగాదు లొనరించిన సోమయాజి. మహారాజుల మన్ననలను బొందినవాడు. ఇరువంకలందు వ్రేలువంచి చూపించ తగిన గుణహీను లెవరు లేరు. నీకీ చెడుగుణము లెక్కడనుండి యలవడినవి? దుష్టులతోడి స్నేహమును మానుము. నీతండ్రి మాటటుండనిమ్ము. రాజచండశాసనుడు నీ ప్రవర్తనమును గురించి కొంచెము చెవిసోకిన చాలును నిన్ను రాజ్యమునుండి వెడల నడిపించును. తర తరములనుండి యనుభవించుచున్న యగ్రహారముల నూడపెరికికొని పుడిసెడునీరైన పుట్టకుండ చేయును. తరువాత మాకు నిలువ నీడలేక మలమలమాడి పోవలసి వచ్చును. నీయొక్కని మూలమున మనవంశములోని వారికందరకు చేటు మూడును. నీవు సకల శాస్త్రములు నేర్చుకొని రాజాది రాజుల సన్మానములను బొందగలవని మీతండ్రి గంపెడాసపెట్టుకొనెను. ఆయన యాశలన్నియు

గాలిలోగట్టిన మేడలవలె నేల, నేలపాలుగావించెదవు? తండ్రి! యీడువచ్చిన బిడ్డడవు. చేతి కక్కరకు రాగలవని యెన్నో కలలు కనుచుంటిమి. అవి నిష్ఫలము కానీయకుము. ఇంత కును మించిపోయినదేమియు లేదు. సకల పాపములను హరించు గంగాభవాని యున్నది. ప్రతి నిత్యమా భాగీరథియందు తెల్లవారక మునుపు స్నానమొనరింపుము. విశ్వేశ్వరుని దర్శింపుము, గురుకులమున కరిగి వేదవిద్యలను జదువుము. హరిహరసోమయాజి కుమారుడు తండ్రిని మించిన మహా పండితుడు. పరమ నిష్ఠాపరుడు. బుద్ధిమంతుడను కీర్తి సంపా దింపుము. నా కుమారుడు వేదకుంభుడు సకల వేదశాస్త్ర విద్యావేత్తకాగలడు. వాదోపవాదములందు కాశీపండితు లను జయించును. సోమయాగము గావించును. సత్రయా గము లొనరించును. తన కీర్తి నలుదిక్కులందున్న పర్వ తములపై చెక్కించును. సిలాశాసనములు వేయించును. దాన ధర్మములొనరించునని చుట్టుపక్కములతో నేనెప్పుడు చెప్పుకొని యుప్పొంగు చుందును. నామాట నిరర్థకము చేయకుము. నీతల్లి కోరిక తీర్పుము. తోడివారలలో మెప్పు సంపాదింపుము. ఇరుగు పొరుగువారల పొగడ్తలను బొందుము. కులకీర్తులను నిలువబెట్టుము'' అని తల్లి బహువిధముల బోధించినది.

హరిహర సోమయాజి మహాపండితుడు. నాలుగు వేదములు మొదటినుండి చివరివరకు నక్షరములు బీరుపోకుండ నభ్యసించెను. ఆరుశాస్త్రములు షడంగములు నాలుకచివర నాట్యమాడుచుండును. ఆయని విద్యాసరస్వతి యనియు

బ్రహ్మయే హరిహరసోమయాజిగా జన్మించెననియు జనులలో వాడుకకలదు. ఆయన యిరువదియైదేండ్ల ప్రాయమునందు కాశ్మీర, కాంభోజ, గాంధార, దేశములందు దిగ్గంతుల వంటి పండితులతో శాస్త్రవాదము లొనరించెను. వారి నోడించి బిరుదులు దాల్పించెను. మహారాజులాయన పాండిత్యమునకు బేలుపోయిరి. ఛత్రములు చామరములు నాందోళికలు నొసంగి గౌరవించిరి. అప్పటి కాశిరాజు శిలాదిత్యుడు, ఆయన మంచి సాహితీవేత్త, నీతి కోవిదుడు పరాక్రమశాలి, శాస్త్రపండితుడు. హరిహరసోమయాజిని స్వయముగా తన సభకు పిలిపించెను. అప్పటికి మూడుతరములనుండియు నాయన తాతముత్తాతలు శిలాదిత్యుని పూర్వీకుల మన్ననలను బొందిరి. అగ్రహారమును గైకొనిరి. శిలాదిత్యుడు హరిహర సోమయాజికి కనకాభిషేకము చేయించెను. అడిగినంతమాత్రము లోనే యజ్ఞయాగాదులు జరిపించెను. తన యాస్థానమునందు ప్రధాన పండితునిగా నియమించెను. హరిహర సోమయాజి పేరు, ప్రతిష్ఠలు ఎశదిశలందు వ్యాపించెను. అనేక రాజ్యములనుండి పండితు లాయనకడకువచ్చి దర్శించి పోవుచుందురు. వివిధ శాస్త్రములందలి సందేహములను తీర్చికొందురు.

హరిహర సోమయాజి పరమ నైష్ఠికుడు. మూడువేళల యందు నగ్నిహోత్రములు నిత్య నైమిత్తికర్మలు, క్షణము తీరికలేదు. మధ్య మధ్య మహారాజు వర్తమాన మంపుచుండును. ఆయన ధర్మసందేహములు తీర్పవలయును. శిలాదిత్యునకు హరిహర సోమయాజి మాట వేదములోనిపాట.

ఆయన చెప్పినగాని మహారాజునకు నచ్చదు. ఇవి యిట్లుండ పండితులతో గోష్ఠి వాదములు. శిష్యులకుపాఠములు, క్షణముతీరిక యుండదు. కుమారునిగురించి ప్రశ్నించుటకైనను తెరిపిలేదు. తెరిపియున్న రాత్రులయందు కుమారుడు నిద్రపోవుచుండును. లేపి పరామర్శ చేయుటకు నిష్టముండదు. తల్లియే కుమారుని మంచిచెడ్డ లరయుచుండెను. ఐదవయేటనుండియు నాయిల్లాలు అమరకోశము - నానార్థ రత్నమాల - ఏకాక్షర నిఘంటువు వల్లె వేయించినది. పంచకావ్యములు నాటకత్రయము వ్యాఖ్యానములతో నోటికి వచ్చినటుల చెప్పినది. కౌముది సంత చెప్పినది. అప్పటికి వేదకుంభునకు పదేండ్లు వచ్చినవి. తండ్రి వాని కుపనయనము గావించెను. వేదాధ్యయనమునకు గురుకులమున ప్రవేశపెట్టెను. అప్పటినుండి వేదకుంభుని పరివర్తనము మారిపోయినది. చెడు స్నేహములు పట్టెను. పెడదారులు త్రొక్కెను. జూదగాండ్రాతని స్నేహితులైరి.

ప్రతిదినము తెల్లవారుజామున లేచును. గురువుల యొద్ద కరుగుచుంటినని తల్లితో చెప్పును. ఇల్లు వెడలి జూదరులవెంట తిరుగును. క్రమక్రమముగా దొంగతనము లలవడినవి. ఇంట వెండి బంగారములను దొంగిలించుకొనిపోయి జూద మాడనారంభించెను. గాలిలో పెట్టిన హారతి కర్పూరమువలె పెట్టెలోని వస్తువులు పెట్టెలోనే మాయమగుచుండెను. తల్లి వేదవతి మహాయిల్లాలు. భర్తమనసు వెంట సంచరించు పరమ పతివ్రత. కుమారునిగుణములుపసికట్టినది సత్యము జాడతీసినది. బహువిధముల నీతులు గరపినది. కా ప్రయోజనము లేకపోయినది. ఒకవంక కన్నకడుపు ఇంకొ

వంక భర్త. ఎవరికేది తటస్థించినను తనకే కీడుమూడును. భర్తకు చెప్పవలయునని తలంచినది. కాని కుమారునిమీద ప్రేమ నోరురానిచ్చినదికాదు. మాటాడక యూరకున్నది. తండ్రి హరిహర సోమయాజి యవినీతి సహించువాడుకాడు. కుమారుని నింటినుండి వెడలకొట్టును. తల్లి యా యెడబాటు సహింపలేదు. మరల మరల చెప్పిచూచినది. కుక్కతోక వంకర తీర్ప నెవరిసాధ్యమగును. కుమారుని చెడుప్రవర్తనము ముదిరిపోయినది. ఒకనాడు తల్లి మెడలోని హారములను దొంగిలింప యత్నించెను. తల్లి యదిచూచినది. చివరిసారి చెప్పవలయునని తలంచినది. ఆమె ప్రబోధమునకు వాని మనస్సు కరిగినది. నదీతరంగములవలె పొంగినది. కనుల నెంట నీరుదిగజారినది. అదే వేదకుంభుని పాపపంకమునుగడిగి నది. అతడు పశ్చాత్తాపము పొందినాడు. తల్లి పాదములపై బడినాడు. నాతప్పు క్షమింపుమని ప్రార్థించినాడు. ఇంక నిటు వంటి పాపములను చేయనని ప్రమాణము చేసినాడు.

తండ్రికి తెలియనీయవలదని ప్రబతిమాలినాడు. వేద వతి యమాయకురాలు. తెల్లనివన్నియు పాలు నల్లనివన్నియు నీరునని తలంచునది. కుమారుని మనసు మార్పునకు సంతో షించినది. కన్నీటితో కుమారు నభిషేకించినది. వానిని లేవనెత్తి.

"నాయనా! చిరకీర్తివికమ్ము"

అని యాశీర్వదించినది.

ఆనాటినుండియు వేదకుంభుడు తొలిజాము కోడి కూతతో లేచును. తల్లి తండ్రుల పాదములకు నమస్క-

రించును. గంగ కేగి స్నానమొనరించును. సంధ్యావందనము గావించుకొని యింటికి వచ్చును. వీధియరుగుమీద కూర్చుండి వేద పాఠములు సంత చెప్పుకొనును. మరచి పోయిన శ్లోకములను జ్ఞాపకము చేసికొనును. సందేహములను తల్లినడిగి తెలిసికొనును. కుమారుని వివేకమునకు మూర్ఖ నకు తల్లి లోలోన నుప్పొంగి పోయినది. వాని నీతి నియమ ములకు సంతోషించినది. ఇంటిపనులన్నియు వేదకుంభున కప్పగించినది. తాను భర్తకు సేవకావించు చుండెను.

నెలరోజులు గడచినది. దేవీ నవరాత్రిపండుగ దినః ములు వచ్చినవి. రాజసౌధము మహావైభవముగా నలంక రింప బడినది. ఆరువేళల మంగళవాద్యములు, పండితుల వేద ఘోషలు, వందిమాగధుల స్తుతి పాఠములు, నలుదిశ లందు మారుమ్రోగుచుండెను. ఒకవైపున దేవీపూజలు, ఒకవైపున బ్రాహ్మణులకు సమారాధనలు. ఒకవైపున పురాణ కాలక్షేపములు, హరికథలు నెడతెరిపి లేకుండెను. నానాదిశలనుండి మహాపండితులు సభా భవనమునకు వచ్చిరి. మహారాజు శిలాదిత్యుడు సింహాసనమున కూర్చుండెను. శంఖారావములు మ్రోగినవి. విజయదుందుభులు ధ్వనించి నవి. ఆటకత్తెలు నాట్యముచేసిరి. పాటకత్తెలు పాడిరి. వైణి కులు వీణవాయించిరి. పిమ్మట మహామంత్రి శిలాదిత్యుని యానతి ననుసరించి యిట్లనెను.

శ్రీ రాజరాజాది రాజరాజ సార్వభౌమ వీరాధివీర మాతంగకంఠీరవ శ్రీ శ్రీ శ్రీ శిలాదిత్యసార్వభౌములు నేటిదిః

మున శాస్త్రవాదమునందు గెలుపొందిన వారికి నీ విజయ హారము స్వయముగా బహూకరింతురు.

విజయహారము వజ్రనిర్మితము. దాని కాంతులు పండితుల కనులకు మిఱుమిట్లు కలిగించినవి. దానిని పొంద వలయునని యువ్విళ్ళూరిరి. సన్నకారు మొదటిలోనే చాలించుకొనిరి. మధ్యకారు మాటాడలేక మరలిపోయిరి. మహాపండితులు వాద ప్రతివాదములకు పూనుకొనిరి. ఒకనివెంట నొకనినిగా హరిహరసోమయాజి వచ్చిన పండితులనందరిని నెదుర్కొనెను. వారిని తొలివాదములోననే జయించెను. అందరు జితోస్మియని దోసిలియొగ్గి నిలిచిరి. మహారాజు పరమానంద భరితుడైనాడు. రత్నసింహాసనమునుండి దిగివచ్చి హరిహర సోమయాజి కంఠమును విజయహారముతో నలంకరించినాడు. 'విజయీభవ, దిగ్విజయీభవ' అని హరిహరశాస్త్రి శిలాదిత్య సార్వభౌము నాశీర్వదించినాడు. సభ ముగిసినది. హరిహర సోమయాజి యింటికి వచ్చెను. నాటి విజయమును గురించి భార్యతో ముచ్చటించుచు నావజ్రహారముచూపెను. వేదవతి మహానందమును పొందినది. 'నా కుమారుడుకూడ యింతటివాడు కావలయు'నని లోలోన నాశించినది.

'నాయనా! విజయా! చూచితివా నీతండ్రిగారిపాండిత్యము.' అని వాని కా వజ్రహారము చూపినది. వేదకుంభుడు మురిసిపోయినాడు. అంతలో నెవరోవచ్చి హరిహర సోమయాజిని పిలిచిరి.

ఆయన 'దేవీ! నే నిప్పుడేవత్తును. హారముభద్రము చేయుము,'అని చెప్పుచు వెడలిపోయెను.

# ౨

వేదకుంభుడు మంచముపైన పరుండెను. వాని కా రాత్రి నిద్రపట్టలేదు. ఇటు నటు పొరలనారంభించెను. కాని కంటికి కునుకురాలేదు. వచ్చినను తటాలున మెలుకువవచ్చును. వచ్చినంతనే కన్నులువిప్పుకొని యటు నిటు చూచును. ఆ చూపులలో వానికి విజయహారమే కనిపించుచుండెను. దాని కాంతులు వాని మనస్సును తబ్బిబ్బు చేయుచుండెను. తుఫాను గాలులవలె నాలోచనలు పొడమినవి. అవి యంతకంతకు విజృంభించి పోయినవి. ఆధాటికి వానిలేతమనస్సాగలేకపోయినది. చిగురాకు రెమ్మవలె రెపరెప లాడినది. అతడు గట్టిగా కన్నులు మూసికొనెను. అది లోపలినుండి వచ్చిన యారాటము. కన్నులు మూసికొన్నంత మాత్రముచే సడలునదికాదు. అది వానికి తెలియలేదు. దుప్పటి నాపాదమస్తకముముసుగు పెట్టుకొనెను. ఐనను నాతని యావేదన యణగలేదు. మరల మరలముసుగుతీసిచూచెను. దీపము వెలుగులో గోడకు తగిలించిన తాళపుచేతులు ధగ ధగ మెరయుచుండెను. అది పిలుచుచున్నట్టుల వానికి తోచినది. వాని గుండె దడదడ కొట్టుకొనినది. తాను తల్లికిచ్చిన మాట చెవులలో ప్రతి ధ్వనించినది. 'తల్లి దేవత' • యను మాటలుస్ఫుటముగా వాని నోట వెడలినది. వెంటనే కనులు మూసుకొని పరుండెను. 'వేదకుంభా!' వాని మనస్సే వానినట్లు ప్రబోధించినది.

'వేదకుంభా! లే'

వేదకుంభునకు కాలు సేతులాడలేదు. పెదవులు వణక నారంభించినది.

'ఊహూ. మాతృదేవత'

అనుచు మరల కనులు మూసికొనెను.

'నీతల్లి యిక్కడలేదు'

'లేదు. ఇచ్చినమాట? చేసిన ప్రమాణము?'

'మాటలు ప్రమాణములు గాలికిపోవును. డబ్బు మాత్రము నిలుచును. ఇటువంటి ప్రమాణములు నీకెన్ని చేయలేదు. జూదరులకు త్రాగుబోతులకు మాటనిలకడయా?'

'నామనస్సు మారినది'

'మార్పెంతసేపు? రానలయును. అట్లే మరల మార్చుకొనుము'.

'మా తండ్రి యింటినుండి గెంటివేయును'

'గెంటివేసినచో విశాలమగు ప్రపంచమున్నది'

'ఎందుకు?'

'జీవించుటకు'

'మరి తిండి?'

'నాకుపోసినవాడు నీరు పోయడా?'

'ఆ కష్టము నేను పడలేను'

'వేదకుంభుడు కనులుమూసికొనెను. వానికనులయెదుట మిలమిల మెరయుచు విజయహారము పకపక నవ్వినది. ఆ నవ్వునకు వేదకుంభుడు లేచినాడు.'

పిచ్చివాడా! తిండికుండదని భయపడుచుంటివా? ఒక్కసారి యిటుచూడుము! నా విలువ నీకు తెలియదు. పది

లక్షలు. జీవితాంతము వరకు జూదమాడుచు జీవించవచ్చును. నీకేమి కొరత? ఏ. ఇంకను సందేహమా? నాడు నాతో పాటింకెన్ని నగలున్నవో. నివు కుబేరుడవు కాగలవు. చదువు లని సంధ్యలని యీ తల్లిదండ్రుల యొత్తిడిలోపడి స్వతంత్రము లేకుండ బ్రతుకుట నరకమనుభవించుటవంటిది. స్వేచ్ఛగా జీవించుటయే మానవుని పరమావధి అది నీకు లభింపకలదు. అంతకంటె కావలసినదేమున్నది వచ్చిన సావకాశము పడ గొట్టుకొనకుము. సిరిరామోకాలడ్డువారుందురా. లెమ్ము. సాహసించినచో లక్ష్మిలభించును. లేనిచో నీ జీవితమింతే?

'మరి రాజదండన?'

'అడుగడుగున కనుమానములు. అదిపట్టుకొని నవ్వుడు కదా?'

'అవును ఊహూ. రాజభటులు యమదూతలు'

'ఎంత యమదూతలైనా డబ్బులో దైవమున్నాడు'

'ఆ. నిజము'

వేదకుంభుడు పక్కమీదనుండి లేచెను. మెల్లగా పాదములు నేలమీద మోపెను. సద్దుకాకుండా లేచెను. విజయహారము వానికి దారిచూపినది. కన్నువాల్పక దానివంక చూచుచునల్ల నల్ల ననడుగులు వేయుచూ కడదరికేగెను. తాళము చేతులనుతీసి తండ్రి పడకటి గదిలోని కరిగెను. హరిహర సోమయాజి గురకపెట్టి నిద్రించుచుండెను. పగలంతయు పని చేసిన బడలికచేత వేదవతి యొడలు తెలియక పడియుండెను. వేదకుంభుడు వారి స్థితిగతులను దూరమునుండి కనిపెట్టెను. మెల్లగా పెట్టెదాపునకుపోయి తాళముతీసెను. పెట్టెలోని

హాసములవలె తళతళ మెరియుచున్న యాభరణములు లోకదాని తరువాత నొకటిగా తీసెను. వాని నుత్తరీయము కొం గున మూటకట్టుకొని తాళము యథారీతిగా మరల బిగిం చెను. తాళముచేతులను గోడకుతగిలించి ద్వారములు తెరిచి కొని యింటినుండి వెడలిపోయెను.

తెల్లవారినది. వెలుగులు పొడచూపినవి. చాత్రాం తియు ప్రాణములుబిగపట్టుకొని కలతనిద్దురపోయిన పక్షిసంతా నములు రెక్కలు విదిలించి ముక్కులు పొడుచుకొనుచు కలకల కూయనారంభించినవి. తల్లిపొదుగులనుండి దూరము గాలాగి కట్టివేయబడిన లేగలు పాలకైయంబాయనియరచు చుండెను. హరిహరసోమయాజి హరినామ స్మరణము గావించు కొనుచు లేచెను. కాలకృత్యములు తీర్చుకొని గంగాస్నాన మునకరిగెను. సోమిదేవియు తనపనులందు నిమగ్నురాలై యుండెను. ఎవరికి వేదకుంభునిమాట పట్టలేదు. అతడు యథా రీతిగా నిత్యకృత్యములు తీర్చుకొనుటకరిగి యుండునని వా రూహించిరి. తలుపులు తెరచియున్న సంగతి వారంతగా పట్టించుకొనలేదు. సోమయాజి తెరచియుండునని సోమిదే వియు, సోమిదేవి తెరచియుండునని సోమయాజియుతలంచిరి.

ఆనాడు విజయదశమి. మహత్తరమైన దినము. పండి తులకందరకు శిలాదిత్య సార్వభౌముడు ప్రత్యేక సన్మాన ములు గావించును. నాటి కార్యకలాపమంతయు హరిహర సోమయాజి చేతులతో జరుగవలయును ఆయన పరీక్షాధికారి. బహుమానములు నిర్ణయించవలసినవాడు. రాజూరక చూచు చుండును. సోమయాజి పెందలకడనే కార్యకలాపములు

ముగించుకొనెను. సభాలంకారములకొరకు పెట్టె తెరచెను. కంఠాభరణము లేమియు లేవు. ఇటునటు వెదకెను. విజయ హారము కానరాలేదు. ఆయనకొడలుజల్లుమనినది. గుండెదడ దడ కొట్టుకొనినది. వరుసగా పెట్టెలన్నియు పరిశీలించెను. ఎచ్చటను గానరాలేదు. అనుగుణం తడబడినవి.

"సోమిదేవి! సోమిదేవి!" అని పిలిచినాడు.

ఆమె పొడ్డిలోనిపనులన్నియు విడిచి భర్తపిలుపుతో పరుగెత్తుకొని వచ్చినది.

"వేసిన తాళములు వేసినట్లేయున్నవి. నా విజయ హారము కనబడుటలేదు. గండపెండేరములు గానరావు. రాజ గారు పారితోషికముగా నిచ్చిన యుంగరము లగుపించవు. ఏమైనవి? దొంగలెవరైన యపహరించిరా? వేదకుంభుడేడి ఏమయినాడు. కానరాడేమి?"

యని తడపడుచు ప్రశ్నించెను. సోమిదేవికి సర్వము వగతమైనది. ఆమెయొడలు కంపించినది. ఆవేదన తలకెక్కి గుండె ఆగిపోయినది. మొదలునరికిన యరటివలె కెవ్వున కేక పెట్టి నిలువున కూలిపోయినది. ఆమె యింక లేవలేదు సోమ యాజికేమియు నర్థముకాలేదు. రాతిబొమ్మవలె కదలక నిల బడిపోయెను. తెరిచినకనులు మూతపడలేదు. ధారాపాతముగా, నశ్రుధారలు దిగజారినవి. అంతలో నొక దివ్యతేజము సోమిదేవి శరీరమునుండి వెలువడినది. అతి సుందరాకార ముతో సోమయాజిముందు నిలిచినది. హరిహరుడా దివ్య రూపమునుగాంచి యాశ్చర్యము నొందెను. అదిస్వప్నమేమో యని తలంచెను. ఆ దివ్యమూర్తి సోమయాజితో నిట్లనెను.

ఆర్యా! విచారింపకుము. కాలకర్మము లెవరికిని తప్పింప నలవికాదు. మానవుడు తాను సకలమునకు క ర్త యని యూహించుచుండును. కాని వానినాడించు నొక దివ్యశక్తి వెనుకనున్నదని తలంపడు. మానవుడొక పాత్రధారి. కర్మానుగతముగా తనపాత్ర నభినయించి పోవుచుండును. స్వామీ! నేనొక గంధర్వాంగనను. నా పేరు చిత్రప్రభ. నాతండ్రి నన్నతి గారాబముగా పెంచెను. సకలవిద్యలు నేర్పించెను. నాకు భరత శాస్త్రము నేర్చుకొనవలయునను నభిలాష కలిగినది. దానిని రచించినవాడు భరతాచార్యుడు. ఆ శాస్త్రమునందు భారతీయులు మిగుల ప్రవీణులు. దేవనాట్యమునకును భరతనాట్యమునకును తారతమ్యమున్నది. భరతాచార్యుని శిష్యపరంపర లోనివాడు నందయోగీంద్రుడు. అత డభినయశాస్త్రము నామూలాగ్రము నెరిగినవాడు. శిష్యులకు నిరంతర మభినయము నేర్పుచుండును. వానిని మించిన భరతశాస్త్రవిదు డింకొకడులేడు. ఆయన బ్రాహ్మణులకు తప్ప యితరులకా విద్య నేర్పకూడదని నియమము చేసికొనెను. నేను దేవతాంగనను, నేనా యోగీంద్రునొద్ద భరతవిద్య నేర్చుకొనవలయునని తలంపు పుట్టినది. నాకోరిక నాతండ్రి కెరిగించితిని.

ఒకనాడు నేను బ్రాహ్మణ కన్యారూపమున నందయోగీంద్రుని యాశ్రమమున కేగితి. ఆ మునివరుని దర్శించి నాకు భరతవిద్య చెప్పుమని ప్రార్థించితిని. ఆ ముని చంద్రుడందుల కంగీకరించెను. నేనాయనకు సపర్య లొనరించుచు భరతనాట్యమును నేర్చుకొనుచుంటిని. అంతలో వసంతకాల మరుదెంచినది. చెట్లు చిగిరించి పూవులను దాల్చినవి. వన

మంతయు విచిత్ర వింత వాసనలతో ఘుమఘుమాయించెను. ఆశ్రమ సౌందర్యము నాహృదయము నాకర్షించినది. నేనా యానందచంద ముల ననుభవించుచు, ఆనందము స్వేచ్ఛగా విహరించితిని సాయం కాలమైనది. ఒడలంతయు చెమటలుపట్టినది. గంగాతీరమున కరుదెంచితిని. అచట పొంగి పొరలి ప్రవహించు నీటిప్రవా హమును పరికించుచు నన్ను నేను మరచిపోయితిని. అనుపమము నొక పురుషమూర్తి నా కనులయెదుట కనిపించెను. ఆయన రూపముదాల్చిన వేదాగ్నివలె వెలుగొందుచుండెను. మొదటి చూపులో శివుని తపస్సు భంగము కావించినపాపము తొల గించుకొనుటకై గంగాస్నాన మొనరింపవచ్చిన మన్మథు డేమో యని తలంచితిని మరల మరల నీక్షించితిని భూలో కమునకువచ్చినజయంతుడని భ్రమించితిని ఆ నవమోహన మూర్తి యల్లనల్లన గంగాజలంబులందు దిగి స్నాన మొన రించెను. సూర్యునకర్ఘ్యమొసంగి తీరమునకు వచ్చెను. అచ్చట దర్భాసనముపరచిపద్మాసనాసీనుడయ్యెను. కనులు మూసికొని దైవధ్యానముగావించుకొనుచుండెను. నాహృదయము వానికై యువ్విళ్ళూరినది. వానిని పరిణయమాడి సంసారసుఖము ననుభ వింపవలయునని యాశ కలిగినది.

ఒక గంటకాలము గడచినది. ఆ సుందరమూర్తి లేచి యింటిదారిని బట్టెను. నేనేమిచేయుచున్నది, నాకు తెలియదు. నాపాదములు వాని పాదచ్ఛాయలందడుగులిడినవి. నేను వాని వెంట నడచితిని ఆయన యిల్లు చేరెను. అంతలో నింట నుండి గొల్లుమని యొక్కపెట్టున శోకము వినిపించినది. ఆయన త్వరత్వరగా లోనికరిగెను. నురుగులు నోటినుండి వెడలు

చుండ నాయనభార్య స్మృతితప్పి పడియుండెను. ఆ యువతి నొక పాము కాటువేసినది. మరుక్షణమూమె మరణించెను.

నేనా దృశ్యము కన్నార చూచితిని. ఆ యువకుడు భార్యమీదపడి పరిపరి విధముల విలపింప నారంభించెను. ఆయన విలాపములు నా మనస్సును గలంచినవి. నాకనులనుండి తలవని తలంపుగా దిగజారినవి. ఇట్టి దయామయుని భార్యనగుటకంటె నదృష్టమేముండునని యోచించితిని. నాకు పరకాయప్రవేశ విద్యవచ్చును. నేను నాయింటి కరిగితిని. నాతల్లితో సకలము నివేదించితిని. నాశరీర భద్రతలకు నియామకములు గావించితిని. మరుక్షణమునే యామృత శరీరమునందు ప్రవేశించితిని. అచటివారందరు వేదవతి బ్రతికినది. వేదవతి బ్రతికినదని "సంతోషించిరి. నాథా! యానాటినుండి యీనాటివరకు నీతో సుఖము లనుభవించితిని. వేదకుంభుడు నాతనయుడు కాకపోయినను మీకై వానిని ప్రేమించితిని. విద్యాబుద్ధులను నేర్పితిని. నేటితో నాశాపము తీరిపోయినది. ఇంక నాకు సెలవు."

చిత్రప్రభ యదృశ్యురాలయ్యెను. హరిహర సోమయాజి శిలావిగ్రహమువలె నిలిచిపోయెను. తన వృత్తాంతమంతయు కలయైనట్లు కనిపించినట్లైనది. ఆ కళేబరముపై బడి విలపింప మొదలుపెట్టెను.

హరిహర సోమయాజిగారింట నున్నారా ?

ఎవరది ?

రాజభటులము

ఏమిపని ?

శిలాదిత్య సార్వభౌములు తమరిని వెంటగొనిరమ్మని యానతిచ్చిరి.

ఇప్పుడే వచ్చుచుంటిని.

రాజాజ్ఞ యముని యానతికంటె కఠినమైనది. బ్రతుక తలంచిన వారెవరు దానిని నిరాకరించరు. హరిహర సోమయాజి భార్యశవమును పదిలపరచి భటులవెంట రాజునుదర్శింప నరిగెను. శిలాదిత్యుడు కొలువుతీర్చి సింహాసనముమీాద కూర్చునియుండెను. హరిహర సోమయాజిని చూచినంతనే వానికనులలో నిరాదరము పొడచూపినది. సోమయాజి శిలాదిత్యునివంక చూచెను. వాని కవళికలలో తొల్లింటి గౌరవాదరములుకనిపించలేదు. అది వానికివింతగాతోచినది. మహారాజు నాచారము చొప్పున విజయోస్తుఅనియాశీర్వదించెను. రాజా యాశీర్వమునువిినినటులుగానిగ్రహించినటులగానితోచలేదు. హరిహర సోమయాజికి రాజునెడనిరసనభావముకలిగినది. పండితులభిమానవంతులు దైవమైనవారినగౌరవించినసహింపరు ఇంక రాజులమాట చెప్పవలసిన పనిలేదు. శిలాదిత్యుడు హరిహర సోమయాజిని తీవ్రముగా చూచెను. సోమయాజి వానిని నిర్లక్ష్యముగా చూచెను.

సోమయాజిగారూ! మేము గౌరవ పూర్వకముగా మిమ్ము సన్మానించిన విజయహారము మీ కంఠమున కాన రాదు. అదేమైనది? పదవికి తగిన యలంకారములు ధరింపక కొలువున కరుదెంచుట మర్యాద నతిక్రమించుట కాదా? యని మహారాజు ప్రశ్నించెను.

సోమయాజి యిట్లుసమాధానము చెప్పెను.

మహాప్రభూ! మర్యాద నతిక్రమించుట యని నాకు తెలియును. కాని ప్రమాదమునకు నేనేమి చేయగలను. ధర్మము నాల్గుపాదముల నడిపించు సార్వభౌముల పీటనే దొంగలుందురని నేను తలంపలేను. నిన్న రేయి యెవరో మాయింట ప్రవేశించి నాసర్వాభరణములు దొంగిలించుకొని పోయిరి. ప్రభువులు సమర్పించిన విజయహారముకూడ కాన రాలేదు.

'దొంగలు పట్టుబడిరా?'

'లేదు ప్రభూ పట్టుబడలేదు!'

'ఔను. ఇంటిదొంగ నెవరు పట్టగలరు'

సోమయాజి విభ్రాంతి నొందెను. రాజు దాని కర్థము కాలేదు. ఆశ్చర్యపోయి వానివంక చూచుచుండెను.

'ఈ గండపెండేరము లెవరవి?'

సోమయాజి వానిని పరిశీలించెను. అందు శిలాదిత్యుని ముద్రలున్నవి. అవి కాశ్మీరపండితుని జయించిననాడు రాజు వానిచేతికి తొడిగెను. హరిహరసోమయాజి వానినిగుర్తించెను.

'ఇవి నావే ప్రభూ! తమరే నా కిచ్చితిరి. అని సమాధానము చెప్పెను.

'ఈ యుంగరములు?'

'ప్రభువు లుధారపూర్వకముగా దానము చేసినవి'

'ఈ హారములు?'

'తమ కొసంగినవే?'

'మీా కుమారుడెక్కడ?'

'గంగాస్నానమున కరిగి యుండవచ్చును'

జూదమాడుటవలనకలుగు మహాపాపమును తొలగించుకొనుటకు గంగాస్నానము, రాజదండనము తప్పించుకొనుటకు కొంగజపములు.

'మహాప్రభువులు పొరపడుచున్నారు. నాకుమారుడట్టి వాడుకాడు'

'అద్దమున్నది. ముఖము చూచుకొనవచ్చును.' ఎవరక్కడ? ఆజూదరుల నిటుతీసికొనిరండు'

అనిరాజాజ్ఞాపించెను. రాజభటులు నలుగురు జూదరులను గొలువులోనికి కొనివచ్చిరి. శిలాదిత్యుని యానతి వెంబడి వారిట్లు వచించిరి.

'మహాప్రభూ మేము దొంగలముకాము. ఈనగరమునకు వెలపలనున్న పాఠశాలలో జూదమాడుచుందుము. మాకిది నిత్యవృత్తి. మాయాజూదమునందు నేర్పరులము. ఆశాలయందు ద్రాగవచ్చినవారితో జూదమాడి వారిధనమును గెలుచుకొని కట్టుబట్టతో పంపివేయుచుందుము. హరిహర సోమయాజిగారి కుమారుడు వేదకుంభుడు ప్రతినిత్యము గురుకులమునకు పోవుచుంటినని యింటచెప్పి యాపాఠశాలకు వచ్చుచుండును. ఇంటదొంగిలించి తెచ్చిన ధనాభరణము

లతో మాతో డ జూదమాడును. తెచ్చినదంతయు నోడిపోయి యింటికరుగును. ఈనడుమ వరుసగా కొన్నిదినములు వేద కుంభు డగుపించ లేదు. మాతో జూదమాడువారు లేకపోయిరి. మేమువేగ కుంభునికై వెదకుచువచ్చితిమి. అతడు స్నానము నకై గంగకువచ్చెను. మేమువానిని కలుసుకొంటిమి. జూదపు కొలువునకు రమ్మని యడిగితిమి. తానేకారణముననో వచ్చు టకంగీకరించ లేదు. మేము బలవంతముచేసితిమి ఐననాతడిష్ట పడ లేదు. తల్లికి తానుమాటయిచ్చితిననియు, జూదమాడన నియు, వేదాధ్యయనముకుబోవలయుననియుమాతో చెప్పివెడలి పోయెను. మేము నిరాశచేసికొని మరలితిమి. ఆ రేయి నడు జామున నీనగలతో వాడ శాలకు వచ్చెను. మాతో జూదమాడి వీనిని నూరుమాడలకు మాకువిక్రయించెను. సకలమునోడి పోయెను. అంతలో రాజభటులువచ్చి మమ్ము బంధించిరి. రాజదండనకువెరచి వేదకుంభుడు తప్పించుకొని పారిపోయెను'

అమాయికుడైన హరిహర సోమయాజికి తలతీసినట్లై నది. ఆ యగౌరవము భరించుటకంటె మరణించుట మేలని తలంచెను. రాజు సోమయాజివంక చూచియిట్లనెను.

'ఆర్యా! దీనికి మీరేమందురు?'

'ప్రత్యక్ష ప్రమాణమున కపవాదమా ప్రభూ!'

అని సోమయాజి కన్నీరు కార్చుచు తలవంచుకొనెను. ఒకవంక భార్య మరణము, వేరొకవైపున కుమారుని దుష్ట ప్రవర్తనము వానిహృదయమున కాల్చివేయుచుండెను. అది కమిలిపొగలు రాజెను.

'కుమారుని తగు కట్టుదిట్టములో నుంచుకొనలేక పోవుట మీాతప్పుకాదా?' అనిరాజు ప్రశ్నించెను.

'అదినాపూర్వకర్మము'

అదియసమర్థుల సమాధానము

'పొరపాటు. కర్మ దైవప్రేరితము. దానినతిక్రమింప గలవారులేరు. ఇంకనాకుసెలవు.'

అనిసోమయాజి వెనుకకుతిరిగెను.

'మీారు రాజతిస్కారము గావించుచున్నారు'

'అది మాయింటను ఒంటనులేదు. మీాయుప్పుకూడుతిని మిమ్మతిరస్కరించు నవివేకినికాదు'

'కాదనిన పుత్రముచే లోకమునమ్మనా?'

కానకకన్న సంతానంబని వేదకుంభు నల్లారుముద్దుగా పెంచితిని. తలపైనెక్కించుకొంటిని. మూపులపైమోసితి. గారాబమున నెత్తిముద్దాడితిని. విద్యాబుద్ధులు నేర్పించితిని మహాపండితుడై నా కులగౌరవము కాపాడునని యాసలు పెట్టుకొంటిని. నాయంతవాడయి నన్నుమరపించునని యువ్విళ్ళూరితిని. నాయనంతరము నాకు తిలోదకము లొసంగి పరలోకమునకు దారిచూపించునని యోచించితిని. అట్టినాకు మారుడే దురాత్ముర్గులతో గలిసి నాకుకానివాడయ్యెను. ఏ మహాసాధ్వి యందచందములకు లోలోన మురిసిముప్పందమై చరించితినో. ఏపతివ్రతావతంస నాకు తోడయివర్తింపునిత్య కర్మలకు విఘాతము కలుగకుండజీవితమింతవరకు నానందంగా గడిపితినో' ఏయిల్లాలి నాదారముగా చేసికొని యీాసంసార సముద్రమున దాటనూహించితినో యట్టినాసర్వస్వమే నన్ను

వీడిపోయినది. ఇంకనాకీ ప్రపంచముతో నేమి సంబంధము గలదుమహారాజా! నేను సన్న్యాసిని. సర్వమువిడి నిరాధారమై యున్నవాడను. మీరునాకు ప్రీతి పూర్వకముగా నొసంగిన యీయగ్రహారములు హారములు నలంకారములు మీరే గ్రహింపుడు. ఇవినాతోవచ్చునవి కావు. ప్రభూ! నేనింతవరకు నొకరిని తిరస్కరించిగాని నిందించిగాని యెరుగను. అబద్ధ మాడియెరుగను. అపకార మొనరించియైన నెరుగను. ఇది నా పూర్వకర్మానుభవము'

అని హరిహర సోమయాజి యింక నేదో చెప్పబోవు చుండెను. అంతలో నిరువురు బ్రహ్మచారులు రాజుకొలువు నందు ప్రవేశించిరి. సోమయాజి పాదములపైబడి వెక్కి వెక్కి యేడ్చుచు,

'గురుదేవా! మీరిచటికి వచ్చిన యనంతరము సోమి దేవిగారి కళేబరము నెవరో దివిజుడొకడువచ్చి తీసుకొనిపోయి నాడు' అని మనవిచేసెను. సోమయాజి వారిని ప్రియముగా లేవదీసి యిట్లనెను.

'నాయనలారా! దుఃఖింపకుడు. మానవుడు జన్మించి నప్పుడే మృత్యువు వెన్నంటి తిరుగుచుండును. దాని తప్పిం చుకొనగలవారు భూమియందొకరైనను లేరు. మృత్యువునకు దయా దాక్షిణ్యములు లేవు. దానికోరలు వాడియైనవి. నాయ నలారా! మీగురుపత్ని ధన్యురాలు. కావుననే యీ పరాభ వాగ్నియందుపడి పరితపించకుండ మరణించినది. పాపపంకిల మైన యీ నాశరీరమూ ఇల్లాలిదేహము నంటకూడదని దేవ తల యభిప్రాయము. అందుకనే దివిజులామె శరీరమును దేవ

లోకమునకు గొసి పోయితి. పాపుకనుజీవములతోడి శవంబునైన నేసింకను జీవించియుంటిని. ఆపరమపతివ్రతకు దహనసంస్కారములైన చేయునోచుకొనని పరమ దగ్ధుడను. ఈ పరాభవ మనెడు మండుటెండలో మాడి మాడి మసిపాత్రనై దిక్కు లేక త్రిమ్మరుటకే నేటింకను జీవించితిని. రాజా మీయాశ్రయమునందు చిరకాలము జీవించితిని. మీ కరుణకు నేను కృతజ్ఞుడను. సర్వసంగ పరిత్యాగినగు నా కీభిరుదములతో పనిలేదు. రక్తము, మాంసము, ఎముకలు, చర్మముతో జనించితిని. వానికోసనే యిచటనుండి యడుగుచుంటిని. నాహృదయమున రేగుచున్న సంతాపాగ్ని యెక్కడనుండి నన్నగ్ని పర్వతమువలె దహించి వేయునో నాకు తెలియదు. మహారాజా నాకింక శెలవు.'

హరిహరసోమయాజి వెనుకకు తిరిగెను. శిలాదిత్యుని కన్నులవెంట నీరు వెడలెను. అచ్చటివారందరు విలపింప నారంభించిరి. అప్పటికిరువది సంవత్సరములు గడచినవి. హరిహరసోమయాజి శిలాదిత్యున కొకవిధముగా గురువును, మంత్రియు, పురోహితుడును ధర్మబోధకుడుగాపనిచేయుచుండెను. మహారాణియు హరిహరసోమయాజివలన పురాణేతి హాసములను నీతి శాస్త్రములను వినుచుండును. హరిహరసోమయాజి దేవాంశ సంభూతుడనియే యామె యభిప్రాయము. ఆమాటయే మహారాజుతో నప్పుడప్పుడు చెప్పుచుండెడిది. అట్లే యాయనకు తోచుచుండెను. లేనిచో నిన్ని శాస్త్రములు, వేదములు, పురాణములు, నీతి ధర్మములెవరు చదువగలరు. చదివి జ్ఞప్తియందుంచుకొన గలవారెవరు ?

రాజునకు మతి విభ్రమము కలిగినది. కనులయెదుటనే సోమయాజి సభాభవనము వెడలి దాటిపోయెను.



పరమేశ్వరా! నన్నేలయిట్లుపుట్టించితివి తండ్రీ! పుట్టించితివి. పోదురాచారులగు జూదరులతోడ స్నేహమునా కేలకూర్చితివి. కూర్చినకూర్చితివిగాక నాకుదొంగబుద్దుల నలవరించితివి. ఇంటదినియింటివాసములు లెక్కపెట్టినట్లు నాక్షేమమునుగోరి నాయభివృద్ధికి పాటుపడుచు నేనే సర్వమని నమ్ముకొనియున్న నా తలిదండ్రులకే ద్రోహము తలంపవలయునా? నేను విశ్వాసఘాతకుడను. నాకు సుఖమెట్లు చేకూరగలదు. తల్లి వలదని నెత్తిన నోరుపెట్టుకొని యెంతచెప్పిన నామె మాటవిననైతిని. పరమసాధుస్వభావయగు నా జననిమనస్సు నొప్పించితిని. తెల్లవారకమునుపు లేచి నాకంటె ముందుగా నా యాకలిదప్పు లెరింగి నలయు భోజన పదార్థములవండి యొడ్డించు నాతల్లిని వీడితిని. ఇంక నాకు దిక్కెవరు? నావంశోన్నతికి నిలబెట్టగల నాతనయుడే వేదకుంభుడని యెల్లవారితో చెప్పి నుప్పొంగు నా తండ్రికి భరింపరాని తలవంపు ఘటించితిని. ఇప్పుడు నన్నింక రక్షించు వారెవరు నాకష్టములనరసి రక్షించువారెవరు? సరిలేని సిరిసంపదలతో తులతూగితిని. రాజభోగము లనుభవించితిని. కష్టమనిన నేమోయెరుగక దాదిరొమ్మునను దూదిపరుపులను బెరిగితిని. చివరకు తినకూటికి లోటయి కారాకులు మేయవలసివచ్చినది. తల్లితండ్రులమాట విననివారిగతి యింత కంటె మరేమగును.

ఇది మహారణ్యము. పర్వతగుహాలు మారుమ్రోగ భయంకరముగా గర్జించు సింహములు; సింహములకు భయపడి పారు మదగజంబులు; మదగజంబు కాలిక్రింద నలుగుడుపడి నడువలేక నడువలేక కుయ్యోయని యేడ్చు నక్కలుగాని మరేమియు గానరావు. ఇంక నాగోడు వినువారెవరు. నా కడుపుమంట తీర్చువారెవరు? అయ్యో తల్లిదండ్రులారా! పాలసముద్రమువంటి మీకులమున కాలకూట విషమువలె జన్మించితిని. మీకు కళంకము కలిగించితిని. ముందు నాకేమి దారి. విద్యానంతుడని జీవింతునంటి నాపొట్టపొడిచిన నక్షరము కానరాదు. కత్తిచేబట్టి బ్రతుకుదునందునా పిరికి తనమాదారి నరుగనీయదు. బిచ్చమెత్తుకొని కాలము గడుపుదునందునా పనులకుపెట్టుటయే కాని యడుగి పెట్టించుకొనుట యెన్నడెరుగను నేనేమిచేయను? ఎక్కడికిపోవుదును?

అని వేదకుంభుడు నానావిధముల దుఃఖించుచుండెను. కాశీనగరము విడిచి నాల్గుదినములైనది. తిండిలేదు. శాంతి నిద్రలులేవు. దుఃఖముచేత మనస్సు వికలమగుచుండెను. ఎడతెగని ప్రయాణములతో నొడలుబడలిక చెందినది. ముందు తనగతి యేమియను తలంపులు రేగినవి. అవి తుపాను గాలులవలె వానిని ముందువెనుకల కూచివేయుచుండెను. అతడొకపిచ్చివానివలె పోవుచుండెను. అతడుపోవునదెక్కడికో వానికే తెలియదు. కాలుముందునకు సాగుచున్నది. మనస్సాలోచించుచున్నది. పరితపించుచున్నది. దారి తెన్నులగుపించుటలేదు. తనజీవిత మందకారమని తోచినది. అట్లే యాయడవియందు కొంతదూరముపోయెను. ఆకలిభరింపరాని

దైనది. కాళ్ళు తేలిపోవుచున్నవి. అడుగు సాగించుటకైన శక్తిచాలకుండెను. మధ్యాహ్నమున కాతడొక సెలయేటి దరినిచేరెను. దానిని చూచినంతనే వానికి ప్రాణములు లేచి వచ్చినవి. వేదకుంభుడచట కొంతసేపు కూర్చుండెను. చల్లని పిల్లవాయువులకు వానియొడలి చెమటలారినవి. అతడు సెలయేటియందు స్నానముచేసెను. అచ్చటచ్చట కోసికొని వచ్చిన చెట్లఫలముల నారగించెను. అంతలో నిద్రాదేవత వానినావరించినది ఆవులింతలు కనుకూన్కులుకలిగినవి. అతడటునిటు పరికించెను. ఆసమీపమునందొక మఱ్ఱిచెట్టుకలదు. చల్లనిదానినీడ నుత్తరీయము పరచుకొని పరుండెను, అంతలో నిద్రపట్టినది.

సాయంకాలమైనది. సూర్యుడు పడమటి కొండ చాటునకరిగెను చీకటులావరించినవి. వనమంతయు మసిపూసినటులైనది. వేదకుంభునకు నిద్రమెలుకవరాలేదు. గాఢనిద్రలో గురకలు పెట్టుచుండెను. రాత్రి నడిజామకావచ్చినది. అడవిజంతువుల యరపులు విరివిగావినిపించినవి. వేదకుంభుడు లికిపడిలేచెను. కన్నులు నులుపుకొనెను. ఇటునటు చూచెను. చుట్టుపట్టునందంతటను గాఢచీకటులు జీరాడుచుండెను. ఇది చెట్టు నిదిపుట్టయని వివరింప రాకుండెను. వేదకుంభునకు భయమువేసినది. ఒడలుకంపించినది. గుండెదడదడ కొట్టుకొనినది. చెడ్డచేనునకు మూడుమంచలేమిటికి 'భయపడి లాభమేమి? కానున్నది కాకమానన' దని కొంతధైర్య మవలంబించెను ప్రాణములను గాపాడుకొనుటకై యామఱ్ఱిచెట్టు నెక్కవలయునని తలంచెను. అంతలో వానికొక యేడ్పువిని

వించినది. అది స్త్రీ కంఠధ్వని. వేదకుంభుడు చెవియొగ్గి యాలించెను.

'అయ్యో! నన్నీ క్రూరుడు చంపదలంచు చున్నాడు. నన్ను కాపాడువారు లేరా? మహాదేవా నీకైనను దయరాదా?

అనుమాటలు వినిపించినవి. వేదకుంభుని గుండెలం తయు చెమటలుపోసినవి. కాళ్ళు కదలింపలేక పోయెను.' పాపమామెయెవరో? నావంటియభాగ్యురాలు కావలయును. దుఃఖమునందున్నవారికి దుఃఖమునందున్న వారే తోడుపడ వలయును. నేనేమిసాహాయ్యము చేయగలను. నేనుచిన్నవాడను వాడెవడో రాక్షసుడై యుండవలయును. వానితో నే నెట్లు పోరాడగలను? ఆమె నెట్లు విడిపింపగలను! నావలన నామెకు మరింత కీడుకలుగవచ్చును. అయిననుపోయిచూచెదను' అని యోచించెను. ఆ ధ్వనివచ్చిన వైపునకు బయలుదేరెను. అతికష్టముమీద వేదకుంభుడొక పాడుపడిన దేవాలయమును దాపురించెను.

ఆ దేవాలయము చాల పురాతనమైనది. దాని ప్రాకారములు పడిపోయినవి. ద్వారములు కూలిపోయినవి. తలుపులులేవు. వేదకుంభుడు ప్రాకారమునుదాటెను. ముఖమంటపము చేరెను. దానికొలదిదూరములో గర్భాలయమున్నది. అందుండి వెలుగు కనిపించెను. వేదకుంభుడు మెల్లమెల్లగా నడుగులు వేయుచు నా గర్భాలయము దరికరిగెను. ప్రక్కన నిలుచుండి లోనికి తొంగిచూచెను. ఎదుట నిలువెత్తున మహాకాళుని విగ్రహము కనిపించినది. అది మహాభయంకరముగా నుండెను. మెడలో కపాలమాలికలు, నెనుకల పేరులు

మోకాలివరకు వ్రేలాడుచుండెను. ఒకచేత గండ్రకత్తి యిం కొకచేత పుఱ్ఱె, శూలాంకుశములు మిగిలిన చేతులందు తాల్చెను. నడుమునకు పులిచర్మము కట్టబడెను. కన్నులు బండిచక్రములవలె గుండ్రనై వెలుగొని వచ్చుచుండెను. మొదట వేదకుంభుడు విగ్రహమునుకూడ, నొక రాక్షసుడనిదో తలంచెను. వాని జీవితములో నెన్నడు నట్టి విగ్రహము చూచి యుండలేదు. దానిముందు హోమకుండము. దానినుండి నిప్పు మంటలు ఛటఛట ధ్వనులతో పైకిలేచి కప్పునంటుకొను చుండెను. ఆగుండమునకొకప్రక్కన నొండచారిన రెండుపుఱ్ఱెలు గలవు. అవి తెల్లగా మెరయుచుండెను. చుట్టు మాంసముల నెముకలు చెల్లాచెదరుగా పడియుండెను. దానిముందు భయం కరమగు నాకారముగల రాక్షసుడు కూర్చుండెను. వానిశరీ రము తుమ్మబొగ్గువంటె నల్లనై నిగనిగలాడుచుండెను. వాని మెడలో లావైన రుద్రాక్షపేరులుగలవు. తలవెంట్రుకలు జడలుకట్టి క్రిందివరకు వ్రేలాడుచుండెను. ఎఱ్ఱనిగడ్డము నెఱ్ఱని మీసము. అతడొక కొండశిఖరమువలె ద్వారమున కడ్డ ముగాకూర్చుండెను. మాటిమాటికి మంత్రములు చదువుచు తెడ్డువంటి యెముకను పుఱ్ఱెలోముంచి క్రొవ్వును మంటల యందు వోయుచుండెను. దానికామంటలు నిలువెత్తున లేచు చుండెను. ఆవెలుగులో వేదకుంభుడు గుండమునకు నెడమ ప్రక్కన నొకయువతిని గాంచెను.

ఆమె యిరువదియేండ్ల వయస్సుగల యౌవనవతి. ఆమె యొడలంతయు జేగురురంగు పూయబడినది. తలవెంట్రుు కలు ముఖమున వ్రేలాడుచుండెను. నుదుట గంగసిందూరపు

బొట్టుకలదు. కనులందు పెట్టినకాటుక సగముచెరిగిపోయినది. మొలకొక పులిచర్మముకలదు. పైనొక పులిచర్మము కప్పబడినది. ఆమె యొక స్తంభమునకు కట్టివేయబడియుండెను. ఆమె మెడనిండ యెఱ్ఱని యడవి పూలమాలికలు వ్రేలాడుచుండెను. దండలకు, నడుమునకు, పూలదండలు కట్టబడియుండెను వేదకుంభుడు నిప్పుకుంటల వెలుగులో నామెను పరికించిచూచెను. ఆయువతి ప్రాణాలమీద నాసవిడిచినది. విచారముచేత కన్నీరుకార్చుచు మెడవేలగిలపడెను. ఆమెను సగముప్రాణము లేచిపోయినది. మిగిలినసగము కన్నుకొలకులలో నాగిపోయినది. అదివెడలిపోకుండ కన్నులుమూసికొని కడసారి పరమేశ్వరుని ధ్యానించుచుండెను.

వేదకుంభుడా యింతిని తేరిపారచూచెను. వానికి మనస్సులో దయారసముబికి యుప్పొంగినది. ఆమె నెట్లయినను రక్షింపవలయునని నిశ్చయించుకొనెను. వానిప్రాణములకు లక్ష్యముచేయలేదు. వేదకుంభుడిటునటు పరిశీలించెను. లోపలి పైపొరకమూల త్రిశూల మొకటి వానికి కనిపించినది. చేయిచాచి యాశూలమును నెమ్మదిగా తీసికొనెను. అది యా రాక్షసుడు హోమముచేయుటకు ముందచ్చట పదిలముగా నుంచెను. వేదకుంభుడా శూలమును గట్టిగాపట్టుకొనెను. అతడు చిన్నవయస్సువాడు. శూలముబరువైనది. వానిచేతులు గజగడవణకినవి. వానియదృష్ట మారాక్షసుని చంపుటపై నాధారపడియున్నది. మరణమో, ప్రాణరక్షణమో రెండిటిలో నేదోయొకటి తేలవయును. అతనిజీవములపై నాసనెన్నడో వదులుకొనెను. అయినను బాలికామణి రక్షించుటకు తన

జీవితాశను విడువరాదు వేదకుంభుడు ధైర్యమవలంభించెను. రాక్షసుని పుర్రెకు దిగువభాగమున మెడకుసరిగా గురిచూచెను. తనబలమంతయు కూడ తెచ్చుకొని తీవ్రముగా పొడిచెను. దానితో నాశూలముకొన మెడలోలోతుగా గ్రుచ్చుకొనినది. కనులు మిఱుమిట్లుగొలుపుచు నిప్పుమంటలు రేగినవి. క్షణము శిరము తెగి యగ్నిగుండమున పడినది. ఆరాక్షసుని శరీరము నిప్పులలో బొరలినది. అతడు కెవ్వున కేక వేయుచు ప్రాణములు విడిచెను. ఆకేకకు యువతికనులు తెరచి చూచెను. రక్కసుని శరీరమునుండి రక్తము ప్రవాహమువలె పొంగిపొరలి వచ్చుచుండెను. వానితల తెగిపోయినది. ఎదుట వేదకుంభుడగుపించెను. ఆమెకానందము నాశ్చర్యము దుఃఖము నొక్కసారిగా వచ్చినవి. వేదకుంభుడా యింతిని కన్నీళ్ళతో చూచెను. ఒకవైపున నామెను రక్షింపగలిగితిననిఆనందము; ఇంకొక ఒకవైపున తన ఘనకార్యమునకు గర్వము; పొడమినది. తనలోతాను పరమేశ్వరునకు కృతజ్ఞతలు తెలుపుకొనెను. ఆతడుకనులు విశాలముగా తెరిచిచూచెను. వానికి ముందువంక నొక పురుషుడు కనిపించెను. వేదకుంభుడు మరలమరల వానివంకచూచెను. అటువంటి రూపమును తానదివరకెన్నడు చూడలేదు. అతడు మానవుడుకాడు. తలపై కిరీటము, చెవులకు రత్నకుండలములు, చేతులకు సింహతలాటపు మురుగులు, మెడలోనవరత్నహారములు, చీకటిలో ధగధగ మెరయుచుండెను. వానిముఖమునుండి తళతళకాంతులు వెడలుచుండెను వానివస్త్రములు బంగారు మయములు. వేదకుంభుడు వానివంక నెగాదిగచూచెను. ఆయువతియు

వానిని తేరిపారచూచినది. కొంచెముసేపు సందేహించినది, మరలచూచినది.

తనకట్టుత్రాళ్ళు త్రెంచుకొని. 'తండ్రీ' యని వచ్చి కౌగలించుకొనినది. ఆపురుషుడామెను వక్షమున చేర్చుకొని కన్నీటితో నామెతలను తడిపెను. వేదకుంభుడు వారిని చూచుచు నట్టేనిలబడిపోయెను. కొంతసేపయినది. వేదకుంభుడు వారినేమని మాట్లాడింపవలయునో తోచలేదు. అంతడతిబాలుడగుట వారితో నెన్నడును మాట్లాడలేదు. మాట్లాడునవకాశము కలుగలేదు. ఆయువతి తండ్రికౌగిలిలోనుండి వేదకుంభుని వెనుకకు చూచినది. ఆమె తొల్లిటివలె లేదు అమృతము పంచవచ్చిన మోహిని భూలోకమున నిలిచిపోయినదేమోయని తలంచెను. అప్సరసలను గురించి వినియుండెను. వారిలోనొకతె కావచ్చునని యూహించెను. వారుచాల యందకత్తెలు. వేదకుంభునకు వింతతోచినది. ముందునకడుగు పెట్టెను.

'అయ్యా! మీచరిత్ర నాకెంతయు వింతగానున్నది. మీరెవరు? ఈమెనీకూతురెట్లయినది. ఈమెను మీరెట్లు బంధించి తెచ్చితిరి' అనిప్రశ్నించెను. ఆ దివ్యపురుషుడు తన కథ యిట్లు చెప్పమొదలుపెట్టెను.



కైలాసపర్వతమున కుత్తరదిశగా నరువదిక్రోసుల దూరమున రత్నకూటమను నొక మహాపర్వతము కలదు. అది నూరుయోజనముల పొడవును నంతియ వెడల్పును, కలిగి

యుండును. దానిశిఖరములు గురువెంద కెంపులతో ధగధగ మెరయుచుండును. అందుచేత దానికి రత్నకూటమను పేరు వచ్చినది ఆపర్వతమునందు చాల గుహాలుకలవు.అవియన్నియు రత్నములు పొదగబడియుండును. అందుమూలమున రేయిం బవళ్లాగుహాలు వెలుగుల నీనుచుండును. ఆ పర్వతమునందు విద్యాధరులు నివసించుచుందురు. ఆ పర్వతముమీాద వజ్ర కటకమను నొక పురముకలదు. ఆ పట్టణమునందలి మేడలు వజ్రమణులతో నిర్మింపబడియుండును. అవి యాకాశమండలము నంటుకొనుచుండును. వానికాంతులు మహాప్రవాహము వలె నంతటను వ్యాపించి యుండుటచేత, రాత్రులు సైతము దేవతలరాకపోకలకు దారులుచూపుచుండును. ఆపురములోని పూదోటలుప్రతికాలమునందునుచిగురాలతోనుపూవులతోడను వింతవింత సువాసనలను వెల్లిగొలుపుచుండును. ఆనగరమున వృక్షములు చేతనంటినచో రసములూరు పండ్లతో నిండి యుండును. అందలి సరస్సులు బంగారు కమలములతో కనులపండువు గావించును. అచటి పూదీనెల యందములు చెప్పనలవికాదు.

ఆ పట్టణమును చిత్రధ్వజుడను విద్యాధరుడు పరిపాలించెను. అతడు చిన్నతనమునుండియు బృహస్పతిని సేవించి వానివలన సకల శాస్త్రములు, నీతివిద్యలు నభ్యసించెను. తుంబురునకుపరిచర్యలుగావించి గానమునలవరచుకొనెను. కాని వానికి తృప్తికలుగలేదు. సర్వవిద్యలను సాధించు తత్వభేదియనువిద్యను సంపాదింపవలయునని తలంచెను. అందు మూలమునచిత్రధ్వజుడు దేవలోకములన్నియు తిరిగెను. భూలోక

మునకు వచ్చెను. పాతాళమున కేగెను. మహామునులను సందర్శించెను. పండితులతో ప్రశంసించెను. తత్త్వభేది విద్య మహాప్రభావము కలది. మంత్రశాస్త్రములందు దానినిగురించి యున్నది. దానికి సరస్వతి యధిష్ఠానదేవత. ఋషి యు నామెయేయని పొగడినవారేగాని యామంత్ర ముపదేశించిన వారు లేరు. చిత్రధ్వజుడొక నిశ్చయమునకు వచ్చెను. సరస్వతివలస దానిని పొందవలయును. అది తపస్సుచేతనేగాని యింకొక విధముగా సాధ్యముకాదు. అని నిరూఢము చేసికొనెను. పదిసంవత్సరములన్నపానములు మానెను. అఖండముగు తపము గావించెను. వానికి సరస్వతి ప్రత్యక్షమైనది. 'వత్సా! నీ తపమునకు మెచ్చితిని. నీకుగల కోరికయేది?' యని ప్రశ్నించెను. చిత్రధ్వజుడు భక్తి వినయములతో నమస్కరించి 'అమ్మా! విద్యాపిపాసినగు నాకు తత్త్వభేది విద్యను ప్రసాదింపు' మని వేడెను. ఆమె సంతోషించి యా విద్య నాచిత్రధ్వజునకు ప్రసాదించినది.

చిత్రధ్వజుడు సకల విద్యలెరిగినవాడయ్యెను. తండ్రి తరువాత యతడు వజ్రకటకమునకు రాజయ్యెను. అతడు నీతి తప్పక రాజ్యమేలుచుండెను. ఆకాలమున రాక్షసరాజ్యమును జ్వాలాజిహ్వుడను వాడు పరిపాలించుచుండెను. అతడు చాల పరాక్రమవంతుడు. ధైర్యసాహసముకలవాడు. అతి భయంకరాకారుడు. వాడు గర్జించునప్పుడగ్నిమంటలు వానినాలుక వెంబడి బయలు వెడలును. అవి దావాగ్నికంటె భయంకరములై యెదుటనున్నవారిని దగ్ధముచేయును. జ్వాలాజిహ్వుడు వజ్రకటక మందమగు పురమనియు, ధనవంతమైనదనియు తన

పరివారమువలన వినెను. దానిని స్వాధీనము చేసికొనవలయు నని యూహించెను. దాని ప్రాకారములు దృఢములైనవి. వానిని భేదించుట యసాధ్యము. చిత్రధ్వజుడు మహావీరుడు. ఒక మాత్రముచేత లోబడువాడు కాడు. వాని సేనలు నంత మాత్రమువే. స్వామిని మించిన వీరాధివీరులా సైనికులు యుద్ధమనిన వెనుతీయరు. ప్రాణములమీద నాశలు మాని పోరాటమునకు సిద్ధమగుచుందురు. చిత్రధ్వజుడనిన వారికి బహుప్రాణము. వారిబొందెలో జీవములుండగా వానికే యపాయము రానీయరు. ఆసంగతి జ్వాలాజిహ్వునకు తెలిసినది. అయినను తనకోర్కె నెరవేరవలయునని నిశ్చయించుకొనెను. కాని విజయమునుగురించి వానికి నమ్మకము లేకపోయినది.

జ్వాలాజిహ్వునకు రక్తాక్షుడనునొకసహోదరుడు కలడు అతడు కన్నులురిమిచూచినచో రక్తముకురియును. అదిదుర్గంధముకలదయి యెదుటివానినుక్కిరిబిక్కిరి చేయును. వాని ప్రాణములను దీయును. జ్వాలాజిహ్వుడు తనసహోదరున కీవార్త చెప్పిపంపెను. రక్తాక్షుడమితమగు సేనలతో జ్వాలాజిహ్వునకు సహాయము చేయవచ్చెను. జ్వాలాజిహ్వుడమితోత్సాహముతో సంతులేని సేనలను సమకూర్చుకొని వజ్రకటకము మీదకు దండువెడలెను. ఆసంగతి చిత్రధ్వజుడు చారులవలనవినెను. అతడు యుద్ధప్రయత్నములన్నియు గావించి జ్వాలాజిహ్వునిరాకకై యెదురు చూచుచుండెను. ఒకనాటి యర్ధరాత్రి సమయమున జ్వాలాజిహ్వుడు వజ్రకటకమును ముట్టడించెను. రాత్రులందు రాక్షసులకు బలము పెరుగుచుండెను. చిత్రధ్వజు

జాసంగతి నెరింగి తెల్లవారువరకు కాలమును గడిపెను. కాని యుద్ధమునకు వచ్చినవారు కూర్చుండి చూడరుకదా! రాక్షసులు మాయావులు తెల్లవారులోపున కోటలో ప్రవేశింపవలయునని విశ్వప్రయత్నములు గావించిరి. మాయా విద్యచేత నెవరికి కానరాకుండ ఆకాశమార్గమున కెగిరి, విద్యాధర సేనలమీద వివిధాస్త్రములను నాయుధములను ప్రయోగించిరి. విద్యాధరులు సకలవిద్యలయందారి తేరిన నేర్పరులు. అందు చిత్రధ్వజుడు కడుదిట్ట. రాక్షసుల మాయ లన్నియు నరయుచుండెను. వానికి ప్రతిక్రియ కావించుచుండెను.

అంతలో తెల్లవారినది. రక్కసుల బలము తగ్గినది. చిత్రధ్వజుడు తనసేనలతో జ్వాలాజిహ్వుని సేనలమీదపడెను. ఇరుతెగలవారికి భయంకరమైన యుద్ధము జరిగినది. అందొక సారి రాక్షసులకు, నొకసారి విద్యాధరులకు విజయచిహ్నములు కనిపించినవి. కాని చివరికి నిజముగా జయమెవరికి కలుగలేదు. ఇట్లురాత్రులందు రాక్షసులు పగటివేళలందు విద్యాధరులు గెలుపులను బొందుచు నెలదినములు యుద్ధము చేసిరి. చివరినాటి యుద్ధ మతిభయంకరముగా జరిగినది. జయాపజయము లానాటితో తేల్చుకొనవలయుననియుభయ పక్షములవారు తలంచుకొనిరి. చిత్రధ్వజుడు జ్వాలాజిహ్వుని తాకెను. విద్యాధర సేనాపతి విశ్వధమనుడు రక్షోకునితో పోరుసాగించెను. విద్యాధరులకే విజయము కలుగునని తలంచిరి. రాక్షసబలములు క్షీణించినవి. వానికి నిరాశకలిగినది. అది జ్వాలాజిహ్వ రక్తాక్షులకు గుండెపోటయినది. కానివారు ధైర్యమును విడువలేదు. వారికత్తులలో కరకుతనముతగ్గలేదు.

వారియట్టహాసములు నశింపలేదు. ఆసమయమున నొకవింత జరిగినది.

చిత్రధ్వజునకు హేలావతియను కూతురుగలదు. ఆమె యందాలబరణి. తండ్రియొద్ద నన్నివిద్యలు నభ్యసించినది. యుద్ధవిద్యలందారితేరిన దిట్టయైనది. రాజనీతి, దండనీతి పరిపూర్ణముగా నేర్చుకొనినది. తండ్రికి రాజ్యపరిపాలనము నందు చేదోడువాదోడుగా వర్తించుచుండెను. ఆమెతండ్రికి మిగులగారాబములబిడ్డ. రక్కసులతోడ యుద్ధమారంభమైనప్పటినుండియు తండ్రిని తన్ను యుద్ధమునకు గొని పొమ్మని ప్రతిమాలుచుండెను. ఎటుపోయి యెటువచ్చునో యనియు, నాడుదానిని రణరంగమునకు గొనిపోవుట యుచితముకాదనియు నందులకు సమ్మతించలేదు. ఆనాడుకోట సంరక్షణార్థమై యామెను నియమించి మూలబలములతో యుద్ధమునకు తరలివచ్చెను. రణావేశమున రాక్షసులను తరుముచు ముందునకు చొచ్చుకొనిపోయెను. జ్వాలాజిహ్వుడు చిత్రధ్వజునడ్డగించి యుద్ధమున నిలువరించెను. అప్పటికిసాయంకాలమైనది. అంతట వెనుకనుండి హేలావతి హేలావతియను నరపులు వినవచ్చెను. చిత్రధ్వజుడు తలయెత్తిచూచెను. కొంచెము దూరములో హేలావతి నెవరో రాక్షసులు చుట్టుముట్టి బంధింప యత్నించుచుండిరి. చిత్రధ్వజుడదికాంచి మనస్సు చెదిరినవాడయ్యెను. జ్వాలాజిహ్వునితోడ యుద్ధమునుమాని హేలావతి వైపునకు తనరథమును మరలించెను. విద్యాధరసైన్యములన్నియు వానిని వెంబడించినవి.

ఆ వ్యవధి చూచుకొని జ్వాలాజిహ్వుడు రాక్షస సేనలతో త్వరత్వరగా వజ్రకటకపురము ప్రవేశించెను. చిత్రధ్వజుడు పోయి చూచునప్పటికి హేలావతి యచ్చట లేదు. అందరు రాక్షసులే. అది రాక్షసులు గెలువలేక పన్నిన మాయయని చిత్రధ్వజుడు గ్రహించెను. విద్యాధర సేనలతో వెనుకకు మరలెను. కాని రాక్షసుల జయజయ ఘోషలు నలుమూలల వ్యాపించి అప్పటికి చీకటిపడినది. ఇంక తన ప్రయత్నము లాభములేదని యూహించెను. భార్యబిడ్డలను గాచుకొను నుపాయమాలోచించెను ధృతవేగుడను నొక మాయావిని రహస్యముగా పురములోనికి పంపి వారిని తన దగ్గరకు పిలిపించుకొనెను. అసలుసంగతి యిది. శైలాంగుడను రాక్షస సేనాపతి జ్వాలాసింహునితో నాలోచించి మాయా నాటకము నాడించెను. రాక్షసులు కామరూపులు. ఎవరి రూపమైన ధరింపగలరు. అతడు హేలావతి రూపమును దాల్చెను. మిగిలిన రాక్షసులు వానిని బంధించుచున్నట్లుల నటించిరి.

చిత్రధ్వజుడు భార్యబిడ్డలతో నరణ్యముల దారిపట్టెను. వానిమనస్సునందు రాక్షసులను సర్వనాశనముగావింప వలయునని తలంపుకలదు. అది త్వరలో జరుగవలయును. లేనిచో జ్వాలాజిహ్వుని సేనలు చెలరేగి విద్యాధరలోకమును సర్వనాశనము గావించును. అందుమూలమున దేవలోకమునకు కీడు వాటిల్లును. వానికొక యూహపొడమినది. గురువరుడగు బృహస్పతి కలడు. ఆయనయుపాయశాలి. దీనికిప్రతిక్రియ బోధింపగలడు ఆయనను దర్శించెదనని తలంచెను బృహస్పతిని

నూడ వెడలెను. తనస్థితిగతులు నాయనకు వివరించెను. బృహస్పతికి చిత్రధ్వజునిమీద జాలికలిగినది. వానిచేత సర్వజితి యను యాగమును చేయించెను. దానిమూలమున నతడు మహా తేజస్వియు, పరాక్రమశాలియునయ్యెను. చెదరిపోయిన విద్యాధరసైన్యములను కూర్చుకొని జ్వాలాజిహ్వుని మీదకిదండు వెడలెను. వానిని యుద్ధమునందెదిరించి యోడించెను. జ్వాలాజిహ్వుడు చిత్రధ్వజునకు భయపడి తమ్మునితో కూడ పాతాళలోకమునకు పారిపోయెను. చిత్రధ్వజుడును వానిని వెంబడించిపోయెను. ఆరకస్సులిద్దరును ప్రాణభయముచేత బలిచక్రవర్తి మరుగుచొచ్చిరి. చిత్రధ్వజుడు చేయునదిలేక తిరిగివచ్చుచు, కపిలమహర్షి యాశ్రమమును జేరెను. అచట సమీపవనమునందొక యువతిని చూచెను. ఆమె యతిలోకసుందరి. చిత్రధ్వజుడామె యందమునుగాంచి మతిభ్రమచెందెను.

ఆ యందకత్తె సుదాంశుడను గంధర్వరాజు భార్య సువర్ణప్రభ. ఆమెశరీరముపచ్చనిబంగారమువన్నెకలది. ఆమె కాలుమోపినచోటు లందెల్లడల పసిడికాంతులు మిసమిసలాడుచుండును. కావున ఆమెకు సువర్ణప్రభయను పేరు వచ్చెను. ఒకకారణముచేత నామె కపిలమహర్షి యాశ్రమమునందున్నది. ఆమె యంటరానియగ్ని. తెంపుచేసి దరిచేరినచో మాడి భస్మమగుదురు. ఆమె పరమపతివ్రత. ఆసంగతి చిత్రధ్వజునకు తెలియదు. చిత్రధ్వజుడామెను సమీపించెను. ఆమె యాదర గౌరవములు చూపించెనుఆతిథ్యయొసగెను. అదియంతయు నాతనిమీద ప్రేమయే. చిత్రని

ధ్వజుడూహించెను. అవివేకియై తనకోరికయామె కెరిగించెను. మహామూని యపుడింటలేడు. ఆమెకుకోపముభరింపరానిదై నది. ఐనను దానిని లోలోన నణచుకొనెను. తనవృత్తాంతమాతని కెరిగించెను. కాని చిత్రధ్వజుడు విద్యావంతుడయ్యును మూర్ఖునివలె నామెను బలాత్కరింప పోయెను.

'ఓరీ! యింటికివచ్చినవాని నాదరించుట నాధర్మము. విజయగర్వమున నొడలుమరచితివి. అవినీతినై ప్రవర్తించితివి రాక్షసుండవగుము' అని యామె చిత్రధ్వజుని శపించినది. ఆశాపమునకు భయపడినాడు చిత్రధ్వజుడు. శాపము మర లింపమని ప్రార్థించినాడు. ఆమె కనికరించినది.

'నాయనా! పశ్చాత్తాపము పాపములను పటాపంచలు చేయును. నీవురక్కసుండవైయుండి నీకూతురును బలికైకొని పోవుదువు. అచట నొక బ్రాహ్మణబాలునిచేత శూలముతో బాధవబడి మరణింతువు. అపుడుమరల నీరూపము నీకు వచ్చును' అనిపలికినది. ఆ చిత్రధ్వజుడనే నేను ఆమాటలు చెప్పుచుండగనె నారూపము మారమొదలుపెట్టినది తెల్లని నాశరీరము నీలమేఘములవలె నల్లనైనది. నేను క్రమక్రమముగా పెరిగి యాకాశము నంటుకొనునట్లయితిని. నోటి నుండి కోరలు పొడుచుకొనివచ్చినవి. కడుకొండ శిఖరము వలె లావును నెత్తును గలదయ్యెను. చింపిరితలయు కొకిబికి గడ్డము పాటమినది. నావికృతాకారము సమీపమునందున్న తటాకములో ప్రతిబింబించినది. దానిని చూచికొని నాలోనేనే భయపడితిని. నావిజ్ఞానమునశించినది. ఆకలి దప్పులు మితిమీరినవి. అచటి యాశ్రమవాసుల నందరిని

విసుచుకొని తినవలయునన్నంత కోరికకలిగినది. మొదట నాయెదుటనున్న స్త్రీపై బడబోయితిని. ఆమె తనచేతిలోనికి కొంతజలముతీసికొని వానిని మంత్రించి, నాపైవిసరినది. ఆజలముల ప్రభావమేమో నాకుతెలియదు. వెంటనే నే ను నూరుయోజనముల దూరమెగిరి భూలోకము నందొక మహారణ్యమునందు పడితిని.

౬

కుంభసూరా! తరువాత సంగతి వినుము. నేను లేచి చూచునంతకు సర్వము నంధకారముగా నుండెను. నాకనులు జ్యోతులవలె వెగిలినవి ఆవెలుగులో నేనొకమహాపర్వతశిఖరము మీదనున్నటుల కనిపించినది. చుట్టూ మహారణ్యము. ఆకలికి కడుపు దహించుకొని పోవుచుండెను. నేను భయంకరముగా నరచితిని. ఆయరపునకు వనమృగము లడలినవి. ఇటునటు నాల్గువైపుల పరుగెత్త మొదలిడినవి. నేనువానిని తరిమికావలసి నన్ని జంతువులను బట్టుకొని భుజించితిని. నేనిప్పుడామాట తలంచుకొనినచో నాకే విషాదము జుగుప్సయు గలుగు చున్నవి. కానలకొలందిగా వాని రక్తమును ద్రావితిని. నా యాకలితీరినది. ఆ యడవియంతయు రొదచేయుచు తిరిగితిని.

ఇట్లుకొన్ని సంవత్సరములు సంచరించితిని. లెక్కలేనన్ని జంతువులనుభక్షించితినిమానవమాంసమునుబుజించితినిశవము లనుతింటిని. చేయరాని నన్నిపాపములను చేసితిని. పడరానన్ని యగచాట్లుపడితిని. చివరకు వింధ్యపర్వతములకుత్తరదిశ యందున్నయడవినిచేరుకొంటినిఒకయర్ధరాత్రిసమయమునకడుసార

మాంసమునుతిని నెత్తురు త్రాగి, యొకమఱ్ఱిచెట్టుక్రిందకూర్చుం టిని. ఆనాడమావాస్య. పిశాచముల కానందదినము. నాతోడి వారందరు గుమిగూడి వికటాట్ట హాసములతో విందుకావించు కొనుచుండిరి. ఆసమయమున నిరువురు రాక్షసులొక శవ మును మోసుకొనివచ్చిరి. దానిని భుజించుటకు వారిలో వారికి భాగములు తెగలేదు. ఒకరితోనొకరు పోరాడుకొనుచు న్నాశవము నిటునటు గుంజుకొనుచుండిరి. ఆ గుంజులాట పోట్లా టగా పెరిగినది. మాటలవెంబడి చేతులు కలసినవి. వారిరు వురు కొట్టుకొనుచు తిట్టుకొనుచు నాశవము నచ్చటవిడిచి యొకరిమీదనొకరు కలయబడిరి. వారికాశవము మాటయే గుర్తులేదు. నేనా శవమును మెల్లగా దొంగిలించుకొని పోతిని. వారు నన్ను చూడలేదు. ఆ చీకటిమరుగులో నెవ రికి గానరాకుండ నొకగుహలో ప్రవేశించితిని. దానిని సావకాశముగా తినుచుంటిని. ఆసమయమున నెవరో యొక మహానుభావు డాకాశమార్గమున నచటకు దిగివచ్చినాడు.

'ఓరీ గుహ్యకా! నీవు తినతలచిన మాంసమంతయు తినుము. నాకా కపాలమునిమ్ము. నీకీ శూలమునిచ్చెదను. ఇది చేతధరించినవాడు వానికంటె మహావీరునొక్కని చంపి మాయమగును. దీనివలననీకు మహోపకారముకాగలదు' అని నుడివెను. నేనట్లే యా శవకపాలము వానికిచ్చి యా శూల మును దీసికొంటిని. దీనితోడనే నీవు నన్ను పొడిచితివి. కావున నే నారాక్షసశరీరము నశించినది. ఆశూలము మాయ మైనది. ఆశూలమును చేతపట్టుకొని నిర్భయముగా తిరుగు చుంటిని. ఆశూలము ధరించిన నాటినుండియు నాలో

నొకమార్పు వచ్చినది. తొల్లింటి యజ్ఞానము నంతరించినది
ఆ శూలము నిచ్చినవాడు రుద్రుడనియు, ఆ దేవుని యొక్క మహా
పండితుడగు నుత్తమజ్ఞానిదనియు నా పుర్రెమాలలో ధరింప
నానుండి గ్రహించెననియు తెలిసికొంటిని. ఆ రుద్రుని వశ
పరచుకోవలయునని యోచించితిని. అది యెట్లు చేయగలను
అను నాలోచన కలిగినది.

ఒకనాడు నేను సిద్ధేశ్వరమను మహాక్షేత్రమున రుద్రో
త్సవము చూడనరిగితిని. అచ్చటికి నానా దేశములనుండి ప్రజలు
ప్రవాహమువలె వచ్చిరి. ఆ మహాక్షేత్రమంతయు నరాటవి
యైనది. మహాపండితులు, యోగులు, మునులు, తార్కికులు,
వేదాంతులు పెక్కుమంది వచ్చిరి. వారందరు రుద్రమహి
మను గురించి బహువిధముల పొగడిరి. అనేక రూపాంతరములను
బహుముఖముల వర్ణించిరి. నా మెడలు పొంగిపోయినవి.
నేనదృశ్యరూపమున వారివారి వాదోపవాదములు వింటిని.
నన్ను వారు చూచిన భయపడుదురు. నేను వారిని దర్శించి
తత్త్వమును తెలిసికొనుటకు నాకువీలులేదు. నే నిట్లేల జన్మిం
చితిని. నాకీ రాక్షసత్వమెందుకు రావలయును. నేనా రుద్రుని
చూచుభాగ్యము లేదా? వీరందరు ప్రత్యక్షముగా చూచినట్లే
వర్ణించినారే. ఆరుద్రుడు నాకేల కానరాడు. నేనేల యా భగ
వంతునితో మాట్లాడరాదు. నేను రక్కసుడను. వారు మిగుల
పవిత్రులు. వారికి దర్శనమిచ్చి యుండవచ్చును. నేను మహా
పాపుడను. మాంసము తిందును, రక్తము, క్రొవ్వు, కల్లు
త్రాగుదును. రుద్రుడు నాకేల కనబడును. అయినను నావ
లెనె స్మశానములందు తిరుగును. కపాలమాలికలు ధరించును.

ఎముకల పేరులు దాల్చును. శివజాగారము చేయును. కల్లు రక్తము, మాంసము తినునేమో. తినకుండిన వీరిపశుబలులేల సమర్పింతురు. ఈ కల్లుకుండలెందుకు నివేదన చేయుదురు. ఛీ! మహాదేవుడు భూతమయుడు. దయాస్వరూపుడు. సర్వ ప్రపంచ మాయనసృష్టించెను. జీవులను పుట్టించెను. తాను పుట్టించిన జీవులను తాను బలికోరునా? కోరడు. ఇది అంతయు మానవుల మోసము. మానవులు మోసగాండ్రు. తమ లాభముకొరకు నెంతటి ఘోరములైన చేయుదురు. వారు చినతరూపమునను న్న రాక్షస పిశాచములు.'

రుద్రుడు రుద్రభూమియందుండునని కదా యీపంక్తులు చెప్పినది. నేనాయన నచ్చట వెదకెదను. గాలించెదను నాకేలకనిపించడు. పాపులకు కనపడడని యోగీశ్వరులమాట. నేనునరహంతకుడను. మహాపాపుడను. నన్నేలఇట్లాయన పుట్టింపవలయును. అది నాతప్పుకాదు. ఒకవేళ తప్పైన నాయననన్ను మన్నించగలడు. కనిపించినచో నన్నియు నడిగెదను' అనియాలోచించితిని. స్మశానములు పరిశీలించుటకు బయలుదేరితిని. ఒకటివెంట నొకటిగాలించితిని. రుద్రుడుకనబడలేదు. గంగాతీరమునందు హరిశ్చంద్ర ఘట్టమున్నది. అదిగొప్ప స్మశానప్రదేశము. అచ్చటచూడవలయునననుమాహ పుట్టినది. హరిశ్చంద్ర ఘట్టమున కరిగితిని. అచటనొక జువ్వి చెట్టుకలదు. అదిచాల పురాతనమైనది. దానికొమ్మలు నలుదిశలకువ్యాపించి దట్టముగానుండెను. దానియాకులు బంగారు వన్నెకలిగి చూపరులకు వింతకలిగించు చుండెను. దానిలో నొకకొమ్మ మాత్రమాకుపచ్చని వర్ణములు కలిగియుండెను.

దానిసిడయందొక బ్రహ్మరాక్షసుడు కూర్చుండెను. వాని చుట్టు భూతములు, ప్రేతములు, పిశాచములు, రాక్షసులు కూర్చునియుండిరి. బ్రహ్మరాక్షసుడు పైశాచికభాషలో నిట్లు ఉపన్యసించెను.

'నాయనలారా! రుద్రుడు సర్వమయుడు. ఎక్కడ చూచినను గలడు. పెక్కురూపులతో పెక్కుచోట్ల యందు కనిపించును. ఆయనదయాస్వరూపుడు. సర్వప్రపంచము మన సుఖములకై విడిచిపెట్టి తాను స్మశానములో నివాసముచేసి కొనెను. నేనొకప్పుడు కుంజనీయేటియొడ్డున నివసించియుంటిని. దానికి కొలదిదూరములో మహాకాళమను నగరముకలదు. దానియందు మహాకాళుడను రుద్రునియాలయమొకటున్నది. ఆదేవుని పేరునుబట్టి యానగరమున కానామమువచ్చినది. నేను నాగురువునుపదేశమును బొంది యీమహాకాళునకు సర్వలక్షణములుగల యొక రాజకన్యకను బలియిచ్చితిని. ఆమహాకాళుడు నాకు ప్రత్యక్షమయ్యెను. ఆయననాతో 'ఓరీ! దానవా! నీవు కాశికరుగుము.

అచట హరిశ్చంద్ర ఘట్టమున నొక రావిచెట్టుగలదు. దానిమూలమున నివశింపుము. ప్రతిదినము గంగలో స్నానమొనరించి భూతప్రేతపిశాచములకు రాక్షసులకు నామహిమను బోధించుచుండుము. ఆరావిచెట్టు కొమ్మలలో సంవత్సరమున కొక్కటిచొప్పునబంగారువన్నెగా మారిపోవును. కొమ్మలన్నియుబంగారు వర్ణము కలవైనప్పుడు నీ రాక్షసరూపము పోవును. దేవత్వము నీకు కలుగును'.

'అమ్మా! విద్యాధర రాజకుమారా ర్తైనను నీ కీమాట్లు చెప్పినవి కావు. కాలకర్మము తెలియ నాటకిలవు. నా మాటలు వినుము. నీ ముదిన్ప్రత్తిని యూనుము' అని ప్రార్థించితి. ఈమె వెక్కి వెక్కి యేడవనారంభించెను. నా సందేహము తీరినది. వెంటనే యామె నెత్తుకొని యాకాశమార్గమున నిచ్చటకు వచ్చితిని. నీవలన శాపవిముక్తిని పొందితిని. నేను నీకు కృతజ్ఞతను జూపరాదా? తత్త్వభేదియను మంత్రము నీ కుప దేశించెదను. అందుమూలమున నీకు సకలశాస్త్రములు విద్యలు కళలు నాల్కతుదియం దాడుచుండును. నీవు ధన్యుడవు కాగల'వని చిత్రసేనుడను తన కథను చెప్పి చాలించెను. పిమ్మట విద్యాధర రాజకుమారిని తనవృత్తాంతము నిట్లు చెప్పెను.

అయ్యా! మా తండ్రి మమ్ము వజ్రకటకనగరమున దించెను. నా తల్లియు నేనును మహానందముగా నుంటిమి. నా చెలికత్తెలు నన్ను యథారీతిగా కలుసుకొనిరి. రాక్షసుల పరిపాలనమున పాడుపడిన సరోవరములను బాగుచేయించితిమి. ధ్వంసములైన పూదోటలను నాటించితిమి. వజ్రకటకము తొల్లింటివలె కళకళలాడుచుండెను. పారిపోయిన విద్యాధరులు మరల నగరమును చేరుకొనిరి. నాతండ్రి యూరలేనప్పుడు నేనే రాజకార్యములను నడిపితిని. కొంతకాల మిట్లు గడచినది. మేము సుఖులమైయుంటిమి. మా తండ్రి యెన్నిదినములకు తిరిగి మాయింటికి రాలేదు. కారణమేమైయుండునాయనువిచార మంతకంతకు కెక్కువైనది. పరివారజనములనుబంపి సకలదిశల వెదికించితిమి. వానిజాడ లెరింగినవారు లేరు. సంవత్సరములు

గడచినవి. మాయయ్య యింటికి రాలేదు. రాక్షసులచేతిలో ఆయన మరణించియుండునని తలంచితిమి. అట్లయిన విద్యాధర సేనలలేమైనవి. వారిలో నొక్కడైనను మిగలలేదా యను తలంపుకలిగినది. దీనిలో నేదో యొకమాయ యుండి యుండ వచ్చునని నిశ్చయించితిమి. కాలము గడచినది. మాతల్లి వియోగమును సహింపలేకపోయినది. అన్నపానీయములను మానినది. దిన క్రమమున చిక్కిశల్యమైనది. మంచముపట్టినది. లేవలేని స్థితికివచ్చినది.

మనోవ్యాధికి మందు లేదందురు. ఎక్కడెక్కడి వైద్యులను పిలిపించితిని. దివ్యౌషధములను తెప్పించి పోయించితిని. ఆమెరోగము తిరుగుముఖము పట్టలేదు. నాతండ్రి కొరకామె కలవరించుచు పలవరించుచుండెను. అది మనోవ్యాధియనియు దానికి చికిత్సలేదనియు వైద్యులు నుడివిరి. నాకేమియుతోచ లేదు. చివరకు నాజనని మందుకూడ విసర్జించినది. ఆమె మరణింపవలయునని నిశ్చయించుకొనినది. ఆమెకు జీవితము భారమైతోచినది. ప్రాణములమీద రోతపుట్టినది. మాకెవరికి తెలియకుండ యర్ధరాత్రి సమయమున నంతఃపురము విడిచిపోయినది. పర్వతశిఖరమునుండి క్రిందికిపడి ప్రాణములను తీసికొనవలయునని రత్నకూటము చివరికొన కెక్కినది. ఆమె దుముక పోవుచుండగా నాకాశవాణి యిట్లు వినిపించినది.

ఈ సాహసమువలదు. నీభర్త కొలదికాలములో నిన్ను కలుసుకొనగలడు.

నాతల్లి తిరిగివచ్చి నాకాసంగతి చెప్పినది. ఆమె కాశలు చిగిరించినవి. కొంచెము ధైర్యమువచ్చినది మన శాంతికై యామె గౌరీశంకర శిఖరము నంబికాలము మున తన భర్తవచ్చునంతవరకు గడపతలంచినది. ఆమెతో పాటు నేను నాచెలులు బయలుదేరితిమి. యోగినీవేషము లతో నామెను సేవించుచుంటిమి. ఒకనాడామె నాకలలోకని పించి నాల్గుదినములలో నీతండ్రి నిన్ను కలిసికొనునని చెప్పి నది. అది యట్లే జరిగినది.

వేదకుంభ డీ కథలను చెవివిచ్చుకొనివినెను. చిత్ర ధ్వజుడు వేదకుంభుని సెలయేటియందు స్నానముచేయించి తత్వబేది మంత్రము నుపదేశించెను. దాని పునశ్చరణ విధా నముబోధించి పుత్రికతో నాకాశమార్గమున గౌరీశంకరమున కరిగెను. వేదకుంభుడు మంత్రముజపించుచు నచటనేయుండెను.

మంచికాని చెడుపుగానిమానవునకు వంశమునుబట్టియే వచ్చుచుండును. మధ్యవచ్చిన గుణములు మాయమగు చుండును. ఇదిలోకసిద్ధము. సత్యమును దెలిసికొనలేక పరులు వానిని తెగడుటయు పొగడుటయు కలుగుచుందురు. కాలము గడచినకొలందియు వానినైజగుణము బైటపడుచుండును. కావున కాలపురుషుడే మానవుని గుణాగుణములు వెల్లడింప గలతీర్పరి. వానితీర్పు వగతమగు నంతవరకు నెవడెట్టివాడో గుర్తించుట యసాధ్యము.

దినములు గడచినవి. వారములు తీరినవి. నెలలుదాటి నవి. వేదకుంభున కింకొకయాలోచన లేదు. తల్లిమాటకాని తండ్రిమాటకాని వానికి స్ఫురింపలేదు. మహారణ్య మధ్య

మని వానికి తోచలేదు క్రూరమృగముల భయంకరారావములుగాని పిశాచముల యట్టహాసములుగాని వానికి పట్టలేదు. వానికి రేయింబవళ్లు బ్రహ్మవిధముగానే తోచినది. వానికి విద్య కావలయును. విద్య విజ్ఞానమునకు కారణమని గ్రహించెను. ఆ వెలుగు ముందీ సూర్యకాంతులు నిరుపయోగములు అదియెంతటి కారుచీకటినైన పాయమొనరించి దారిచూపించగలదు. ఆదారియే భూలోకమందును పరలోకమందును కీర్తి సంపాదించుటకును సుఖమును పొందుటకును రాచబాట. అంతకుమించిన దేదియు ప్రపంచము నందింకొకటి లేదు.

ఋతువుల వెంట ఋతువులు వచ్చినవి, పోయినవి. వర్షములు ధారాపాతముగా కురిసినవి. ఎండలు మెండుగా కాచినవి. చలి వణకెత్తించినది. కాని వేదకుంభుడు తనపట్టుదలను విడువలేదు. విడువకుండుటయే కాదు. అది పెరిగి పెద్దదయినది కొమ్మలు రెమ్మలు వైచి యలముకొన్నది. వేదకుంభుడు కూర్చున్న చోటునుండి కదలలేదు. పాములు బుసకొట్టినవి. వానికి వినిపించలేదు. బెబ్బుల్లుగాండ్రించినవి. వాని చెవులలో పడలేదు. భూతములు ప్రేతములు పిశాచములు చుట్టు రోదకావించినవి. వేదకుంభునిలో చలముకలుగలేదు. వానిధ్యానమునందు ప్రపంచమే మాయమైనది. మనస్సునందు శరీరమునందు పలుకులందు వానికా మహాదేవి సరస్వతియే యగుపించినది. ఆమె నిజరూపదర్శనమునకై మనస్సు తహతహలాడినది. సంవత్సరముల కొలంది వేదకుంభుడచే తప మొనరించెను. పొదలు చుట్టు పెరిగినవి. తీగెలలముకొన్నవి. పుట్టలు పట్టినవి. ఇపుడు వేదకుంభుని రూపుజాడయే కనిపించుట లేదు.

# ౭

హరిహర సోమయాజి శిలాదిత్యుని కొలువునుండి వెడలిపోయెను. వానిహృదయము దుఃఖావేశముచేత పెల్లుబికినది. అవమానాగ్నియందు కమిలిపోయినది. ఆ బాధం నతడు భరింపలేకపోయెను. అతడు స్వయముగా అభిమానవంతుడు. ఆత్మగౌరవము కలవాడు పరుకొనరించు పరాభవమున కాతడుసహించువాడు కాడు. వాడు మహారాజైనను పరమేశ్వరుడైనను వానికొక్కటియే. తగిన సమాధానము చెప్పితీరును. అభిమానముపోయిన తరువాత ప్రాణములతో నేమిపనియని వానిసిద్ధాంతము. శిలాదిత్యునకు హరిహర సోమయాజిసంగతి బాగుగా తెలియును. కావుననే యాయ నను ప్రత్యేకముగా నొకకంట గౌరవమర్యాదలతో కనిపెట్టుచుండెను. శిలాదిత్యుడు రాజాధిరాజు. ధర్మమునకు హాని వాటిల్లినప్పుడు సహించడు. న్యాయము చేయవలసినవాడు రాజు. పక్షపాతము రాజులకుండరాదు. తప్పుచేసినవాడు బంధువుకాని. పరాయివాడుకాని వానిని న్యాయశాస్త్ర ప్రకారము దండింపవలసినదే. శిలాదిత్యుడు హరిహర సోమయాజి వెడలిపోవుట చూచెను. తనయాస్థానమునుండి సరస్వతియే కదలిపోవుచున్నదని తలంచెను. అతడట్లు జరుగునని కలయందైన నూహించలేదు. హరిహర సోమయాజివంక నిర్ఘాంతపోయి చూచుచుండెను. ఆ తేజోమూర్తి వెడలిపోవుచున్న కొలందియు రాజునకు విషాదము పొంగులువారినది. ఆగుమనుటకు నోరురాలేదు. ఊరకుండుటకు మనస్సురాలేదు. కన్నులనొప్పగించి రాతిప్రతిమవలె చూచుచుండెను. ఆ చూపులలో వేలకొలంది భావములు స్ఫురించినవి.

హరిహర సోమయాజి యొకవిధముగా శిలాదిత్యునకు సహాధ్యాయిమిత్రుడు, విద్యాగురువు. ఇరువురు హరిహర సోమయాజి తండ్రియొద్ద చదువుకొనిరి. ఆకాలమునందిరువురి శరీరములు, ప్రాణములు నొక్కటిగానుండెను. వారిరువురిది యొక్కటేమాట ఒక్కటేబాట. హరిహరునితోపాటు శిలాదిత్యుడు హరిహరునింటనే పెరిగెను. రాజమందిరమున కంటె గురువునింట వానికి సుఖము, స్వాతంత్ర్యముకలదు. కావున తనబాల్యమంతయు హరిహర సోమయాజి తోడనే గడచిపోయినది. హరిహర సోమయాజి శిలాదిత్యునకు రాజనీతి, దండనీతి, ధర్మశాస్త్రము బోధించెను. తరువాత శిలాదిత్యుని రాజ్యకాలమున ప్రధానయాస్థాన పండితుడయ్యెను. నాటినుండియు శిలాదిత్యుడు హరిహర సోమయాజిని మిగుల గౌరవముతో మన్నించుచుండెను. వాని విద్యాపాండిత్యములుకూడ నంతపాటివే.

హరిహర సోమయాజి వంచినతలయెత్తలేదు. చూపులలో మార్పుకలుగలేదు. భావములలో నుద్రేకము తగ్గలేదు. నడకలపోకడలో వేగము కుంటుపడలేదు గంగదారినిపట్టెను. తీరమువెంబడి నడువనారంభించెను. వానికన్నులకు మానవరూపముల గమనికలేదు. మిట్టపల్లముల వైనములేదు, కాలు సాగుచుండెను. కన్నులు చూచుచుండెను. రాత్రిలేదు పగలు లేదు, తిండిలేదు, నీరువట్టులేదు. కాశీపొలిమేర దాటెను. గయ ప్రయాగలు తరించెను. త్రివేణి సంగమస్థానమునకు వచ్చెను గంగా సరస్వతీయమున లక్కడకలియును. యాత్రికులందరు నచటస్నానముచేయుదురు. అందుమూలమునక్షయ పుణ్యలోకములు కలుగునని వారినమ్మకము. మరణించిన

వారికి తిలోదకము విడుతురు. పిండములు వేయుదురు. అది మహాపుణ్యక్షేత్రము. ప్రయాగలోని త్రివేణీసంగమమున పడి మరణించినవారు తలంచిన తలంపులన్నియు మరల జన్మయందు తప్పక నెరవేరునని శాస్త్రములు సిద్ధాంతము చేసినవి. అట్లు మరణించి కృతార్థులైనవారిచరిత్రలు లెక్కలేనన్ని యున్నవి. హరిహర సోమయాజి కన్నెత్తి యాపవిత్రసంగమస్థానమునుచూచెను. రెండుచేతులెత్తి నమస్కరించెను. వేదశూక్తులతో నుతించెను. నడుమునకుత్తరీయము బిగించెను. 'హరహరమహాదేవశంభో' యనిముందునకొకయడుగువేసెను.

హరిహరా! ఆగు

హరిహరుడు వెనుకకుచూచెను. ఎవరు కనిపించలేదు. అటుచూచెను. అచటనెవరులేరు. మరల ముందునకొక యడుగువేసెను. మరలబిగ్గరగా నీకుకాదు చెప్పినది. ఆగు.

హరిహర సోమయాజి యాగెను.

ఎవరుమీరు? అని విసుగుకొనుచు ప్రశ్నించెను.

ఎవరా? నేను నేనే

అనగా

నీ యాత్మను.

నాతో నీ కేమి పని

నీకు నాతో పనిలేకపోవచ్చును. నాకునీతో పనియున్నది.

నాతోడనా ?

అవును

ఏమిటా పని

నీ యవివేకమును విమర్శించుట

అవివేకమా

అవివేకము కాకేమిటి? నీవు చేయుదమన్న పని

ఆత్మహత్య

ఎందుకు?

విరక్తివలన.

ఎవరిమీద విరక్తి

శరీరముమీద.

నన్నేమి చేయుదువు? పాప దావానలమున వేసి దహింతువా?

పాపమా!

కాక మరేమిటి? మహాపండితుడనని దేశదేశములందు చంకలుకొట్టుకొని తిరిగితివే? శాస్త్రవాదములు గావించి పండితులను నోరు మూయించితివే. ఆత్మహత్య మహాపాపమని నీకు తెలియదా? ఎవరిని సాధించుట కీయాత్మహత్య. నిన్ను నీవు వంచించుకొని యారని నరకమహాగ్నిలో నన్నుకూల్చుటకేనా? ఇదియా నీ పాండిత్యము, ఇదియా నీ శాస్త్రజ్ఞానము. వేదములు శాస్త్రములు తలక్రిందుగా చదివితినందువే! దాని కిదియేనా ఫలము.

'అవును. ఇదియే ఫలము.

ఇదియేనా నీవు నేర్చినది

అవును.

అయిన మూర్ఖునకు నీకునుగల తారతమ్యము.

నాస్తి.

హరిహరసోమయాజి గుభేలున సంగమస్థానమునందు దుమికెను. అచట సుడిగుండమున్నది. హరిహరుడు పడుటతోడనే గుండములో మునిగెను. మరల లేచెనుం 'హరహర

మహాదేవ' యని శివనామము లుచ్చరించెను. మరల లోనికి గుంజుకొనిపోయెను. గంగతరంగహస్తములతో లేవనెత్తినది. యమున తోడైనది. సరస్వతి సహాయమొనరించినది. హరి హరసోమయాజి యూపలియొడ్డున సుఖముగా చేరెను. అతడు కనులు తెరచి చూచెను. ముగ్గురు దివ్యాంగనలు వానిని మోసుకొని వచ్చుచున్నటుల గ్రహించెను. ఆ ముగ్వురితలల యందు మాణిక్య కిరీటములున్నవి. మెడలో రత్నహారములు తూగాడుచుండెను. ఒక యువతి నీలిచీరె ధరించెను. మిగిలిన యిరువురు తెల్లని వలివెములను దాల్చిరి. హరిహరసోమయాజి వారిని పరిశీలించెను. వారెవరో దేవతలని గ్రహించెను. వారికి నమస్కరించి-

అమ్మా! మీరెవరు? అని యడిగెను.

కుమారా! నేను గంగాదేవిని. నేను యమునను. నేను సరస్వతిని అని వారుముగ్గురు వేరువేరుగా సమాధానములు చెప్పిరి.

అమ్మా! మీరు నన్నేల రక్షించితిరి?

అది మా విధి.

ఏమీ? పాపాత్ములను రక్షించుట మీ విధియా?

నీవు పాపుడవు కావు.

కానిచో నాకీ శిక్షయేల విధింపబడవలయును?

శిక్షయా!

అవును.

శిక్ష కాదునాయనా కర్మానుభవము.

నే నేపాపకర్మము నెరుంగనే

అది యీ జన్మలోనిది కాదు.

ఎప్పటిది ?
పూర్వ జన్మలోనిది
అదేదో నాకు తెలపకూడదా ?

ఆ నదీసుతల్లులు విరగపడినవ్విరి. హరిహరుని వారి పరిహాసమునకు మరింత నొచ్చుకొనెను. మానవులకే కాక దేవతలకుకూడ నాజీవితము వేళాకోళమైనది. నేనింక జీవించి ప్రయోజనమేమి కలదు పరమేశ్వరా నన్నిట్లు తెగతాళి పాలు గావించితివా ? నేనొనరించిన పూజలేమైనవి. నా నిత్యకర్మలే యేటిలో కలిసినవి. ప్రాణపదమైన భార్య మరణించినది. ఆమె కగ్నిసంస్కారమునైన చేయుటకు నోచుకొననైతిని. కన్నకుమారుడు జూదరియై యడవులపాలయ్యెను. నాకు పిండోదకములు లభించునాసపోయినది. నన్ను మన్నించి తలపై దాల్చిన శిలాదిత్యుడు సభాంతరమున నగౌరవపరచెను. ఇంక నే నేమొగముపెట్టుకొని జీవింపవలయును. అని లోలోన విలపించెను. ఏదో యడుగవలయునని హరిహరుడు తలయెత్తి చూచెను. ఆ దివ్యనదీసుందరులు కానరాలేదు.

అప్పటికి సాయంకాలమైనది. సూర్యుడు హిమవత్పర్వతములమీదుగా బడమటికొండ శిఖరమునకు చేరుకొనెను. వాని యరుణకిరణములు నదీజలతరంగములమీదపడి తెలుపు నలుపు వన్నెలుగల నీటినేకరూపముగా జేయుచుండెను. జలపక్షుల కిలకిల ధ్వనులు మిన్నులుముట్టుచుండెను. మలయమారుతము మరింత శీతలమై వీవనారంభించెను. ఆకాశమున సన్నని నులిమబ్బులలముకొనుచుండెను. అవిసూర్యునికాంతులలో రంగులుమారి వింతవింతరూపములను వహించు చుండెను. వానిలో ముప్పదిమూడుకోట్ల జీవరాసుల ప్రతిమలు

గోచరించుచుండెను. కొంచెము సేపుసింహముకొంచెము సేపుల్లో పులి, మేక యాకారములందులో నిమిడియుండెను. అవి కాల పురుషుడు చిత్రించిన బొమ్మలు. అవి కామరూపధరములు క్షణములో నాకారములు మారిపోవుచుండెను. ఆ ప్రకృతి చిత్రస్వభావమునకు పరవశమునొంది కాబోలు నదీజలము లుప్పొంగి తీరములకంటగదుముకొని వచ్చుచుండెను. ఆ రాకలో మురుమ్మరగానము లారంభమైనవి. అవి ఎదుట స్ఫుట ముగా వినిపింపకపోయినను క్రమక్రమముగా స్థాయి హెచ్చి శ్రుతులుమారినవి. వానిలో మకరందరసము తొణికిసలాడి నది. అది చెవులకు చైతన్యము కలిగించినది.

హరిహర సోమయాజి కన్నులు తెరచి మెల్లగా తల మెత్తెను. అది శ్రీకృష్ణుని మురళీనాదముకంటె మిగుల సున్ని తముగా వినిపించినది. అందు సప్తస్వరములు వినిపించినవి. అవిరాగసరళిని వినిపించినవి. హరిహర సోమయాజికూర్చున్న చోటునుండిలేచెను. అది నదీగానముకాదు. మానవగానము కాదు. అది యాకాశమార్గమునుండి వచ్చుచున్నటుల హరిహరుడు గ్రహించెను. తలయెత్తిచూచెను. ఆ బంగారు వన్నెమబ్బుల నడుమనుండి యదివెలెంచి గాలితరంగములలో తూగాడి యొయ్యారముగా హరిహరుని చెవులకుసోకుచుండెను. దానిని హరిహరుడు, చెవులార నాలించెను. దానితో వాని మనస్సునందు కదలికగలిగినది. అతడు లేచెను. భావతరంగము లుయ్యాలలూగినవి.

'ఎక్కడిదీగానము, ఎక్కడో వినినట్లున్నది'

అని యాలోచించెను. మెల్లగా నడగులుసాగించెను. అతడు ముందునకు పోయినకొలందియు నదిదాపునకు వచ్చి

నట్లు తోచినది.

శీతసమీరము చివికిశమించె
మధురవసంతము మలుపులుతిరిగె
గడచినకాలము గతమయిపోయె
తడవికేల మిళింద తరలిరావోయి

హరిహరుడాపాటను వెంబడించెను. అదిపోయిన కొలంది మరింతదూర మరుగుచున్నట్లుల తోచినది. అది దేవతాగానము. దానిపిలుపునకు తుమ్మెదవలె నెగిరిపోవ నారంభించెను. దానిని వినినకొలందియు నాతనికేదో తహతహ పుట్టినది. దానికి కారణమతనికి తెలియలేదు ఊహించుటకైనను సావకాశము లభింపలేదు. అదిపాటలోని తియ్యదనమో లేక తనలోనిమార్పో హరిహరుడు గ్రహించుకొనలేకపోయెను. అతడట్లే ఎంతదూరమరిగెనో. అదేపాట మరల మరల వినిపించినది. అదివిన్నకొలందియు నాతనియందాశా తరంగములు పొంగి కొండంతలుగా రేగినవి వాని నడకలో శరవేగమావేశించినది. అతడు క్షణములో పర్వతశిఖరముల వరకు నెక్కిపోయెను. గానమాగలేదు. అతడెంత దూరము వచ్చినదియు వెనుకకు తిరిగిచూడలేదు. జ్యోతిర్లతలు దెన్నెల వెలుగులను ప్రసరించుచుండెను. అంతలో నా గాన మరింత మధురముగా వినిపించినది. హరిహరున కా వేగము హెచ్చినది. చూపంతయు మింటిపైపున నుండెను మనస్సు పాటయందు విలీనమయ్యెను. అతడెటు పోవుచున్నది వానికి తెలియదు. అతడొక యగాధమగు కొండచీలిక నడుమమాయమయ్యెను. అంతటితో కొండ చీలికలు కలుసుకుపోయెను. గాన మాగిపోయెను.

# రత్నప్రభ

దేవీ!

ఆ

అమ్మాయి నడిగితివా?

అడిగితిని

ఏమన్నది?

వివాహామే వద్దన్నది

వద్దని యేమిచేయును

ఆజన్మాంతము బ్రహ్మచారిణిగా నుండునట

కారణము

చెప్పలేదు

ఇప్పుడేమి చేయవలయును

మనకు లేక లేక వార్ధక్యములో కలిగిన సంతానము

అయిన

దానికోరికయే కానిండు

అట్లయిన లోకమేమనుకొనును?

లోకమునుతలంచి కన్నకూతురును నిర్బంధింతుమా!

ఇందు నిర్బంధమేమున్నది. తనకిష్టమువచ్చిన రాజకుమారుని వరింపమంటిమి కదా.

ఆమెకెవరు నచ్చకపోవచ్చును

ఇందరు రాజకుమారులలో నొక్కరైననచ్చకుండిరా! అది నమ్మదగినమాటకాదు ఇందేదో రహస్యమున్నది.

రాణి మాటాడలేదు. వైద్యుతి కొంచెము సేపాలో చించెను. ఒకసేవకునిబిలిచి రాజకుమారిని బిలుచుకురమ్మని యానతిచ్చెను. అతడు తొందరగాబోయి యావార్త రాజ కుమారి కెరిగించెను. రాజకుమారి తండ్రియానతిని గౌరవించి వచ్చినది. వైద్యుతి కూతురు నందచందములనట్లే చూచుచు లోలోన పొంగిపోయెను. ఆపొంగు కన్నీరయి బైటికిదారలు కట్టి పారలినది. మహారాజు మాటాడలేక క్షణముసేపు ముగ్ధుడయ్యెను. రాజకుమారి తండ్రికి నమస్కరించినది. అదిమనోహర కళ్యాణమూర్తి. రూపముతాల్చిన యందాలరాసి. ఆమెలో వినయము విధేయత రాజసము విజ్ఞానము విస్పష్టముగ యద్దమునందువలె ప్రతిఫలించుచుండెను. మహారాజు కన్నీరు తుడుచుకొని యాముగ్ధమూర్తిని మరల చూచినాడు. ఆ కుమారి తనయింట పెరుగుచున్న లక్ష్మియును తలంపుకలిగి నది. మరల వానికన్నులవెంట నీరోడిగలు కట్టినది.

'ఈ మహాతల్లిని విడిచిపెట్టుటయా. నా యింటిదేవత నొరులకప్పగించుట నా సర్వస్వమునిచ్చుట. నా ప్రాణములే వానిచేతపెట్టుట. అది నేనెట్లు చేయగలను. నా మనస్సెట్లు సమ్మతించును. నా ముద్దుకూన నా యింటనే యుండవల యును. ఎంతకాలము. ఏమో ఆమె కోరినంతకాలము. నా యదృష్టమున్నంతకాలము. అప్పుడైన నొరులయింటికి పంప వలసినదేకదా. నే నేలపంపవలయును వివాహమే చేయను. చేయనిచో లోక మూరకుండునా. లోకముతో నాకు సంబంధమేమి ? నేను మహారాజును. నన్నుకాదన గలవారెవరు. నా రత్నరాసి నాతో నుండును. ఆనుకూఅురు తల్లిదండ్రులకు

బ్రహ్మచే నిల్లడముంచబడిన కన్య. పెంచి పెద్దదానినిచేసి తగు వరున కొసంగవలయును.

అది లోకాచారము అను తలంపులు వైద్యుతిమనసము నందుపొడమినవి. అంతసేపు వైద్యుతికి తనయమీద నేచూపు. అతడు రెప్పవాల్పలేదు. కన్ను త్రిప్పలేదు. కన్నీరుతుడవలేదు. కూతురాయనవంక చూచినది. తండ్రిచూపులకామె కే యర్థము గ్రహించుకొనలేకపోయినది. విషాదమా ? కాదు. కోపమా? అంతకంటే కాదు. మరేమి ? ఏదో యావేదన. అది భరింప రానిది. ఆడపిల్లలను కనిన తల్లిదండ్రుల కంపరకున్న దే. రాజ కుమారి తల్లిప్రక్కన నిలుచుండెను.

కూర్చుండుము తల్లీ ! అన్నది యామె.

ఆమె కంఠములో వణకుడు గోచరించినది. దీని కంతకు తానే కారణము కాబోలునని గ్రహించుకొన గలిగినది. క్రిందటిరాత్రి తల్లి రాజకుమారితో వివాహ విషయమై ప్రసంగించినది. మహారాజు మనోనిశ్చయమెరి గించినది. వందలకొలంది రాజకుమారుల చిత్తరువులు చూపించినది. వారిలో నొక్కకరినిగురించి తానెరిగినది విన్నది, కన్నది, చెప్పమన్నది పూసగ్రుచ్చినట్లు బోధించి నది. వివాహముకన్యలకు తప్పనిబంధమని యెరిగించినది. ఆరాజకుమారులలో నొక్కరినివరించి సుఖింపుమనియు తన కోరికవ్యర్థపుచ్చవలదనియు తెలిపినది, కాని యారాణిమాట రాజకుమారి చెవికెక్కలేదు. నిరాదరముగా పటములన్నియు నవలత్రోసినది. చిన్నతనంపు చిలిపిమాటలతో 'నాకు పెండ్లి వలదు' అని సమాధానము చెప్పినది.

ఆమెకారణమడిగినది రాజకుమారి పెదవి విరిచినది. 'రండే యాడుకొందము' అని చెలికత్తెలను పిలుచుకొని పోయినది.

ఆమె యిరువదేండ్లకన్య: పెండ్లియీడువచ్చినది. ఆమె మహావిద్వాంసురాలు. సంగీతము, సాహిత్యము నృత్యము, చిత్రలేఖనము:సకలకళలునభ్యసించినదిమహాపండితులయొద్దతర్కము వ్యాకరణము, వేదాంతాదిశాస్త్రము మొదటినుండి చివరి వరకు చదివినది. వాదోపవాదములు, పూర్వపక్ష సిద్ధాంతములు చక్కగా నలవరచుకొన్నది. ఆమె విజ్ఞానమునకు మేధాసంపత్తికి గురువులు మహాశ్చర్యపడుచుండిరి. ఆమె యసమానపాండిత్యము సంపాదించినది సంగీత సాహిత్యములందు సరస్వతిని, నాట్యమునందు రంభను, శాస్త్రవాదమునందు బృహస్పతిని మరపించినది. చెలికత్తెలామెను వాణి యని పిలుతురు. గురువులు విద్యా యనిసంబోధింతురు. తల్లి తండ్రులు ప్రభాయని యందురు. అసలామె పేరు రత్నప్రభ ఆమె స్త్రీజాతికి తలలోనిరత్నము. అందచందములందు మా లక్ష్మి సరస్వతీ పార్వతులామెసరస నిలుచుండుటకు సిగ్గుపడి యొకతె మగనిరొమ్మునను నొకతె నోటియందు, నొకతె శరీరములోను,దూరి దాగియుండిరి. అందమునకు చదువునకు నామెగుణములు మెరుగుపెట్టుచుండును. ఆమెనుచూచి తల్లి తండ్రులు మురిసి మూప్పందుమగుచుందురు. ఆమెను కదిలించి తల్లి బెదరించితండ్రి యదలించిచెలులు, చదివించిగురువులు నోటిమాటలను వినరెంతురు. అప్పుడామె పలుకులలో ముత్యములు రాలును.

రత్నప్రభతనదారి నరిగినది. తల్లినిరాశతో కన్యాం తఃపురము వెడలివచ్చినది. మరునాడాసంగతిమహారాజుప్రస్తా వించెను. రాణి జరిగినదంతయు చెప్పినది. రాజకుమారి తల్లి తండ్రుల యావేదనకు తానే కారణమని గ్రహించుకొనకలిగి నది. మహారాజు కుమార్తెను దగ్గరకు పిలిచెను ప్రక్కన కూర్చుండపెట్టుకొనెను.

'ప్రభా! యాడుబిడ్డలను కన్న తల్లి తండ్రులభాగ్యులు తల్లీ! అనెను. అంతటితో నాయనకు మరల కళ్ళనీరుక్రమ్మి నది. ప్రభ తండ్రివంక చూచినది.

'కాదు నాయనగారు! వారు మహాభాగ్యశాలులు. పరులవంశాభివృద్ధికి దేశాభివృద్ధికి తోడ్పడుచున్నారు' అన్నది రత్నప్రభ.

మొదటిలోనే ప్రత్యాఖ్యానము, సంపూర్ణవిద్యా వంతురాలైన యాడదానితో పరమేశ్వరుడైన మారాడ లేడు. అసలు స్త్రీలకూహాపోహలెక్కువ. ఆలోచన లెక్కువ క్షణములో పరులమనస్సు గ్రహింతురు. ముందరి కాళ్ళకు బంధమువేయుదురు. ఇట్టివంటివి వారిసంగతి మరి వేరె చెప్పనక్కరలేదు. తండ్రి లోలోననవ్వుకొనెను.

'అదికాదమ్మా! ప్రభా! యింటనున్న రత్నము నిత రుల కర్పింపవలయుటచే యభాగ్యులంటిని.'

'ఇతరులకు లేనిదానిని దానముచేయుట యభాగ్య మందురా? సకలదానములలో కన్యాదానముత్తమమనియు నదియదృష్టవంతులకు లభించుననియు శాస్త్రములు చెప్పు

చున్నవి. అంతయిష్టములేనిచో నింటనేయుంచుకొనవచ్చును కదా!'

అవును. నిజమే. ఎంతకాలమది సాగివచ్చును
జీవితాంతము
లోకము నిందింపదా
లోకమున కేమిపట్టినది.

'మానవుడు సంఘజీవి. తానుచేయు ప్రతికార్యము సంఘమునకు సంబంధించియుండును. సంఘమేలోకము, లోకమే సంఘము దానిని విడిచిమానవుడు జీవింపలేడు'

నన్నేమి చేయమందురు?

నచ్చిన రాజకుమారుని వివాహమాడమందును
పరులకు దాసినై నాసుఖము కోలు పోమ్మందురా ?
దాసివగుటకాదు
మరి
కులవర్ధనులగు కుమారులను గని కీర్తిని పొందమని
నచ్చినవాడు లేనిచో

అది నాకు తెలియును. నీ విద్యా సౌందర్యాదులకు తగినవాడు లభించుట యసాధ్యము. ఐన తప్పనిది.

రత్నప్రభ క్షణమాలోచించినది. తండ్రి ముఖము చూచినది. తల్లి కన్నులలో కన్నులిడి పరిశీలించినది. వాని యందు విషాదరేఖలు గోచరించినవి. ఆమె యేమి సమాధానము చెప్పునో యని వారు తొందరపడుచుండిరి.

రత్నప్రభ 'సరే' యన్నది. రాజదంపతుల ప్రాణములు లేచివచ్చినవి వారి ముఖములు విప్పారినవి. నవ్వు తెర లలమినవి.

మరల రత్నప్రభ కానియనినది

తండ్రి కాని యేమిటి? అని ప్రశ్నించెను

'నేను పెండ్లియాడు వానిని స్వయముగా నేనే పరీక్షింపవలయును. అతడేకులము వాడైనను సరే'

'స్వయంవరము చాటింపమందువా?'

'అవును, దేశదేశములందు చాటింపుడు'

'ఏమని?'

'విద్యావిజ్ఞానవంతులగు వారిని రాజకుమారి వరింప గలదని'

మహారాజునకు బరువంతయు దింపినట్లయినది. రాణికి విషాదమంతరించినది. రత్నప్రభ చెలికత్తియలతో తిరిగి పోయెను. తల్లిదండ్రులు లోపెను వెనువంకచూచుచు నానం దించిరి. మహారాజునకు నవ్వువచ్చినది.

రాణి మహారాజుతో 'రాజులచూపునకు రాళ్ళుపగులు నందురు' అని నవ్వుచు సన్నగా పలికినది. 'రాజకుమారి రాయికాదు, రప్పకాదు విద్యా సౌందర్యములకు సముద్రము. గుణరత్నములకు తరగనిగని'

ప్రభువుల కేదివచ్చినను పట్టపగ్గములుండవు' అందుకనే రాజులను కట్టివేయుటకు రాణులను నియమించినారు మహా రాణి ముసిముసినవ్వులు నవ్వినది, ఓరకంట రాజవంక చూచినది. వైద్యతి యన్న మాటసత్యము. మహారాజు

విజృంభణకు యొక్క కట్టుత్రాడు. ఆమె మాటలో నాయన వర్తించును. ఆయన మనోభావములను వెన్నెలలోనామె సంచరించును. రత్నప్రభను మహారాణిమాట ననుసరించి సకలవిద్యలయందారితేరిన దిట్టను గావించినాడు. రాజామెను మహావీరాంగనను గావించి తనరాజ్య మామెకొప్పగింపవలయుననియు నాయన యూహించెను. దానికి మహారాణి యడ్డు చెప్పలేదు. మహారాణికి సహోదరుడు కలడు. అతడు కుంతలరాజ్యమున కధిపతి. అతని పేరు ప్రరోచనుడు. వానికి రత్నప్రభనిచ్చి పరిణయము కావింపవలయుననియు కాంభోజ కుంతలరాజ్యము లేకము చేయవలయునని వైద్యుతి యభిప్రాయము. ప్రగోచనుడు మహావీరుడే విద్యావాసనలేదు. పొట్టపొడిచిన నొక్క యక్షరముపుట్టదు. దానికామె యంగీకరింపలేదు. రాజు రాణిమాట త్రోసిపుచ్చలేదు. వారిరువురిట్లడుగులలో మడుగుల నిడుకొనుచుందురు. మంచిచెడ్డలను కలసి యాలోచింతురు. ఆమె రాజునకు మేలుతలచు విజ్ఞానవంతురాలైన మంత్రి. సమంజసమని తోచిన వానిని తలదాల్చెను.

౨

వైద్యుతిమహారాజు రత్నప్రభ చెప్పినటుల ప్రతి గ్రామమునందును పట్టణమునందు నగరమునందు భటులను పంపి చాటింపు వేయించెను. రాజులకు ప్రత్యేకముగా నుత్తరములను వ్రాయించెను. రత్నప్రభ విద్యావిజ్ఞాన సుందరుడేకులమువాడైన పరీక్షించి పెండ్లాడుననువార్త దేశదేశము

లంపు వ్యాపించినది. రత్నప్రభాదేవి యందచందములను గురించి యెరుగని వారాకాలమునందెవరు లేరు. రాజకుమారు లెందరో యామెను వివాహమాడవలయునని యువ్విళ్ళూరిరి. పండితులామెను పరిణయమాడవలయునని కలలు కనిరి. పెండ్లిమాట యెట్లున్నను చూడనైనచూడవచ్చునని కొందరు తలంచిరి. ఎంత మహారాజులైన సేనలతో రాకూడదు. ఒంటరిగా నామెను దర్శింపవలయును. అది నియమము. పరీక్షకొరకొక మేడ నిర్మింపబడినది. దానికి వేయిమంది మహావీరులు కాపుంచబడెను. మేడకు ముందొకగంట కట్టబడెను. రాజకుమారిని దర్శింపకోరువారాగంట మ్రోగించవలయును. రాజభటులు వానిని లోనికి గొనిపోవుదురు. ఎవరైనను మర్యాద నతిక్రమింపరాదు. అతిక్రమించినవారితల తెగిపోవును. ఈ నిబంధనలన్నియు ముందే ప్రకటింపబడినవి.

వైద్యుతి మహాపరాక్రమశాలి. యుద్ధమునట్ల దేవతలనైన లెక్కచేయడు. అతని కంగవంగ కళింగ సింధు రాజులరికాపులు. మగధచక్రవర్తి ప్రాణమిత్రుడు. కాశీరాజుతో వియ్యమందెను. ఇరుగుపొరుగు వారాతని మాట మన్నింతురు. నదురుబెదురులులేక వానిసేన లెక్కడికైన నిరాటంకముగా పోవును. వానికి తలవంచువారేకాని తలయెత్తి చూచువారు లేరు. కావున వైద్యుతి నిబంధనలక్షరాల జరిగినవి. పలుదేశములనుండి రాజకుమారులు, పండితులు, తత్త్వవేత్తలు, ధర్మశాస్త్రజ్ఞులు వచ్చుచుండిరి. వారిహోదాలనుబట్టి విడుదులు నియమింపబడుచుండెను. రాజకుమారి పరిక్షా సౌధమున నొక విశాలమగు చావిడియందు సర్వా

లంకారములుధరించి కూర్చుండును. ఆమెకానరాకుండ యొక తెర యమర్చబడెను. అది చాల విచిత్రమైనది. వరింపవచ్చిన వారికామె కనబడదు. వారామెకు కనబడుదురు. పరీక్ష ప్రొద్దు నను సాయంకాలమందు జరుగును. అందును కాలనియమము చేయబడినది.

కాలము గడిచిపోవుచున్నది. పరీక్ష నిరాటంకముగా సాగుచున్నది. రాజకుమారులు వచ్చుచుండిరి పోవుచుండిరి. రాజకుమారి వచ్చినవారి గుణగణాదులనుగురించి ప్రశ్నించును. విద్యాపరాక్రమాదుల నడుగును. రాజకుమారులను శాస్త్రములనుండి ప్రశ్నించును. పండితులను యుద్ధవిషయముల నడుగును. వారు సమాధానము చెప్పలేక నెడలుచుండిరి. మహారాజకుమారుడై శాస్త్రవేత్తయైనవానిని స్త్రీపురుషుల లక్షణములనుగురించి యడుగును. ఆమె హృదయము విచ్చిచూచినట్టు లెదుటవానికిరానివిషయములనెరిగి ప్రశ్నించును. వాడు నోరు వెళ్ళబెట్టును. దాసీజనులాతనిని తరిమివేయుదురు. మొరకుతనము చూపినచో రాజభటులచేతికి పనివచ్చును.

ఒక సంవత్సరము గడిచినది. రెండేడులు తీరినవి. రత్నప్రభ పరీక్షకు తాళినవారుగాని, యామెకు నచ్చినవారుగాని లేకపోయిరి. వచ్చినవారిలో గుసగుసలు బయలుదేరినవి. అసంతృప్తియు నిరాదరము ప్రబలినది. 'అసలు రాజకుమారి కానరాదు. ఆమె యున్నదో లేదో యెవరికి తెలియదు. ఆ ప్రశ్నించునది యేమహాపండితుడో కావచ్చును. ఆడువారి కంత పాండిత్యముండునా, మహాపండితులనునోరుమూయించి

నది. కాంభోజరాజు నాటకమాడుచున్నాడు. పరులను పరాభవించుచున్నాడు. ఎంత మహాచక్రవర్తియైన వానికిట్లు తగదు.' అని వారిలోవారు అనుకొనుచుండిరి. ఆమాటలు రాజభటులు ఆలకించి మహారాజున కెరిగించిరి రాజయిన దానికి కాని దానికి కోపించువాడు కాడు. వెంటనే రత్నప్రభ సలహా తీసుకొని మహాశిల్పులను రావించెను బంగారముతో తన కుమార్తెయెత్తున కీలుబొమ్మను చేయుడని యానతిచ్చెను. వారు సరిగా రాజకుమార్తెను బోలిన యంత్రపు బొమ్మను నిర్మించి తెచ్చిరి. దానిని వస్త్రములతోడను నగలతోడను నలంకరించెను. తెరకీవల వైపున కుర్చీయందు కూర్చుండ చేసెను. ఆ విగ్రహమునుచూచి యంతఃపుర పరిచారికలే రాజకుమారి యనిభ్రమించిరి.

ఒకనాడు రత్నప్రభ యథారీతిగా పరీక్షాభవనమున కూర్చుండెను. వాకిటగంటమ్రోగినది. మరుక్షణమున యిరువురు రాజభటు లొకపురుషుని లోనికిగొనివచ్చిరి. రాజకుమారి తెరచాటునుండి వానినితలనుండి పాదములవరకు చేరి పారచూచినది. వానిరూప మామెకు వింతగొలిపినది. తలనున్నకిరీటము దట్టమగు నీలకాంతులనీనుచుండెను. అది నలుదిశల వ్యాపించి గోడలన్నియు నీలాలతో కట్టినట్లులైనవి. కిరీటమునందెచ్చట బంగారము కనిపించ లేదు. అదంతయు నొక్క పేమణి. దానినితొలిచి కిరీటముగా చేసినట్లున్నది. అదివానితలనంటుకొని పెకలించినను వచ్చునట్లులేదు. వాని నుదురు చాలచిన్నది. హటాత్తుగా చూచినచో చవితినాటి చంద్రరేఖయనుకొందురు. దానిమీద తెనుగు ఏడంకె లెదురు

బొాదురులుగా నిలిపినటుల బొట్టుకలదు. వాని కనులంవరి కనులవలె లేవు. గుండ్రనైనవి. కన్నులంతయు నల్లని గ్రుడ్డే కాని తెల్లతనమెచ్చటలేదు. వానిముక్కు సన్ననయి చివర ముద్దతీరియుండెను. నోరుచాలచిన్నది. పెదిమెలు నిష్కారణ ములం తెఱ్ఱగా నుండెను. బవిరిగడ్డము. వానిముఖము తెల్లనయి వెండివెలుగులు ప్రసరించుచుండెను. అతడు బలిష్ఠమైన శరీరముకలవాడు. కాని లావరికాడు. పొడుగరియగుటచేత కొంచెముసన్నగా నున్నటుల కనిపించును. అతడు తెల్లని పాముకుబుసమువంటి వస్త్రములనుదాల్చెను. అవి పట్టువికావు. వెండి జరీపోగులతో నేయబడినట్లున్నవి. వానిపాదములు విచిత్రములుగా నున్నవి. మానవుని పాదములందువలె వ్రేళ్ళు లేవు. అతడు నడిచివచ్చునపుడు తెల్లనివెన్నెలవంటినిగనిగలు ప్రాకుచున్నటుల తోచినది.

రాజకుమారి మరల మరల వానినిచూచినది. ఆమెముఖమున వింతమార్పులు కనిపించినవి. ప్రశాంత భావములు కలగుండు పడినది. మనస్సు నుద్రేకముకలిగినది. అది ప్రేమవలన కాదు. ఆ వచ్చినపురుషుడు బంగారువిగ్రహమును గాంచెను. అతడు చిరునగవుచిలికించెను. అదియు నవ్వినటులనే యగుపించినది. అతడేదో గొణుగుకొనుచు పెదిమెకదిలించెను. ఆ విగ్రహముల్లో కదలించినటులతోచినది. చల్లనిపిల్లగాలులకు నామెతలవెంట్రుకలు కదలినవి. అతడావిగ్రముముల్లోచూచుచు నేదో పలుకరింపబోయెను.

అంతలో నావిగ్రహమే కాబోలు. 'ఆర్యా!' అనిపిలిచినటుల తోచినది.

'ఆ' అని యాతడుపలికెను.

'మీ రెవరు?'

'కనబడుచుండుట లేదా'

'కనబడకుండుటకు భూతము కాదుకదా?'

'నేను మానవుడను.'

'కాదన్న వారెవరు?'

'అనలేదు నేనే చెప్పుచున్నాను'

'మీ రాజ్యము'

'కుతలము'

'రసాతలము కాదా?'

పురుషుడు తబ్బిబ్బులాడ మొదలుపెట్టెను. ముఖమున చెమటలుపోసినవి. 'కాదు' అని సమాధానము చెప్పెను.

'పోనిండు. మీ రే దేశమును పాలింతురు'

'పర్వత దేశము'

'వల్మీకము కాదా? మీ రే యేవిద్యలు నేర్చితిరి'

'కౌటిల్యము'

'అవును. అదిమీ కవళికలే చెప్పుచున్నవి'

పురుషునకు రోషోద్రేకములు హెచ్చినవి. కన్నులెఱ్ఱ వారినవి. ఒడలుకంపించినది. పెదిమెలువణకినవి. కోపముఱగిలినది. కాని యతడేమి చేయకలడు. ఒంటరివాడు. పరాక్రమించిన ప్రాణములమీదికివచ్చును. కొంతవరకు మనస్సును శాంతిపరచుకొనెను. రత్నప్రభ యింతవరకెవరితో నట్లు మాట్లాడలేదు. చెలులామె సంభాషణవిని వింతపడుచుండిరి. వానిరూపముమీద కలరోతచే నామె యట్లుమాట్లాడుచుండె

వని వాపుతలంచిరి. ఎట్టుపోవు యెట్టువచ్చునో యని వారా మెను వారించుచుండిరి. కాని యామె లక్ష్యపెట్టలేదు. ఆమెకు కోపమెక్కువైనది.

'మీరు వచ్చిన కారణము' అని రత్నప్రభ ప్రశ్నించినది.

నిన్ను వరించుటకు అని యాతడు సమాధానముచెప్పెను.

'ఛీ మూర్ఖుడా వేయిజన్మలెత్తినను నన్ను నీవుదక్కించు కొనలేవు. నేను రెండు నాలుకల దాననుకాను. ఇప్పటికైన నెరుంగుము'.

ఆ పురుషునకు కోపము రౌద్రముగామారినది. కనుల నుండి నిప్పుకణములు రాలినవి. అతడొకసర్పముగామారెను. బుసలుకొట్టుచు నా విగ్రహమును తీవ్రముగా కాటువేసెను. దానితో నాసర్పముకోర లందుదిగబడినవి. మరల వెనుకకు లాగునప్పుడు చీరె యడ్డుపడినది. కోరలను వెడలించుకొన లేకపోయెను. అచటి వారందరు భయపడిరి. ఆ విగ్రహమే రాజకుమారియని సర్పరాజు కోపోద్రేకమున భావించి దానిని కాటువైచెను. రాజకుమారి తెరవెనుకనుండి బైటికివచ్చెను. ఆమె కత్తినిచేతపట్టుకొని కరాళకాళివలెదానిమీదికిపోవునది. ఆ సర్పము కోరల నెట్లో తెమలించుకొని పారిపోవ యత్నించెను.

'ఆగు. ఒక్కడుగు కదిలించితివా నీ తల తుండెము లగును'. అని రత్నప్రభ యా సర్పమునకెదురుపోయెను.

అది భయంకరాకారముతో బుసలుకొట్టుచు పడగవిప్పి తోకపైకెత్తెను.

'ఓరీ! నీ యాంటలింకసాగవు. నీ విషజ్వాలలు నన్నే మియు చేయలేవు. నీ పాపమునకు ప్రాయశ్చిత్త మిప్పుడే చేయించెదను'

అని రత్నప్రభ యా సర్పముపై కత్తినివిసరబోయెను. ఆ సర్పరాజు భయమున గడగడవడకుచు తలవాల్చెను. ప్రభ దానిని భటులచేతపట్టించియొకసంచియందు బంధించెను. అచటి వారందరూ నాటి సంఘటనమునకు వింతపడిరి. రాజ కుమారి యానాడింకెవరితోడను మాట్లాడలేదు. ఈకథ మహా రాజు చెవులబడెను. ఆయన తబ్బిబ్బుపడుచు కుమార్తెను జూడవచ్చెను. రత్నప్రభ యావేశముతో రోజుచుండెను. ఆమె యాకారము తొల్లింటివలెలేదు. చిరునగవులు చిలికించు మొగమెర్రబారినది. తెల్లకలువలవంటి కనులలో నెత్తురు క్రమ్మినది శరీరము గగుర్పొడిచినది. ఎడతెరిపిలేక నిట్టూ ర్పులు నిగిడించుచుండెను. పెదవులు కంపించుచుండెను. చెలి కత్తెలుసైత మామెను పలుకరించుటకు వెరచుచుండిరి. ఎవరి నేమి చేయునోయని లోలోన వారు భయపడుచుండిరి. కాని యామె నెవరిని దండించునది కాదు. తప్పు కనిపించినను కోపిం చదు. శాంతముతప్పయామెముఖమునందెన్నడు వారుకోపము చూడలేదు. నైద్యుతి రత్నప్రభనుగాంచెను. ఆమె తండ్రి కెదురుపోయినది.

తండ్రి యిట్లు ప్రశ్నించెను. అమ్మా! ప్రభా! ఏమి జరిగినది. ప్రభ మాటలాడలేదు. ఆమె కోపము శోకముగా మారినది. కన్నీరుకార్చుచు తలవంచినది. తండ్రి యామె ముఖముపంక చూచెను. ఆయనకుపట్టరాని దుఃఖముకలిగినది.

ప్రభయందాయన ప్రేమయట్టువంటిది. ఆమె కన్నీరుపెట్టిన వాని హృదయము తహతహలాడును. ఆమె సంతోషించిన నాయన యానందించును. ప్రభ గడ్డమును పట్టుకొని ముఖమును పైకెత్తెను. 'ఈకన్నీరేమిటి?' అని మరల ప్రశ్నించెను. ఆమె దుఃఖముమితిమీరినది. తండ్రిని కౌగలించుకొని వెక్కివెక్కి యేడ్చెను. జరిగినదేదో చెప్పుముతల్లీ! చెలికత్తెలు మహారాజునకు సర్వము చెప్పిరి.

'అపాయమేది?' అని రాజు ప్రశ్నించెను.

రాజకుమారి బంధించి పదిలపరచినది. అని వారు సమాధానము చెప్పిరి. రాజు ప్రభనేమో యడిగెను. ఆమె దేనికీ సమాధానము చెప్పలేదు.

## 3

'అవ్వా !'

'ఏమినాయనా !'

'ఆమె యంత యందకత్తెనందువా ?'

'కాకేమి నాయనా !'

'నీ వామెను చూచితివా ?'

'లేదు. నేనేకాదు. ఈ యూరి వారిలో నెవరూ చూడలేదు.'

'మరి నీ వెట్లెరిగితివి ?

'ఆమె పరిచారిక చెప్పినది. ఆమెకు చదువునందేకాక యందమునందుకూడ దేవతలైనను చాలరట.'

'అట్టి సుపుత్రినికన్న తల్లిదండ్రులు ధన్యులు'

'ఆమె దేవాంశయని తల్లిదండ్రుల యభిప్రాయము'

'దానికి నిదర్శనము'

'విను. మహారాజునకు చాలాకాలము సంతానము లేదు. ఆయన జ్యోతిష్కులను రావించి ప్రశ్నించెను. వారు మహారాజా! మీకు తప్పక పుత్రిక జన్మించునని పలికిరి. మహారాజు చాలాకాలము మరల నిరీక్షించెను. ఒకనాడు దేవాభుడను మహాముని దాతుర్మాస్యములు గడుపుటకు రాజమందిరమునకువచ్చెను. మహారాజు మునివరున కెదురుపోయి తీసికొని వచ్చెను. ఆయనను బూజించి గౌరవించెను. ముని తనకోరిక రాజునకెరిగించెను. రాజు దానికితగిన యేర్పాటులు గావించెను. రాజు, రాజుభార్యయు దేవాభుని వర్షాకాలము నాలుగునెలలు సేవించిరి. ముని యమితానందము నొందెను. అతడు వెడలిపోవుచు వారికొక మారేడుఫలము నిచ్చెను. అందేమున్నదో చూడవలయునని దానిని పగుల గొట్టిచూచిరి. అందొక స్ఫటికశివలింగము కలదు. వారు దానిని భక్తివిశ్వాసములతో బూజించిరి. సంవత్సరము గడిచినది.

ఒకనాటిరేయి తెల్లవారుజామున శివుడు రాజునకు స్వప్నమునందు కనిపించెను. రాజా! నీ కోరిక నాకు తెలియును. కొలది మాసములలో నీ రాణి యొక యాడశిశువును గాంచును. ఆమెమూలమున నీ కులగౌరవములు వృద్ధి పొందునని వచించెను. రాజు మహానందభరితుడై లేచెను. ఆ సమయముననే రాణి యొకకల గాంచెను. అందాకాశము

నుండి యొక పారిజాతపుష్పము నేల వ్రాలినది. దాని వాసనకు దిశదిశలనుండి తుమ్మెదలు ముసురుకొన్నవి. కాని అవి దానిచెంతకు పోలేదు. అందుండి యొక చిన్న వెలుగు గోళాకారముతో బైటికి వచ్చినది. అంతటితో నా పుష్పము సువాసనవీడినది. ఒడిలిపోయినది. తుమ్మెదలు చెల్లాచెదరైనవి. ఆ వెలుగు రాణి నాశికలోనుండి లోనికరిగినది. ఆమెకు మెలకువ వచ్చెను. ఉలిక్కిపడి లేచెను. రాజామె ప్రక్కన కూర్చుండి యుండెను. మహారాజామెతో తనకలసంగతి వివరించిచెప్పెను. ఆమెయు దనసంగతి భర్తతో చెప్పెను. వారు తమకోరిక నెరవేరినదని సంతోషించిరి. రాణి గర్భవతి యయ్యెను. పదిమాసములు నిండినవి. ఒక శుభసమయమున నామె యొకదామరమొగ్గను బోలిన యండమును గనెను. పురిటింటిలోని వారందరు వింతపడి చూచుచుండగా నా యండముపూరేకులవలెవిచ్చినది. అందు సర్వాలంకారములు గలయొక శిశువుకనిపించెను. అది యాడశిశువు. రాజీవార్త వినిచాల యాశ్చర్యమునొందెను. పిమ్మట జాతకర్మాదుల వ్రాయించి రత్నప్రభ యని పేరుపెట్టెను.

రత్నప్రభ దినదిన మొక్కచాయగా పెరిగినది. పదియారు నెలలలో పదియారేండ్ల బాలికయైనది. గురువులు సూచించినంత మాత్రముచేతనే సకలశాస్త్రములు, విద్యలు కళలు నలవరచుకొన్నది. ఈ కారణములచే నామె దేవతల యంశతో బుట్టినదని లోకులు,తల్లిదండ్రులు భావించిరి. ఆమె యందము మానవలోకములోనిది కాదని యామెదాసి చెప్పినది.

అట్టి యందాలరాసి నాకులభించు నందువా ?
తప్పక లభింపగలదు
ఎందుకని ?

నాయనా వినుము. ఇప్పటికేవేలకొలంది రాజకుమారులను చూచితిని. నీ యంద మెవరియందు చూడలేదు.

అవ్వా! ఒక్క యందముతో నేమగును. విద్యాధనములుండవలయును. ఆమె రాజకుమారుని. పరాక్రమవంతుని వరించును.

వేదకుంభుడన్నమాటిని లేచెను. చేయికడుగుకొనుటకు వాకిటిలోని కరిగెను. వానితో తెల్లనివెన్నెలలు నడిచివచ్చుచుండెను. చూచినవారందరు చందమామ మానవరూపముతో నచటకు వచ్చెనని యూహించిరి. దారివెంబడి వచ్చిపోవు వారందరాయువకునిచూచి యట్లెనిలబడిపోయిరి. క్రమక్రమముగా జనులుగుంపులుకూడిరి. వేదకుంభునకు వారెందుకు నిలిచిరో యేమిచూచుచుండిరో యర్థముకాలేదు. అతడు చేయికడుగుకొనిలోనికరిగెను. క్షణములోండిమరలబైటికివచ్చెను. మూగినజనము వీగిపోలేదు. వేదకుంభుడు యరుగుమీద కూర్చుండెను.

'ఎంతసుందరుడు. చూచుటకు వేయికన్నులు కావలయును' అనివారిలో నారనుకొనుచుండిరి. అవ్వయామాటలు వినెను. 'నాయనా వేదకుంభా! లోనికిరమ్ము' అనిపిలిచినది.

ఆమె రాజకుమార్తెను గురించి యింకేమైన చెప్పునేమోయని లోనికరిగెను.

'దిష్టిచేటు లోనగూాన్సుంచుచుము' అని నూనెముందము వాల్చినది.

అప్పుడు వానికర్థమైనది. నేనంత యందగాడనా యవ్వా!

'ఎవరియందము వారికి తెలియదు. నీసౌందర్యము నే మహారాజు కూతురనుభవించి యానందింపనున్నదో' అనుచు నవ్వ దొడ్డిలోనికరిగెను. వేదకుంభుడు క్రమక్రమముగానిద్రలో మునిగెను.

వేదకుంభుడు తత్త్వభేదిమంత్రమును పట్టుదలతో నడవియందుండి పదేడులు జపించెను. ఆహారము తినకుండు టచే శరీరము కృశించుటకుమారు నానాటపుష్టికల దయ్యెను. సంవత్సరములవెంట నాతని ముఖకాంతి యభివృద్ధి యగుచుండెను. వేదకుంభుడు తనలోనీ మార్పునకు వింత పడచొచ్చెను. వానికి తేజము హెచ్చినకొలందియు పట్టుదల హెచ్చినది. వేదకుంభు డప్పటి కిరువదై యేండ్ల వాడయ్యెను. వాని శాంతస్వరూపమునుగాంచి యడవిమృగములు తమ ప్రవర్తనమును మార్చుకొన్నవి. సింహ శరభ, శార్దూలాదులు జీవహింసను మానివేసినవి. కోతులుతిని రాల్చినకాయలు ఫలములుభుజించి యాకలితీర్చుకొనినవి. పక్షులు వంచన మునుమాని ఋజువుగా వర్తించినవి. ఫలవృక్షములుసైతము వేదకుంభుడు దరికివచ్చినంతనే కొమ్మలువంచి పూలతో పూజించి పండ్లనొసంగినవి. తన తపశ్శక్తిచేత ప్రకృతిలో కలిగినమార్పునకు వేదకుంభుడాశ్చర్యము నొందెను. అతడు

మరింత నిష్కళంకాశయుడై ఘోరముగా రెండేండ్లు తపము గావించెను.

వేదకుంభుడొకనాడు యోగసమాధియందుండెను. వానినెవరో గట్టిగా వీపుమీద తట్టినట్టుల తోచెను. అతడు వెంటనే కన్నులు తెరచెను. వానియెదుట నొకస్త్రీ కనిపించినది. ఆమెకు నలుబది యేబదియేండ్లుండవచ్చును. ఆమె సగము నెరసిన తలవెండ్రుకలను ముడిచి కుడివైపున కోరగా కొప్పు పెట్టినది. అర్ధచంద్రునివంటి నుదుట సింధూరముతో బొట్టు పెట్టినది. ముక్కున నడ్డబేసరియు బులాకియుకలదు. చెవులకు దుద్దులు తాల్చెను. ఆమె తెల్లనిచీరెకట్టుకొని బంగారు పేటంచుజరీరైక తొడిగినది. చేతులకు బంగారుగాజులుగలవు. పాదముల నందెలు కడియములుగలవు. మెడలో ముత్యాల హారములు బంగారుసరములు తళతళ మెరయుచుండెను.

ఆమె వేదకుంభునిచూచి నాయనా! నాది యీ సమీపమునందొక గ్రామము. నే నాకొండవెనుకనున్న గ్రామమునకు పోవలయును. నేనుబయలుదేరునప్పటికి చాలాప్రొద్దెక్కినది. ఇక్కడికి వచ్చునప్పటికి నడిజామయినది. ఎండ తీవ్రముగానున్నది. ఇంకవచ్చినంతదూరము పోవలయును. కొంచెమలసటతీర్చుకొని పోయెదను. కానీపు నీతో జూదమాడవలయునని యున్నది రమ్ము' అని తనచేతనున్న పాచికలనుచూపి గలగలమ్రోయించెను.

వేదకుంభుడు 'అమ్మా! చెడినదిచాలక మరలజూదమా నాకిష్టములేదు' అని బదులుచెప్పెను.

ఆ పెద్దముత్తైదువపలు విధములవేషించినది. ఆతడులోబడ లేదు కనులుమూసికొని తపమాచరించుచుండెను. అంతనా ముత్తైదువ పకపకనవ్వెను. వేదకుంభుడు చలింపలేదు. అతడు నిశ్చలముగ హృదయములో మంత్రము జపించుచుండెను. వానికాసమయమున దివ్యమగు వీణానాదము వినిపించినది. అతడు పరమానందభరితుడై 'అమ్మా'యనికనులు తెరచెను. అచట ముసలియువతి లేదు. సరస్వతి వీణాపుస్తకపాణియై కని పించినది. వేదకుంభుడామెకు ప్రదక్షిణ నమస్కారము లాచ రించెను.

సరస్వతి యపరిమితానందము నొందెను. కాని యామె కనులలో విషాదరేఖలలముకొన్నది. వేదకుంభుడా దేవిని కన్నార్పక చూచెను. వానిమనస్సులో సంతోషతరంగములు తాండవించినవి.

ఆమహాదేవి కుమారా! నీవుబాలుడవు సమస్తసుఖము లనుభవించవలసిన వాడవు. ఈ ప్రాయమున నిట్టి ఘోరమగు తపమేల కావించెదవు? ఈ విరక్తి నీ కేల కలిగినది నాయనా!

విరక్తికాదు తల్లీ యనురక్తి

దేనియందు?

విద్యయందు

విద్యవల నీకు కలుగులాభము

విజ్ఞానము

విజ్ఞానము నీ కేమి సుఖము నొసంగగలదు? భోగమో, భాగ్యమో, రాజ్యసంపదలో కోరుకొందురుగాని కోరమాలిన విద్యకొరకిట్లు శరీరమును కష్టపెట్టుదురా?

విద్యయున్నచో సకలసుఖములు పడయుచచ్చును. విద్య యిహ పరసాధనము. అదిలేక మానవు డెన్ని భోగ భాగ్యములు రాజ్యసంపదలున్నను రాణింపనేరడు ఈ భోగములన్నియు విద్యలేనిచో కొండముచ్చునకు నగలలంక రించినట్లుండును.

తల్లీ! నాకు విద్య దయచేయుము.

నాయనా! నీబుద్ధి మెచ్చుకోతగినది. నీ కేవిద్యలు కావ లయును?

అమ్మా! నాకు సకల విద్యలు కావలయును. నే నెరు గని విద్యలు ప్రపంచమునందేది యుండరాదు.

కుమారా! నీ కోరిక నిరుపేదవాని యాశవలెనున్నది.

అవును నేను నిరుపేదను. నా యజ్ఞానముచేత తల్లి దండ్రులకు దూరమైతిని. గృహసౌఖ్యములకు దూరమైతిని. రాజదండనకు గురియైతిని. అడవులపాలయి కాయకసరులను భుజించితిని. చలివానలకు తలయొగ్గితిని. కఠినశిలాతల మున శయనించితిని. నేను నిరుపేదను కాకమేమగుదును తల్లీ! దీని కంతకు నావిద్యాహీనతయే కారణము.

వేదకుంభుని హృదయము దుఃఖములో మునిగిపోయిన కన్నీరు కడవలతో పోసినటుల ప్రవహించినది. అతని పూర్వ చరిత్రయంతయు నొక్కసారి జ్ఞాపకమునకు వచ్చినది. అది వానిని పిసించి పిప్పిచేసినది. అతడు నిలువలేక సరస్వతి పాద ములమీదపడెను. ఆమెకు కన్నులలో నీరుతిరిగినది. వేద కుంభుని సాదరముగా లేవదీసినది. అతడా మహాదేవి ప్రసా

దమునకై తలయెత్తి ముఖమువంకజూచెను. కన్నీరు కనుల కొలకుల వెంట చెక్కులమీద జారుచుండెను.

ఏమీ? నాకు విద్యాదానము చేయుటకు నీకు విషాద ముగా నున్నదా తల్లీ! అవును పరమకిరాతుడను పాపుడను పవిత్రములగు విద్యలు నానోటబడి యపవిత్రములగును. సత్యము కాని నీకు తప్పనిది. లేనిచో నేను మరణింతును.

లేదు నాయనా! నాకు విషాదముగా లేదు. నా కన్నీటి కొక కారణమున్నది.

ఏమది ?

అది యొక పెద్ద విషాదగాథ

నాకు చెప్పకూడనిదియా?

ముందు ముందు నీకే తెలియగలదు.

అమ్మా! నీవే చెప్పకూడదా?

కూడదు నాయనా ! కూడదు.

ఎందుకని ?

ఇది సమయముకాదు

వేదకుంభుడు సరస్వతివంక తేరిచూచెను.

ఆమెహృదయము విషాదాకులమైనది. వేదకుంభుని చేతులతో దగ్గరకుతీసికొన్నది. 'కుమారా! వేదకుంభా! నీ వుసకలశాస్త్ర విద్యాపండితుడవైతివి. ఏదీ నీకన్నులు తెరువుము. నీకుసమానమగు విద్యావేత్తలు చతుర్దశభువనము లందు నుండరు'.

వేదకుంభుడొడలెరుగని యానందమునొందెను.

సరస్వతి మాయమయ్యెను.



వేదకుంభునకు మనోభారము తీరిపోయినది. అతడరణ్యమునుండి వెడలి నలందా విశ్వవిద్యాలయము దర్శింప వచ్చెను. అచట నిర్వేదాచార్యుడను మహాపండితుడుగలడు. అతడు సకలశాస్త్రములను, విద్యలను, కళలనునేర్చిన మహాపండితుడు. సరస్వతి పురుషరూపము నా మహాపండితుడై జన్మించినదని వాడుక. వేదకుంభుడాయనవద్ద నొకనెలదినములు శుశ్రూష కావించెను. దేవతావరమున విద్యలు లభించినను గురుసేవగావించుట లోకాచారము. ఆకాలమున నలందా విశ్వవిద్యాలయము లోకవిఖ్యాతినొందెను. నానాదేశముల నుండి విద్యార్థులువచ్చి యచట శాస్త్రము లభ్యసించుచుండిరి. అందలి విద్యాగురువు లొక్కొక్క రొక్కొక్క శాస్త్రమునందు తరగనినిధులు. శాస్త్రములకు శాస్త్రములునిర్మింపగల సమర్థులు. దేవతాప్రసాదములను బడసినవారు. వారిలో నిర్వేదభట్టాచార్యుడు ప్రధానగురువు. ఆయన వేదకుంభుని ప్రతిభావిశేషములను బరిశీలించెను సర్వతంత్ర స్వతంత్ర భట్టాచార్యుడను బిరుదునొసంగెను.

కాశ్మీరదేశము మహాపండితులకు నివాసస్థానము. ఆకాలమున నెంతపండితుడైనను కాశీగాశ్మీరదేశ పండితులను జయించినగాని తనపాండిత్యము రాణింపకుండెను. కావున విద్యపరిపూర్తియైన తరువాత పండితులందరు, కాశి చేరుకొందురు. అచట సభలయందు పండితులతో వాదోపవాదములు గావింతురు. తమపాండిత్యము వెల్లడింతురు. బిరుదులను సంపాదింతురు. పిమ్మట దేశసంచారము

గావింతును ఆకాలమున గాశ్మీరదేశమును నరేంద్రదమను డనురాజు పరిపాలించుచుండెను. అతడు నాల్గుశాస్త్రిములు నాల్గువేదములు నామూలాగ్రముగా చదివెను. వానికొలువు నందు దిగ్గంతులవంటి మహాపండితులుగలరు. వారినిజయించిన వారెవరులేరు. ఆయనకొలువునకు సరస్వతీపీఠమని పేరు.

సరస్వతీపీఠమందమైన మందిరము. దానియగ్రభాగమున శారదేవి విగ్రహము స్థాపింపబడెను. అది మహిమగల విగ్రహము. సరస్వతియే యారూపమున నచటవెలసినదని వదంతి కలదు. ఎప్పుడువెలసినదో? ఎవరాభవనమును నిర్మించిరో కథలు గాథలు చెప్పుకొనుటయేగాని సత్యమెరిగినవారు లేరు. నరేంద్రదమునకు పదితరములక్రిందట బ్రహ్మదమనుండను రాజు కాశ్మీరదేశమును పరిపాలించెననియు; అతడు బ్రహ్మదేవుని ప్రార్థించి సరస్వతిని తనకొలువున నుండునటుల ననుమతి బడసెననియు; నాటినుండియు నామె యారూపముతో నచట వెలసెననియు చెప్పుదురు. దానికారాజవరు డొక దివ్యభవనము కట్టించి యేటేటనుత్సవములు కావించెను. ఆసందర్భమున పండితులను సన్మానించెను.

సరస్వతీ పీఠమునందు శారదాదేవికి ముందుభాగమున విశాలమగు చలువరాతి చప్పరముగలదు. దాని స్తంభములకు బంగారుమొలాము చేయబడెను. పైభాగము చంద్రకాంత శిలలచేత నిర్మింపబడెను. దానికి నాలుగుద్వారములు నలువైపుల నమర్చబడెను. ఆద్వారములకు ముందువైపుగా నలుప్రక్కల నాల్గుఎత్తైన బంగారుపీఠములు గలవు. వాని కొక వైపుగా సింహాసనమున్నది. ఆచప్పరమునకుముందుభాగము

పండితులకు వరుసగా నాసనములమర్చబడియుండెను. లోపలి భాగమునందు స్త్రీలు కూర్చుండుటకు మేడకలదు, మహా రాజునకు సరస్వతీ విగ్రహమునకు కుడిప్రక్కన నున్నతమగు రత్నసింహాసనమమర్చ బడెను. ఆభవనమునకు ముందొక గంటగలదు. నూతనముగా వచ్చిన పండితుడాగంటను మ్రోయింపవలయును. రాజు నాసతిబడసి భటులు వానిని లోపలికి గొనివత్తురు. పిమ్మట నాపండితు డేదిశయందుండి వచ్చిన యాద్వారముగుండా చలువవేదికయందు ప్రవేశింప వలయును ఆవైపు పీఠముపై గూర్చుండవలయును, ఇది నియమము.

వేదకుంభుడు వివిధదేశములందు చరించెను. పేరు గాంచిన పెద్దపెద్ద పండితుల నందరిని శాస్త్రివాదమున జయించెను. కాశ్మీరదేశమునకు వచ్చెను. యథారీతిగా సరస్వతీ భవనమునందు ప్రవేశించెను. అవి దేవియుత్సవదిన ములు. నానాదేశములనుండి మహాపండితులు వచ్చిరి. సభ కిటకిటలాడుచుండెను మహారాజు సింహాసనము నలంకరించెను. సభలోని వారందరు నొక్కసారిగా వేదకుంభునివంక చూచిరి. అతడు బ్రహ్మచారి ఒంటిపేటజందెము, నడుమునకు మోకాలు మోవచుట్టిన నీరుకాలిబట్ట, వ్రేళ్ళకు దర్భయుంగరములు చేతిలో మోదుగుకఱ్ఱ వెలసిన వామనమూర్తివలె నుండెను. చెవులందు వ్రేలాడుచున్న రత్నకుండలములకాంతి మిసిమి చెక్కిళులయందు వింతవన్నెలు కొలుపుచుండెను. ముంజేతి బంగారు సింహతలాటపు మురుగులుపాండితీ ప్రతిభలనుచాటు చుండెను. పాదములకుతొడిగిన పావుకోడు నాజూకుతనమును

వెల్లడించుచుండెను. భుజములమీదను గల బంగారుపోగులను పచ్చనిసాలువ మేనిమిసిమికి పసిమినికల్పించుచుండెను. ముఖ మతిమనోహరము. దానినుండి సాయంకాలప్రు లేతయెండ వంటి కాంతులు వెడలుచుండెను. ఆ బ్రహ్మచారి చిరునవ్వు వెన్నెలనిగ్గులో సభాభవనమంతయు నిర్ఘాంత పోయినది. అతడు రూపముతాల్చిన బ్రహ్మతేజము. దానిని పండితులు రాజు కనువాల్పక నరయుచుండిరి.

'బ్రహ్మతేజస్వులగు బ్రహ్మచారులకు నా ప్రణామము' అనుచు మహారాజు నరేంద్రుడు సింహాసనము మీద నుండి లేచెను. ఆయన యెందుకు లేచెనో యేమనెనో ఎవ్వరికిని తెలియదు. వానితోపాటు పండితులందరు లేచిరి. ప్రణామము గావించిరి. అది వారికి తలనతలంపుగా వచ్చినమాట బ్రహ్మచారి బంగారుతీగెలవంటి వేళులతో కంకణఘుంటిక మ్రోయుచుండ చేయెత్తి 'విజయోస్తు తే రాజన్' అనియాశీర్వదించెను. రాజు సభాసదులుకూర్చుండిరి. బ్రహ్మచారియు కూర్చుండెను నరేంద్రదమనునియాస్థానపండితుడు గోపాతిభట్టాచార్యుడు. అతడు చతుశ్శాస్త్రవేత్త. ప్రాయమున ముసలివాడు. పాండిత్యమున పడుచువాడు. అతడు పండిత పరిషాధికారి. ఆసనముమీదనుండి సాలువుసర్దుకొనుచు నిట్లు ప్రశ్నించెను.

బ్రహ్మచారీ! నీవే శాస్త్రమునందు పరీక్షింపబడ వలయును?

విద్యావేత్తల కిష్టమువచ్చిన శాస్త్రమునందు.

సమాధాన మతిప్రౌఢముగా నున్నది. కంఠస్వరము మేఘధ్వనివలె నున్నది. బ్రహ్మచారి చిన్నవాడు. పాతికేం

ప్రశ్నించెను. పండితుడు చింతపడెను. మరల నిట్లనెను. 'నీవు నాల్గు శాస్త్రములు నేర్చితివా?'

చాల తప్పుగా సెలవిచ్చినారు?

రాజునకు నవ్వు వచ్చినది. వాదము ప్రారంభమైనది. వ్యాకరణశాస్త్రముతో ప్రారంభించిన చనాల్గు శాస్త్రములను తిరిగినది. గౌహతిభట్టాచార్యులకు గుక్క తిరగలేదు. పండితులవెంట పండితులు ప్రశ్నలు వాదములు సాగించిరి. వారి వాదము లాపోశనపట్టెను.

'ఇతడు మానవ బ్రహ్మచారి కాడు' అని యందరు నోరులు మూసికొనిరి. ఇంక వాదించువారు లేరు. రాజు వానికి కనకాభిషేకము చేసెను. లక్ష సువర్ణములు బహుమాన మిచ్చెను

'రాజా! నేను బ్రహ్మచారిని. నాకీ ధనమెందులకు? బీదలకు దానముచేయుము' మని వచించెను. తన యాసనము మీదనుండి లేచెను.

నరేంద్రదమనుడు వానికి నమస్కరించి 'ఆర్యా! మా యాస్థానమున మీరు ప్రధానస్థానమలంకరింప వలయునని నా కోరిక,' అని ప్రార్థించెను.

అందులకు వేదకుంభు డిట్లనెను. మహారాజా! నాకు పదవులపై యాసలేదు.

పోనిండు మా రాజ్యమున సుఖముగా వసింపుడు.
బ్రహ్మచారికి సుఖోపభోగములు చెల్లవు రాజా!
చెల్లనిచో మాపీట భిక్ష గావింపుము
'అది నాకు గిట్టదు'

రాజేమియు మాటాడలేదు. వేదకుంభుడు సభనుండి లేచెను.

పునర్దర్శనము ?

ఈశ్వరేచ్ఛ.

వేదకుంభుడు బయలుదేరెను. వాకిటికివచ్చెను. బంగారు పల్లకి సిద్ధముగా నుండెను వేదకుంభుడు పల్లకి నెక్కెను. తన సిబ్బందితో ప్రయాణము సాగించెను. కాంభోజనునకు దారితీయుడని శిష్యుల కాజ్ఞాపించెను. 'నరేంద్రదమనుడు తన సైనికులలో మహావీరులను నాశ్వికులను నూర్గురను పిలిచి వేద కుంభ భట్టాచార్యులు కాంభోజ రాజ్యమున కరుగుచున్నారు. వారి కే యాపద మార్గమునందు కలుగకుండ రక్షించు చుండుడు. వారికి వలయు సౌకర్యములను కల్పించుచుండుడు, అనియమితముగా ధనమిచ్చి వేదకుంభుని వెంట పంపెను. వేద కుంభుడు గ్రామములను నగరములను వనములను గడచి కొన్ని దినములకు కాంభోజ రాజ్యమునందు ప్రవేశించెను. అచ్చటి జనులవలన రత్నప్రభాదేవి వృత్తాంతమును వినెను. ఆమెతో శాస్త్రవాదము కావింపవలయునని తలంచెను. ప్రధాన నగర మునకు వచ్చెను. ఆ యూర నొక వృద్ధురాలియింట బస చేసెను. తన రాకనుగురించి తెలుపుచు వైద్యుతిమహారాజు నకు వర్తమాన మంపెను.

వేదకుంభుడు నిద్రనుండి లేచెను. రాజు కొలువునుండి భటుడొకడు వచ్చి ద్వారముకడ వేచియున్నాడని శిష్యులు మనవి చేసికొనిరి. వేదకుంభుని యనుమతిప్రకారము రాజ భటుని శిష్యులు లోనికి తెచ్చిరి. అతడు వేదకుంభునకు నమ

స్కరించి యొకయుత్తరము చేతికందించెను. అది యనుమతి పత్రము. వేదకుంభుడు దానిని చదువుకొనెను. అందిట్లున్నది.

బ్రహ్మశ్రీ రాజ రాజాధిరాజ మాన్యులును సర్వతంత్ర స్వతంత్ర భట్టాచార్య బిరుదాంకితులును ఘంటాకంకణ చ్ఛత్రచామరాందోళికాది రాజలాంఛనులునగు వేదకుంభ పండితశేఖరులకు

శ్రీ శ్రీ మహారాజ రాజాధిరాజ, రాజేంద్ర మత్త వేదండ కంఠీరవ, రాజాలంకార, శ్రీ శ్రీ శ్రీ కాంభోజ సామ్రాజ్యచక్రవర్తులు వైద్యుతిసార్వభౌములు పురుషపుర సింహాసనాధిష్ఠితులై వ్రాయించి పంపినయనుమతిపత్రము

మీ రాకవలన మాకు మహానందమైనది. ఈ వైశాఖ బహుళ దశమీ సోమవారము సభ చేయించుటకు మేమును మా యాస్థాన విద్వాంసులును నిర్ణయించు కొంటిమి. అంత వరకు మీరు మీ పరివారముతో మా కోటయందు మీకై ప్రత్యేకముగా నియమింపబడిన విడిదియందుండ కోరు చున్నాము.

ఇట్లు
కాంభోజరాజ్య చక్రవర్తి
వైద్యుతిమహారాజు.

వేదకుంభుడు తలయెత్తి చూచెను. రాజభటుడు వేదకుంభునకు నమస్కరించి 'స్వామీ! మీకొరకు రాజపురోహితుల వారు మేనా కొనివచ్చిరి. తమ రాకకై చూచుచున్నారు' అని వచించెను.

వేదకుంభుడు లేచి శిష్యులతో బయలుదేరి పోయెను. కోటలో మహారాజు నియమించిన విడిదియందు దిగెను. రాజు నియమించినదినమునకై యెదురు చూచుచుండెను.

వేదకుంభుని శాస్త్రపాండిత్యమును గురించియు సౌందర్యమును గురించియు నగరమునందలి జనులు కథలుగా గాథలుగా జెప్పుకొన నారంభించిరి. అతడు దేవతాంశమునజన్మించెననియు, మానవులందంతటి యందము గలవాడెందును లేడనియు రాజకుమారి యదృష్టము మంచిది కావుననే, యాతడీ నగరమునకు వచ్చెననియు ననుకొనుచుండిరి. నగరమునందెక్కడ విన్నను వేదకుంభునిమాటలే వినవచ్చుచుండెను. ఆస్థానపండితులు గాయకులు కళోపాసకులు నటీనటులు వానిని దర్శించి పోవుచుండిరి. చూడవచ్చిన వారందరిదొక టేమాట. రాజకుమారికి తగినవరుడు వేదకుంభుడు. దైవము వారిరువురను దాపునకు చేర్చినాడు. వివాహము తప్పక చేయును'

వేదకుంభుడు వచ్చినవారందరితోడను సాదరముగ మాట్లాడును, చర్చించును. ఏ శాస్త్రమునందు విషయ మందించిన నామూలాగ్రముగా వివరించును. ప్రతిపక్షపు వాదనలను ఖండించి తన వాదము నిలబెట్టుకొనును. వాని మాటలలో తేనెలు సోనలై ప్రవహించును. వినువారు దానిని కుత్తుకవరకు త్రావి యానందింతురు. గాయకులు విషయములగు తాళల యా స్వరములనుగురించి ప్రశ్నించుచుండును. వానినన్నిటినిపాడి యొండొంటితో పొందుపరచి చూపును. వాని కంఠస్వరమునందు వీణాకలాపము లాలాపముచేయును. వారు చెవులు విచ్చి విందురు. నాటకులతో నాట్యాభినయములను

గురించియు, రసభావములను గురించియు చర్చించును. 'వేదకుంభునకు రానిశాస్త్రములేదు, విద్యలేదు కళలు లేవు. అతడు సర్వజ్ఞుడు అని యందరు నను కొనిరి. మహారాజ వానిని పరమేశ్వరుడే యీరూపమున రాజకుమారినివరింప వచ్చెనని యూహించెను. కాని వేదకుంభుని బ్రాహ్మణుడు రాజకుమారుడైన యెంత బాగుండెడిది' యని తలంచెను. క్రమక్రమముగా వేదకుంభుని సంగతి రత్నప్రభ చెవులలో పడినది.

౨

అది మండు వేసవికాలము. రోహిణీకార్తి రెండుపాదములు గడచినది. మూడవపాద మారంభమైనది. ఆనాడు సూర్యుడగ్నివర్షము కురిపించినాడు. ఆమంటలకు భూదేవి యొడలుమండిపోయినది. సూర్యునిమీద చేటలతో సుడులు త్రిప్పి దుమ్ము త్తిపోసినది. పోరాడుచున్న యాలపోతులమధ్య పడి లేగలకాళ్ళువిరిగినట్లు నడుమవీధివెంట పోవువారి యొడలంతయు మలమలమాడినది. దుమ్ము కన్నులనిండ పడినది. ఇంక చెప్పవలసిన దేమున్నది. చల్లచెట్లనీడలకై పరుగులెత్తనారంభించిరి. ఇంటిలోనివారు తలుపులుమూసికొని నాలుగు గోడలమధ్య తెకతెకలాడిపోయిరి. ధనవంతులు వట్టివేళ్ళ తడికెలు చలువపానీయము లుపయోగించుచు దినమెల్లగడిపిరి. సాయంకాలమైనది. కాని వడగాలితగ్గలేదు. పిల్లకక్కటిల్లిపోవుచుండిరి. తల్లిదండ్రులు వారిని భుజములమీద వేసికొని వీధివాకిళులవెంట తిరుగుచుండిరి. అప్పుడప్పుడే యుదయించిన

చంద్రుడు పురీజనముల శరీరములు చల్లని తన కరములతో నిమురుచుండెను.

రత్నప్రభ పగలంతయు శీతలోపచారముల ననుభవించినది. ఆమెకు విసుగుపుట్టినది. కొంచెము వెన్నెల సుఖమనుభవింపవలయునని మేడముందు వసారాలోనికి వచ్చినది. అక్కడ గాలియాడుట లేదు.

నేనుపుట్టి బుద్దెరిగినతరువాత యింత యెండతీవ్రత నే నెరుగను 'అనివిసుగుకొన్నది. అవునమ్మా! యసలే శేతతములపాకువంటి శరీరము. ఉడుకెత్తి కమిలిపోయినట్లయినది. చంద్రశాలలోనైనా చల్లగానుందునేమో' అని యందిచ్చినది యొకచెలికత్తె. రత్నప్రభ 'అవును'ననుచు మేడచివరియంతస్తుమీదకిపోయినది. చంద్రశాల యామెను పిలుచుచున్నటులున్నది. చెలికత్తెలు ముందుగా కావలసినసౌకర్యములుచేసిరి. రత్నప్రభ యొక చలువరాతి యరుగుమీద కూర్చుండెను. చుట్టు క్రింద చెలికత్తెలుకూర్చుండిరి. క్షణముసేపెవరుమాట్లాడలేదు. అందరు నిశ్శబ్దముగానుండిరి. చెలికత్తెలుచిలిపికత్తెలు· రాజకుమారిని నుడికించుటయో యూరించుటయో వారిపని·

వారిలోనొకతె 'అమ్మా! మహారాజుగారు సభనెప్పుడు నిర్ణయించిరి?' అని ప్రశ్నించెను.

రాజకుమారి నీకావిమర్శ యెందుకేయన్నది.నవ్వుచు. కొంచెముగడసరిది, రెండవచెలికత్తె ఆమెయామాటయందుకొన్నది. ఇట్లుసమాధానముచెప్పినది. అట్లనెదవేమి? మీకుపెండ్లియైనచో చూడవలయునని.

చూడటమేనా, పెండ్లికానుకలు వచ్చునని యన్నది మూడవది.

కాదమ్మగారు. మీకొకవేళ సుస్పష్టమైతే చూడవలయునని అన్నది నాల్గవది ఆమె కొంచెము ముదిరిన ప్రౌఢురాలు.

చూచుటయేమిటి? యెత్తిముద్దాడవలయునని అన్నదింకొకతె. వారిసంభాషణ అసలుచెట్టులేదుచిగిరించి, పూవులు పూచి కాయలదాకావచ్చినది. రాజకుమారియొక్క యెద లింపదలించినది. అందరినోరులు కట్టుబడినవి ఒకఘడియ కాలము గడచినది. రెండుఘడియలైనది. అందరి మనస్సులేకమైనవి. మొగములెత్తుకొని చెవులువిచ్చి వినుచుండిరి.

'ఏమిటది?' అని రాజకుమారి ప్రశ్నించినది

'గానము' అని యెవరో యెదటున సమాధానము చెప్పిరి.

'గానమా?'

అవును.

అబ్బా! ఏమాధుర్యము. ఏమాకోమలత్వము. ఎవరాపాడునది.

ఏమో! దేవతలై యుండవచ్చు!

రత్నప్రభ ముఖము వికసించినది. చిరునవ్వు మొలకలు మోసులెత్తినవి. వ్రేళ్లుతాళసరళికి దారిచూచినవి. ఆమె హృదయముప్పొంగినది. అస్ఫుటముగా వినిపించిన యాగానము క్రమక్రమముగా స్ఫుటమైనది. అది యమృతప్రవాహమువలె నామెమనస్సునకు విచిత్రమగు కదలిక కలిగించినది. ఆ గానమును రత్నప్రభ చెవులువిచ్చుకొని వినినది.

'మలయ మారుతము, నిజముగా మలయమారుతమే వల్లీ! ఏదీనావీణ నిటుతీసికొనిరా' యనినది రత్నప్రభ యానందపరవశములో. వల్లి పరుగుపరుగునపోయి వీణె తెచ్చినది.

రత్నప్రభ వీణాశ్రుతులు మేళవించినది. తీగెలను మీటి? నది. ఆ గీతముతో వీణావాదనమును జతపరచినది. వాయిద్యమునందు తన నేర్పంతయు చూపినది. మంద్రము, మధ్యము, పంచమము, షడ్జమము. ఆ గానముతో నీ వాద్యము లుసరి రాలేదు. 'ఛీ! యీ వీణె యెక్కడ దొరికినదే. బాలసరస్వతి లేదా?' యనినది రత్నప్రభ. బాలసరస్వతి మిక్కిలి యందమైన వీణ. దాని తీగెలు వేరు. శ్రుతుల సరళి వేరు, మెట్లు వేరు, సరికట్లు వేరు. ఆ స్వరపేటికలో కచ్ఛపీనాదము నెలకొనునట్లు స్వయముగా చేయించినదావీణ. అది నిజముగా బాలసరస్వతియే ఆమెకానందము కలిగినప్పుడెల్ల దానిపై గానమాలపించును. వల్లి దానిని తెచ్చినది.

రత్నప్రభ శ్రుతులు సవరించినది. గాన మాలపించినది. బాలసరస్వతి వీణావాదన మా రాగాలాపముతో సరి రాలేదు. ఆమె వింతపడినది. మరల వాయించినది. ఆ కంఠ మాధుర్యమునకు సరికాలేదు. మరల మరల నా గానముతో కలిపి వాయించవలయునని యత్నించెను. ఆమె ప్రయత్నము విఫలమైనది. వీణె నవతల పెట్టినది. గడ్డముక్రింద చేయిచేర్చి మోచేయి ముందానించి చెవులు విచ్చుకొని విన్నది. అది గంధర్వగానము. మానవులెవరు పాడుచున్నది కాదు. ఎక్కడ నుండి వచ్చుచున్నదో? ఆ పాట యొకవైపునుండివచ్చుచున్న

టుల లేదు. అవును. దేవతాగానమట్లే యుండును. ఈ తోటలో దేవతలెవరైన గలరు. యుండిన యుండవచ్చును. నేనీపాట నిదివరకు వినలేదు. నూతనముగా నేగంధర్వ రాజు కూతురో సంచారముకొరకు వచ్చియుండునేమో. ఇందలి పూదోట చాల యందమైనది. ఇట్టి యుద్యానవనము భూలోకమునందెచ్చట లేదనివాదుక. దాని సౌందర్యమున కామె యొడలుప్పొంగినది కాబోలు. అందందు తిరుగాడుచు నీ మలయమారుత రాగమాలపించుచున్నది. కావుననే బాలసరస్వతి చిన్నబోయినది. ఆ దేవతను చూడవలయును. ఆమెతో మాట్లాడవలయును.' అని రత్నప్రభ యాలోచించినది. ఆమె కూరుచున్నది కూరుచున్నటులనే లేచినది. ఆమెకు మరల నాలోచనలు పొడమినవి. ఆమె దేవతాస్త్రీ. నన్ను చూచినంతనే మాయమైపోవును. గానమున కాటంకము కలుగును. అప్పుడు నాతలంపులు వ్యర్థములగును.

మరల రత్నప్రభ వేదికమీద కూర్చుండెను. ఆమె యొడలంతయు చల్లపడినది. కొంచెము కొంచెముగా చలివేసినది. చల్లనిపిల్లవాయువులు మల్లెపూల వాసనలను తాల్చి వీవనములతో విసరినట్లువీచుచుండెను. 'అవునుమలయమారుత రావమున కాశక్తి యున్నది. వేడివాయువులలో మంచి గంధపు చలువతనమును పరపించును. దుమారములయావిరిలో మల్లెవాసనలు వెదజల్లును. దాని గానసరళియట్టిది. పాడువారిలో నాప్రతిభ యుండవలయును. దేవాంగ కావుననే యారాగాలాపమునకు వడగాలిమలయమారుతమైనది. ఆశక్తి మానవులకు కలదా? కలిగినను కలగవచ్చును. మా గురు

వులు మలయమారుత రాగమహిమను వేనోళ్ల పొగడిరి. నాచేత సాధనచేయించిరి. అప్పుడప్పుడు నాకీయూహ తోచుచుండును. నేను దానిలోని సత్యమును పరిశీలించితిని. కాని యీ చలువతనము నీసుగంధము రాలేదు. వచ్చినను వచ్చియుండవచ్చును. నేనంతపరీక్షింపలేదు. తాపజ్వరము మలయమారుత రాగముచేత నుపశమించును. నారదబ్రహ్మలోని మహిమ యటువంటిది. వసంతరాగమునకు చెట్లు చిగిరించును, పూవులు పూయును. పున్నాగరాగమునకు నాగులు పడగ విప్పి యాడును. ఇవన్నియు నెప్పటిమాటలోయని కొందరందురు. అది నాకు 'ప్రత్యక్ష ప్రమాణము' అని యేమేమో యూహలు, తలంపులు నామె మనస్సునందు దాటులు పెట్టినవి. ఆమె మెల్లగా లేచినది. పూదోట దారిపట్టినది. చెలికత్తెలామెను వెంబడించిరి. ఆ చందమామ చలువవెన్నెలలో నల్లనల్లన నడుగులిడుచు ముందునకేగినది. ఆయడుగుల చప్పుడులకు దేవాంగన పారిపోవునేమోయని యామె భ్రమ. చూపులటునిటు పరకించినది. పోయినంతదూర మామెకెవరు కానరాలేదు. ముందు మల్లెపూ బొదరిండ్లు. వెనుక మాధవి తీగెలమండపములు పిదప సన్నజాజివిరజాజిగుబురులు. ఆమీద ద్రాక్షతీగెల పందిరులు. ఒకటివెంట నొకటిగా వెదకినవి. ఏ గంధర్వరాజు కూతురు కనపడలేదు. కాని పాట యంతకంతకు దాపుగా వినిపించినది రత్నప్రభ కాశలు మోసులెత్తినవి. అంతలో చెలికత్తెలామె నాగుమని సంజ్ఞచేసిరి. ఆమె నిలబడిపోయెను. పాట యాగిపోయెను. వారికి మాటలు వినిపించెను. వానిని చెవియొగ్గి వినిరి.

ఆత్రేయా! నీ తాపమెట్లున్నది?
తగ్గినది.
తలనొప్పి?
పోయినది.
అబ్బా! ఒళ్లంతయు మాడిపోవుచున్నది.
కోహలా! యేదీ మేఘమంజరీ రాగము.

కోహలుడు మేఘమంజరీరాగ మందుకొనెను. వేద కుంభుడాలాపన కారంభించెను. రత్నప్రభ గోడచాటుననుండి వినుచుండెను. వల్లిక వట్టిచిలిపిపిల్ల. మందారవృక్షము మీాది కెగబ్రాకి గోడమీాదనుండి యవలకుచూచెను. చల్లని వెన్నెలలో నాత్రేయుడు కొంచెముకన్నుమూసికొని చంద్రకాంతపుటరుగుమీాద పరుండెను. ప్రక్కన వేదకుంభుడు కూర్చుండి రాగమాలపించుచుండెను వెన్నెలవెలుగులో తెల్లబంగారమువలె నొడలు మెరసిపోవుచుండెను ముఖ మగుపించుట లేదు. అట్లే ఒకానొకగడియ కాలము గడచినది. వెన్నెల సన్నగిల్లినది. సన్నని నులిమబ్బులావరించినవి. అవి క్రమ క్రమముగా నొకదానితో నొకటి కలిసికొని విడిపడి పోవుచుండెను. రత్నప్రభకు రాగాలాప ధోరణితప్ప మరేమియు పట్టలేదు. మేఘధ్వనిని విన్నమయూరివలె నామెమనస్సు పొంగిపోవుచుండెను. ప్రపంచమునే యామె మరచినది. మరల నొక్కగడియ గడచినది. ఆకాశమున కారుమబ్బు దొంతరలు వ్యాపించినవి. ఉరుములు మెరుపులారంభమైనవి. వేదకుంభున కమితానందముకలిగెను. ఒడలుపొంగి రెండింతలైనది. ఉత్సాహము పెచ్చుపెరిగినది. ఆ రసావేశములో

తన్ను తానుమరచి యాలాపమొనరించు చుండెను. చిటపొట చినుకులురాలినవి. చల్లగాలి యతితీవ్రముగా వీచినది. చినుకులు చిత్తడిజల్లయినది. అది కుంభవర్షముగామారినది. వేదకుంభుడున్నచోటునుండి కదలలేదు. వాని శిష్యులుకూర్చున్నచోటునుండి లేవలేదు.

రత్నప్రభ చెలికత్తెలతో కన్యాంతఃపురము ప్రవేశించెను.

ఆనాటి యెండతీవ్రత కాత్రేయుడాగలేక పోయెను. వడతాకినది. తాపజ్వరము తగిలినది. ఒడలంత నిప్పులలో పొరలినట్లు కమిలిపోయినది. అగ్నిజ్వాలలవలె పొగలురేగినవి. ఆయూదర కాత్రేయుడు తెకతెకలాడిపోయెను. దానికితోడు తలనొప్పి వచ్చినది. అది వానికిభరింపరాని దయ్యెను. ప్రాణభయమున మూల్గుచు నేలపైపొరలుచుండెను. మిగిలిన శిష్యులందరు వానికి పలువిధముల నుపచారములుచేసిరి. ఆ యుపచారములేవియు పనిచేయలేదు. వారు వేదకుంభున కీ సంగతిచెప్పిరి. ఎండతీవ్రత తగ్గగానె తాపమణగిపోవునని వేదకుంభుడు తలంచెను. అట్లుజరుగలేదు. వడగాలితగ్గలేదు. ఆత్రేయుడు బాధ భరింపలేకపోయెను. పెద్దపెట్టున నేడువ నారంభించెను.

ఆత్రేయుడు పసివాడు. పదిపదునాలుగేండ్ల బాలుడు. వేదకుంభునియొద్ద విద్యాభ్యాసమునకై వానితల్లిదండ్రులు విడిచిపెట్టిరి. వానికి చురుకుతనము మెండు. చూపిన నల్లుకుపోవుశక్తి వానిలోనున్నది. అదిచూచియే వానిని వేదకుంభుడు శిష్యునిగా గ్రహించెను. వేదకుంభున కాత్రేయుడని

నచో చాల ప్రేమకలదు. వానికి రెండేండ్లలో పంచకావ్యములు నలంకారశాస్త్రము కొంతవరకు నూరిపోసెను. కౌముది యారంభించెను మిగిలిన శిష్యులతో పాటూనాడు పాఠమును వల్లెవేయుచు కుండపుకుమీాద కూర్చుండెను. అంతలో వానికి కొంచెము కన్నులుమూసికొని వచ్చినవి. అచ్చటనే మేను వాల్చినిద్రించెను. లేచునప్పటికి వానిమొడలు వానికి తెలియ లేదు. వేదకుంభుడు వాని మొడలంటిచూచెను. నాడిపరీక్షించెను. అది తాపజ్వరమని గ్రహించెను. బైటియుపచారములు పనిచేయలేదు. ప్రకృతిలో మార్పువచ్చినగాని వానికి తాప మడగదు. వేదకుంభుడది యాలోచించెను. ఆత్రేయు నింటిలో నుండి బైటికితీసికొనివచ్చెను. చల్లనిచెట్లనీడ నొకచలువరాతి యరుగుమీాత పరుండబెట్టెను.

గానమునకు ప్రకృతికి సంబంధమున్నది. కాలపురుషుకుసహితము తేజాలనిమార్పు గానము సాధింపగలదు. ఆస్వరసంపుటిలో నాప్రభావమున్నది. ఆనాదములో మహిమ యున్నది. ప్రకృతికివింతప్రకృతికి కల్పింపగలదు. అది సాధన సంపత్తిలోనున్నది. వేదకుంభునకాసంపద కలదు. అది దేవతాప్రసాదమువలన సిద్ధించినది. వేదకుంభుడు ఆత్రేయు నొడియందుంచుకొనెను. మలయమారుత రాగాలాపము గావించెను. ప్రకృతి చల్లారినది. కొంత తాపజ్వరముపశమించినది. పిమ్మట మేఘమంజరి రాగమునకు పూనుకొనెను. కుంభవర్షము కురిసినది. ఆవర్షధారలలో నాత్రేయుడు స్వస్థత వహించెను. వేదకుంభుడువానిని లోనికికొనిపోయెనుఆయకాల కుంభవర్షమునకుగ్రామములోని వారి ప్రాణములు తెప్పరిల్లినవి.

౬

నాటికి నెలదినములైనది. వాదోపవాదములు, ప్రతిపక్ష విఖండనములు, నిజపక్ష సిద్ధాంతము సాగిపోయినది. నాల్గువేదములు నారంగము, నారుశాస్త్రములు, రాజనీతి దండనీతి, ధర్మశాస్త్రములు గిరగిరాతిరిగిపోయినవి వేదకుంభుడు రత్నప్రభకు కొరుకుడుపడని కొబ్బరికాయ యయ్యెను. రత్నప్రభ వాదమారంభించును. ఆమె మనస్సునందున్న విషయములన్నియు క్షణములో వేదకుంభుడు కంటితోచూచి నట్లనువదించును. వానియందలి దోషములనుచూపి ఖండించును. ఆఖండనవాదములే శాస్త్రములందు నుండవు. పండితులు నోరు తెరచి చూచుటయేకాని సమాధానము చెప్పగలవారు లేకపోయిరి రత్నప్రభ వేదకుంభుని యంతులేనిపాండిత్యమునకు నిర్ఘాంతపోయినది. ఆమెయుసామాన్యురాలుకాదు ప్రతిభకలది. వేదకుంభుని నొకపట్టున నిలువనీయలేదు. వాని ఖండనలు నిరర్థకము లౌనరించినది. వేదకుంభుడు ప్రశాంతముగా నాలకించెను. రాబోవు వాదమును తానేయందుకొని తనసిద్ధాంతమును నిలవబెట్టుకొనెను. వారిశాస్త్రములు పండితులకర్థములు కాలేదు. వారిప్రతిభలు మానవమాత్రములు. వీరిప్రతిభలు దేవతలనుసైతమతిక్రమించినవి. వేదకుంభకంఠధ్వని మేఘనిర్ఘోషము. రత్నప్రభ యెలుగురావము కోమలికూత. ఈయిరువుల నామెవిజ్ఞానపించమును పూర్తిగా విప్పినది. ప్రతిభావేశమున శాస్త్రవాదమును నాట్యముచేసినది. వేదకుంభునకది యానందమైనది. కాని యతడు వినికని లోలోన పొంగుపోవునేగాని 'ఔను, సత్యము, వహావ్వా'

యపడు. అది నోటిపెదిమెపరంకు వచ్చినను విరిచి వికలములు చేయును. అది వానిలక్ష్యము. కావిచో వానివాదనకు తావే మున్నది. ఎత్తునకు పై యెత్తు వాదమునకు ప్రతివాదము. అదిచదరంగపుటాట. ఒకరినిమించిన వారింకొకరు. ఒకరుతోసి రాజన్న' నింకొకరు తప్పుకొనిరాజందురు. దినముబెంబడి దినములు గడచినవి. ఎవరుకట్టుపడలేదు.

పండితులకు రత్నప్రభా వేదకుంభుల శాస్త్రవాదము తలపట్టయినది. వారింటికి పోవుదురు. సావకాశముగా వారి వాదములనుగూర్చి యాలోచింపవలయునని కూర్చుందురు. వారికావాదనలే జ్ఞాబకమునకు రావు. వాదనలు జ్ఞాపకమునకు రాకపోయిన పోనిండు సారాంశమైనకు గుర్తునకు రాదు. శాస్త్రములన్నియు తిరుగవేయుదురు. ఏ శాస్త్రములోను వాని జాడలు కనపడవు. వారు విసుగున శాస్త్రిములు కట్టకట్టి మూలకు త్రోయుదురు. ఎవరైనా యానాటి సభావిశేషములనుగూర్చి ప్రశ్నించినచో నాధారములేని వాదము దాని కొక మొదలేమిటి చివరేమిటి యని, కొందరు పండితుల సమాధానము. అవునవునని ప్రక్కననున్న శిష్యులు చేతులు నలుపుకొనుచు 'తందాన తాన' యందురు. కొందరు బుద్ధిమంతులగు పండితులు వేదకుంభుని దర్శించి తమ యనుమానము తీర్చుకొనవలయునని పచ్చుచుందురు. విరామ కాలమునందు వేదకుంభుడు దేవ ధ్యానమునందుండును. వారికి వాని దర్శనము లభింపక తిరిగిపోవుచుందురు.

ఆనాటి వాక్యార్థవాద మతితీవ్రముగా సాగినది. వేదకుంభునిది పై చేయి యైనది. ప్రత్నప్రభ వాని వాదము

ఖడించలేకపోయినది. అది మహామోకొకవిధమైన పరాభవమని తోచినది సగము వాదములోనే నాటిసభ ముగించి పోయినది. రత్నప్రభ యంతఃపురమున కరిగినది. వేదకుంభుడు సామాన్య మానవుడు కాడు. అతడు దేవాంశతో పుట్టినవాడు. ఒకవేళ సరస్వతియే నన్నోడించుట కీరూపమున పుట్టినదేమో, అట్లు నగాదు. ఆమె నాకు వరమును ప్రసాదించిన దేవత. నాపై నామెకు విరోధమేల కలుగును. వేదకుంభుడు మహాతేజస్వి. బ్రహ్మతేజ మాతనిముఖమున వెలుగొందుచున్నది. వాని సౌందర్యమున నా తేజమొక కాంతిని ప్రసాదించుచున్నది. ఆ యందము భూలోకవాసు లందెవరిలో గనిపించదు. ఆయన బ్రహ్మవేత్త. విద్యాసంపన్నుడు. ఇంక నాకారమందుమా కొంతవరకుసరిపోల్చిచూచితిని ఆలక్షణములన్నియు వేదకుంభుని యందు గోచరించుచున్నవి ఏమో! యొకనినిపోలిన వాడిం కొక డుండకూడదా. ఉండిననుండవచ్చును. మహాదేవి చెప్పి నదికదా. ఒకవేళ నా పురుషుడీతడే యగునేమో. అయిన కావచ్చును. కాదనుటకు తార్కాణములు కనిపించుటలేదు. అవుననుటకు దృష్టాంతములు తోచుటలేదు. ఇంకను నాలో చింపవలసి యున్నది. శాస్త్రవాదములు ముగిసినవి. అయిన నేమి కళాప్రపంచమంతు లేనిది. దానినికూడ పరీక్షింపవల యును. అప్పుడుగాని నిజము తేలదు. వేదకుంభుడు గాంధర్వ విద్యయందారితేరిన దిట్ట. కొంతవరకు పూర్వమే తెలిసినది. కానిచో మేఘమంజరీరాగాలాపమునకు కుంభవర్షము కురి యునా! ఆ దినమున సైతమట్లే జరిగినది. అది వసంతతిలక రాగము. ఇది మేఘమంజరి.

రత్నప్రభ కన్నులనుండి యశ్రుధారలు జాలువారినవి. ఆమె కాసంగతి తెలియదు. అవి ప్రవాహములుకట్టి పక్కంతయుతడిపినది. పైటతడిసినది. ఆ చల్లదనమైన నామె గ్రహింపలేదు. ఒకవేళ గ్రహించియు నిర్లక్ష్యముచేసినదేమో! తెలియదు. ఆమె యాలోచనలంతతీవ్రముగా రేగినవి. వానిలో నామె లీనమైనది. ఇప్పుడామెకీ ప్రపంచముగొడవయే లేదు. ఆమెకనులు సగముమూసికొని పోయినది. ఆమె యంతరాత్మ క్రమక్రమముగా నామెకు దూరమైనది 'వల్లికవచ్చి రాజకుమారీ' యనిపిలిచినది. ఆమె పలుకలేదు. తల్లి 'ప్రభా' యని దూరమునుండి ప్రబోధించినది. ఆమె కనులు తెరువలేదు. పోనిమ్ము నిద్రపోవుచున్నదికాబోలు. లేపుట యెందుకని తిరిగిపోయినది.

రాజకుమారి యంతరాత్మ ప్రయాణము సాగించినది. దానికి నదురుబెదురులు లేవు. గాలికంటెముందుగా పరిగెత్తినది. హిమాలయము మీదుగా గౌరీశంకర శిఖరమునకు పోయినది. ఆ శిఖరముతో దానికిపని లేదు. దూరమునుండే జగన్మాతకు సమస్కారమన్నది. కైలాసము దానికి విలాసముగా కనిపించలేదు. ఆ మందాకినీజలతరంగాలు చల్లతనము కూర్చలేదు. ఒకవిధముగా విసుగుపుట్టించినది. మరుక్షణమున రత్నకూటము చేరినది. ఆపర్వతమును చూచినంతనే మహానందము కలిగినది. ఆసంతోషమునకు మేర లేదు. అది పొంగిపోయినది. ఇటునటు గంతులువేసినది. రత్నకాంతులతో ధగధగ మెరయుచున్న గుహలలో తొంగిచూచినది. నీలాలతో మెరపులతో చీకటలుక్రమ్ముచున్న చరియాను పరికించి

నది. జ్యోతిర్లతల వెన్నెల వెలుగులలో హాయినను భవించి నది. హోయిహోయి యొక బంగారుకమలములతోనిండిన సరో వరముచేరినది. అచట కొంతసేపలసట తీర్చుకొనినది. దక్షిణ దిశనుండి తరలివచ్చుచున్న చల్లగాలి పిల్లతరంగములు కొలని మీదుగా నీదులాడుకొనుచువచ్చి రత్నప్రభ యంతరాత్మపై వీచినది. అంతలోనది చల్లపడినది.

కన్నులపండువుగా నీకొలనినిచూచి యెన్నిదినము లైనది. ఆహా యేమిదీనిచలువతనము. ఈసరోవరములో పుట్టి తిని. ఈసరోవరములో పెరిగితిని. ఇది నాపుట్టినిల్లు ఎంతకాల మిందుంటినో నాకు తెలియదు. ఈబంగారు కమలములు నాతోబుట్టువులు. ఇవి తమరేకులనువిప్పి నన్నుసంతోష పెట్టి నవి. ఈతుమ్మెద కుమారులు నాకుజోలపాటలుపాడి నిద్ర పుచ్చిరి. నాతల్లి నన్ను రేకుపొత్తులలోముడుచుకొని కాపా డినది. అని యేమోమో తలపోసినది. అంతలో నాయంత రాత్మ చూపుమరలినది. ధ్యానముపరిగెత్తినది. ఆపూదోట నడిదారివెంబడిపోయి యొకమేడవైపు చూపునిగిడించినది. ఇదినానివాసము. దీనిమీద చంద్రశాలయందుండి యానాడు నేనాయందాలరాసిని చూచితిని. వీణాతుంతువులమీటి నే నాయనచూపు మరలించితిని.

రత్నప్రభ కలకలనవ్వినది. ఆ నవ్వులో వెన్నెల ప్రస రించినది. అది యామెయాత్మ ప్రసాదించిన యానందము. దాని ననుభవించినది రత్నప్రభ. అది యొకమహావనము. అందలితీగెలు చెట్లు నాకులురాలి యొకచిగురుగాని పూవు గాని లేక యుండెను అది యాకురాలుడుకాలము. ఆవనము

నందు సెలయేరొకటి పారుచుండె. అందలి జలమతిస్వచ్ఛముగా నుండెను. లోపలి యిసుక సైతము స్పష్టముగా నగుపించుచుండెను. ఒడ్డుననున్న చెట్లు చేమలా నీటియందు ప్రతిబింబించుచుండెను. రత్నప్రభ యొక సుందరాకారుడగు యౌవనునితో నాయొడ్డునకు చేరినది. వారిరువురు నచటి తిన్నెమీద కూర్చుండిరి. ఇప్పుడామె పేరు విద్యుల్లేఖ.

లేఖా! ఎంతకాలమైనది

దాపునకే వచ్చినది

ఎప్పటికప్పుడే యాశలూరించుచుంటివి

లేదు. ఈసారి నిజము

అట్లయిన వెనుకటివన్నియు నబద్ధమేయందువా?

కాదు. అదియు నిజమే

నీమాట నమ్మజాలకున్నాను

నన్నా! ప్రభూ!

అవును. మరేమనుకొంటివి? క్రిందటి వసంతకాలమున మనమిచ్చట మొదట కలసికొంటిమి. మరల వసంతకాలము వచ్చినది. చూడూ, ఆ చెట్లే సాక్ష్యము.

ఇంకా చిగిరించలేదుకదా

అది యెంతలో జరుగును

అదియునంతే

విద్యుల్లేఖ సిగ్గుతో తలవంచినది. చిరునవ్వు చిలికించినది. కుడిచేతి నడిమి వ్రేలుతో వీణలో నొకతీగెను కదలించినది. అది మధురాతిమధురముగా మ్రోగినది. ఆ మ్రోతలో సుందరుని హృదయము జలదరించినది. లేఖ ముఖమును తేరి

చూచుచు 'ఏదీ యాపంచమ శ్రుతి నాదము' అని చెక్కిలి కొట్టి బ్రతిమాలినట్లడిగినా డాయుందగాను.

లేఖమనస్సు పొంగినది. వీణచేతబట్టుకొని యాశ్రుతి లోనే వసంతలతిక రాగమాలపించినది. దానిలో నమృతము కురిసినది. చెట్లుతలలు నూగించినవి. తీగెలు నటించినవి. సుందర కుమారునిచూపా మెముఖమున నిలిచినది. చెవులు పాటమీాద ప్రసరించినవి. వానికి నమృతము దోసిళ్ళతో త్రాగినట్లయినది. విద్యుల్లేఖకు నావేశము హెచ్చుచుకొనివచ్చినది. ఆమె తన పాండిత్యమంతయు ప్రదర్శించినది. సుందరకుమారుడు మహా నందమునొందెను. ఆమానందములో తలయెత్తిచూచెను. వనమంతయు చిగిరించి రంగురంగు పూలతో కన్నెము త్తెదువ వలె ప్రకాశించినది. పలురకములగు పరిమళములు వ్యాపించి నవి. ఆమె రాగాలాపముమాన లేదు. సుందరకుమారుడు ముందువంకచూచెను. విద్యుల్లేఖ ముఖము పరిశీలించెను. ఆమె ముఖమున చెమటబిందువులు ముత్యములవలె వ్యాపించినవి.

శ్రమకుతగిన ఫలమగుపించలేదు? లేఖా! అని యా సుందరుడు వేళాకోళముగా పెదిమెవిరిచెను.

అది యామెకక్కసు పుట్టించినది. ముఖము ముకు ళించుకొనినది. వీణ నవలనుంచినది. అవును. ఎంతమెప్పింప చూచినను పురుషులకు పెదిమెవిరుపుడు సహజము. అనుచు లేఖమాతి ద్రిప్పుకొనెను.

నామాటకేమి? అటుచూడరాదా?

విద్యుల్లేఖ యటుచూచినది. ఎదుటకొంచెము దూర ములో నొక మోడుమ్రాకున్నది. అది చిగురులుపెట్టలేదు.

పూలుపూయు లేదు. వసంతతిలక రాగాలాపనకు నెండినమామైన చిగిరింప వలయును. కాని యది యట్లే కట్టెవలె నిలబడెను. లేఖ మరలవీణ తాల్చినది. మరల యాలాపమునకు పూనినది. చేతులు కందినవి. వ్రేళ్ళుచీరుకొని పోయినవి. కాని యా మోడుచిగిరించ లేదు.

'లేఖా! అయినదా ప్రయత్నము' అని యాసుందరు డీమారు ముఖముననే వేళాకోళముచేసెను. అది యామెకు పూర్తి పరాభవముగా తోచినది. విద్యుల్లేఖ విద్యాధర సార్వ భౌముని పెంపుడుకూతును. ఆమె చిన్నతనమునుండియు గానాభినయములమీద నభిమానము చూపినది. తండ్రి యామె మనోభావమును గుర్తించి నారదునియొద్ద గానము నేర్పించెను. ఆయన తనవిద్యయంతయు సంపూర్ణముగా నామెకునేర్పెను. ఆమె యంతటితో తృప్తిపడ లేదు. సరస్వతి సకలవిద్యలకు నధిదేవత. ఆమెను ప్రాతః సంధ్యలయందు నిష్ఠతో పూజించినది. సరస్వతి ప్రత్యక్షమైనది. అమ్మా! నాకు నీశుశ్రూష ప్రసాదింపుమని యడిగినది దానికామె యంగీక రించినది. విద్యుల్లేఖను తనవెంట కొనిపోయినది, సత్యలోక మునందు పనిపెద్దదేవతలతో గలిసిసరస్వతికి శుశ్రూష కావించి నది విద్యుల్లేఖ. శారదాదేవి యామెకు స్వయముగా సకల శాస్త్రములు, గాంధర్వము, కవిత్వము, భరతనాట్యాభినయ ముపదేశించినది. పదేండ్లలో నామె సర్వశాస్త్రములందు విద్యలయందు తీర్ణురాలైనది విద్యుల్లేఖ సరస్వతియొద్ద సెలవు తీసికొని తండ్రియింటికి వచ్చినది. తనప్రియుడు తననిష్టపడు వేళాకోళను చేయుట విద్యుల్లేఖకు తలవంపులైనది. ఆమెకు కన్నీటి సుడులుతిరిగినది.

అది పరిశీలించిరాజాసుందరుడు. ఆమెచేతివీణను తాను తీసికొనినాడు. వీణవాయింపమొదలుపెట్టినాడు. ఆవీణ మహాతీకచ్ఛపుల వాద్యమును మించినది. ఆమె హృదయమే చిగిరించినట్లైనది. విద్యుల్లేఖ చూచుచుండగనే యామోడు మ్రాకు చిగిరించినది. పూలతో వికసించినది. ఆరాగాలాపనకు దేవతలమృతము కురిపించిరేమో యనిపించినది.

అంతలో నొక సర్పమాసుందరుని కాటు వేసినది. అతడు మూర్ఛిల్లినాడు.

'హా ప్రాణప్రియా! కళాధరా! అని రోదనపెట్టుచు వానిమీదపడి విలపించినది. రత్నప్రభయాత్మ యథారీతిగా నామెలో ప్రవేశించినది.

'నిలునిలు నాగరాజా! నిలు. ఎక్కడికిపోయెదవు' అని కేకలుపెట్టుచు రత్నప్రభ లేచెను.

ఆధ్వనివిని చెలికత్తెలు చుట్టుచేరిరి. 'ఏమిటమ్మా కల వచ్చినదా?' అని చెలికత్తెలు ప్రశ్నించిరి.

ఆమె తలయూపినది. 'ఏమిటాకల, నాగరాజేమి? అని వారడిగిరి. ఆమె సమాధానము చెప్పలేదు. ఆమె వెక్కి వెక్కియేడ్చుచు కన్నీరుకార్చినది.

## ౭

రత్నప్రభ తెల్లవారుజామున లేచెను. కాలకృత్యములు తీర్చుకొనెను. స్నానముచేసి పూజాగృహములోనికి నరిగినది. శారదామందిరము పుష్పాదులతో నలంకరింపబడి యుండెను. పూజాద్రవ్యములన్నియు నమర్చబడెను. ఆమె శుచియై యాచమనముచేసినది. యథావిధిగా సరస్వతీపూజ గావించి

నది. హారతినిచ్చి నైవేద్యముపెట్టినది. ఒక్కసారి సరస్వతి ముఖము పరిశీలించినది. ఆ మహాదేవి యానాడెందులకోగాని యామెనుచూచి నవ్వుచున్నటులతోచినది. అది పరిహాసమో సంతోషమో యామెకర్థముకాలేదు. ఆమె చాగిలపడి మ్రొక్కెను. లేచినమస్కరించెను. ఆమె నవ్వుతు నేయున్నది. 'అమ్మా! ఎంతకాల మీపరీక్ష? ఉన్నదేమో తేల్చి చెప్పకూడదా. నామనస్సులోని పరితాపము నన్ను దహించి వేయుచున్నది. అది నీకానందమాతల్లీ! నిరంతరము నిన్నే నమ్మికొనియుంటిని. నీపాదసేవయే చేయుచుంటిని. నీవలననే నాకోరిక నెరవేరునని నమ్మికొంటిని. నీభక్తురాలయెడ కనిక రించకుండుట ధర్మమా. ఎంతకాల మీయెడబాటు సహించి యుండ గలుగుదును. అవినాకి కనికారములేకపోయిన పోవును గాక నీకైన దయాదాక్షిణ్యము లుండవలదా? ఆకుదానను. అధివాసము విడిచివచ్చినదానను. ఎంతకాలము పరపంచ లందు బ్రతుకమందువుతల్లీ! ఈకష్టకాలమున కంతములేదా? ఈజీవికి సుఖమనునది లేదందునా? తల్లీ! నీవు దయాస్వరూపు రాలవనియు భక్తపరాధీనురాలవనియు మనోవాక్కాయకర్మ ములతో నీయారాధన గావించుచుంటిని. నీశిష్యురాలనని యైనను కనికరింపకూడదా. ఈ కఠినశిక్షావిధికి నేచేసినపాప మేమి? నే నెవ్వరి కేయపకారముచేసియెరుగను. నాకా యీ యెడబాటు. అవునుతల్లీ! అవును. నీ కుమారునినీవే కాచుకొనలేని యసమర్థురాలవు. నీవునన్ను రక్షింతువనుకొనుట నా యవి వేకము. దాసులను హింసించుట దైవముల కలవాటు. ఎది రించెడు నారినేమిచేయుదు. దైవమునునమ్మిన దాసునితప్పు గాని దైవముతప్పేమియు లేదు.

రత్నప్రభకు కన్నుల నీరు క్రమ్మినది. శోకము కెల్లుబికినది. మరల ఆ మహాదేవి పాదములకొరదిక్షణ వీక్షించినది.

'బిడ్డా! అధైర్యపడకుము. కష్టములు కాపురముండవు.' అని యామహాదేవి చెప్పినట్లు తోచినది.

రత్నప్రభ లేచి కన్నులు తుడుచుకొని పూజామందిరము నుండి బైటికివచ్చినది. ఆమె చుట్టు చెలికత్తెలుమూగిరి.

రత్నప్రభ 'ఆనాగరాజెక్కడ' అని ప్రశ్నించెను.

కరండమునందు జాగ్రత్తగా బంధించియుంచితిమి నాని నిచటకుకొనిరండు.

చెలికత్తెయొకతె పరుగుపరుగునపోయినది. ఆనాటితో వేదకంఠునిపరీక్ష పూర్తికావలెను. దానితోపాటామె కోరిక నెరవేరవలయును. అది యామెయిష్టమునకు. దానికి తగినయుపాయమాలోచించినది. 'వకుళా! నీవు కపాలుని పిలుచుకొనిరమ్ము'

కపాలుడు పాములవాడు. ఎట్టిపామునైన మంత్రముగా బట్టగలడు. దాని విషమునుపిండగలడు. మంత్రతంత్రముల చేత విషమును విరువగలడు. అతడు నిత్యము పాములతోచర్లాట. వానిపూర్వీకులందరు నదేపనిని చేసిరి. మహారాజు వైద్యుతి వారిని ప్రత్యేకముగా కొన్ని కారణముల చేత తననగరునందు కాపురముంచెను. నాగరాజును కరండముతో చెలికత్తెతీసికొనివచ్చెను. వకుళ కపాలకుని వెంటపెట్టుకొని వచ్చెను. వారందరు నుద్యానవనములోని కరిగిరి. రత్నప్రభ కపాలకుని కా కరండమునుచూపి 'కపాలకా! దీనిలో నాగరాజున్నాడు. ఆయనను బైటికితీయుము.' అని యాజ్ఞాపించెను. కపాలకుడు బుట్టమూతతెరిచెను. అందులో నొకసంచియున్నది. దాని కట్టు విప్పెను.

'నాగరాజా! బైటికి దయచేయుము' అని రత్నప్రభ యెద్దేవగానననెను. ఆమె చర్యలన్నియు నచ్చటివారికి వింతగా దోచినవి. ఆమె యేమిచేయునో చూడవలయునని కనులనువిచ్చి చూచుచుండిరి నాగరాజు బైటికిరాలేదు. ఆమెకు కొంచెము కోపము, నసూయకలిగినది.

'ఓహో! మహారాజులకు నాగస్వరము పట్టవలయును గాబోలును.' అని తీవ్రముగా కనులెఱ్ఱచేసి పలికినది.

'కపాలికా! కొంచెము నాగస్వరము వేయుము. అట్లయినగాని శ్రీవారికి నిద్రమెలకువరాదు. వకుళా నీవు పోయి నావీణ తీసికొనిరమ్ము' అని రత్నప్రభ పలికినది. వకుళ త్వరగాపోయి వీణె తెచ్చినది. కపాలకు బుట్టనోటిలో పెట్టుకొని నాగస్వరము వాయించుచుండెను. అతడు నాగస్వరము వాయించుటలో చాలప్రతిభ కలవాడు. పాతాళమున పడుకొనియున్న నాగులైనా నిద్రలేచి బైటికివచ్చును. రత్నప్రభ వీణ చేతపట్టుకొని శ్రుతులుసరిచూచెను. కపాలుని పాటతోగలిపి వాయించుచుండెను. నాగరాజు మహోగ్రుడై బైటికివచ్చెను. వాని పూత్కారములకు పూతోట వడికిపోయినది. చెట్లపూవులు మలమల మాడినవి. నాగరాజు పడగవిప్పి లేచెను. కపాలికుడు నాగరాజును జాగ్రత్తతో పరిశీలించుచుండెను. కన్ను మరలింపలేదు. రత్నప్రభయు నట్టే చూచుచుండెను. నాగరాజు తోకపై లేచెను. వాని చూపులు రత్నప్రభవైపునకు ప్రసరించుచుండెను. ఆ చూపులతిభయంకరముగా నుండెను. కాని రత్నప్రభ యాచూపులను లక్ష్యపెట్టలేదు. ఆమె క్రమక్రమముగా శ్రుతిని హెచ్చించినది. వీణానాద మొకవిధముగా భయమును, నొకవిధముగా

సంతోషమును కలిగించినవి. అందరు పరవశము నొందిరి. రత్నప్రభ యేమిచేయుచున్నది యెవరికి తెలియుటలేదు ఆమె క్రమక్రమముగా ప్రక్కకుజరిగినది. ఆమెముందు మందార వృక్షము కలదు. రత్నప్రభ కనబడి కనబడకుండ దానిచాటు నకు తప్పుకొనెను. నాగరాజా మొయుందే తనచూపుతీక్షణముగా బరపించుచుండెను. రత్నప్రభ కపాలికునకు సన్న చేసినది. స్వరము మూడవకాలమున నడచుచుండెను. నాగరాజు పరవశత్వముచే తూగాడుచుండెను. రత్నప్రభ సమయము చూచినది. అపస్వరము పలికించినది. నాగరాజు భయంకర కోపదృష్టులతో కాటందుకొనెను. నాగరాజుకోరిక తీరలేదు. వానికాటు మందారవృక్షముమీద పడినది. కోరలు మ్రాని లోనికిదిగిపోయినవి. నాగరాజు తన విషమువంతయు వెడల గ్రక్కెను. అందరు చూచుచుండగనే యాచెట్టు మలమల మాడిపోయినది. ఆకులు పువ్వులు క్షణములో రాలిపోయినవి. రత్నప్రభకోరిక తీరినది. ఆమె వేళాకోళముగా 'శ్రీవారింక దయచేయవచ్చు' అన్నది.

నాగరాజు సిగ్గునతలవంచుకొని కరండములోని కరిగెను. వాని మనసు పరాభవాగ్నిచేత కుమిలిపోయినది. కోపము మండిపోయినది. కాని యేమిచేయగలడు. కాలముతప్పి వచ్చినది. కావున తలవాల్చి చింతాకులితుడై నిదురించెను. వానిమనస్సు వాని నూరకుండనీయలేదు. మంచికాలమునకై వెదకుచుండెను.

రాజకుమారి చెలితో నకులా! ఈనాగరాజునుజాగ్రత్త అని బోధించి తాను లోనికరిగెను.

ఆనాడు గాంధర్వ విద్యయందు పరీక్షయని వేదకుంభు నకు వర్తమానము పోయినది. ఆయన శిష్యులతో రాజమంది రమునకు వచ్చెను. గాయకులు పండితులు కిటకిటలాడు చుండిరి. అంతలో నొకరాజభటుడు వచ్చి 'అయ్యలారా! నేటిసభ రాజోద్యానమున జరుగును. అచటికి దయచేయుడు' అని చాటిచూపెను. పండితులందరు రాజోద్యానమునకు పోయిరి అచట మహారాజు రత్నసింహాసనముమీదకూర్చుం డెను. అచ్చరలవంటి యిరువురు రాజకుమార్తెవింజామరల వీచుచుండిరి. వెనుక నొకపరిచారిక ముత్యాలవెల్లగొడుగు పట్టుకొనియుండెను. ఆయనకొకప్రక్క మహారాణి పరిచారి కలతో మణివేదికపై నాసీనయయ్యెను. రెండవవైపున రత్న ప్రభ వీణను చేతపట్టుకొని కూర్చుండెను. సభాసదులందరు నిర్ఘాంతపోయి రాజకుమారిని కన్నార్పకచూచుచు చిత్రపు బొమ్మలవలె నిలుచుండిరి. ఆమె యింతవరకు నెవరికంటను పడియుండలేదు. పురజనులలోనివారుగాని రాజపురుషులుగాని యామెను చూచినవారులేరు. ప్రభ పెద్దదయినతరువాత తల్లితండ్రులే యామెను సరిగా చూచి యెరుగరు. చెలికత్తెలు సైతమొకొక్కప్పుడు రాజకుమారిముఖమును చూచుచువారు చెప్పతలచుకొనినది మరచిపోయి తబ్బిబ్బగుచుందురు. ఆమె విషయమును తెలిసికొని మందహాసముతో చెప్పతలచు కొన్నదేదో మరల నాలోచించుకొనిరండని పంపివేయు చుండును. ఆమె సౌందర్యమంతది. ఆమెపలుకులలోని తియ్య దనము తేనెకైన నున్నదోలేదో యనిపించును. నాటి సభకు వచ్చినవారందరు నామె సాక్షాత్తుసరస్వతియనియే భావిం చిరి. ఆమెచెలికత్తెలు పని పత్కన్యలని భావుభ్రమించిరి.

ఒక్కసారిగా నందరు సరస్వతీస్వరూపరాలను రాజపుత్రికకు నమస్కారమని చేతులెత్తివందనముపెట్టిరి.' ఆహాయేమి యా యందము' అందమునకు తగినవిద్య, విద్యకుతగిన వినయము వినయమునుతో సరిపోలిన సుగుణములు. మహారాజీమెకుమా ర్తె యగుటచేత ధన్యుడైనాడు. ఇట్టి శారదామూర్తిని చూచుట చేత మనజీవితము పావనమైన' దని యనుకొనిరి

రాకుమారి లేచి మహాపండితులకు నమస్కరించెను. వేదకుంభుడు తనశిష్యులను వెంటపెట్టుకొని యారామము లోనికి వచ్చెను. అదిరూపముతాల్చిన బ్రహ్మతేజము. మూస కట్టి పోతపోసిన యందాలసముద్రము. పండితులు గాయకులు శిల్పులు వేదకుంభు నొకసారిచూచి, రాజకుమారివంక చూపుపరపించి, తగినదాంపత్యము. దైవనిర్ణయ మెట్లున్నదో యని లోలోనతలంచిరి.

వేదకుంభు డొక్కమారు వైద్యుతి మహారాజునంక కన్నెత్తిచూచెను. 'రాజామీకువిజయమగుగాక' యని కుడి చేతినెత్తి యాశీర్వదించెను. ఆహా యేమి యాకంఠమాధు ర్యము. వర్జన్యరాజు పలుకుబడిలో వీణాస్వామితంతువుల మృదునాదమును గుచ్చెత్తిపోసినటులున్నది' యని వైద్యుతి యనుకొనెను. మహారాణి మారత్నప్రభకు తగినవరుడితడే యని నిర్ణయించుకొనెను. రాజకుమారి కన్నులు చెమరించి నవి. చేతులువడంకినవి. పెదిమలు చిగురాకులవలె యల్లాడి నవి. లేచి 'విద్యామూర్తులగు బ్రహ్మచారులకు వందనము' అని కూర్చుండెను.

'కళ్యాణమస్తు' అని చిరునగవుతో వేదకుంభుడాశీర్వ దించెను. ఆ నవ్వువెన్నెలలలో ప్రభావతికన్నులు కలువలై విక

సించినవి వేదకుంభుని హృదయమును గంతులు మ్రోదయై యా నసుమ క్రీడించినది. వేదకుంభుడు తనకొరకు నియమించిన గద్దెమీద కూర్చుండెను.

మహామంత్రి లేచి 'సభికులారా! నేటివరకు శాస్త్రపరీక్ష యైనది. ఇంకముందు గాంధర్వ విద్యాప్రదర్శనము వేదకుంభులవారు గావింతురు. అంతటితో రాజకుమారి తననిర్ణయము తెలుపును' అని కూర్చుండెను.

వెంటనే యొకసేవకుడువచ్చి వీణను వేదకుంభుని ముందుంచెను. రాజకుమారి వీణావాదనము ప్రారంభించినది. వేదకుంభుడు దానితో జతగూర్చి గీతాలాపముగావింప మొదలుపెట్టెను. సభలోనివారందరు తలలూనాడింప మొదలు పెట్టిరి. గాయకులు వేళులు లెక్కపెట్టుచు తాళములు వేయుచుండిరి. అరగంటదాటినది. సభికులందరు చిత్రపు బొమ్మలవలె చెవులు నిక్కించి యాలించుచుండిరి, అది మానవుల యూహాపోహలకందు సాధ్యముకాదు. గీతసరళిలో ప్రత్యక్షరము పలికినది; జంత్రమునకేమి యూసామర్థ్యమేమి యని యందరు బేలుపోయిరి; ఒకరినిమించి యొకరు, రాజకుమారియు వేదకుంభుడు తమవాద్యములలోని నేర్పును ప్రదర్శించిరి; దేవతలసైత మాశ్చర్యముతో నాకాశమునుండి చెవులువిచ్చికొనివినిరి; ఆనందపరవశమున మేనులుమరచిరి;

గీతవాద్యమయినది స్వరము నందుకొనినది రత్నప్రభ దానితో రాగములయించినది. ఆది గానములో చెట్లు తల లూచినవి. వానికి ప్రాణముకలదు. తమ యానందమును చిగిరించి పుష్పించి వెలికిచూపినవి. అది కాలముకాదు. చేమంతిపూలు పూచినది. మాలతికుసుమముల వాసనలు

చల్లినది. అశోకమొక్క బారినది. మిగిలినవి చెప్పనక్కరలేదు. ఆకాకునకు చిగురులు చిగురు చిగురునకు పూలగుత్తులు తుమ్మెదలు ఝుమ్మని తేనెద్రాగి మత్తిల్లినవి. 'ఇది దేవతా గానము మానవులకీ శక్తియెక్కడిది. వీరు నిజంగా గంధర్వులేమోయని సభయందలివారు తలపోసిరి. కాని మందారము చిగిరించలేదు. రత్నప్రభ యాచెట్టువంకచూచినది. రత్నప్రభ మనోరథము వేదకుంభుడు గ్రహించెను. అతడు రాజకుమారి వంక నోరకంటతో చూచెను. చిరునవ్వు చిలికించెను. ఆమె సిగ్గున తలవంచినది; వారిరువురిచర్యలలో నర్థమున్నది; అది వారికే తెలియును; రత్నప్రభ ఆగిపోయినది; వేదకుంభుడు విజృంభించినాడు; ఆవాద్యములో నమృతము వర్షించినది; అందరిహృదయములు నవీనచైతన్యమును బొందినవి; ఆనంద రసములో తేలియాడినవి; అచేతనములగురాళ్లు కరిగినవి; మందారవృక్షము చిరుగురించి పూవులుపూచినది; సభాసదులొడలు తెలియని యానందముబొందిరి; రత్నప్రభ కనులు మోడ్చి పరవశము నాలించుచుండెను; అనాదబ్రహ్మతో నామె విలీనమునొందెను; ఆమె సకలప్రపంచము మరచినది; ఆసమయమున నుద్యానవనమంతయు నల్లనిపొగలు క్రమ్మినవి: అపొగమంచు 'తెరలుతెరలుగా నలముకొనినది; కారు చీకటులుక్రమ్మినవి; ఆచీకటులలో నొకరిమొకములొకరికి కనిపించలేదు; అందరుమతితప్పిచూచుచుండిరి; అంత కెవ్వన కేక వినిపించినది; రాజకుమారి మూర్ఛిల్లి యావేదికమీద పడిపోయినది; 'అమ్మో పాముపామను మాటలువినిపించినవి; అందరికి కన్నులు బైరులుక్రమ్మినది: మరల మాటలేదు;

—: oo :—

# శ్రీ ధరుడు

స్వామీ !

ఆ.

మీరు కరుణామయులుకదా

అది నీకే తెలియవలయును

నాసంగతి యటుంచుడు

మరి

లోకులనుకొనునది

నాకేమి తెలియును

అబ్బా! మీ రసాధ్యులు. కాలికివేసిన వ్రేలికివేయుదురు. వ్రేలికివేసిన కాలకివేయుదురు.

అవును. ముందరికాళ్ళకు బంధాలువేయుటకూడా నీ దగ్గర నేర్చుకొనినదే. ఆరునెలలు సావాసముచేసిన వారువీరగుదురట.

పోనిండు రాతిలోనికప్పను పోషింతురటకదా?

అందుకు లోపమేమికలిగినది ?

మానవులమీద నాదయ తేటేమియని?

కప్ప నోరెరుగనిజీవి

మానవుడో

మాయాతంత్రజ్ఞుడు

కావున వానిని తినతిండియుకట్టబట్టయు లేక పీడింతురా

ఎవరిని పీడించితిని?

అనుమానము.

పరమేశ్వరుడు మండువంకచూచెను. వడగాలి తీవ్రముగా వీచుచున్నది. దుమారము సుడులుతిరిగి యాకాశము నంటరేగి కన్నులలోను ముక్కులలోను చెరుగుచున్నది. ఒక బ్రాహ్మణుడుజ్జయినిలోని యొక రాచబాటవెంట తూలుచు పోవుచుండెను. అతడరువదేండ్లపైబడిన వృద్ధుడు. నడుము కొంచెము వంగినది. చిక్కిశల్యమైన పలుచటిశరీరము. ఎముకలు బొమికెలు నెక్కడివక్కడ కన్పడుచుండెను. చర్మము ముడుతలుపడినది. డబ్బపండువంటి మేను మండుటెండలో మిలమిల మెరయుచుండెను. ఆముసలి మోకాలిపై కొక చిరిగిన కొల్లాయి కట్టుకొనెను. వాలికలైన యంగవస్త్ర మొకటి తలమీద నెండకడ్డముగా వేసికొనెను. వానిచేతిలో తెల్లగా తోమినచెంబొకటి కలదు. చంకన పంచాంగపుకట్ట. అతడు 'శివా! మహాదేవ! శంకర! శంభో!' యను శివనామము లుచ్చరించుచు నడుమనడుమ నాగి యెండిన పెదవులను నాలుకతో తడుపుకొనుచు నడుచుచుండెను. ఆవృద్ధు డొక యింటి గుమ్మములోనికరిగెను. వెంటనే వెనుకకు తిరిగిగెను. ఇంకొక గుమ్మములోని కరిగెను. వెళ్ళి వెళ్ళకమునుపే వెనుకకుమళ్ళెను. ఇట్లావీధి వాకిళులన్నియు త్రొక్కుకొనుచు ముందునకు సాగిపోవుచుండెను. ఎవరు పిడికెడుబిచ్చము పెట్టినవారు లేరు. అప్పటికి నడిజామైనది. ఒడలంతయు చెమటలు దిగజారిపోయినవి. కాళ్లు బొబ్బలెక్కినవి. మేను కందబారినది. కన్నుల నీరుక్రమ్మినది. ప్రాణము సొమ్మసిల్లినది. శ్వాస సరిగాయాడుటలేదు. వేసవి మండుటెండతాకునకు

తాళలేక యాయన యొక్క శివాలయములోనికి నరిగెను. అంత
వరకు శివాభిషేకమొనరించి వచ్చిన కాసులు, కానుకలు
కొంగునవోపుకొని యా వృద్ధుని చూచినవెంటనే తలుపు
వారగావేసి యింటిలోనికరిగెను. ఆ ముసలిబ్రాహ్మణుడు
శివునకు సమస్కరించి యిట్లు తన గోడు వెడలబుచ్చుకొనెను.

మహాదేవా! శంకరా! శివా! యేమిటీ నిర్దాక్షిణ్యము.
ప్రభూ! నీవుదయామయుండవని, కరుణాస్వరూపుండవని, భక్త
పరాధీనుండవని, దీనరక్షకుండవని, నిన్నాశ్రయించితిని. నీ
నామమే తలంచితిని. నీజపమే చేసితిని. నీవే దిక్కని నమ్మి
తిని. ఎంతకాలమునకు నీదయ నాపైరాదూ. ఇదియా నీదయ.
ఇదియా నీ ప్రేమ సర్వజీవులను నీవు రక్షింతు
వట, కాపాడుచుందునట. ఈ దీనమానవు నొక్కని
నాదరింపలేవా ? స్వామీ ! రేయనక పగలనక నిన్నే
యారాధించుచుంటిని. నీపాదసేవయే చేయుచుంటిని. నీకే
మొక్కుచుంటిని. నీవేదిక్కని నమ్ముకొంటిని. దానికిదియా
ఫలము. తినదిండియు కట్టబట్టయులేక నల్లాడిపోవుచుంటిమి.
ఎంతకాలమీ యాయవారముచేత జీవింపమందువు. శంకరా!
పుట్టిబుద్దెరిగి యొక్కనాడైన కడుపారతిని యెరుగను. దరిద్ర
ములో బుట్టితిని. దరిద్రములో పెరిగితిని. దరిద్రములోనే
యంతమొందుమందువా! మహాదేవా! ఇదియా నీసేవాఫలము.
ఇదియా దయ. ఇదియానీసంకల్పము. చెప్పు. ఈముసలితనమున
నాయనువారులేక పోషించు పురుషుడైన కానరాక మండు
టెండలో మలమలమాడి చావమందువా? ప్రభూ! ఇంటింట
తిరస్కారము. నీపాదసేవకున కిదియేనా నీవుచేయవలసినది.

నీవొక రాతిబండవు. నీహృదయము రాతిముక్క. నిన్నునమ్మి మోసపోయితిని నీమూలననాదారిద్ర్యము పటాపంచలగునను కొంటిని. నాయింట పచ్చనిపసికందు కనిపించుననుకొంటిని. కల్ల. శిలకు దయాదాక్షిణ్యమెక్కడిది స్వామీ! ఎరుగక నా కాలము నీపూజలోగడిపితిని. నాజీవితమువ్యర్థముచేసికొంటిని.

ఏమీ? నాస్వామిని నేనునిందించితినా! నాప్రభువును నేను దూలనాడితినా! యెంత మహాపరాధము గావించితిని. ఎంతఘోరపాపము చేసితిని ఈమహాపాపము తీరుటెట్లు? శంకరా! శివా! మహాదేవ! యావేశమున నిన్నుతిట్టితిని. నన్నుక్షమించు. క్షమించుమని యా వేదబ్రాహ్మణుడు దుఃఖముతో వడివడిగాలేచెను. ఆశివలింగమును గౌగలించు కొనెను. తలను లింగముమీద టపటపకొట్టుకొన నారంభించెను. తలపగిలినది. రక్తమువచ్చినది. అతడు స్మృహాలేక పడిపోయెను.

ఆధ్వనివిని పూజారి గుడిలోని పళ్ళెముల నెత్తుకొని పోవుచుండెనేమోయని పరుగుపరుగున వచ్చెను. వృద్ధ బ్రాహ్మణునిగాంచెను. చుట్టుపట్టులనున్నవారిని'రండురండని' కూడబిలిచెను. 'అయ్యలారా! చూచితిరా మనశివుని మహాత్మ్యము. నేను శివాభిషేకముగావించి నైవేద్యమునకు వంటకములు తీసికొనిరావలయునని లోనికరుగుచుంటిని. అంతలో నీముసలి లోనికివచ్చెను. ఎవరోభక్తుడు శివదర్శనము చేసికొని పోవుననితలంచితి. తలుపులు తెరచియుంచితిని. ఏమిజరిగినదో నాకు తెలియదు. 'టపటప' దెబ్బలుకొట్టినటుల వినిపించినది. పరుగెత్తుకొని వచ్చితిని. ఇచటి వెండిపాత్ర

లేవియులేవు. ఈ ముసలితలకు గాయములు తగిలి నెత్తుటిలో నిచ్చట గర్భాలయమున పడియుండెను. ఈదురాత్ముడా రజతపాత్రలను హరించి యెవరికో యిచ్చి పంపియుండును. శివునకు కోపమువచ్చి తనశూలముతో పొడిచియుండును. చూచుచుండువానినెత్తి శూలముతో పొడిచినట్లు మూడుగాయము లైనవి. నేనువచ్చుసరికి మహాదేవుడీలింగములోనికి మాయ మయ్యెను. నేను వానిశూలముగాంచితిని. వీడు తెలివితప్పి పడిపోయినాడు. పరమేశ్వరు నందపరాధము గావించినాడు. ఇది దేవతలచేత ప్రతిష్ఠింపబడినది దీనిమహాత్మ్య వానికి తెలి యదు. పరమశివుడు సంచారముకొరకు రాత్రులలో నీగుడి నుండి వెడలుచుండుట నేను పలుసార్లుచూచితిని. ఈదురా త్ముడొనరించిన యపరాధమునకు ఫలితమనుభవించినాడు. వీని నూరిబైటపారవేయుడు' అనెను.

వచ్చినవారంద రామాటనమ్మిరి. పరమశివునకు నమ స్కరించి చెంపలువేసికొనిరి. వానిని కొనిపోయి యొకపాడు పడినబావిలో పడవేసిరి.

స్వామీ! మీరు పరమదయాస్వరూపులు. 'మీపేరు చెప్పుకొని బ్రతుకవచ్చును' అని పార్వతి శివునిదెప్పినది.

గౌరీ! యిందు నేచేసినదేమున్నది. నన్ను నిందింప మంటినా తలబ్రద్దలు కొట్టుకొమ్మంటినా?

'లేదు. తిండిలేనివారిని తలపగులగొట్టి పాడుపడిన నూతిలోపడవేయమంటిరి'

అది నేచేసినదేయందువా?

కాక మరెవరు?

వానికర్మ

అది చివరివేదాంతము. మహాదేవికి కోపమువచ్చినది. ఆమె చరచర లోనికరిగినది. పరమశివుడామె కోపముచల్లార్చుటకు వెంటనేగెను. సాయంకాలమైనది. బ్రాహ్మణునకు తెలివివచ్చెను. ఇటునటుచూచెను. మీదువంక నరసెను. తా నొకపాడుపడిన నూతియందుంటినని గ్రహించెను. తా నొనరించిన శివనింద కాపరమేశ్వరుడె తన్నిచ్చట పారవేసి యుండుననితలంచెను. కష్టంమీద నెట్లో బా వెలుపలికి వచ్చెను. తనయింటిదారిపట్టెను. చీకటు లావరించినవి. బ్రాహ్మణుని భార్యయింటివాకిట నిలుచుండి దిక్కులుచూచుచుండె. తెల్లవారకమునుపులేచి కాలకృత్యములు తీర్చుకొనెను. స్నానము చేసి సంధ్యవార్చుకొనెను. శివార్చన కావించెను. బారెడు ప్రొద్దెక్కునంతవరకు జప తపము లాచరించెను. పిమ్మట శివస్తవము చేయుచు భార్య తెల్లగా తోమియిచ్చిన చెంబు చేతపట్టుకొని యాయవారమునకు బయలుదేరెను. చీకటిబడినను ఇంటికి చేరలేదు. అని యామె లోలోన గుంజాటనపడుచుండెను. అంతలో దూరమునుండి తూలుచు వచ్చుచున్నభర్తను చూచెను. ఎదురుగాబోయి చేయిపట్టుకొని యింటికిగొనివచ్చెను. మంచమువాల్చి పరుండబెట్టెను. తా నెచ్చటినుండియో యడిగితెచ్చిన కాసిని బియ్యము కడిగి పొయిమీద పడవేసెను. భర్త జరిగినదంతయు చెప్పుచుండగా వినుచు వాని పాదములొత్తుచుండెను. ఆసమయమున వారికొకపిల్లవాని యేడ్పు వినిపించెను. దానితో 'అయ్యా ! లోపల నెవరులేరా ?' యను పిలుపు వినిపించెను.

'ఎవరది?' అనుచు నాయవ్వ గుమ్మములోనికి వచ్చెను. వారిరువురు భార్యాభర్తలు. భార్యచేతిలో నొక మగశిశువు నడ్డముగాబెట్టుకొని యూడించుచుండెను. ఆమె యెంతయూడించినను నాశిశువు గగ్గోలుపెట్టి యేడ్చుచుండెను.

భర్త యా ముసలియవ్వతో 'అమ్మా! మేము పరదేశీయులము. నాభార్య యిప్పుడే ప్రసవించినది. ప్రొద్దున నుండియు మాకన్నములేదు. నడచివచ్చుటచే చాలాబడలితిమి. కొంచెము భోజనము పెట్టింపుడు. ఈరేయి మేమిచట నిద్రించి తెల్లవారిపోయెదము. పసుండుటకు తావొసంగుడు. మీకు మేలుకలుగును. అని దీనముగా వేడుకొనెను.

ముసలియవ్వ పాపని తేరిపారచూచినది. తల్లి చేతులలోనుండి తీసికొని మెత్తిముద్దాడినది. వారికి సంతానము లేదు. బహుకాలము పిల్లలకొరకామె తపించిపోయినది. 'బీదవారికి సంతతి మెండందురు. నాకొక్కశిశువైనకలుగ'దనియనుకొనుచుండెడిది. ఆశిశువును చూచినంతనే ప్రాణములు లేచినవి. వారితో 'లోపలికి రండు. అన్నముడుకుచున్నది. వార్చి పెట్టెదను' అనెను.

నిజమున కావంటక మొక్కనికి సరిగాతినిన సరిపోదు. ఆమె పరులకష్టములుచూచి సహింపలేనిది. తనకు లేకపోయినను పరులుసుఖించిన చాలును. ఆమె యానందించును. క్రొత్తగా వచ్చిన యతిథీదంపతులు లోనికివచ్చిరి. ముసలియవ్వ లోనికరిగి గంజికాచినది. వచ్చినవారికి తనభర్తకు పెట్టినది. తనకేమియు మిగలలేదు, అతిథులకు సౌకర్యములు

చేసెను. శిశువుతో కొంతసేపు గడపెను. భర్త దగ్గరకు వచ్చెను.

వృద్ధుడు భార్యతో 'రేపు మాతండ్రిగారి యాబ్దికము' అనెను.

'ఏమిచేయుదము. ఇంటనొక్కవస్తువులేదు.' వృద్ధునకు కంట నీరుకారినది. భార్య వానివేదనగ్రహించినది. దుఃఖింపకుడు తెల్లవారినగదా? ఏదో యొకటి దొరుకకపోదు. అని భర్త నోదార్చెను. వారి సంభాషణ యతిథిదంపతులు వినుచుండిరి. వారికి జాలికలిగినది. బ్రాహ్మణుని భార్య చెంగు నేలపై పరచుకొని నిద్రించెను. రేయి బ్రాహ్మణునకు నిద్ర పట్టలేదు. పగటి సంగతియే మాటిమాటికి జ్ఞాపకమునకువచ్చుచుండెను. మధ్య మధ్య తండ్రి యాబ్దికముసంగతి యాలోచించుచుండెను. తెల్లవారు జామైనది. బిడ్డగుక్కపెట్టి యేడువనారంభించెను. ఆ ముసలి ముత్తైదునకు నిద్రమెలకువచ్చెను. గూటిలోనుండి యొక గిన్నెతీసికొని పొరిగింటి కరిగెను. కొంచె మాముదము తెచ్చెను. 'అమ్మాయీ! పిల్లగుక్కపెట్టి యేడ్చుచున్నది. ఈ యాముదముగ్గుపెట్టుము' అనుచు లోనికివచ్చెను. అటునిటు చూచెను. అతిథిదంపతులు లేరు. పిల్లరొదపెట్టి యేడ్చుచుండెను. యా శిశువు నెత్తుకొనెను. 'ఎచ్చటికిపోయిరో'యని తలవాకిలికివచ్చెను. వీధినలువంకల చూచెను. మరల యింటిలోనికివచ్చెను. ఆమె చూచుచుండగనే యిల్లంతయు పెద్దమేడగా మారినది. ఆమె కనులఎదుట వింత వింత వస్తువులు కనిపించినవి. ఆమె కాశ్చర్యము కలిగినది. భర్తగదిలోనికి పోయినది. భర్త పట్టుదుస్తులను దాల్చి

యుండెను. అందమగు హంసతూలికా పాన్పుమీద సుఖముగా నిద్రించుచుండెను. తన వంక చూచుకొనెను. ఆమె యొంటిమీద బంగారు జరీయంచుల సన్నని సున్నితమగు చీర తళతళ మెరయుచుండెను. భర్తను చేతితో తట్టిలేపెను. అతడు నలువైపులజూచి నిర్ఘాంతపోయెను. ఆ వచ్చిన దంపతులు పార్వతీ పరమేశ్వరులనియు, తమ మొరవిని యీ కుమారుని, ధనము నైశ్వర్యము ప్రసాదించిరనియు వారూహించిరి.

౨

అమ్మా!
ఎవరది?
బీదవాడనమ్మా!
అయితే యేమిచేయమందువు?
ఒక పట్టెడన్నము పెట్టించుము తల్లీ!
ఎక్కడనుండి తెమ్మందువు పోపో.

రెండుదినములనుండి యన్నములేదు. కన్నులు తిరిగి పోవుచున్నవి. పసిపిల్ల కక్కటిల్లి పోవుచున్నది. ఒక్కపట్టెడు చలిదియన్నము పెట్టించుతల్లీ!

ఓరి మొండిగ్రహమా! నీవుకాక నీకొకపసిపిల్ల కూడనా? బాగున్నది. తానుదూరకంత లేదు. తనకొకబొంతట చాలుచాలు పోపో.

అమ్మా! దేవుడిచ్చిన దాని కెవరేమిచేయగలరుతల్లీ.

దేవుడిచ్చాడా దేవుడు. అయితే యీ దేవు నేయడుగు. ముందు పోతావా లేవా?

పోకిక్కడేయుందునా తల్లీ!

'ఓరీ ముష్టికివచ్చినవాడికి నీ కెంతపొగరున్నదిరా. అందుకనే దేవుఁడునిన్నిటుల చేసినాడు. నలుమూలల నింకా తిన్నగా తెల్లవారలేదు. మాకడొకటి పుచ్చుకొని యింటి ముందు తయారయినావు. ఇక్కడ తేరగా నన్నెవరు రాసి పోసికొని యుండలేదు. దున్నపోతులవలె ముగ్గురున్నారు. ఏదైనాపనిచేసికొనరాదు. ఉన్నవారికి లేనివారికినొక లేముష్టి. తలుపుతీసినచాలు తయారగుచుందురు' అని యాయిల్లాలొక యుపన్యాసము ప్రారంభించినది.

లోపలడబ్బులెక్కపెట్టుకొనుచు నింటియజమాని యీ సంభాషణవినెను. డబ్బంతయు జాగ్రత్తగా నేలబోషాణము నందు పదిలపరచి గట్టిగా తాళము బిగించెను. ఒకటి రెండు సారులు తాళము లాగిచూచెను. తాళముగట్టిగాపడినదని నిర్ణయముచేసికొనెను. మూలనున్న దుడ్డుకఱ్ఱను చేతపట్టుకొని బైటికివచ్చెను. బిచ్చగాఁడు వానియాకారముచూచి గడగడ లాడిపోయెను. అతడు ప్రాయమునకు ముసలివాడైనను బలముచేత నడియౌవనమందున్నవానివలె నగుపించెను.

ఎన్నిసారులు చెప్పవలయును. నీకుబుద్ధిలేదా? మనుష్యుడవుకావా, పొమ్మనిచెప్పుచున్నది నీకుకాదా? పగలు బిచ్చమునకు రాత్రిదొంగతనమునకు. నీవు దాచిపెట్టిన ముల్లెయున్నదని బిచ్చముపెట్టవలయునా? పోవేమి? పోకున్న నీ ప్రాణములు తీసెదను, అని యీ యజమాని ముందునకు వచ్చెను. బిచ్చగాడు నిర్ఘాంతపోయి చూచుచుండెను. పాప మాతనేదో చెప్పవలయునని పెదిమెయాడించెను. ముసలికి

కోపము హెచ్చిపోయినది. చేతికర్రతో వానితల చావచిదుగ కొట్టెను. వాడు బాబోయనియేడ్చుచు నేలమీదపడి ప్రాణములు విడిచెను. చెంతనున్న వానిభార్య ఘొల్లుఘొల్లున వానిమీదపడి యేడవసాగెను. ఇదంతయు చూచిన పసిపిల్లకు గుండెయవిసినది. యాకూన కెవ్వునకేకపెట్టి తల్లితండ్రులమీదపడిపోయెను. దారినెంబడి పోవువారందరు చుట్టుమూగిరి. ఆముసలియు నిర్ఘాంతపోయెను. అత డట్లుజరుగునని నిజమునకు తలంపలేదు. ఆగ్రహము మించిపోయినది. దెబ్బ తగలరానిచోట తగిలినది బిచ్చగాడు మరణించెను. రాత్రి యంతయు గస్తితిరిగి యింటికిపోవుచున్న తలారులదిచూచిరి. జరిగినదంతయు తెలిసికొనిరి. ఇంటియజమానుని బంధించికొని పోయిరి. వానిని మహారాజునెదుటపెట్టి జరిగినదంతయు మనవి చేసికొనిరి.

ఉజ్జయిని రాజ్యమును ప్రద్యోతుడనురాజు పరిపాలించుచుండెను. అతడు చండశాసనుడు. అవినీతిపరులను శిక్షించుపట్ల యమధర్మరాజువలె వర్తించును. వాని మంత్రులు దండనాథులునట్టివారే. వారికి పక్షపాతబుద్ధిలేదు. ఆకారణముచేతనే దుర్మార్గు లారాజ్యమునందు నివసింప భయపడుచుందురు. ప్రద్యోతుడుధర్మపరుడు. వానిరాజ్యమునందు ధర్మదేవత నాలుగుపాదములమీద చరించుచుండును. ప్రద్యోతుడు రాజభటులు చెప్పినదంతయు నాలకించెను. మంత్రులను బిలిపించి యావృద్ధునకు తగినదండన విధింపుడని యాజ్ఞాపించెను. మంత్రులు వానిని విచారించి యిట్లు తీర్పుచెప్పిరి. 'ధనమదమున కన్నుగానక యింటికి బిచ్చమునకైవచ్చిన

వానిని చంపినమహాపాపమునకు మరణదండనము తగినశిక్ష. ఈ బ్రాహ్మణుని మూలమున పేదవాని భార్యబిడ్డలు నిరాధారులైరి. అందుమూలమున వారిపోషణకొరకు బ్రాహ్మణుని యాస్తిపాస్తులన్నియు నాపేదవాని భార్యబిడ్డలకు చెందవలయును.

ప్రద్యోతమహారాజు మంత్రులతీర్పు వినెను. తలారులను బిలిపించి వారితో నిట్లనెను.

'తలారులారా! వీనిని నాయెదుటనుండి కొనిపొండు. నడిరేయి స్మశానమునందు వీనితల ఖండింపుడు. ఈ హంతకుని యాస్తి సర్వస్వము బిచ్చగాని భార్యవశము కావింపుడు.

తలారులు మహారాజు నానతిని నెరవేర్చిరి. ఆ వార్త విని యా వృద్ధునిభార్య గుండెలుసి మరణించెను. ఆ హంతకుడే పాడుపాడిన నూతియందు పడవేయబడిన బ్రాహ్మణుడు. అతడు ధనవంతుడయి క్రమక్రమముగా పరమేశ్వరుని మరచిపోయెను. స్నాన సంధ్యా జపతపాదులను విడిచిపెట్టెను. తన సంపదలన్నియు తన తెలివితేటలవలననే లభించినవని తలంచెను. వానికి గర్వము తలకెక్కినది. పేదసాదలయందాదరము నశించినది బిచ్చగండ్రు యాచకులు దొంగలనియు, వారు పగల్లిల్లుతిరిగి రాత్రులయందు దొంగతనమును చేయుదురనియు నూహాలు పొడమినవి. తన తొల్లిటి పేదరికమును మరచిపోయెను. ఆ గర్భ శ్రీమంతునివలె మెలగుచుండెను. ప్రతిదినము తన ధనమును లెక్కపెట్టుకొనుచుండును. తన భోగభాగ్యములను చూచుకొని పొంగిపోవును. నానాటికి వానికి ప్రతివానిమీాద ననుమానము కలుగ నారంభించినది. ఎవరు

తన యింటికి రాకూడదు. వచ్చినచో లోన నడుగుబెట్ట కూడదు. అడుగు పెట్టినచో నాతడేమైనదొంగిలించుకొని పోవు నేమోయని వేయికన్నులతో కనిపెట్టి యుండును. రాత్రు లందా ముసలి బ్రాహ్మణుడు నిద్రించుటయే మానివేసెను. ఎచ్చటేమూల చప్పుడైనను దొంగలు దొంగలని యరచుచు లేచును. వానికిప్పుడు ధనమే దైవము. వానిభార్యయు వాని తోడిపాటిదై పిల్లికి బిచ్చము పెట్టుటకూడా మానినది.

ఆ బ్రాహ్మణదంపతులకు లభించిన శిశువును నతిగారా బముగా పెంచుకొనుచుండిరి. వానికి శ్రీధరుడని పేరు పెట్టిరి. వాని కైదేండ్లు వచ్చినవి. తల్లిదండ్రులు వానినొక గురువు నొద్ద చదువునకై నియమించిరి. వానికిదల్లిదండ్రులవలెగాక పెద్ద లందు భక్తియు, దైవమునెడ భీతియు, పేదలయందు దయయు నలవడెను కావున వానియందు తోడిబాలుర కభి మానము మెండు కాజొచ్చెను. శ్రీధరునకు పదునైదేండ్లు వచ్చినవి. ఈడునకు తగినవిద్య రాకపోయినను నలువురిలో మంచివాడను వాడుకపడినది ఇరుగుపొరుగువారికి వానితల్లి దండ్రులపై ద్వేషమును వానిమీద నాదరమును కలదు. తల్లి దండ్రులు మరణించిన తరువాత శ్రీధరుని నిరుగుపొరుగు వారు కొంతకాలము పోషించిరి.

ఒకనాడతడు తనలోతానిట్లని యాలోచించెను. ఇంత కాలము నాకీలోటుపాటులు రాకుండ నాతల్లిదండ్రులు నన్ను కాపాడిరి. నేను ధనికుడనై పలువురిలో దలయెత్తి తిరుగగలిగి తిని. ఇప్పుడు నేనెటుచూచినను నాకు 'నా'యన దగినవారు లేరు. తల్లిదండ్రులు మరణించిరి. ధన సంపదలు కోలుపోతిని.

తినతిండియు కట్టబట్టయు లేక యల్లాడుచుంటిని. పూర్వము నన్నుగౌరవించినవారే నన్నిప్పుడు తూలనాడుచుండిరి. నేను కనబడిన చాలునని నాకొఱకు దారులెదురుచూచువారిపుడు నేను కనిపించినంతనే ముఖము తప్పించుకొని పోవుచుంటిరి. నాస్థితి పూలు తాల్చినచోటనే కట్టెలమ్ముకొని నట్లయినది. ధనవంతుడి దేజగము. ధనములేనివా డెంతగుణవంతుడైనను గౌరవింపబడడు. ధనవంతుడే విద్యావంతుడు, రూపవంతుడు అతడెట్టి దుర్గుణములు కలవాడైనను జనులాతని నాశ్రయింతురు. వాని నింద్రుడు చంద్రుడని పొగడుదురు. నేనిప్పుడు నిరుపేదనై తిని. యాచనావృత్తిచేత నిచటనేకాలముగడుపుదు నను కొందునా నాముఖము చూచువారెవరు ? వీడు మిక్కిలి నిరుపేదయగు బిచ్చగాని జంపిననాని కుమారుడని నాముఖముమీదనే నిందింతురు. ఆ యపకీర్తిని పొందుట కంటె మరణించుటమేలు. ఈ పట్టణమును విడిచి నేనెక్కడికైన పోయెదను. శ్రీధరుడెవరితో నేమియు చెప్పలేదు. ఒక రాత్రిసమయమున బయలుదేరి పరదేశములకు ప్రయాణమయ్యెను. అతడు నగరములను గ్రామములను నదులను దాటి యొక యడవియందు ప్రవేశించెను. అచట నొకయేటియొడ్డున కూర్చుండి తన స్థితిని గురించి యాలోచించుచుండెను. ఆ సమయమున వానికొక దివ్యపురుషుడు కనిపించెను. శ్రీధరుడు వానినిచూచి 'అయ్యా ! మీరెవరు ? ఈ యరణ్యమునందు దారితెన్నులు గానక దుఃఖించుచు నన్ను కాపాడ వచ్చిన దేవతవని తలంతును నావంటి యభాగ్యున కంతటి యదృష్టముకలుగునని తలంపను. ఐనను దేవతలు దయా

స్వభావుని మనుమనుడను మీ వృత్తాంతము నాకు తెలుపు డని ప్రార్థించెను.

అందులకా దివ్యపురుషుడిట్లు చెప్ప నారంభించెను. 'కుమారా! దుఃఖింపకుము. కష్టసుఖములు కావడికుండల వంటివి. జ్ఞానముకలవారు కష్టమువచ్చినప్పుడు విచారింపరు. సుఖమువచ్చినప్పుడు పొంగిపోరు. దేవతలకైనను కష్టములు రాకతప్పవు. కష్టకాలమున ధైర్యముపూని యుండుటయే పురుషునిలక్షణము. లక్ష్మి చంచలమైనది. అది యొకచోట నిలువదు. నీవు ధనములేదని చింతింపవలదు. వినుము. కైలాస పర్వతమనుపేరు వినియుంటివికదా. అది పార్వతీ పరమేశ్వరులకు నివాసము. అచటి వృక్షములన్నియు కల్పతరువులు. అందు ప్రవహించు సెలయేళ్ళు మందాకినీ నదియందలి నీటి ధారలు. ఆ పర్వతమున యక్షులు తమభార్యలతో సంచరించుచుందురు. వారికది యాటస్థలము. నేను యక్షుడను. నాపేరట్టహాసకుడు. నాకొక సోదరుడుకలడు. వానిపేరు కళాధుడు. మేమిరువురము నొక గురువునొద్ద గానము నభ్యసించితిమి. అందు మేము ప్రవీణులమైతిమి. పిమ్మట నాట్యము నేర్చుకొంటిమి. కుబేరుడు మా విద్యాపాండిత్యమును విని మమ్ము పిలిపించెను. మమ్ములను తనకొలువునందు గాయకులుగా నియమించెను. కొంతకాలము గడచినది. కుబేరునకు సౌదామినియను నొకపెంపుడు కూతురుకలదు. ఆమె యతి సౌందర్యవతి. కుబేరుడు నన్నొకనాడు పిలిచి యామెను గానమునందును నాట్యమునందును ప్రవీణురాలనుగావింపుమని

నియమించెను. నేనందుల కంగీకరించితిని. ఒక శుభదినమున విద్య నారంభించితిని.

ప్రతిదినమామెకు స్వరసంపుటములు చెప్పి యభినయము బోధించుచు వచ్చితిని. కాని యామెకావిద్యలలవడ లేదు. ఎంతకాలముచెప్పిన నారంభదశయందే యుండెను. స్త్రీలకు గాన నృత్యములు తేలికగా పట్టుపడును. ఆకళలయందు వారికి బుద్ధిచొరవ మెండు. ఈమెకు నీ విద్యలు పట్టుపడకుండుటకు కారణమేమైయుండునా యనియాలోచించితిని. నాకేమియు. కారణమగుపించలేదు. మరునాడు తాధారీతిగా నాట్యశాలకరిగితిని. అచట సౌదామిని చెలికత్తెలతో విచారముగా కూర్చుండెను. వారు సౌదామినినిట్లు ప్రశ్నించిరి. 'సౌదామినీ! యెంతయడిగినను నీవిచారమునకు కారణముచెప్పవు. మేమింకపోయెదము' అందులకు సౌదామిని యిట్లు సమాధానముచెప్పెను. చెలులారా! నాకుచెప్పుటకు భయమగుచున్నది. నాగురువుగారిని చూచినప్పటినుండియు నామనస్సు మనస్సునందుండుటలేదు. విద్యాభ్యాస సమయమున నాదృష్టియంతయు నాయనమీదనే యుండును. ఆయన బోధించునది నామనస్సున కెక్కుటలేదు. ఆయన యది నాయవివేకమని విసుగుకొనుచుండును. నామనస్సాయనకు తెలియకున్నది. ఆయనమీదిప్రేమ వెల్లడింతుననిన నాకు ధైర్యముచాలదు.

ఆమాటలు చెప్పునప్పుడామె కనులనుండి నీరుకారనారంభించెను. నిజమునకు నాస్థితియు నట్లేయుండెను. కుబేరునివలన భయముచేత నాయనురాగము లోలోన నణచు

కొనుచుంటిని. స్త్రీలహృదయము తెలిసికొనుట యసాధ్యము. నేను ముందుబైటపడి లోకువకావేలయని యూరకుంటిని. సౌదామినిమాటలు వినిన నామనస్సునకు కొంతధైర్యము చిక్కినది. ఐననేమి? నేనుసేవకుడను. ఆమె స్వామిపుత్రిక. అరటియాకు ముల్లుమీదపడినను, ముల్లరటియాకుమీదపడినను నరటియాకునకే మోసముకలుగును. కావున నాప్రేమ నా హృదయముననే యుంచుకొంటిని.

ఒకనాడు నేను నాసోదరునితో కైలాసపర్వతము నందలి చరియలలో విహరించుచుంటిని. అచటికి సౌదామిని తనచెలికత్తెలతో వచ్చెను. వారియెదుట వినోదముకొరకు కుబేరునిపాత్రను నేనుధరించి నటించుచుంటిని నాసోదరుడు మంత్రివేషమును దాల్చెను. గగనమార్గమున శివునిసేవింప వలయునని వచ్చుచున్న కుబేరుడు మమ్ముగాంచెను;అధికార మోహమున మేమట్లు వేషములనుదాల్చితిమని కుబేరుడు తలంచెను; మాయొద్దకు దిగివచ్చి 'మూర్ఖులారా! పదవీ వ్యామోహమున మీరిట్లువేషములు తాల్చితిరి;అధోలోకమున జన్మింపు' డని మమ్ముశపించెను; మేమిరువురమాయన పాదములపైబడి ప్రార్థించితిమి; కుబేరుడు నిజముతెలిసికొనినీవెవరి వినోదముకొరకు నీనాటకమాడితివో యామెనే నీవు భూలోకమున పెండ్లియాడుదువు; ఆమెవలన నీసోదరుడే నీ కుమారుడుగా నీకుజన్మించును; అంతతో నీశాపముతీరిపోవునునీ సోదరుడు బహుకాలము రాజ్యపరిపాలనచేసి మరలనిన్ను కలిసి కొను'నని శాపాంతమును దెలిపెను; మాశాప మొకవిధముగా వరమైనది;

త్రిగర్తదేశమునందు వత్సేశ్వరమను గ్రామము కలదు. అందు విద్యానాథుడను మహాపండితుడు గలడు. వేద వేదాంగములను జదివి యజ్ఞ యాగాదు లొనరించెను. ఆ కారణముచేత వానిని విద్యానాథ సోమయాజియని యా గ్రామములోనివారు పిలుచుచుండురు. అతనిభార్యయుత్తము రాలు. ఆదంపతులకు నేను కుమారుడనై జన్మించితిని. నా తండ్రి నాకు వత్సనాభుడని పేరుపెట్టెను. నేను క్రమక్రమముగా నైదేండ్ల బాలుడనైతిని. నాతండ్రి నాకు విద్యాభ్యాసము గావించెను. సకాలమున నుపనయనముచేసెను. నాకు వేదాది విద్యలయందు ప్రవీణునిగాచేసెను. నా కిరువదియేండ్లు వచ్చి నవి. నాకు వివాహము చేయవలయునని తలంచెను. పెక్కు మంది నాకు పిల్లనిత్తుమని యింటిచుట్టు తిరిగి పోవుచుండిరి. నాతండ్రి నాకుతగిన యందకత్తె లభించినకాని వివాహము చేయరాదని పట్టుపట్టెను. దినములు గడచినవి. నెలలు దాటి నవి. నాతండ్రికి నచ్చినట్టి కన్య లభించలేదు. అంతలో నాతల్లిదండ్రులు మశూచిరోగముచేత మరణించిరి. నే నాశ్ర యములేనివాడనైతిని నావిద్యావివేకములకుతగినటుల నేరాజు నైన నాశ్రయించిజీవితముగడపవలయుననితలంచితిని. వత్సేశ్వ రమునుండి బైలుదేరి యంగరాజ్యమునకు వచ్చితిని. ఆరాజ్య మును రుద్రదమనుడనురాజు పరిపాలించుచుండెను. అతడు పండితపక్షపాతి కవిజనాశ్రయుడు. రుద్రదమనుని యాస్థాన మున పెక్కుమందిపండితులు, గాయకులు, కవులు, నటీ మణులు నటకులుగలరు. వారిలో విశ్వేశ్వరుడను పండితుడు

కలదు. అతనిని రాజు మిగుల గౌరవించుచుండును. అతడొక విధముగా రాజగురువు. వానితో నాకు నెయ్యము కుదిరినది. వాని మూలమున నేను మహాప్రదమగు కొలువునందాస్థాన కవిగా కుదిరితిని. కొలది కాలములో నా ప్రతిభా వివేకములు రాజునాకర్షించినవి. రాజు నన్ను మిగుల గౌరవించుచుండెను. నే నొంటరివాడను. నాకు బంధువులు లేరు. బ్రహ్మచారిని. విశ్వేశ్వరుడు నన్నాదరించి వానియింట నాశ్రయమిచ్చెను.

విశ్వేశ్వరునకు మదనసుందరియను కూతురు గలదు. ఆమె నిజముగా మనస్సుందరియే అందచందములందరి కన్యలనుమించినది. ఆమె నన్నుచూచి నాయందు ప్రేమ కలదయ్యెను. ఆమె తల్లిదండ్రులును నా గుణగణములను గాంచి మదనసుందరిని నాకిచ్చి పెండ్లిచేయవలెనని యూహించిరి. కాని నా కేలనో యామెయందు సహోదరీ భావము కలిగినది. వారు నామనోభావమును గ్రహింపలేదు. విశ్వేశ్వరుడు తన భార్యతోనాలోచించెను. ఆమె యిష్టమునెరింగెను. ఒకనాడు నాతో యిట్లనెను. 'నాయనా! నీకు వివాహమునకీడువచ్చినది. ఇంతకాలము నీవు పెండ్లియాడకుండుటకు నాకు విచారమగుచున్నది. ఎంతకాల మిట్లొంటరిగానుందువు. నీకు రాజాశ్రయముకలదు. చక్కని సాహిత్యమున్నది. కావలసినంతపాండిత్యమున్నది. నా కుమార్తెయూ విద్యావంతురాలు. మంచి గుణములుకలది. అన్నిటికంటె నందకత్తె. నీ విష్టపడినచో రాజుతో చెప్పి ముహూర్తము నిర్ణయము చేయింతును. నీ యిష్టమేమో తెలుపుము. పిలిచిపిల్లనిచ్చుచుంటిని. వలదనకుము' వానిమాట నాకంతగా నచ్చలేదు. అతడు రాజునొద్ద

పలుకుబడికలవాఁడు. వానిని తిరస్కరించినచో కార్యము చెడిపోవును. సమ్మతించుటకు నామనస్సంగీకరింపలేదు. కొంచెము సేపాలోచించి యిట్లు సమాధానము చెప్పితిని. 'అయ్యా మీయాదరమునకు నేను కృతజ్ఞుడను; నా తల్లి దండ్రులు మరణించి యొక సంవత్సరమైనను గాలేదు. ఆవిచారము నన్ను పీడించుచున్నది. మీమాట నేను కాదనలేను. కొంచెము వ్యవధి యొసంగుడు ఇప్పుడంత తొందరలేదు. కదా? అవకాశమునుబట్టి చూచుకొందుము' అని తెల్పితిని. నామాట విశ్వేశ్వరుఁడు నేనుసమ్మతించినటులనే తలంచెను. వాని భార్యయు సంతోషించినది. నాటినుండియు మదనసుందరి నాతో మరింత చనువుకలిగి వర్తించుచుండెను. ఆమెచర్యలను నేను సహింపలేకపోయితిని. ఆయూరనే వేరొకయింట బసకావించితిని. అది విశ్వేశ్వరునకు వాని భార్యకు నంతయిష్టము లేకుండెను. మదనసుందరికి మరింతకష్టముగా తోచినది. రుద్రదమునుని యాస్థానమునందు రత్నావళియను విద్వాంసురాలు కలదు. ఆమె నాట్యకళయందు గొప్పకీర్తిని గణించెను. ఆమెతో నాట్యమునందు రంభాదులైన సరిరారనుటకు సందేహము లేదు. ఆమె ముఖ సౌందర్యమునకు జాబిల్లి ముమ్మారు దిగతుడుపు. ఆమె నవ్వునప్పు డమృత సముద్రముపొంగి పొరలి వచ్చుచున్నటనిపించును. వీణచేతపట్టి వాయించెనా సరస్వతియైనను చిన్నపోవును. కంఠమెత్తిగానమొనరించెనా కోయిల కుత్తుకలు కట్టుబడును. భూలోకమున నందమునకు బ్రహ్మ యామెను నిదర్శనముగా సృజించెనేమో యనిపించును. రాజు కొలువునకామె యొక రత్నాలంకారము. ఆమె వేశ్యయైనను

సుగుణములందు కులాంగన లేవరామెయెదుట పనికిరాదు. ఆమె కన్యాత్వమామెయందములోనే కనిపించును. ఆమె మీద నాకేలనో మనస్సుకలిగినది. ఆమెయు నాయందు ప్రేమ గలదయ్యెను ఆమెయప్పుడప్పుడు నాయింటికివచ్చుచుండెడిది. నేనామెనుకలుసుకొనుచుండెడివాడను. ప్రతిదినమామెకు నేను రాజుపై గేయములను వ్రాసి యిచ్చుచుంటిని. ఆమె దానికి స్వరమును రాగమునుగూర్చి పాడుచు నాట్యమొనరించు చుండెను. ఇట్లు మాయిరువురకు పౌడమినయనురాగము దట్ట మైనది. ఈసంగతి నగరమునందంతటను వ్యాపించెను

విశ్వేశ్వరుడు మాయిరువుర ప్రేమలనుగురించి యాలిం చెను. వానికి నాపై కోపము వచ్చినది. రాజుతో లేనిపోని కొండెములు నాపై చెప్పనారంభించెను. మొదట రుద్రదమ నుడు విశ్వేశ్వరుని మాటలు పెడచెవినిబెట్టెను. కాని ప్రతి దినమదేపనిగా చెప్పుచుండుటచేత వానికనుమానము కలిగి నది. ఒకదినమున మహారాజు నన్నుపిలిచి నేను మర్యాద నతి క్రమించి ప్రవర్తించుచుంటిననియు, ముందింక నారీతిగా ప్రవ ర్తించిన రాజదండనకు గురికావలసి యుండుననియు మంద లించెను. నేనేమియు మాటలాడలేదు.

రత్నావళి రాజనర్తకి. ఆమె జీవితమంతయు కన్యకగా నుండవలయునని రాజునాజ్ఞ. అందులకై యామెకు సంగీతము సాహిత్యము నృత్యము నేర్పించెను. ఇట్టివారా కొలువనం దింక నైదారుగురుకలరు. వారినందరిని రాజొకకంట కని పెట్టియుండును, రాజనర్తకులలో రత్నావళి మిక్కిలి సౌంద ర్యవతి. రాజునకామెయందు మనస్సుపారినను తన నియ

మును పాటించుండెను. విశ్వేశ్వరుడామెమీద కొండెములు చెప్పిన నాటినుండియు రాజామెను నిర్బంధమునందుంచెను. ఆమె బైటికిపోరాదు. ఎవరితోడను మాట్లాడరాదు. రాజను మతిలేనిదే మిట్టములను దర్శింపరాదు. అను నియమములను గావించెను. అందుమూలమున నామె జీవితంలో విషాదకథా ఘట్ట మారంభమైనది. ఆమె నన్నికట్టుదిట్టములందుంచుట నాకును భరింపరానిదయ్యెను. నామూలమున నామెకిట్టి యగ చాట్లువాటిల్లుట నాకిష్టములేకపోయినది. ఒకనాటి యర్ధరాత్రి సమయమున నేనూరువెడలి పరదేశమునకు ప్రయాణమైతిని.

రత్నావళి దాసీజనులామెకు నా సంగతి వినిపించి నప్పటినుండియు నామె యన్నపానములను మానివేసినది. నన్ను కలిసికొను నుపాయము ఆలోచించినది. ఒకనాడామె పురుషవేషమును ధరించెను. చెలికత్తెలకైనను దెలియ రాకుండ గుఱ్ఱమునెక్కి నన్ను వెదకుచు బయలుదేరెను. నేను పడరానిపాట్లెల్ల పడుచు కాశీనగరము చేరితిని. ఒకనాడు గంగాతీరమున కూర్చుంటిని. అప్పుడే యస్తమించుచున్న సూర్యునికిరణములు నదీతరంగములమీద నుయ్యాలలూగు చుండెను. నేను వానియొయ్యారము నరయుచుంటిని. ఆ సమయమున నా జీవితకథయంతయు నొక్కసారిగా జ్ఞాపకమునకు వచ్చినది. నాలో నేను విచారించితిని. నాతలంపు లెప్పటి కప్పుడు వికలమగుచున్నందులకు శోకించితిని. నేను జరాధారుడను. బ్రహ్మాండాకాశ మధ్యమునందు నాకు 'నా'యన దగిన వారులేరు దైవము నాకీ పాడుజీవితమేల వ్రాసియుంచెనని కన్నీరు కార్చితిని. అంతలో నెవరో నా భుజములమీద

చేయి వేసిరి. నా యొడలు జల్లుమనినది. నేను వెనుకకు తిరిగి ఎవరు మీరు ? అని ప్రశ్నించితిని.

నన్ను గుర్తుపట్టలేదా ?

లేదు

నేను నీ ప్రియమిత్రుడను. మైత్రేయుడను.

మైత్రేయుడు నా విద్యాభ్యాసకాలమున నొకమిత్రుడు. అతడు నన్ను ప్రాణములవలె ప్రేమించెను. నేను స్వగ్రామమును విడిచివచ్చినప్పుడు నా వెంట చాలదూరము వచ్చెను. నన్ను విడువలేక విడువలేక విడిచిపోయెను. ఇప్పటికాతనిని చూచి పదేండ్లయినది. వానిపోలికలు పీవియుందేమియు కానరాలేదు. కాని వయస్సు వచ్చినకొలదియు రూపము మారిపోవుచుండును. అట్లే చాలమందిని పోల్చుకొనలేక తబ్బిబ్బులగుచుందుమని యాలోచించితిని. మైత్రేయా ! రమ్ము కూర్చుండుము అని వచించితిని. నా మిత్రుడు కొంచెము దూరమున నా ప్రక్కన కూర్చుండెను. నే నిట్లడిగితిని.

మైత్రేయా! నిన్ను చాలకాలమునకు చూచితిని. నీ జననీ జనకులు క్షేమమేగదా.

క్షేమమే

నీవిప్పు డిక్కడి కేలవచ్చితివి

నీకొరకు

నాకొరకా! నే నిచ్చటనుండుటనని యెట్లు తెలిసినది.

రత్నావళి చెప్పినది

రత్నావళియను పేరు విన్నంత మాత్రముననే నా యొడలు జలదరించినది. కన్నులనుండి నీరుకారినది. ఒక్క

నిట్టూర్పు విడిచితిని. వానితో నిట్లంటిని. ఇంకెక్కడి రత్నావళి. రత్నావళికి నాకు ఋణము తీరిపోయినది.

అదేమిరా మిత్రమా యట్లనెదవు? ఆమె నీకై విలపించినది. నీజాడ నరయుటకు నన్ను వెంబడించివచ్చినది. దారిపొడుగునా నీకథలే చెప్పినది. నీమాటలే వచించినది.

ఆమె యెక్కడ నున్నది?

నా వెంట రమ్ము నీకామెను చూపెదను.

మైత్రేయుడు నన్ను తనవెంటపెట్టుకొని యొక ధర్మసత్రమునకు తీసికొనిపోయెను. అచటనొకగదియందు కూర్చుండబెట్టెను. రత్నావళిని గొనివత్తునని లోనికరిగెను. కొలది సేపటిలో రత్నావళి వచ్చెను. నేనామెను కన్నార చూచితిని. మైత్రేయునిపోలిక లామెలో కనిపించినది.

'మైత్రేయుడేడీ?' యని నేనామెను ప్రశ్నించితిని.

రత్నావళి 'నేనేమైత్రేయుడను' అని తనవృత్తాంతమంతయు నాతో చెప్పినది' మేమిరువురము శాస్త్రవిధిని వివాహమాడితిమి. పది సంవత్సరములు స్వతంత్రముగా జీవితము గడిపితిమి. మాయిరువురకు నొకకుమారుడు జన్మించెను. అంతలో మాయిరువురకు పూర్వజ్ఞానము కలిగినది. మాశాపము తీరిపోయినది. మేము విద్యాధరులమైతిమి. ఆసమయమున నేను రత్నావళితోనిట్లంటిని. 'ప్రేయసీ! పాపకలుషితమగుభూలోకముతో మనకు పని తీరిపోయినది. మన మిచ్చటనుండనేల? మన లోకమునకు మనము పోవుదము. రత్నావళి కనుల నిండ నీరువచ్చినది. కన్నకుమారు నొక్కదినమైన కన్నారచూచి యానందించలేదు. ఆ బాలునినింక నదేపనిగా చూచినది.

కుమారుని విడువ లేనివంటె నొక కై పున పీడించినది. తనలో తన లోకమునకు పోవలయుననుసంతోషము ఒకవైపున కలిగినది.

ఆమె కేమియు తోచకున్నది. ఆమె నాతో 'వీని గతి యేమి? అని శిశువునుచూపి యడుగుచున్నది. నే నాకుమారునివంక చూచితిని. చంద్రబింబమువంటి ముఖము అందమొలకించు రూపము. నాకును విచారము కలిగినది. కాని యాశిశువు కొంతకాల మీలోకమున నుండవలయును.

అంతలో నాకాశవాణి యిట్లు వినిపించినది. సౌదామినీ అట్టహాసులారా! మీరీ శిశువుగూర్చి దుఃఖింపకుడు. కుబేరునిమాటలు జ్ఞప్తికి తెచ్చుకొనుడు. వీడు విశాలసామ్రాజ్యమును పరిపాలించును. ఉజ్జయినీ నగరమున దేవపాదుడను శివభక్తుడు కలడు. వానికి సంతానములేదు. అతడు పరమ దరిద్రుడు. వానియింట నీబాలుని విడిచిపెట్టుడు వానికి సర్వ సంపదలు నే నొసంగుదును.

మామనస్సులు కొంతశాంతించినవి. ఆశిశువును గొనిపోయి దేవపాదునింట విడిచితిమి. నాయనా! నీవే యాబాలుడవు నీవు నాకు సోదరుడవు. కుబేరశాపమున నాకుమారుడవై పుట్టితివి. ఈ సంగతి నీకు చెప్పుటకే యిచ్చటికిని వచ్చితిని. నీ వీయడవినిదాటి యుత్తరముగా నరుగుము. నీకు సకలసుఖములు కలుగును. నిన్ను నేనెల్లవేళలందు రక్షించుచుందును. ఇదిగో ఈ ఖడ్గమును గైకొనుము. ఇది మహా ప్రభావము కలది. నీతల్లి నీకై గౌరివలన సంపాదించిపంపింది. ఇది నీ కష్టములందు సహాయకారి కాగలదు. అని యిట్లు పలికి యా ఖడ్గము శ్రీధరునకిచ్చెను. యక్షుడు మాయమయ్యెను.

౮

శ్రీధరుడు ఆ ఖడ్గము చేతపట్టుకొనినంతనే యెక్కడిలేని ధైర్యమువచ్చినది. అతడొక మహావీరుడయ్యెను. పగలంతయు నాయడవియందు నడచెను. సాయంకాలమున నాతడొక పర్వతమువద్దకొచ్చెను. అది చాలయందముగా నుండెను. అందు పలువిధములగు పూలతలు,ఫలవృక్షములు గలవు. శ్రీధరుడా కొండనెక్కెను. అందలి రుచికరములైన ఫలములను భుజించెను. తియ్యని బుడగనీటిని త్రాగెను. ఒక పొదరింట కూర్చుండి యలసట తీర్చుకొనుచుండెను. ఆ సమయమున వానికి భయంకరమగు నొకధ్వని వినిపించెను. అది వేయిపిడుగు లొక్కసారి పడినటులుండెను. మరుక్షణముననే వానికొక యడవి వరాహము కనిపించినది. అది యావరాహము ఘుర్ఘురధ్వని. అది పరుగుపరుగున శ్రీధరుని మీదికివచ్చుచుండెను. అది బలసిభయంకరమై యొకగున్న యేనుగును బోలియుండెను. దానికన్నులు మండుచున్న చింతనిప్పులు. చూపులలో మిణుగురులు రాల్చుచుండెను. దానిముట్టెమీద నేనుగుతొండమంతలావు కొమ్ముకలదు. అది తలనువంచి కొమ్మును నిగిడించి ముందునకు దుమికెను. శ్రీధరుడు కత్తినిజళిపించి గురిచూచెను. అది మీదికిలంఘించినది శ్రీధరుడు తనకత్తినివిసరెను దానితో వరాహము మెడ నరుకుకొని పోయెను. తల నేలమీదపడెను.

శ్రీధరుడు వరాహమునుచూచెను. దానితల మునుపటి వలెనే యుండెను. వానికాశ్చర్యము కలిగినది. వానికాలో

చించుటకు సావకాశము లేదు వరాహము వెనుకకు తగ్గి ముందు పకు వుమికినది. శ్రీధరుడు ప్రక్కకు తప్పుకొని మరల ఖడ్గమును విసరెను. అదియు ముట్టెను సూటిగా తగిలి ముట్టె తెగిపోయినది. కాని మరల ముట్టె మొలిచినది. రెండుమూడు తడవలట్లే జరిగి నది. వరాహము మరణింపలేదు. ప్రతితడవ దానికోపము మిక్కుటమగుచుండెను. శ్రీధరున కుపాయముతోచలేదు. మరల నొక్కదెబ్బతో వరాహము నాల్గుపాదముల నరికెను. అవి యథారీతి మరల మొలచుకొనివచ్చెను. వానికి మెరుపు వలె నొకయాలోచన తోచినది. వెనుకవైపునకువచ్చి దాని వీపుమీద నెక్కికూర్చుండెను. తనకత్తితో పొడువనారంభిం చెను. కాని గాయములెప్పటికప్పుడు మాయమగుచుండెను. వరాహము తీవ్రమగు వేగముతో నాకొండ గుహాయందు దూరినది.

వరాహమాగుహామార్గము వెంట నూరు యోజనములు శ్రీధరుని గొనిపోయెను. మార్గమంతయు కటికచీకటిమయము. అదెచ్చటికి తన్నుకొనిపోవుచున్నదియు వానికి తెలియలేదు. కాని శ్రీధరుడు ధైర్యమువిడువలేదు. తనశక్తికొలంది యా వరాహమును గాయపరచుచుండెను. అది మరణింపలేదు. రక్తము చింది వస్త్రములు తడిసిపోయినవి. తుది ప్రయత్న ముగా వరాహము మెడమరల తెగవేసెను. ఉపయోగము లేకపోయినది. శ్రీధరుని వదలించుకొనవలయునని యా వరా హము ప్రయత్నించినది. కాని శ్రీధరుడు పట్టువడువలేదు. చివరికివారొకవిశాలబహిరంగ ప్రదేశమునకువచ్చిరి. అందొక మహోద్యానవనముకలదు. అందు సువాసనలు వెదజల్లుచు

వికసించి వింతవర్ణములతో నొప్పారుచున్న పలుపూవుతీవలు గలవు. ఆరముగ్గిన పండ్లబరువుచేవంగి కనులకువిందుగావించు ఫలవృక్షములుగలవు. వానినడుమ తామరకొలనులు. ఆకొలనులయందు కలకలధ్వనులు గావించుచు జంట జంటలుగా విహరించు రాజహంసలు, బలాకములు? బెగ్గురుపక్షులు చూచుట కింపుగొలుపుచుండెను. ఆపూదోటమధ్య యందు ఆకాశమునంటుకొనుచు రతనంపురాళ్ళ వెలుగుచేతవింతవింత రంగులనీను నొకపెద్ద మేడకలదు.

వరాహము శ్రీధరుడా పూదోటలోని యొక సరోవరము దాపునకుఁగొనిపోయెను. అచట కానరాకుండ మాయమయ్యెను. శ్రీధరుడు మిగుల నాశ్చర్యము నొందెను. క్రిందుమీదులరసెను. దిక్కులుపరికించెను. వరాహము కానరాలేదు. ఆ సరోవరమును కలవరపరచెను. అందున వరాహము లేదు. వానికి భయము. వింతయు, విభ్రమముకలిగినది. 'ఈ, వరాహమేమైనది. ఎటుపోయినది. చూచుచుండగనే మాయమైనదే. ఇది సామాన్యజంతువుకాదు. అయినచో దీనికీజవసత్త్వము లెక్కడనుండివచ్చును. ఇదియొక దేవతామృగము. కానిచో నన్నికత్తిదెబ్బలుతినియు జీవించియుండునా? ఖండించిన తలలు మరలపెరుగునా? అందేదో విచిత్రమున్నది. ఇదేలోకము. నేనిప్పుడెక్కడ నున్నాను. ఈవరాహము నన్నేలయిచ్చటికిగొనివచ్చినది. మరల బైటికిపోవుదారియేది నాకంతయు మాయగా దోచుచున్నది.వరాహము రాక్షసుడు కాడుకదా. ఏమో యైనకావచ్చును. రాక్షసులు కామరూపులు. వారేయాకారమునైన దాల్పగలరు. ఎంతటి

ఘోరకార్యమునైన చేయుగలరు. నన్నిచ్చటికి గొనివచ్చింది. చంపదలంచే గావలయును. ఈకష్టమునుండి తప్పించుకొను టెట్లు? నన్నీస్థితియందుండి యా మహాదేవియే కాపాడవలయును, అని లోలోన తలంచెను. వాని కేదైనదారికనిపించునేమోయని యంతయు వెదుకనారంభించెను. వాని కాకలి వేసినది. ఒడలు చమటపట్టినది. ఆయాసము హెచ్చినది. అచట నుద్యానవనములోని తియ్యనిఫలములను గడుపార భుజించెను. కొలనునందలి జలమును త్రాగెను. అంతలో వానికి నిద్రవచ్చినది. అచట నొకచెట్టునీడ నుత్తరీయము పరచుకొని పరుండెను. చల్లనిగాలి వింజామరం వీచినది. శ్రీధరునకు కన్నులు మూసికొనివచ్చెను. క్షణములో నీ ప్రపంచమును మరచి స్వప్నలోకమున విహరింపసాగెను.

తెల్లవారుజామయినది. శ్రీధరునకు నిద్ర మెలకువ వచ్చినది. అతడు కన్నులు తెరచిచూచెను. అతడొక మహాసౌధమున నున్నటుల గ్రహించెను. అతడు వింతపడి కనులు నులుముకొని మరలచూచెను. తాను చూచినదంతయు నిజము. చుట్టు నిలువుటద్దములు తళతళ మెరయుచుండెను. వాటియందు తన ప్రతిబింబములు వేలకొలందిగా నగుపించుచుండెను. ఆగదియందు తల్పములుచలవరాతి వేదికలుయంత్రపు పైడిబొమ్మలు పెక్కు కలవు. అవియన్నియు చాల యందముగా నమర్చబడియుండెను. మధ్యమధ్య యగరుధూపములు గుప్పున వాసనలను వెదజల్లుచుండెను. చిత్రవర్ణములుగల రెక్కలను విదలించుచు చిలుకలు చెవులకింపుగా బలుకుచుండెను. శ్రీధరుడు కనులను విశాలముగా తెరచినాటిని పరిశీ

లించెను. అతడు స్వర్గమునందుండెనో, లేక మాయాలోకము నందుండెనో, కలకనుచుండెనో వానికి సందేహము కలిగినది. అతడు ప్రక్కవైపునకు చూచెను. అప్సరసవంటి యొక స్త్రీ వానికి వెనువైపుగా నిలుచుండి వీవనతో వీచుచుండెను. శ్రీధరుడామెను చూచెను. ఆమె మందహాసముచేసినది. సిగ్గున తలవాల్చినది.

నీ వెవరవు ?

ఆర్యా ! చూచుచుండియు నన్నడిగెద రేల ? నేను స్త్రీని కాదా ?

ఆసంగతి నీవు చెప్పనక్కరలేదు

మరి.

నీ వెవరి కుమార్తెవు ?

నే నెవరికుమార్తె నైననేమి? నీమేలునుకోరియే నిన్నిటకు తెచ్చితిని. ఇది యపాయములేనిచోటు. భయపడవలసిన పనిలేదు.

ఇదేలోకము

పాతాళము

అయిన నీవు నాగకన్యవా?

కాదు

రాక్షస పుత్రికవా ?

ఆమె తలయూపినది. శ్రీధరునకు గుండె చెదరినది. భయము పొడమినది. చెమటలు దిగజారినవి. ఆయువతి వాని వంక తేరిపారచూచినది. అతని యనుమానముగ్రహించినది.

నీ తండ్రి పేరు

మూకరాసురుడు

నన్నిటకు తెచ్చిన దాతడేకదా ?

అవును.

ఇప్పుడాయన యెక్కడున్నాడు

నీకొఱకు వెదుకుచున్నాడు.

నే నిక్కడనుంటినని యెఱుగడా ?

ఎఱుగడు

నీవు నన్నిచ్చటికేల తెచ్చితివి ?

నిన్ను కాపాడుటకు

రాక్షసులకంత కరుణయా ?

ఆర్యా ! అట్లనకుడు. శశిరేఖ మాకులమునందు పుట్ట లేదా ? ఆమె యనిరుద్ధుని వరించినది.

మరి నీవో ?

నిన్ను వరించి తెచ్చితిని. ఆర్యా! వినుము. నాతండ్రి త్రిలోకభయంకరుడు. దేవతలనైన లక్ష్యముచేయడు. మానవులన్న వానికొక లెక్కకాదు. అతడు దేవేంద్రుని జయించి యమృతకలశమును దిగమింగెను. అది వానిపొట్టయందుండ డుటచేత నెవరెన్ని యాయుధములను ప్రయోగించినను మంణమునొందడు. కావుననే నీయాయుధము వానియందు ప్రయోగము లేనిదైనది. అతడు కామరూపుడు. అడవిపందియై యాగిరిమీద తిరుగుచుండును. అచ్చటికి వచ్చినవారిని చంపి తినుచుండును. వానిచేత ననేకమందిమానవులు హతులైరి. నిన్నటిదినము నీవాయనకంటపడితివి. నిన్ను చంపవలయునని నీపైకి లంఘించెను. కాని నీవుమహావీరుడవై వాని నెదిరించి

తివి. నీకత్తిపోటుల కాయనశరీరము మిగుల నలిగినది. నీ వాయనపై నెక్కుటయేతడవుగావాయువేగమున నిన్నీలోకము నకు గొనివచ్చెను. వంటయింట చొచ్చినకుందేలు వీడెందు బోగలడిని తలంచెను. నిన్నుతామరకొలను సమీపమున విడిచి మాయమయ్యెను. ఆయన తనమందిరమునుచేరి సేదతీర్చు కొనుచుండెను.

నేను నాతండ్రిని దర్శింపనేగితిని. ఆయన పాన్పుమీద పరుండి మూల్గుచుండెను. కారణమడిగితిని. జరిగినదంతయు నాతో చెప్పెను. నాతండ్రినంత నొప్పించిన మానవుడు సామాన్యుడుకాడని తలంచితిని. అట్టివానినొకసారి చూడవల యునను బుద్ధికలిగినది. నాచెలికత్తెలను తండ్రికుపచారములు గావింప నియమించితిని. నిన్నువెదకుచు నుద్యానవనము నందు ప్రవేశించితిని. తామరకొలను తీరమున మందారవల్లీ కలపొంత నిన్నుగాంచితిని. నిద్రయందు సైతము మందహా సము చిందులుత్రొక్కు నీ ముఖసౌందర్యమాలోకించితిని. నామనస్సు ప్రేమరసములో మునుకలుపెట్టినది. నిన్నువరించి యిచ్చుటకు గొనివచ్చితిని. నాతండ్రి కొంచెము సేదదేరి నీ జాడలనరయుటకై మందిరము వెలువడెను అందందు వెద కెను. ఎచట నీవుకానరాలేదు. మరల వరాహగిరియొద్దకు పోయియుండునని యచటికరిగెను. ఈసంగతి చెలికత్తెలు నాకుచెప్పిరి.

ఆకథయంతయు విని శ్రీధరుడు 'ఇంతటి యందక త్తెవాతనికెట్లు కుమార్తెవైతివి' అనిప్రశ్నించెను.

అందులకా రాక్షసుని కూతురు అయ్యో! నాతండ్రి దేవలోకముమీద దండెత్తిపోయెను. దేవతలనుహింసించెను. తిలోత్తమయను నప్సరసనుబంధించి తెచ్చెను. ఆమెయందు నాతండ్రికి నేనుజన్మించితిని. నాతల్లి దేవలోకమునకరిగినది. నాతండ్రి నన్ను గారాబమున పెంచుచుండెను. నాకై యీ యపూర్వభవనమునుకట్టించియిచ్చెను. మిగుల నందకత్తెలగు రాజకుమార్తెలనుపట్టుకొనివచ్చి నాకు చెలికత్తెలుగా నియమించెను. వారునన్ను మిగుల ప్రేమింతురు. నాతోనాడుకొందురు. నన్ను ప్రాణపదముగా చూచుకొందురు. వారిజీవితములు నేను సుఖప్రదముగా చేయుచుందును. వారిని నాతండ్రి యేమియు ననడు. నావలెనే వారిని చూచుకొనుచుండును.

'నీ పేరు?'

మందారవల్లి

మందారవల్లి నిజముగా నందకత్తె. ఆమెముఖములో దేవతలపోలిక కలదు. ఆ సౌకుమార్యము ప్రతిబింబించుచుండును. ఆమె భూలోకమోహిని యనియే చెప్పవలయును. కాని యీమె త్రాచుపాము తలయందున్నమణి. అది యెంత కాంతులను ప్రసరించినను దానిని గైకొనుటకు సాహసింపరు. సాహసించిన వారి ప్రాణములు పోకతప్పవు. మందారవల్లి స్థితియట్టిది. ఆమె శ్రీధరుని మనస్సాకర్షించినది. ఐన నొక మూల భయరేఖలుపొడమి మనస్సును కంపింపచేయుచుండెను. వారిట్లుమాట్లాడుకొనుచుండగా యెవరో తలుపుతట్టినటులతోచినది. మందారవల్లి యొడలు భయమునవణకెను కాని కొంచెము ధైర్యమవలంబించినది. శ్రీధరుని తనమంత్ర

ప్రభావముచేత పూలమాలికగా మార్చినది. దాని నొకచలు వ్రాతిబ్రాహ్మ మెడలోవేసినది. తలుపు తెరిచినది. సూకరా సురుడు లోపలికివచ్చెను. మందారవల్లి తండ్రినొకచోట కూర్చుండబెట్టెను..

అమ్మా! మందారా! వానికొరకు రాత్రియంతయు వెదకితిని. ఎచ్చటగానరాలేదు. కనబడినచో నాకసితీర్చు కొనెడివాడను.

నాయనగారు! చేతచిక్కినవానిని విడిచిపెట్టితిరి. అది యేనా పొరపాటు.

సూకరాసురుడు కూతునివిడిచి పోయెను.

౨౪

'మందారవల్లీ! యెంతకాలమీకారాగృహనివాసము?'

ఇంక కొద్దికాలమోపికపట్టుడు

ప్రతిదినము నిట్టే చెప్పుచుంటివి

ఏమిచేయమందురు? ఎంతచెడినను తండ్రికదా

శ్రీధరుడు మందారవల్లికనులలో చూచెను. కన్నీరు సుడులుతిరిగి కొలంకులకు దిగజారుచుండెను. ఆమె ముఖమతి దినముగా నుండెను. శోకరసముబికి ముఖసరోవరము నింపి నది. శ్రీధరుడామె యాందోళనము గ్రహించెను. కాని తాను పాతాళమందిరములోనుండి బైటపడవలయునని కోరిక. అది నెరవేరుట కొక్కటే యుపాయమున్నది. సూకరాసురునిచంప వలయును. అది సామాన్యమగు పనికాదు. దానికి మందార వల్లి సహాయము కావలయును. ఆమెకైన నాతని జీవితరహ స్యము తెలియదు. తండ్రినడుగవలయును. అడిగినవాడనుమా

నించును అందుమూలమున నామెకే కీడుకలుగవచ్చును. రాక్షసులు క్రూరులు. కోపమువచ్చినచో కన్నబిడ్డల ప్రాణములైనతీయుదురు. భార్యనైన పట్టిపీడింతురు. ఆసంగతి మందారవల్లికి బాగ తెలియును. తండ్రి జీవితరహస్యమును తెలిసికొనుటకువెనుకముందాడుచుండెను. అనుమానము మాటెట్లున్నను వానిప్రాణములు తీయవలసినవానిపని పట్టును. తల్లితన్ను విడిచిపోయిననాటినుండి కంటికి రెప్పవలె మందారవల్లిని కాపాడెను ఎత్తుకొని ముద్దాడెను. ఆమెకు కావలసిన సకల సుఖములను కలిగించుచుండెను. ఆమెసుఖమే తన సుఖముగా భావించుచుండెను. ఆమె కన్నీరువిడిచిన తాను కన్నీరు విడుచును. ఆమె సంతోషించిన తాను సంతోషించును. అట్టి తండ్రిని మోసముచే మృత్యువు ముఖమునకప్పగించుటయెట్లు? అదే ఆమె విచారము.

మందారవల్లి శ్రీధరుని వరించినది. శ్రీధరుడామెభర్త. వానిని మనసార ప్రేమించినది. ప్రేమించుట యేకాదు. శ్రీధరుడే యామె, ఆమెయే శ్రీధరుడు. వానిజాడ యనుపించినచో సూకరాసురుడు బ్రతుకనీయడు. ఒకపంటిక్రింద పెట్టి నొక్కివేయును. వానికేయపాయము కలిగినను మందారవల్లి బ్రతుకలేదు. ఎంతకాలము రహస్యముగా శ్రీధరుని దాచియుంచగలదు. ఎప్పటికైనను నిజము బైటపడకమానదు. అప్పుడిరువురిమరణము తప్పించుకొనరానిది. తండ్రికి తనయనురాగమెరిగించునా తనకంత యపకారము చేసినవానితోడ సూకరాసురుడు పెండ్లికొప్పుకొనడు. ఏ విధమున నాలోచించినను మందారవల్లికి కీడుతప్పనిస్థితి వచ్చి

నది. ఆమె రాత్రియంతయు బాగుగా నాలోచించినది. ఈయునస్వతంత్ర జీవితముకంటె తండ్రిని విడుచుటయే యుత్తమమని తలంచినది. తన ప్రేమకై జనకుని జంపుకొన నిశ్చయించినది.

తెల్లవారినది. సూకరాసురుడు ప్రతి దినమువలెనే మందారవల్లిని చూడవచ్చెను ఆమెగొల్లుగొల్లునయేడ్చుచు తండ్రిని కౌగలించుకొనెను ఆ యేడ్పునకు సూకరాసురిని గుండెలదరినవి. ఆతడెప్పుడామె యంతయధైర్యపడి విలపించి నదిచూడ లేదుసూకరాసురుడా మెనుపలువిధములనోదార్చెను కాని యామె దుఃఖమాగ లేదు. సూకరాసురుడు మందార వల్లిని మేనునిమురుచు నిట్లనియెను; 'అమ్మా ! మందార ! యెందుకమ్మా యీదుఃఖము ? ఏమి జరిగినది ? నాకు చెప్పుము; నిన్నెవ్వరేమనిరి ? బ్రతుకతలంచినవారెవరు నీ జోలికి రాజాలరు. దుఃఖము మానుము జరిగిన దేమో చెప్పుము. మందారవల్లి తనయేడ్పును చాలించినది;

ఆమె ఇట్లు తండ్రితోననెను; తండ్రీ ! మీరిచ్చుటకు కొనివచ్చిన యీ మానవుడు సామాన్యునివలె నాకు తోచుట లేదు; అతడు మిగుల ప్రజ్ఞాయావిగానున్నాడు; ఉన్నవాడున్న టులనే మాయమగును, మరల కనిపించును; వానిచేతియందు దేవతా ఖడ్గమున్నది; అది యగ్నిజ్వాలలను గ్రక్కు-చుండును; అతడు నిన్నరేయిప్రొద్దుపోయినతరువాత నామేడ లోనికి వచ్చెను; నన్ను నిద్రనుండిలేపి 'ఓసీ మూర్ఖురాలా ! నీతండ్రియగు సూకరాసురుడెక్కడున్నాడు. చెప్పుము. చెప్ప వేని నీప్రాణములను తీయుదును; నీతండ్రిని చిత్రవధ కావిం

చుటకే నేనిచ్చటకు వచ్చితిని; వానికొరకు మాయామాప మున కానరాకుండా తిరుగరానిచోట్లెల్లను తిరిగితిని; నాకంటి కగుపించలేదు. నగుపించెనా నా ఖడ్గముతో వానిని తుండె తుండెములుగా ఖండింతును. వాని రక్త మాంసము లను కాకులు గ్రద్దలు తినునట్లు చేయుదును;' అని తనఖడ్గమతిభయంకరముగా జళిపించెను. దానినుండి ప్రళ యమునందువలె నిప్పుమంటలు రేగినవి; నాకనులు మిరుమిట్లు గొలిపినవి; నేనొక కేకవైచి క్రిందపడిపోయితిని;'ఆ మాయావి నాతల వెంట్రుకలనుబట్టి లేవనెత్తి' ఓసిపకువా! నీ నటన లింక చాలింపుము; నీ తండ్రి యెచ్చటనున్నాడు; నేను మహా కాళివరమును బొందివచ్చితిని; వానినెట్లయిన వధింపకతప్ప' నని యదలించెను; నన్నెంత బాధించినను నీజాడవానికి చెప్పనైతిని. వాడుమహోగ్రుడై మండిపడుచు'దూర్తురాలా! నీవుచెప్పకున్న వానిని వెదకి యీరాత్రియే వధించెదను. లేదా రేపుతప్పదని' వచించి వెడలిపోయెను. అప్పటినుండియు నాకు నిద్రపట్టలేదు నీసంగతి తలంచుకొనుచు నీరాక కెదురుచూచుచుంటిని. తండ్రీ! నీవు బైటికి వెడలవలదు. నా యొద్దనేయుండుము. నాకు భయముగుచున్నది. ఆదుర్మార్గుడు నిన్నేవేళ నేమిచేయునో తెలియదు' అని లేనిదుఃఖమును తెచ్చుకొని వెక్కి-వెక్కి-యేడ్చెను.

సూకరాసురుడు కన్నకూతునోదార్చుచు నిట్లనెను. మందారవల్లీ! దిగులై నీవుదుఃఖింపకుము. ఆమానవాధముడు నాకంటబడెనేని వాని ప్రాణములు నిట్టనిలువునతీయుదును. నాకసితీర్చుకొందును. కుమారీ! వాడు నన్నువధించుటకెల్ల.

నా ప్రాణములు నా చేతియందే యున్నవి. వానినెవ్వరు హరింప జాలరు. నే నీయాకారమును విడిచి యడవిసూకరమైనపుడు నా ప్రాణములు గిట్టల యడుగునందుండును. ఆసమయమున నవిఘనీభవించి నాకమితెంత బలమును కలిగించును అప్పుడవి యెవరికి భేదింపనలవికాకుండును. నాగర్భగోళమున నమృత కలశమున్నది. ఏ యాయుధము నన్ను గాయపరచలేదు; నా ప్రాణము తీయలేదు. నన్ను వధింపదలచువాడు నేనీరూపమున నుండుగా నాకరములను గర్భగోళము నొక్కసారి తెగ వేయవలయును; అది యసాధ్యముకావున నా కేయాపదయు కలుగదు; నీవు సుఖముగానుండుము; నే నామానవుడు కని పించినచో వధించివత్తును.' అనిసూకరాసురుడు వెడలిపోయెను.

వరునియందెంత ప్రేమ యున్నను, కన్న తండ్రిని చంపుట కెవతెయిష్టపడును; తండ్రివలన రహస్యము నెరిగినది. అది శ్రీధరునకు చెప్పవలయుననిన మనస్సురాలేదు; దినములు గడిచినది; శ్రీధరుడామెను బలవంతముచేసెను; ఆమెకు నోరాడలేదు; ఆనాడు మందారవల్లిని మరింత బలవంతపర చెను; లేనిచో నాకు వరాహగిరికిమార్గము చెప్పుమని యడి గెను; ఆమెమనస్సల్లకల్లోలమైనది; తండ్రి మరణమున కొప్పు కొనుటయో' శ్రీధరుని విడుచుటయో రెంటిలోనేదోయొకటి జరుగవలయును శ్రీధరునిచేతులు పట్టుకొని బతిమాలినది. అతడాపాతాళ సౌధమునందుండుటకు సమ్మతింపలేదు;వానిని బెదరించిన లాభములేదు; ఆమెకు కన్నీరు కాల్వలుకట్టినది. ఆమెకు పితృప్రేమకంటె భర్తయందనురాగము ఘనమైనది.

చివరికామె రహస్యము చెప్పవేసెనది: చెప్పవలెనో కాని కార్యము నెరవేరునట్లు

సూకరాసురుడు పగలెల్ల గాఢనిద్రయందు మునిగి యుండును. సాయంకాలమునుండి తెల్లవారువరకు నచ్చ టచ్చట దిరుగుచుండును. శ్రీధరుడు, మందారవల్లితో నాలో చించెను; మరునాడు శ్రీధరుడు మందారవల్లి సలహా పతీసి కొని సూకరాసురుని నిద్రించు గదియందు ప్రవేశించెను. అప్పుడాతడు గుర్రుపెట్టి నిద్రపోవుచుండెను; అతడు రెండుచేతులను పొట్టమీద నుంచుకొనెను; శ్రీధరుడాసమ యమును గనిపెట్టి తనఖడ్గముతో నొక్కవేటున వానిచేతులు పొట్ట తెగునటుల వ్రేసెను; దానితో నమృతకలశము దొరలి క్రిందపడెను. సూకరాసురుడు మాటలేక ప్రాణమువిడిచెను. ఇదంతయు ప్రక్కనుండి చూచుచున్న మందారవల్లి పెద్ద పెట్టున నేడువనారంభించెను. చెలికత్తెలామెచుట్టుమూగిరి. శ్రీధరుడు మందారవల్లిని నోదార్చెను.

ఆసమయమున స్వర్గమునుండి దేవేంద్రుడు దిగి వచ్చెను శ్రీధరుడు వానిని విప్పారుకనులతో నాశ్చర్యముగా చూచెను. దేవేంద్రుడు శ్రీధరునితో 'శ్రీధరా! సూకరాసు రుని చంపుటచేత దేవతలకు మిగులసహాయము చేసితివి. అతడు దేవలోకము మీదికి దండెత్తుకొనివచ్చి యమృత భాండము గొనిపోయెను. దానినిమరల దేవతల కొసంగుము. నీకుశుభముకలుగును. నే నాయమృతభాండము కొరకువచ్చి తిని. నన్ను దేవేంద్రుడందురు.' అని నచించెను. శ్రీధరు నమృత కలశమును, దేవేంద్రునకప్పగించెను. అంతనింద్రుడు 'శ్రీధరా! నీవు మగధదేశమున కధిపతివయి వంద సంవత్సర

ములు రాజ్యమేలుదువు. ఈ మందారవల్లివలన కుమారుని గని సుఖింతువు' అనిపలికి యింద్రుడు దేవలోకమున కరిగెను. శ్రీధరుడు మందారవల్లిని పెండ్లాడెను. ఒకసంవత్సరము వరకు నాపాతాళభవనమున నివసించెను. ఒకనాడు శ్రీధరుడు మందారవల్లితో ప్రేయసీ! నేను భూలోకముచూచి చాలకాలమైనది. ఒకసారి యటుపోయి వచ్చెదను. నాకు వరాహగిరికి దారినిచూపుము' అని యడిగెను. ఆమాటల కామె హృదయము దడదడకొట్టుకొనెను.

స్వామీ! మిమ్ము విడచి నేనొక్క-క్షణమైననుండజాలను. నాతండ్రి మరణించెను. మిమ్ములను నమ్ముకొనియుంటిని. నన్నొంటిగా విడిచిపోవుట ధర్మముకాదు. మీరు వెళ్ళిన తరువాత నాకీభోగములతో బనియేమి? నేను నీవెంటవచ్చెదను. నన్నుగొనిపొండు. పోకుంటిరేని నాకుమరణంబుకాక మరొకటి శరణంబులేదు'. అని కన్నీరుకార్చుచు సమాధానముచెప్పెను.

శ్రీధరుని మనస్సుకరిగినది. ప్రేయసీ! నన్నిప్పుడేమి చేయుమందువు! మీతో కొనిపొమ్మందును.

పురుషులెట్టి కష్టములకైన సహింపగలరు. స్త్రీలుకాలిలో ముల్లిరిగినచో కన్నీరుకార్తురు అందుకని యింతదూరము చెప్పితిని. మీరుండగా నాకేమియు కష్టమురాదు. వచ్చినను దానిని సుఖముగానే తలంతును.

అంతధైర్యముండిన నాకేమి? అని శ్రీధరుడుమందారవల్లిని వెంటబెట్టుకొని పాతాళభవనము వెలుపడెను. వచ్చిన దారివెంబడినరిగి వరాహగిరిని చేరుకొనెను.

మగధసామ్రాజ్యమునకు పాటలీపుత్రము ముఖ్యపట్టణము. ఆ రాజ్యమును విశ్వావసుడనురాజు పరిపాలించుచుండెను. వానికి ముసలితనమువచ్చినది. కానిమగసంతానము లేదు. పద్మశ్రద్ధయను నొక కూతురుకలదు. ఆమె వార్ధక్యమునందు పుట్టినదగుటచేత తండ్రి యీమె నతిగారాబముగా పెంచుకొనుచుండెను. ఆబాలిక క్షణముకనిపించకున్న విశ్వావసునకు నేదోపోయినటుల ననిపించును. మనస్సు మనస్సులో నుండదు. రాజకార్యములమీద బుద్ధిపోరదు. ప్రపంచతయు నంధకారమున మునిగిపోయినటుల కనిపించును. ఆ బాలికయు నెల్లప్పుడు తండ్రినంటిపెట్టుకొని యుండును. తండ్రి కొలువుకూటమునకు పోవుచున్నను పద్మశ్రద్ధ దుస్తులను నగలను ధరించి వెంబడించి పోవును. ఆమెకు పన్నెండేండ్లవయస్సు వచ్చినది. విశ్వావసుడు కుమార్తెతో నడవికి వేటకై యరిగెను. అచట పరిచారకులు, రాజభటులు రాజునకు రాణీవాసములోనివారికి ప్రత్యేకములగు గుడారములను నిర్మించెను.

వేట ప్రారంభమైనది. విశ్వావసుడు వేటగాండ్రతో మృగములను తరుముచు నడవిలో బహుదూరమరిగెను. అప్పటికిసాయంకాలమైనది. రాజువేటరులతో నింటిముఖమయివచ్చుచుండెను. కొందరు రాజభటులు, వాని కెదురుగా వచ్చి పెద్ద రొదపెట్టుచు 'మహారాజా! రాజపుత్రిక గుడారమువెలుపల నాడుకొనుచుండెను. మేమందరము తగు జాగ్రత్తతో చూచుచుంటిమి. అచటికొకయడవిపంది వచ్చినది. మేము దానిని చుట్టుముట్టి తరమబోయితిమి. అదిభయంకరముగా ఘుర్ఘురించుచు మాపయిపడినది. దానిని బల్లెములతో బొడిసి

చితిమి. అది చావలేదు. మహారాణి తనకోమ్ముతో పొడిచి గాయపరచినది. అయినను మేము దానిని వదలలేదు. రాజకుమారి భయమున గుహాంతరములోనికరిగినది. ఆ సూకరము రాజకుమారిని వెంబడించెను. మేము చూచునప్పటికెవరో రక్కసుడు బాలికనెత్తుకొని పోవుచుండెను. మేము వానిని చాలదూరము వెంబడించితిమి. బాణములను ప్రయోగించితిమి. కాని వాడు చావలేదు. ఆకాశమార్గమున కెగిరిపోయెను. మేము పోయిచూచునప్పటికి మహారాణి మరణించియుండెను.

విశ్వావసుడా వార్తవిని పెద్దపెట్టున విలపించెను. మతిపోయినవానివలె ప్రవర్తించెను. మహామంత్రులు బలవంతము మీద విశ్వావసుని పురమునకుగొనివచ్చిరి. రాజు నానాట దుఃఖమునమునిగి యాహారనిద్రలు మానివేసెను. భార్యాపుత్రికలను తలంచుకొనుచు ప్రపంచమును మరచియుండెను. దినములు గడచినవి. మహారాజు చిక్కి శల్యమయ్యెను. రాజవైద్యులు దివ్యౌషధములు వాడిరి. అవియేవియు పనిచేయలేదు. రాజు మంచముపట్టెను. మనోవ్యాధి వివరకు క్షయరోగముక్రిందికి దింపినది. ముసలితనమునకు దుఃఖము తోడైనది. దుఃఖమునకు రోగము సహాయమైనది. రాజు మరణావస్థను వచ్చెను. మహావైద్యులు తమశక్తికొలది ప్రయత్నించిరి. లాభములేక పోయినది.

ఆ రాజ్యమునందు ధన్వంతరియను నొక వైద్యుడు కలడు. అతడు రాజుపరిస్థితిని గాంచెను. నాకెవరైన ధైర్యసాహసముకలవాడు తోడైనచో రాజుగారిరోగమును నయముచేయగలను' అని మంత్రులతోననెను. మహామంత్రులాలోచించి

యట్టివాడెక్కడైన లభించునాయని వెదకించిరి. ఎవడు దొరక లేదు. చివరకు దేశదేశములందు చాటింపు వేయించిరి. మేము మేమని వచ్చినవారేగాని చెప్పినపని చేయగలిగినవారు లేరైరి. అప్పటికి నాలుగేండ్లైనది.

శ్రీధరుడు మందారవల్లిని, నామె చెలికత్తెలగు రాజకుమార్తెలను వెంటపెట్టుకొని కొంతపరివారముతో పాటలీపుత్రమునకు వచ్చెను. ఆ యూరిలోని యొక ధర్మసత్రమునందు దిగెను. అచ్చటివారందరు శ్రీధరుడొక మహారాజకుమారుడని తలంచిరి. వానిదర్శనముకొరకు పండితులు గాయకులు కవులు వచ్చిపోవుచుండిరి. శ్రీధరుడు వచ్చినవారికందరకు బహుమానములిచ్చి పంపుచుండెను. విశ్వావసుని మంత్రులు శ్రీధరునిగురించి వినిరి. అతడుమహావీరుడనియు సూకరాసురుని సంహరించెననియు పాటలీపుత్రమునందెల్లడ వ్యాపించెను. ఆయనను దర్శింపవలయునని పురజనులు సత్రముచుట్టు మూగుచుండిరి. విశ్వావసుని మంత్రియగు బృహదశ్వుడొకనాడు శ్రీధరునిదర్శింపవచ్చెను. శ్రీధరుడు వానిని సగౌరవముగా నెదురుపోయి కొనివచ్చెను. తగినయాసనముమీద కూర్చుండ నియమించెను. బృహదశ్వుడు రాజతంత్రమునందు నిపుణవిద్యావివేకసంపన్నుడు. పరులమనోభావములను గుర్తించుటలో చతురుడు. శ్రీధరుని పుట్టుపూర్వోత్తరములను తెలిసికొనవలయునని ప్రయత్నించెను. శ్రీధరుడు బృహదశ్వుని మించిన తెలివితేటలుగలవాడు. తనసంగతి యావంతయు నాతనికవగతము కానీయలేదు. మంత్రి యాప్రయత్నము నుండి విరమించెను. తమరాజునకొదవిన రోగమునుగురించి ప్రస్తావించె. శ్రీధరునకు జాలిపొడమినది. కాని శ్రీధరుడు తన

మనోభావము వెల్లడించ లేదు. మంత్రి శ్రీధరునియొద్ద సెలవు తీసికొనిపోయెను.

తెల్లవారెనది. శ్రీధరుడు విశ్వావసు మహారాజును సందర్శింపనరిగెను. మంత్రులు పరివారజనములు వైద్యులు నాయనచుట్టుచేరి యుండిరి. ఎవరికి తోచినయుపచారములు వారుచేయుచుండిరి. వైద్యులు క్షణక్షణము మహారాజునాడిని పరీక్షించుచుండిరి. మందులునూరి పోయుచుండిరి. ఆస్థాన వైద్యుడు మహామంత్రిని పిలిచి రహస్యముగా నిట్లనెను. 'అయ్యా! మహారాజు జీవించుననన్న యాసయింక లేదు. మాయొద్దనున్న మందులన్నియు పోసితిమి. ఇంక భేతాళస్ఫటి యను నౌషధ మొక్కటేయున్నది. దానికొరకు విశ్వప్రయత్నముచేసితిని. తగిన మహావీరుడున్నగాని యాప్రయత్నము ఫలింపదు. బేతాళుని పట్టి తేగల సాహసవంతుడుండ వల యును. ఉపాయము నాకు తెలియును. కాని యాధైర్యము నాకు లేదు. దేశమంతయు చాటింపించితిమి. ఎవరుముందునకు వచ్చినవారు లేరు. వచ్చినవారు సంగతి యిదియని చెప్పి నంతనే వెనుకకుతిరిగి పోవుచుండిరి. ఎవరిప్రాణములు వారికి తీపుకదా?'

శ్రీధరుడామాటలు వినెను. ఇదిపరోపకారము. పరోప కారముకొరకు శరీరము పోయినను కీర్తినిలుచును. ఈయన మహారాజు. రాజు లేనిరాజ్యమరాజకమగు. అందువలనను జనులలో నల్లకల్లోలముకలుగును. పరాయిరాజులా సావ కాశము చూచుకొని దండెత్తి వత్తురు. ఆ కారణముచేత జన క్షయము రక్తపాతము వాటిల్లును. ఇన్నికష్టము లొక్కరాజు లేకుండుటచేత చేకూరును. అట్టిరాజును సంరక్షించుటచేత

నిహాపరములు కలుగును. నేనేలయట్లు చేయకూడదు?' అని యాలోచించెను. మంత్రినిచేరి 'అయ్యా! నావలని మీకేదైన నుపకారము కావలయునన్నచో నడుగుడు. నేను దానిని చేయుటకు సిద్ధముగానున్నాను' అనెను.

మహామంత్రి శ్రీధరుని సాహసమునుగురించి వినెను. వానిసహాయమును బొందవలయుననియేయాతనను సందర్శించెను. కాని శ్రీధరు రాజుపరిస్థితి చూలించియు నేసమాధానము చెప్పలేదు. నోరువిడిచి యడిగినను లాభముండదని మహామంత్రి వెడలిపోయెను. ఇప్పుడు శ్రీధరుడు స్వయముగా నడిగెను. మంత్రికి పంచప్రాణములు లేచివచ్చినవి. ఉన్న విషయమును శ్రీధరున కెరిగించెను.

శ్రీధరుడు 'మహామంత్రులు దీనికై యంతయాలోచింపవలసిన పనిలేదు. నే నా భేతాళుని పట్టితెచ్చెదను. వైద్యులుకోరిన సహాయము చేయుదును' అనెను.

ఆమాటలకు వైద్యుడు సంతోషించెను. 'అయ్యా! నేడు బహుళచతుర్దశి. ఈ నగరమునకు దక్షిణ దిశయందు మహాశ్మశానమున్నది' అందు చీకటిమాకులు దట్టముగా నల్లుకొని యొకతోపుకలదు. ఆచెట్లగుబురులలో సూర్యరశ్మియైన తగలదు. పగలుసైతము చీకటిగానుండును. నేటి యర్థరాత్రిసమయమున నీవు నన్నచ్చటకలిసికొనుము అనిచెప్పెను.

శ్రీధరుడు సరేయని యింటికి పోయెను. మందారవల్లిని బిలిచి యామెతో జరిగినదంతయు చెప్పెను.

ఆమె భయమున వడంకినది. 'ఆర్యా! మీ రేమిపని చేసితిరి. బేతాళుని పట్టితెచ్చుటయన్న సామాన్యమగు పని కాదు. వానిమాయలు తెలిసికొనుట యసాధ్యము. అతడు

కోపించెనా ప్రళయము వాటిల్లును. వానిముందెవరు నిలువ లేరు. దేవతలుసైతము వానికి భయపడుచుందురు. మన మనగా నెంతవారము. మీప్రయత్నమును మానుడు.' అని చేతులుపట్టుకొని బ్రతిమాలెను.

అతడు మొండిపట్టు పట్టెను. పరోపకారమునకై ప్రాణములు పోయినను పోనిమ్ము' అని సమాధానము చెప్పెను.

మందారవల్లి కొంచెముసేపు ఆలోచించి యిట్లనెను. అట్లయినచో నామాట వినుడు. నాయొద్ద యక్షిణీవిద్య యొకటియున్నది. అది యొకప్పుడు నాతండ్రి నాకుపదేశించెను. దానిమహిమచేత సకలభూతములు మీకు స్వాధీన మగును. నేను దానిని మీకుపదేశించెదను. పట్టుదలతో దానిని నడిరేయివరకు జపింపుడు. యక్షిణీదేవత మీకు ప్రత్యక్షమగును. దానిని మీయందావేశించునటుల వరము ప్రసాదింపుమని ప్రార్థింపుడు. ఆశక్తి మీయందు ప్రవేశించును. కత్తిని చేతపట్టుకొని వెనుకకుచూడకుండ శ్మశానమునకు పొండు మీకార్యము నెరవేరును' అని పలికెను. శ్రీధరున కా యక్షిణీమంత్రము నుపదేశించెను. అతడు పట్టుదలతో నా మంత్రమును జపించెను. రాత్రి తొలిజాము దాటినది. రెండవ జామారంభమైనది. యక్షిణీదేవత శ్రీధరునకు సాక్షాత్కరించెను. నల్లని శరీరము, చింతనిప్పులవంటి కనులు, పిరుదులనుదాటి జడలుకట్టి వేలాడుచున్న యెఱ్ఱని తలవెండ్రుకలు, పదిచేతులు, నతిభయంకరముగా నుండెను. తలమీద కిరీటము ధగదగమెరయుచుండెను. మెడలో రత్నాలహారము లగ్ని కీలలవలె మెరయుచుండెను. నడుమునకు వజ్రములయొడ్డాణము, చేతులకు రత్నములుతాపిన బంగారుగాజులు, పాదములకు

నీలాలయందెలు తళతళ ప్రకాశించుచుండెను. ఆ దేవత నిస్వ నిలువున తాడి ప్రమాణముకలదై యట్టహాసము కావించెను. శ్రీధరుడా మెరూపముగాంచి భయపడలేదు. భక్తివినయము లతో నామెకు నమస్కరించెను.

ఆ యక్షిణీదేవత శ్రీధరా! నీకేమికావలయును అని ప్రశ్నించెను. ?

ఆమాట లుడుకులుగ వెలె చెవులంబుపడినవి. 'అమ్మా! నీవు తల్లివి. నేను కుమారుడను. నామెదుట నింతభయంకర మైనరూపముతో నగుపించిన నేనేమియు కుగ గలుగుదును. సాత్వికమూర్తివై కనిపింపుముతల్లీ' అని ప్రార్థించెను.

ఆమెకు లోలోన నవ్వువచ్చినది. ఆమె త్రిజగన్మోహన మైన యాకారముతో శ్రీధరునియెదుట నిలిచినది.

ఆ రూపమును శ్రీధరుడు చూచినాడు. 'ఇదేమి పరీక్ష తల్లీ! నీవు మాతృదేవతవని పూజించితిని, జపించితిని. ఈదివ్య మంగళవిగ్రహముకు కన్నెత్తి చూడలేను. నాకనులు మిరుమిట్లు కొలుపుచున్నవి. నాధ్యానరూపంలో నాకు దర్శన మిమ్ము' అని వినయముగా వేడుకొనెను. యక్షిణీదేవతకు ఆనందము కలిగినది. ఆ వినయమునకు సంతోషించినది.

'నాయనా! శ్రీధరా! యిటుచూడుము' అనినది.

శ్రీధరుడు ముందుచూచెను. నిండారవికసించిన వేయి రేకుల యెఱ్ఱనికమలము. దానినడుమ పద్మాసనాసీనయై యక్షిణీదేవత గోచరించినది. ఎఱుపు పసుపు వన్నెలుకలిసి మెరపుతీగెల పుంజమువలె మెరయుచున్నశరీరము. కళంకము లేని పున్నమినాటి చంద్రునివంటిముఖము, అమృతము చిందించు నందమగు చిరునగవు, తలమీద రత్నములుతాపిన

కిరీటము, తొగరువర్ణములుకల బంగారుపేటంచు పట్టుచేలము; కంఠములో ముత్యాలసరములు, నాల్గుచేతులు, శంఖము చక్రము, అంకుశము, పాశముకల పిడికిళులు, చెవులకు మకర కుండలములు, మహాదేవి దేవతామూర్తితో నగుపించినది. శ్రీధరుడు లేచి నమస్కారము చేసెను.

'నాయనా! నీకేమి కావలయును' అని యామె ప్రశ్నించినది.

నీవు నాయందు లీనమగుము తల్లీ! అని శ్రీధరుడు ప్రార్థించెను. దేవి వాని యందావేశించినది. శ్రీధరుడొక దేవతామూర్తివలె ప్రజ్వలించినాడు. ఖడ్గముచేతపట్టుకొని స్మశానమువైపునకు దక్షిణదిశగా పోయినాడు.

౭

కాళరాత్రియైనది. శ్రీధరుడు కత్తిని చేతపట్టుకొని స్మశానమునందు ప్రవేశించెను. అంతయు నంధకారము. కన్నులు పొడుచుకొన్నను కానవచ్చుటలేదు. వెనుకనుండి పిశాచముల కేకలు వినవచ్చుచుండెను. ముందువైపున కొరివి దెయ్యములు కాగడాలను చేతిలోపుచ్చుకొని గొణగొణ ధ్వనిచేయుచు గుంపులు గుంపులుగా బయలుదేరి పోవు చుండెను. అక్కడక్కడ బ్రహ్మరాక్షసుల వేదఘోషలువిని పించుచుండెను. చుట్టుపట్టులందు కాలుచున్న చితులనుండి యెముకల సంధిబంధములు విడులుచున్న చిటపటధ్వనులు రేగుచుండెను. సగముకాలిన శవములను లాగి రాక్షసులు భుజించుచుండిరి. నక్కలు మోరలుసాచించి కూయుచుండెను. శ్రీధరు డాయారావములను వినుచు బెదరులేక ముందునకు సాగిపోవుచుండెను. కొంతసేపున కాతడు చీకటిమ్రాకుల త్రోవలలో ప్రవేశించెను.

ఆతఁడు పునుకుమూ వైద్యుఁడు పద్మాసనమునైచుకొని యేకాగ్రముగా ధ్యానము చేయుచుండెను. అతని దేహమంతయు తెల్లని చిదాభస్మముపూసికొని యుండెను. మెడలో నెముకల హారములుగలవు. వానికుడిచేతియందొక పుత్రైయు, నెడమచేతియందు తెల్లని యెముకలకట్టయు గలవు. వానిచుట్టు కొరువులు పాతియుండెను. శ్రీధరుడు వానిని గుర్తుపట్టి పలుకరింపక ప్రక్కనకూర్చుండెను వైద్యుఁడు కొంతసేపటికి కన్నులు తెరిచిచూచెను.

మీరు వచ్చితిరా? ఆవచ్చితిని.

'నాకెదురుగా నూరుగజముల దూరములో నొకమఱ్ఱి యున్నది. దాని క్రింద నొకశవమున్నది. దానినిచ్చుటకు తీసికొనిరమ్ము వెనుకకు చూడకుము' అని వైద్యుఁడు చెప్పెను. శ్రీధరుడులేచి బయలుదేరెను. ఆమఱ్ఱియొద్దకు పోయెను. అచట నొకశవమునుగాంచెను. శ్రీధరుడా శవమును భుజములమీద నెత్తుకొనబోయెను. అంతలో నొకరాక్షసుడచ్చటికివచ్చెను. వానితలనుండి యెఱ్ఱని చింపిరి వెండ్రుకలు ముఖముపై బడుచుండెను. గడ్డములు, మీసములు పెరిగి యుండెను. వానినడుమనుండి చింతనిప్పులవంటి యెఱ్ఱని కనులు కనిపించుచుండెను. శరీరమొక పర్వతమువలె నున్నతముగా నుండెను. భుజములేనుగు తొండములను బోలి యుండెను. వానికి గోళ్లుపొడవుగా పెరిగికొనలు దేరి పులిగోళ్లను బోలియుండెను. అతనినుండి నల్లనిచీకటులు వెలువడుచుండెను. ఆరాక్షసుడు భయంకరముగాధ్వనిచేయుచు 'ఓరీ వీనినినీవెచ్చుటకి కొనిపోయెదవు.సాయంకాలమునుండియు వీని మరణమునకై యెదురుచూచుచు వీనిని తినవలయునని కాచు

కొనియుంటిని పీసిని విడువు. లేదా నీ ప్రాణములు దక్కవు. అని పలుకుచు నాశవముపాదములు పట్టుకొనిలాగవొచ్చెను;

శ్రీధరుడు తలవైపున గట్టిగా పట్టుకొని, ఓరీ! రాక్షసాధమా! నాకు వీనితో పనియున్నది; వీనిని విడిచి పెట్టుము. లేదా! యీ కత్తితో నిన్ను తుంటె తుండెము లుగా నరికెదను' అని సహాధానముచెప్పెను; వారిరువు రా శవము కొఱకు చాలసేపు పెనుగులాడిరి; ఆసమయమున భేతాళుడాశవము శరీరమునందు ప్రవేశించెను; అది వారిరు వ్వురి పెనుగులాటమధ్య నలుగుడుపడి బిగ్గరగా కేకపెట్టెను; ఆ కేకకు దిక్కులువడకినవి; గుహలుకంపించినవి; కొండలు కుదుకుతప్పినవి; స్మశానమంతయు ప్రతిఘోషలు పెట్టినది; ఆరాక్షసుడు భయము సడరిపడి నేలకువ్రాలెను; శ్రీధరు డా శవమును భుజములమీద నెక్కించుకొని నడువనారంభించెను; అంతలో నారాక్షసుడు తెప్పరిల్లిలేచి శ్రీధరుని కడ్డముపడెను; శ్రీధరు డాశవమును విడువక రాక్షసునితో పోరుసాగించెను; యక్షిణీదేవత శ్రీధరునియందు నావేశించియుండెను. వాని బలము రాక్షసునిబలమును మించిపోయెను. వానిముందు రక్కసునియాటలు సాగలేదు. శ్రీధరుడాలస్యమునకు సహింప లేక తనఖడ్గముతో వానితల నరక యత్నించెను. అంతలో నా రాక్షసుడు భయపడి మాయమయ్యెను.

శ్రీధరుడు శవమును త్వరత్వరగా గొనిపోవుచుండెను. అంతట శవము పెద్దగానరచుచు ఓరీ! ఆగుము. నన్నిచ్చటకు గొనిపోవుదవు. నాకాకలి యగుచున్నది. నాకు నరమాంస మాహారము కావలయును. లేదా నిన్నే బక్షించెదను. ఆగుము అని యదలించెను.

'నీకు కావలసినంత నరమాంసము పెట్టెదను' అనుచు తన శరీరమును కత్తితో కోసి ఒక్కొక్క ముక్క నోటికందించు చుండెను. దానిని శవము తినుచుండెను. శ్రీధరుడాశవమును కొంతదూరము కొనివచ్చెను. వానిశరీరములోని మాంస మంతయునైపోయినది. రక్తము ప్రవాహముగా కారుచుండెను. శవములేచి శ్రీధరునితో నిట్లనెను. ఓయీ ! నీ ధైర్య సాహసములకు మెచ్చుకొంటిని. నన్నుతీసికొనిపోయి యా వైద్యున కొప్పగింపుము. నీకు సకలశుభములు కలుగును.

శ్రీధరుడు యథారీతిగా నయ్యెను. శవమును మోసు కొనిపోయి వైద్యుని యెదుటపెట్టెను. ఆ వైద్యుడు చితాభస్మముతో ముగ్గులుపెట్టెను. దానికెనిమిది మూలలయందు పుర్రెలలో క్రొవ్వునుపోసి వెంట్రుకల యొత్తులువేసి దీపములు వెలిగించెను. రక్తమును తెచ్చి నాల్గువైపుల చల్లెను. తూర్పుగా నగ్నిని వెలిగించెను. ఆశవమును ముగ్గులోనడుమ పరుండబెట్టెను. దానిరొమ్ముమీద కూర్చుండెను. మనుష్యుని యెముకలతో క్రొవ్వును పుర్రెనుండి తీసి శవము నోటిలో హోమముచేయనారంభించెను. గంటకాలము గడచినది. శవమునోటినుండి భయంకరముగా నగ్నిబయలుదేరెను. అది యంతకంతకు పెరిగి నిలువెత్తునలేచెను. వైద్యుడదిచూచి భయముతో త్రుళ్ళిపడిలేచెను. వెంటనే యా శవము నిట్టనిలువునలేచెను. భయంకరముగా నట్టహాసము చేయుచు నా వైద్యునిబట్టుకొని మింగెను. అచట నున్న సకలపదార్థములను మింగివైచెను. శ్రీధరుడదిచూచి మహోగ్రుడై మండిపడుచు కత్తిదూసి వానిపై కెరిగెను.

'ఓయీ! వీరుడా! నేను భేతాళుడను. ఇదిగో భేతాళ స్ఫటి నానోటినుండి తీసికొనుము. దీనిని విశ్వావసు చేతిలో నుంచుము. వానికి క్షయరోగము నివారణయగును. సుఖముగా నుండుము' అనెను.

అందులకు శ్రీధరుడు 'ఇదేమిన్యాయము. లోకము నన్నుగురించి యేమనుకొనును. నేను నాస్వలాభమునుగోరి వైద్యుని చంపితినని కొనును. నామాట యెవరు నమ్మెదరు. వైద్యుడులేక నే నెట్లింటికి పోగలను. ఈయపకీర్తి భరించుట కంటె మరణించుటమేలు. నా వైద్యుని నాకిమ్ము. లేదా నన్నుకూడ బలికొనుము' అనెను.

అందులకు భేతాళుడు మహావీరుడా! భయపడకుము. నీయందు యక్షిణీదేవతయావేశించియున్నది. ఆమహాదేవియే సర్వము సరిచేయగలదు. నీవు మగధసామ్రాజ్య చక్రవర్తివి కాగలవు. భేతాళస్ఫటిని గైకొనుము, అని సమాధానము చెప్పెను. శ్రీధరుడు భేతాళుని నోటినుండి స్ఫటిని గైకొనెను. శ్రీధరుడు విశ్వావసుని సందర్శింప నరిగెను.

అప్పటికి తెల్లవారినది. సూర్యుడు తూర్పు కొండల మీద నెర్రని కాంతులతో వెలుగొందుచుండెను. విశ్వావసుడు కొనయూపిరితో నుండెను. మంత్రులు మిత్రులు ప్రధానోద్యోగులు మహారాజు చుట్టుచేరి వైద్యునికొరకెదురు చూచుచుండిరి. అంతలో శ్రీధరుడు రాజు మందిరమును ప్రవేశించెను. అచటి వారిముఖము సంతోషముతో వికసించినది. కాని వైద్యుడురాలేదు. అందరు ముఖద్వారము వైపునకు చూపులు నిగిడించిరి. కొందరు ముందు వాకిటికి పోయి చూచిరి. వైద్యుడు వచ్చుచున్నజాడ వారికి కనిపించలేదు.

మహామంత్రి శ్రీధరుని చూచి 'రాజవైద్యులు రాలేదా?' అని ప్రశ్నించెను.

ఆసంగతి తరువాత మనవి చేసికొందును. ముందీమందును రాజు చేతనుంచుడు. అని శ్రీధరుడు సమాధానము చెప్పెను.

అందేదో విశేషమున్నదని మహామంత్రి యూహించెను. శ్రీధరుడు వాని మనోభావమును గ్రహించెను. కాని యాతడేమియు మాటలాడలేదు. అచటనున్న వారినందరిని తోసికొనిపోయి మహారాజు మంచముదాపునకు నరిగెను. భేతాళస్ఫటి వానిచేతియందుంచెను క్షణములో విశ్వావసువునకు తెలివివచ్చినది. రోగము తిరుగుముఖముపట్టినది. మరుక్షణములో మహారాజు లేచి కూర్చుండెను. అందరినిచూచి మాట్లాడనారంభించెను అచటి వారందరు మహానందము నొందిరి. మూడుక్షణములైనది. మహారాజు సంపూర్ణముగా నారోగ్యము కలవాడయ్యెను. మహామంత్రి శ్రీధరునివంక మరల తీవ్రముగాచూచెను. 'మహారాజు వైద్యులేరి' అని ప్రశ్నించెను.

శ్రీధరుడు సావకాశముగా జరిగినదంతయు చెప్పెను.

మహామంత్రి యామాటలు నమ్మలేదు. శ్రీధరుడు రాజు మన్ననలను తానే పొందవలయునని యాస్థానవైద్యుని చంపి యా భేతాళస్ఫటి తానే ఘనకార్యముచేసినటుల తెచ్చి యుండునని యనుమానించెను.

మంత్రి శ్రీధరునితో 'మహారాజవైద్యులు ధన్వంతరి యంతవారు సర్వశాస్త్రములు తెలిసినవారు, గుండె నిబ్బరంకల విశ్వాసుడు. భేతాళుని బెదిరింపుల కదరిపడి యుండుటకల్ల. భేతాళుడు వానిని భుజించుటయన్న నంశకంటె నబద్ధము. మీరే స్వలాభమునుకోరి వారినిచంపియుందురు' అనెను.

శ్రీధరునకెక్కడలేని కోపము వచ్చినది. కాని యా కోపము లోలోన నడచుకొనెను.

మహామంత్రులు పొరబడుచున్నారు. స్వార్థముకొరకు పరులను వంచించుట మాబోటి పరోపకారుల పనికాదు, తలలుమార్చుటకు నేను మంత్రులముకాము' అని శ్రీధరుడు తీవ్రముగా బలికెను. మహామంత్రికి కన్నులెఱ్ఱవారినవి. వెనుక నున్న రాజభటునివంకకు చేయిచాచెను. వాడు ఖడ్గము నందించెను. శ్రీధరుడు మహోగ్రుడై కత్తిదూసెను.

అంతట శ్రీధరునావేశించియున్నయక్షిణీదేవత 'విశ్వావసు మహారాజా! శ్రీధరుడంతయు సత్యమునుబలికెను నేను యక్షిణీ విద్యాధిదేవతను. ఈతనినావేశించి యుండుటచేత నేభేతాళుడు వీనికి వశమయ్యెను' అని యాకాశమునుండి పలికెను. అచ్చట నున్నవారందరు విభ్రాంతులై వినుచుండిరి. రాజమితానందము నొందెను. శ్రీధరుని గాగలించుకొని 'నాయనా! శ్రీధరా! నా ప్రాణములను రక్షించితివి. నీవు నారాజ్యమునకు కాదగిన భావిమహారాజువు. నాకు ముందుదారి చూపుటకే దైవము నిన్నిచ్చటికి కొనివచ్చెను' అని పలికెను.

శ్రీధరుడు 'మహారాజా! యింతకంటె మీకు నమూల్యమగు కానుక తెచ్చితిని. దానిని స్వీకరింపుడు.

అని పలుకుచు వెనుకవైపునకుచూచెను. అంత దాసీ జనులొకయువతిని మేలిముసుగువైచి యచ్చటకు తీసికొని వచ్చిరి. శ్రీధరుని యానతినిగైకొని యామె మేలిముసుగుతీసిరి. రాజు తనకన్నులను తాను నమ్మలేదు. ఆమె కన్నీరుకార్చుచు తండ్రిపాదములపై బడి నమస్కరించెను. ఆమె రాజపుత్రి పద్మాక్షి. రాజు మహానందమునొందెను.

# కోహలుడు

ఎవరు నీవు ?

నేనొక క్షత్రియుడను

పేరు

కోహలుడు

దేశము

మధ్యరాష్ట్రము

జీతమెంత కావలయును

నెలకు పదివేల వరహాలు

ఆదిత్యవర్మ యొక్క సారి కోహలుని పాదములనుండి తల వరకు పరిశీలించెను. మరల తలనుండి పాదములవరకు చూచెను. అతడు మహాబలుడు. దృఢమగు శరీరము కలవాడు. చేతులు మోకాలిమీదికి వ్రేలాడుచుండెను. కండలు పెరిగి దండలు మెలితిరిగియుండెను. భుజములు మూపురములవలె పెరిగి చెవులకంటుచుండెను. వానినుండి యొకవైపున నంబుల పొది రెండవవైపున డాలు వ్రేలాడుచుండెను. కుడిచేత విల్లు కలదు. నడుమున కాలసర్పమువలె ఖడ్గము తళతళ మెరయు చుండెను. నడుమునకు బిగించిన కాసెకోకలోనుండి రెండు చురకత్తులు బంగారుపిడులతో నిగిడియుండెను. అతడాజాను బాహువు. ఆరడుగులకు మించియుండెను. వానిది విశాలమైన వక్షము. పర్వతశిఖరమువలె నుబికియుండెను.

నీకు పెండ్లియైనదా

లేదు ప్రభూ

ఒంటివాని కంతజీతమా
పరీక్షించి యుచితమనితోచిన నొసగుడు
లేనిచో
నాదారి నేనుపోయెదను
ఎక్కడకు ?
అది నేనెట్లు చెప్పగలను ప్రభూ

ఆదిత్యవర్మ కోహాలునిముఖములో చూపునిగిడించెను. చెంపకు చేరెడుకనులు. ఆకనులలో నెఱ్ఱని నెత్తురు రేఖలుబికి యుండెను. మహారాజు తలవంచి యాలోచించెను.

'కోహాలా !' అని పిలిచెను

'మహారాజా !' అని కోహాలుడు తలయెత్తి రాజువంక నాతురతతో చూచెను. అది మేఘగంభీరధ్వని. దానిలో నురుములు మెరుపులు నెలకొనినవి. ఆకంఠరావమునకు మహారాజు హృదయము నెమలివలె తాండవించినది.

'నీవు మాకంగరక్షకునిగా పనిచేయవలెను' అని రాజనెను.

'మహాప్రసాదము' అని కోహాలుడు నమస్కరించెను.

నాటినుండియు కోహాలుడు ఆదిత్యవర్మకొలువునందు పని చేయుచుండెను. ఆదిత్యవర్మ మహావీరుడు. వంగరాజ్యమాతని బాహువులనాశ్రయించి రత్నగర్భయైనది కాల సర్పము కోరలలోనివిషమునకైన మంత్రచికిత్సయున్నది, కాని యాతడు విజృంభించినచో బాహుపరాక్రమమునకు నాటంకమునునదిలేదు. అది కారుచిచ్చువలె విరోధులపై నికబలమును చివరివరకు కాల్చివేయవలయును. అప్పుడు కాని దానికి తృప్తి లేదు. ఒకసారి కళింగరాజు తణోత్తుంగుడు వంగదేశము

మీాదికి దండెత్తివచ్చెను. అతడు వీరాసైనికుడు దక్షిణభారత మంతయు జయించి మహారాజాధిరాజను కీర్తిని పొందెను. అతడు మహారుద్రునిపూజించి వజ్రసారమను విజయఖడ్గమును సాధించెను. దానిబలంచేత విరోధులనందరిని జయించి మహాగర్వియై ప్రవర్తించుచుండెను. అతడు మహాసార్వభౌముడు కావలయుననియు సద్వీపములను జయింపవలయునని యాశ పుట్టినది. ఆయాశ కంతములేదు. సముద్రమువంటి సేనలు వంగరాజ్యముమీాదికి దండెత్తివచ్చెను. ఆదిత్యవర్మ మహోగ్రుడై మండిపడి సేనలను తగలించుకొనిపోయి రణోత్తుంగునెదిరించెను. రెండుసేనలకతి భయంకరముగా యుద్ధము సాగినది. ఎన్నిదినములుగడచినను విజయమెవ్వరిని వరించలేదు. ఆదిత్యవర్మకు విసుగుపుట్టినది. ఆనాటితో జయమో పరాజయమో తేల్చుకొనవలయునని నిశ్చయము చేసికొనెను. అర్ధరాత్రిసమయమున మారువేషముతో రణోత్తుంగుని గుడారమునందు ప్రవేశించెను. రణోత్తుంగుడు పగటియుద్ధమునందు తగిలిన గాయములకు చికిత్స చేయించుకొనుచుండెను. యమధర్మరాజువలె తనయెదుటనిలువబడిన ఆదిత్యవర్మనుచూచి రణోత్తుంగుడు నిర్ఘాంతపోయెను. ఆపాదమస్తకము గడగడ వణకిపోయెను. అది భయమువలనకాదు. పరాక్రమవంతులగు మహావీరులు సంరక్షించుచున్న సైన్యశిబిరములనుదాటి ఆదిత్యవర్మ యెట్లు తనగుడారమునందు ప్రవేశింపగలిగెనని యనుమానము కలిగినది. ఆదిత్యవర్మ రణోత్తుంగుని తీవ్రముగా పరిశీలించినాడు.

'వీరశిరోమణీ! లేనిపోని మత్సరములను పెంచుకొని యుభయపక్షములందలి సేనలను చంపుకొనుట తగినపని కాదు. ఇప్పటికీ యుద్ధమున లక్షలకొలంది యమూల్యవీరుల రక్తము నేల పాలుగావించితిమి. మనయిరువురకుగల వైరమునకు సేనలను బలియిచ్చుట యెందులకు. మనలో మనమే పగ సాధించు కొందము నీకు ధైర్యముకలదేని నాతో ముష్టియుద్ధమునకు తయా రగుము. నీవు గెలిచిన నా రాజ్యము నీకిచ్చివేసెదను. నేను గెలి చిన నీదారి నీవు వెనుతిరిగిపొమ్ము' అని నిష్ఠూరముగా బలికెను. రణోత్తుంగున కేమి సమాధానము చెప్పవలయునో తోచినది కాదు. వానిచూపులు విజయఖడ్గముమీదికి ప్రసరించినది. ఆదిత్యవర్మ యది గ్రహించెను. విజయఖడ్గము రణోత్తుంగు డందుకొనినచో వానిని జయించుట యసాధ్యము. అది పర మేశ్వర ప్రసాదము. దానికి తిరుగుండదు. ఆదిత్యవర్మమన స్సులో మెరపుతీగెవలె నుపాయము పొడమినది.

'మహావీరా! నీవు పరాక్రమశాలివి. బాహుబలము కలవాడవు. పురుషునకు సహజములైన బలదర్పములను దూర ముగావిడిచి ప్రాణములేని యొక కత్తిని సాయముగా గొని యుద్ధమునకు చూచుట మగవానిలక్షణము కాదు. నీవంతగా పౌరుషముగల మహారాజువేని ముష్టియుద్ధమునకు సంసిద్ధు డవు కమ్ము.' అని పలికెను.

రణోత్తుంగునకు పౌరుషము రాజమంటలు రేగినది. బాహుయుద్ధమునందు ఆదిత్యవర్మ నెదిరించి జయింపవచ్చు నని యాతడూహించెను. కాని ఆదిత్యవర్మ బాహు యుద్ధ మునందు మహా ప్రతిజ్ఞకలవాడు. తండ్రికాలమునందుండియు

వేలకొలంది బలశాలులమని గర్వముతో విఱ్ఱవీగి వచ్చిన జట్టీలను నిరాఘాటముగా నెముకలతోడవిరిచి మాంసపుముద్ద చేసినవాఁడు. ఆసంగతి రణోత్తుంగునకు తెలియును. ఆదిత్యవర్మ యుపాయమాతని కర్థముకాలేదు.

'సరే నీ యభిప్రాయమెట్లో యటులనే కానిమ్ము' అని రణోత్తుంగుడులేచి సమాధానముచెప్పెను. రణోత్తుంగుడుప్రాణములపోయినను అనినమాట తప్పువాఁడుకాఁడు. ఆదిత్యవర్మ యధర్మమునకు పూనుకొనువాఁడుకాఁడు. అట్లుపూనుకొనినచో రణోత్తుంగుని మొదటిచూపుననే తనకత్తి వానికంఠమునకు గురిచూచి యుండెడివాఁడు.

'మహారాజా! యిది యర్ధరాత్రిసమయము బాహుయుద్ధమునకు సమయముకాదు. రేపటిదినము సూర్యోదయమున కలిసికొందము' అని సమాధానము చెప్పి గుడారము నుండి వెడలిపోయెను. అంగరాజు శిబిరములోనివారందరు తమరాజనుగానక యల్లకల్లోల పడుచుండిరి. మహామంత్రి కోటలోనికి వర్తమానం పంపెను. ఆదిత్యవర్మ యచటలేడని సమాధానము వచ్చినది. 'మరేమయినాడు రణోత్తుంగుడు కుటిలస్వభావుడు. తన యనుచరులనుబంపి బంధించియుండునేమో? అది యెట్లుజరుగును. మహావీరులు కడుజాగ్రత్తతో కాచుచుండిరి. సేనాపతియు గానరాడు. బంధించిన సిరువురను పట్టుకొనిపోవుదురా? ఇందరిని కనులుకప్పి తీసికొనిపోవుట ఎట్లుజరుగును. మహారాజు సేనాపతితో నెచ్చటికో పోయియుండును. యుద్ధసమయమున నెవరితో చెప్పక నెచ్చటికిపోవును' అని దారులెదురు చూచుచుండిరి. ఆదిత్యవర్మ

యున్న వాని పరిజనములకే కాదు ప్రజలకు మంత్రులకు సైని కులకు మహాప్రేమ. వారి కష్టసుఖములను తాను స్వయముగా దెలిసికొనుచుండును. తాను మహారాజయ్యును వారిలో తానొకడై చరించును. వారితో క్రీడించును. మంతనము లాడును. అట్లని తన రాజసమునకు లోటు రానీయడు.

వారిట్లు మాట్లాడుకొనుచుండగా దూరమునందుండి దుమారము రేగుచున్నటుల కనిపించినది. వారు పరికించి చూచుచుండిరి. అంతలో గిట్టలచప్పుడు వినిపించెను. వారు వినుచుండగనే గుర్రములు కనిపించినవి. వారందరికి ప్రాణ ములు లేచివచ్చినట్లయినది. 'మహారాజు.మహారాజని కేకలు వేయనారంభించిరి. ఆదిత్యవర్మ సేనాపతితో శిబిరములను జేరుకొనెను ఆరేయి గడచినది. తెల్లవారుజామయినది. తూర్పుదిశయందు నెర్రనికాంతులలముకొనినది. వాని నడుమ సూర్యబింబము పాదమునకు పూసిన పారాణిరేఖలలోనిచుక్క వలె కనిపించుచుండెను. రెండు పక్షములందలి సేనలు పెద్ద కోలాహలముతో రణరంగమునకు బయలుదేరెను. వంగ కళింగసేనలు బారులుతీరి నిలుచుండెను. సేనాపతుల యాజ్ఞ లకై యెదురుచూచుచు కయ్యమునకు కాలుతూగుచుండిరి. ఎంతసేపటికి సేనానాయకుల యానతికాలేదు. సూర్యుడు నులివెచ్చని కిరణములు ప్రసరించుచుండెను. రెండు పక్షముల నుండి గుర్రములనెక్కి రణోత్తుంగుడు ఆదిత్యవర్మయు సేనా మధ్యమునకువచ్చి నిలిచిరి. సైనికులందరు నేమిజరుగునోయని మెడలు నిగిడించి చూచుచుండిరి. రణోత్తుంగుడు ముందుగా నశ్వమును దిగెను. ఆదిత్యవర్మ వానిననుసరించెను. మహా

రాజు లిసవ్రకు ముష్టియుద్ధమునకు తగిన కవచములను ధరించి యుండిరి.

రణోత్తుంగుడు కేబదియేండ్లు పైబడిన మహాయోధుడు. రూపమున బలిష్ఠమగు నేనుగును బోలియుండును. చామన చాయ శరీరము. సున్నతములగు భుజములు, విశాలమగు వక్షము, కొంచెము గుజ్జురూపము కలవాడై చూపులకు నలుబదియేండ్లవానివలె కనిపించును. ఆదిత్యవర్మ పొడుగరి. కాల్చిన బంగారువన్నె శరీరముకలవాడు. దృఢమైన సంధిబంధములుకలిగి యుబికిన కండరములతో మూర్తి సౌమ్యత వహించియుండును. వాని కనులలో తీక్ష్ణత దోబూచులాడుచుండును. అతడంత సుందరుడు కాకపోయినను కురూపి మాత్రముకాడు. అతని బుద్ధి మిక్కిలి నిశితమైనది. ఏసమయమున కేదియుచితమో యది సులువుగా గ్రహింపగలశక్తి వానిలోగలదు. రణోత్తుంగెడు అతిభయంకర సింహానాదము కావించెను. ఆధ్వని కచటి గుర్రములొక్క మొగిరెగిరి దూరకముగా బరుగిడిపోయినవి. ఆదిత్యవర్మ రణోత్తుంగునితో చేతులు కలిపెను. రణోత్తుంగుడు ఆదిత్యవర్మకంటె బలవంతుడనుటలో సందేహాము లేదు. కాని యతనిశరీరము బరువగుటచేత బాహుయుద్ధమున కంతగా ననువుపడియుండలేదు. ఆదిత్యవర్మ తూనీగవలె నెగురుచు రణోత్తుంగునకు పట్టుచిక్కనీయ లేదు అతడు పొడుగరి. రణోత్తుంగుని పిడికిలిపోటులచేత నొప్పించుచుండెను. వాని తాపులకుకండలుచితికినెత్తురు బైటికి వచ్చుచుండెను. రణోత్తుంగునకు రోషము పెరిగిపోయినది. సింహామువలె గర్జించుచు ఆదిత్యవర్మ నడుమును బట్టుకొని

పైకెత్తి విసరివైచెను. కాని యతడు పడియుబడక మునుపు లేచి రణోత్తుంగుని మీదికురికెను. వాని కంఠమును రెండుముంజేతులతో బిగించిపట్టుటచేత నూపిరాడకుండెను. రణోత్తుంగుడు ఉక్కిరిబిక్కిరయ్యెను. వాని నెత్తి కూలవేసెను.

పోరాటము మధ్యాహ్నమువరకు సాగినది. రణోత్తుంగుని యుద్ధోత్సాహము తగ్గినది. ఆయాసము హెచ్చినది. బలము క్షీణించినది. కాని వానికి పట్టుదల నశింపలేదు. ఆదిత్యవర్మ వానిస్థితిని బాగుగా గ్రహించెను. తన బలమంతయు నుపయోగించి పిడికిడితో రొమ్మున మోదనారంభించెను. ఒక్కొక్క మోదున కొక్కొక్క ప్రక్కయెముక విరిగి రణోత్తుంగుని నోటనుండి రక్తముధారలుగా వెడలినది. వానికి స్పృహ లేదు. ఆదిత్యవర్మ వాని యంగబంధములు విరిచి యొక ముద్దగావించెను. వంగసేనా శిబిరములనుండి జయజయ నాదములు రేగినది. కళింగ సేనాముఖములందుండి హాహాకారములు వెడలినది. రెండు ధ్వనులు మిన్నుముట్టి గాలిలో లీనములైనవి. ఆదిత్యవర్మ సేనలతో కళింగబలములమీద పడెను. వారు ప్రాణములకొరకు పెనుగులాడిరి. శిబిరములను విడిచిపారిపోయిరి. ఆదిత్యవర్మ విజయమును, విజయఖడ్గమును సాధించి కోటవైపునకు తరలెను.

ఆదిత్యవర్మ మహోత్సాహముతో నంతఃపురములోని కరిగెను. తల్లికొరకు నిటునటుచూచెను. ఆమె పూజాగృహము నందున్నదని పరిచారిక లెరిగించిరి. ఆదిత్యవర్మ యామెను దర్శించెను. ఆమె పాదములకు నమస్కరించెను.

'వచ్చితివా నాయనా!' అని యామె యావేదన మంతయు వెలిబుచ్చుచుండెను. ఆదిత్యవర్మ జరిగినదంతయు పూసగ్రుచ్చినట్లు చెప్పెను. విషాదమామె మనస్సున నలుముకొన్నది. జలజలకన్నీరు కార్చినది.

౨

ఎందుకమ్మా యీ కన్నీరు
కన్నీరు కాకేమున్నది నాయనా!
ఏ మట్లనెదవు
నే నభాగ్యురాలను
మహావీరుని గన్నతల్లి యభాగ్యురాలెట్లగును!
ఎందరు కుమారులున్న నేమిలాభము. పశుప్రకృతు లతో చాటియగునా
ఇప్పుడేమైనది

రాజమాత యింక మాటలాడలేకపోయెను. ఆమె పెదిమలు వణంకినవి. హృదయము విచారసముద్రములో మునుకలు వేసినది. ఆమె గుక్క తిప్పుకొనలేకపోయెను. కన్నీరు కాల్వలు కట్టినది. అది యామె భరించలేకపోయెను. ముఖము రెండుచేతులతో మూసుకొని యేడువనారంభించెను. ఆదిత్యవర్మకామె యేడుపర్థముకాలేదు. తెల్లపోయి యామెను నిలువున చూచెను. మనస్సులో నేదో యాలోచించెను. 'అమ్మా' యని పిలిచెను. ఆమె పలుకలేదు. ఆమెయెడ తానేదో యొక మహాపరాధము కావించియుండునని యూహించెను ఆ యపరాధమేమో వానికి స్ఫురింపలేదు. తన కార్యములన్నియు

నొకటివెంబ నొకటిగా పరిశీలించుకొనెను. తనపై దండెత్తి వచ్చిన విరోధినిచంపుట తప్పా? ఎట్లుతప్పగును. కాదేని రణోత్తుంగుని మరణమున కీమె యింత దుఃఖింపవలసిన పని యేమి? వానికి నీమె కేమి సంబంధము కలదు. మాకిట్టి చుట్టరికము కలదని యామె యెన్నడు చెప్పియుండలేదే? అది కాదేమో! పసుపుకుంకుమ పేరెత్తినది. నాతల్లి పసుపుకుంకుమున కేమికీడు వాటిల్లినది. నేనప్పుడప్పుడు నాతండ్రినిగురించి ప్రశ్నించితిని. ఆమాట తెచ్చినప్పుడెల్లా నామెకన్నీరునింపుచుండెను. ఆమె మనస్సునకు విచారమేల కలిగింపవలయునని యూరుకొంటిని. ఆ నాతండ్రి కేమైన యాపదకలిగినదేమో? నాతండ్రియెవరు? వానికేయాపద కలిగినది? అను నాలోచనలు ఆదిత్యవర్మ మనస్సునందు తరంగములవలె పొడమినవి అవి వానికంతకంతకు కల్లోలపెట్టినవి.

ఆదిత్యవర్మ నిజమునకు నుత్తమగుణము కలవాడు. తండ్రి నాతడెవడగు. తెలిసికొనవలయునని విశ్వప్రయత్నములు గావించెను తల్లిని పెక్కుసార్లు ప్రశ్నించెను. ఆమె కన్నీరు విడుచుటతప్ప వానికేసమాధానము చెప్పలేదు. మంత్రులనడిగెను. వారడిగినదితప్ప మిగిలినవన్నియు చెప్పుచుండెడివారు. పరిజనులను ప్రశ్నించెను వారు 'అయ్యా! మే మెరిగినప్పటి నుండియు మీరే మహారాజులు' అని వారు సమాధానము చెప్పిరి. ఆదిత్యవర్మ మరి యాసంగతినెవరినడిగిననులాభములేక పోయెను. కాని నిజము నిలకడమీద తెలియునని యూరకుండెను. కాని యెంత కాలమునకు సత్యము బైటపడలేదు. తల్లిని చూచినప్పుడెల్ల వానిగుండె చెరువగుచుండును. ఆమె ముఖ

మునందెవ్వరు సంతోషము గాచది కానరాదు. రాజమాత ప్రాతఃకాలమున లేచును. స్నానమాచరించును. పూజా గృహములోని కరుగును. మరల నామె యొకరికి కనబడదు. ఆమె యెవరితోడను విస్తారముగా మాట్లాడదు. ఒంటిపూట భోజనము. నేలమీద పరుండును. రాత్రులు ప్రొద్దుపోవు వరకు పురాణములు వేదాంత గ్రంథములు చదువుచుండును. అది యామెకోరిక కాబోలునని ఆదిత్యవర్మ వానికే యాటంకము రానీయడు. దసమునకొక్కసారి మాతను తల్లిని దర్శించును. ఆమెపాదములకు నమస్కరించి వచ్చును. తల్లి యనిన ఆదిత్యవర్మదృష్టిలో నొక దేవతయని తలంపు. మహా మంత్రులు ఆదిత్యవర్మను పెంచి పెద్దవానినిగావించిరి. తగిన యీడురాగానే రాజ్యము నొప్పగించిరి. ఆదిత్యవర్మ బాల్య మంతయు ప్రధానమంత్రియింటనే గడచినది. చాలకాలము మంత్రి దధిపతులే తల్లిదండ్రులనియతడు భావించెను. అట్లేవారిని పిలుచుచువచ్చెను. రాజ్యాభిషేకమైననాటినుండియు ఆదిత్య వర్మ తనతల్లిని తెలుసుకొనెను. ఆమెయనిన వానికి పంచ ప్రాణములు లేచివచ్చును. ఆమె కన్నీటిధారలు ఆదిత్యవర్మకు మనోవ్యాకులమును కలిగించినవి.

అతడు తల్లిపాదములపై బడి 'అమ్మా! తెలియక నేనే దైన తప్పుచేసిన క్షమింపుము' అని కన్నీరు విడుచుచు వేడు కొనెను.

ఆమె కొంతదుఃఖము దిగమ్రింగి నీవేమి తప్పుచేయ లేదు నాయనా! అని సమాధానము చెప్పెను.

అట్లైన నీ కన్నీ రెందులకు

నాకర్థము నాయనా

ఈమాటలు నాకర్థముకాలేదమ్మా. అకర్మమెట్టిదో నాకు చెప్పకూడదా? ఆదిత్యవర్మ మొండిపట్టు పట్టెను.

రాజమాత యిట్లు చెప్పినది. నాయనా! వినుము. ముప్పదియేండ్లైనది. నాతండ్రి సింహేంద్రవర్మ యీ రాజ్యమును పరిపాలించెను. ఆయనధర్మస్వరూపుడు. సత్యసంధుడు. ఎంతశాంతపరుడో యుద్ధమునందంత భయంకరుడు. వంగ దేశమునకు కళింగరాజ్యమునకు చాలకాలము నుండియు సరిహద్దు పోరాటములుగలవు. కళింగరాజు రణోత్తుంగుని తాత తండ్రులు కయ్యమునకు కాలుదూగి సరిహద్దు పల్లెలను కొల్లగొట్టి వానిని తమరాజ్యములో చేర్చుకొనిరి. వారి యాగడములను నివారింప బోయిన నాతాత యుద్ధమునందు మరణించెను. నాతండ్రి యీవార్తవిని మహోగ్రుడై మండి పడెను. వంగసేనలను సమకూర్చుకొని కళింగరాజు మీదికి యుద్ధమునకుపోయెను. పదిదినములు భయంకరముగా యుద్ధము సాగినది. ఆ యుద్ధమునందు కళింగరాజు మరణించెను. వంగసేనలు విజృంభించి రాజధానిపైబడిరి. నగరమంతయు కొల్లకొట్ట నారంభించిరి. ఆరేయి నాతండ్రి గుడారమునందు నిద్రించుచుండెను. సైనికులందరు యుద్ధపుబడలికచేత గుఱ్ఱు పెట్టి నిద్రించుచుండిరి. రాత్రి రెండుజాములైనది. చిటపాట మని చినుకులు రాలుచుండెను. ఆసమయమున నాతండ్రి గుడారమునందు, కొంచెము అలికిడి వినవచ్చినది. కాపలావారు లేచి యిటునటుచూచిరి. వారికెవరు కానరాలేదు. వారు నిద్రమత్తునందుండుటచేత నెక్కడివారక్కడ మేనువాల్చిరి.

కొంతసేపయినది. మాతండ్రి మంచమునకు కుడివైపున నొకవ్యక్తి నిలుచుండెను. ఆవ్యక్తియొక స్త్రీ. త్రిలోకసుందరమగు రూపముకలది ఆమె హృదయము కోపముచేత నుడికిపోవుచుండెను. కనులనుండి నెత్తురు కక్కుచుండెను. ముఖమెఱ్ఱతామరవలె మెరయుచుండెను. ఊపిరిబిగపట్టుటచేత నుబికి శరీరమామెను రెండింతలుగా పెంచినది. ఆసుందరి యల్లనల్లన మంచముదాపునకువచ్చెను. తన కొంగులోనుండి కైజాతు నూడబెరికెను. దానిని నాతండ్రి వక్షమునకు గురిచేసి పైకెత్తెను. ఆసమయమున నామె చూపు నాతండ్రి ముఖమున ప్రసరించినది. అది ప్రశాంతమగు సుందరముఖము స్నిగ్ధయందును, చిఱునవ్వు వెన్నెల కాయుచుండెను. ఆమోము తామరలో మహాలక్ష్మి మురిపెములు కురియుచుండెను. ఆమె యాముఖమున కన్నార్పక పరికించినది. ఆమె మనస్సు నిలకడతప్పినది. అది క్రమక్రమముగా లేచి నాతండ్రిని హత్తుకొనినది. ఆసుందరి కోపమంతరించినది. ఎఱ్ఱని కనులు తెలతామరల తోరణములు కట్టినది. ఆమెలో మానసభావము లంకురించినవి, అవియామె నిటునటుచేసినవి. ఆ యలజడిలో చేతిలోని కైజాతు క్రిందజారినది. గణిల్లని ధ్వనియైనది. మాతండ్రికి మెలకువ వచ్చినది. పక్కమీద నుండిలేచి యామె చేతినిగట్టిగా పట్టుకొనెను. ఆమె గడగడలాడిపోయినది. ఒడలంతయు చెమటపట్టినది. కాని యామె చూపు వానిముఖమునందే నిలబడినది.

'ఎవరునీవు?' అని నాతండ్రి యామెను ప్రశ్నించెను. ఆమె యేమియు సమాధానముచెప్పలేదు. ఆమె చూపులు

వానిచూపులలో కలిసిపోయినవి. ఆమె పెదిమె కదిలించినది. కాని మాటవినరాలేదు. 'భయపడకుము. నీవెవరవో చెప్పుము. నిన్నువిడిచిపెట్టెదను' అని నాతండ్రి నుడివెను. ఆమాట లామె చెవివిచ్చివినెను. కాని సమాధానమురాలేదు. పోనిమ్ము నీజోరిని నీవుపోవచ్చును' అని యామె చేతిని విడచిపెట్టెను.

ఆయావనవతి కనులలో నీరుతిరిగినది. నాతండ్రి పాదములమీద వ్రాలినది. 'ప్రభూ! నన్నుక్షమింపుము. నేను ఘాతుకరాలను' అని వెక్కి వెక్కి యేడ్చినది. యువతీ! నీకు ప్రాణభయములేదు. నీవెవరవో చెప్పుము అని మహారాజు ప్రశ్నించెను.

ఆమెకొంతమనస్సును పదిలపరచుకొని యిట్లుపలికెను. 'మహారాజా! నేను కళింగరాజు కూతురను. త్రిపురాంతక దేవి యనుదానను. నాతండ్రిని నీవు యుద్ధమునందు చంపి తివి. నాతల్లి సహగమనము కావించుకొనినది. తల్లిదండ్రుల మరణమునకు నేను పట్టరాని దుఃఖము ననుభవించితిని. నిన్ను చంపవలయునని వచ్చితిని. లోనప్రవేశించితిని. నీవక్షమునకు నాచురకత్తిని గురిచేసితిని. నాచూపు నీముఖమున ప్రసరించి నది. ఏకారణమో నాకు తెలియదు 'మూర్ఖురాలా! మనుని శివుడికంటి మంటలచేత భస్మముగావించెను. ఆకొరత తీర్చు టకుబ్రహ్మ మరల వీనినిపుట్టించెను. నీవు వీనినిప్పుడూరు పేరు లేకుండచేసెదవా? అని నాయంతరాత్మ ప్రబోధించినది. నాచేతి కైజారు నేలజారినది. ఆధ్వనికి మీరులేచితిరి.

మహారాజా యువతితో 'రాజకుమారీ! ఒకవిధముగా నీవు నాకు ప్రాణదాన మొనరించితివి. నీకు నే యుపకారము

చేయగలుగుదును. రత్నాభరణాము లిత్తుసంటినా అవి నీ యింట కొల్లకొలందికలవు. నాజీవితాంతము నీకు చేసు కృత జ్ఞుడనైయుందును. నీ యంతఃపురమునకు నీవు తిరిగిపొమ్ము' అనెను. తనపరివారములోనివారను రావించి 'మీరీ రాజ కుమారిని కోటలో విడిచిరండు' అని యాజ్ఞయిచ్చెను. త్రిపు రాంతకదేవి నిలుచుండిన చోటునుండి కదలలేదు. నాతండ్రి యూమెతో 'మీరిచ్చట నిలువతగదు. లోకము కాకులవంటి వారు. మీరు మహారాజపుత్రికలు సగౌరవముగా నాసైని కులు మిమ్ము మీకోటలో విడిచెదరు. మీ యుపకారమునకు మీరాజ్యము మీ కొప్పజెప్పితిని. అదియే నే చేయగలిగి నది. మీ సోదరునితో సుఖముగా నుండుడు' అనెను.

అంత రాజకుమారి ఆర్యా! మీరు నాచేతిని పట్టు కొంటిరి. అప్పుడే నా హృదయము నాకు తెలియకుండ మీ వశమైనది.

అది ప్రాణరక్షణకేగాని, ప్రేమ రక్షణకుకాదు.

గ్రహించిన దానిని విడుచుట రాజధర్మమా? ప్రభూ! రక్షణ శిక్షణములు రాజధర్మములు. మిమ్ము రక్షింపుమని వేడుచుంటిని నన్ను పరిగ్రహింపుడు.

అది నాచేతకాదు.

పోనిండు నన్ను దాసిగా పరిగ్రహింపుడు

సాటి రాజకుమార్తె నగౌరవింపమందువా?

స్వయముగా ఒప్పుకొంటినిగదా

నీ మనస్సు సమ్మతించినను నా మనస్సందులకంగీక రింపదు.

అట్లైన నాకు మరణ మొక్కటియే మిగిలినది.

అతిసాహసము కూడదు రాజకుమారీ ! మరణించి సాధించున దేమున్నది.

నేను సాధించుటకు ప్రార్థించుటలేదు. ప్రేమభిక్షము పెట్టింపుడని మనసార వేడుకొంటిని. త్రిపురాంతక దేవి కనుల వెంట నీరుకార్చినది. కాని నాతండ్రి మనస్సు కరుగలేదు. ఆయన చిత్తమునందు నా జనని యనంగలేఖ రూపము దృఢముగా నాటుకొనినది. ఆయన యేకపత్నీవ్రతుడు. పరస్త్రీలను మాతృసమానముగా పరిగణించును. నాతండ్రి త్రిపురాంతక దేవిని నిరాకరించినాడు. ఆమె ప్రయత్నము వ్యర్థమైనది. వెనుకకు తిరిగినది. 'మహారాజా!'యని యొకకేక పెట్టున నేలపైచు క్రిందపడిపోయినది. ఆమె రొమ్మునుండి రక్తము వరదలై పారినది. నాతండ్రి నిర్ఘాంతపోయి యామెవంక చూచెను. ఆమె తనకత్తితో పొడుచుకొని ప్రాణత్యాగము చేసినదని గుర్తించెను. ఆయన కన్నులనుండి నీరుకారినది. ఆయన హృదయము శోకమున మునిగినది.

'మహారాజపుత్రీ! నీవింత ఘోరకార్యము చేతువని తలంపలేదు. నీప్రేమ యంతులేనిది. మనోనిశ్చయము దృఢమైనది. నేను గ్రహింపలేక పోయితిని. గ్రహించినను నా మనస్సునందీ జన్మకు నీకు తావులేదు. నా నియమము నిన్ను బలికొన్నది నేనో మహాపాపుడను' అని యామె నొడియుం దుంచుకొని వలవలయేడ్చెను.

మహారాజా! నాకై విలపింపకుడు. నేనీ జన్మయందింత మాత్రమే నోచుకుంటిని నాకదియే చాలును. మీచేతి స్పర్శ

నా మనోవేదనను కొంతశాంతింపజేసినది. మరల జన్మమున్నదైనా మీకు భార్యనయి సేవచేయు నదృష్టము దైవము ప్రసాదించునుగాక, యనుచు త్రిపురాంతకదేవి ప్రాణములు విడిచినది.

నాతండ్రి కంతులేని యావేదనము కలిగినది. మహాపాపమని తోచినది. ఘోరాన చావునకు కామిగోరెను. త్రిపురాంతకదేవి శవమును సగౌరవముగా కోటగోడకి పంపించెను. తాను సేనలతో పురమునకు మరలెను. నే నప్పటికి పదేండ్లబాలికను ఈ కథ నాతండ్రి నా తల్లితో చెప్పుచుండగా వినియుంటిని.

## 3

కళింగచక్రవర్తి కుమారుడే రణోత్తుంగుడు. ఆయన త్రిపురాంతకదేవికి సహోదరుడు. రణోత్తుంగునితో పాటామె రణవిద్యలన్నియు నేర్చుకొనెను. కావున వారిద్దరుశరీరములు రెండైనను ప్రాణములొక్కటిగా మెలగుచుండిరి. వారొకరినొకరెడబాసి యుండరు. ఆడినను పాడినను నొక్కచోటనే భుజింతురు. త్రిపురాంతకదేవి చెలికత్తెలతోకంటె రణోత్తుంగునితోడనే కాలమెక్కువగడుపుచుండును. నాతండ్రి పంపిన పరివారము త్రిపురాంతకదేవి శవమును రణోత్తుంగునకప్పగించిరి. జరిగినదంతయు నివేదించిరి. ఆయనకు దుఃఖముతోపాటు కోపము పొరలుకొనివచ్చినది. నాతండ్రి త్రిపురాంతకదేవిని చేతులారచంపి యీకథ పన్నియుండునని యూహించెను. వచ్చినవారినందరిని బంధింపుడని యాజ్ఞాపిం

చెను. కాని వారాతనికిగాని పరివారమునకుగాని లొంగలేదు.
కత్తులనుదూసి వారిపై బడిరి. చిందరవందరగావించి బైటపడిరి.

రణోత్తుంగునకు తల్లిదండ్రుల మరణముకంటె త్రిపురాంతక దేవి మరణము మనస్సునకు రంపపుకోతయైనది. నా తండ్రిపై పగతీర్చుకొనవలయునని నిశ్చయించుకొనెను. నా తండ్రి వీరశిరోమణి. రణరంగమున వానికి నూరుచేతులు వచ్చును. ఆయనయెదుట సామాన్యులు నిలువలేరు. ఆయనకు మనోబలము మెండు. దానికితోడు సేనాబలమంతులేనిది. వానివిూదయుద్ధమునకువచ్చి జయముసాధించుటయసాధ్యము. అవిస్మయముగా రణోత్తుంగుడు కన్నులతో జూచెను. ఆయన మహా వీరసింహము. వానిగర్జనలకు దిక్కులు వణకిపోయినవి. శత్రువులకు తలలు గుదులుగుదులుగా రాలినవి ఆ శూరుని జయించుటకు మానవబలము చాలదు. దైవబలముండ వలయును. రణోత్తుంగుడు బాగుగానాలోచించెను. తనమంత్రులను రావించెను. వానిపై సకల రాజ్యభారము మోపెను. తాను సిద్ధేశ్వరమునకేగెను. అచట పదిసంవత్సరములు ఘోరముగా తపమాచరించెను. వానికి మహాకాళుడు ప్రత్యక్షమయ్యెను. రణోత్తుంగుడు దేవదేవుని వేనోళ్ల నుతించెను. మహాకాళుడు సంతోషించి రాజా! యిది వజ్రసారమను ఖడ్గము, దీనిని గైకొనుము. నీకు విజయము ప్రసాదింపగలదు. కాని నీవు గర్వము మనస్సులోనుంచుకొని యావేశమున తపముచేసితివి. దానికి ఫలితముగా నీ యాత్మీయుని చేతనే యుద్ధమున నీవు మరణింతువు. అని పలికి ఖడ్గమునిచ్చి యంతర్థానము నొందెను.

రణోత్తుంగుడు పట్టరానియుక్కున్న మనస్సులోపెట్టు
కొని యింటికివచ్చెను. సేనలనుసమకూర్చుకొని దక్షిణదేశము
లనెల్లజయించెను చోళ పాండ్య కేరళ ద్రవిడాంధ్ర మహా
రాష్ట్ర భూపతులు వానికి లోబడిరి. విజయలక్ష్మి వానిని
తొలిచూపునందే వచ్చియింటిపెట్టుకొనినది మహానందముతో
నింటికి తిరిగివచ్చెను. మగధభూపతి శ్రీధరుడు వానిపరాక్ర
మమునువిని తనసోదరియగు పద్మస్థను రణోత్తుంగునకిచ్చి
వివాహముచేసెను. మగధ కళింగసేనలేకమైనవి. రణోత్తుంగ
చక్రవర్తి యాటోపమును నా తండ్రి వినెను. ఎప్పటికైన
వానితో యుద్ధముతప్పదని నిశ్చయించుకొనెను. తనబలము
నపరిమితముగావించెను. ఏనాటికానాడు యుద్ధమునకెదురు
చూచుచుండెను.

రెండేండ్లు గడచినవి. రణోత్తుంగునిచూపు వంగ
రాజ్యముమీదికి మరలినది. వంగీలతో యుద్ధమునందుతనకు
సాయముచేయుమని శ్రీధర సార్వభౌమునకు వర్తమానము
పంపెను. శ్రీధరునితండ్రి విశ్వావసు మాతల్లికి సహోదరుడు.
నాతండ్రికి బావమరంది. విశ్వావసు మహారాజు వానప్రస్థా
శ్రమమునందుండి తపము చేసికొనెను. శ్రీధరుడు విశ్వావసునకు
పెంపుడుకుమారుడు. తండ్రికి శ్రీధరుడీవార్త నందజేసెను.
విశ్వావసుమహారాజు తొల్లింటిబంధుత్వమును తలంచియు
దాసీనతవూనియుండుట యుక్తమని కుమారునకు కబురు
చేసెను. మాతండ్రియు శ్రీధరునకు వర్తమానమంపెను. శ్రీధ
రుడీరువురకు నొకటేసమాధానము చెప్పెను; రణోత్తుంగుడు
వంగరాజ్యముమీదికి తనసేనలను తరలించుకొని వచ్చెను.

మనకోట ముట్టడించెను రెండుమాసములు ముట్టడిసాగినది. రేయింబగళ్లెడ తెరిపిలేక యుద్ధము ప్రవర్తిల్లినది. ఎవరికి జయము లభించలేదు; లక్షలకొలంది మహావీరులు రెండుపక్షములందు యుద్ధాగ్నిలో తమప్రాణములుహోమముగావించుకొనెను. ఐనను పట్టువిడువక పోరాటముసాగినది; రణోత్తుంగుడు రాత్రులందు రహస్యముగా కందకమును పూడ్పించి దారికల్పించెను ఒకనాడు తెల్లవారునప్పటికి సేనలన్నియు పురముచుట్టు చేరినవి. తూర్పుద్వారములను భేదించి లోనికి ప్రవేశింపయత్నించిరి. మనసైన్యములు ప్రాణములనుదాచుకొనక విరోధులనెదిరించినవి; మహాసముద్రమువలె కళింగసేనలు కోటలోన ప్రవేశించెను; మనసేన లంగడగునక వైరిప్రాణములను బలికొనినవి. నాతండ్రి ప్రాణములకు తెగించి రణరంగమున ఉరికెను. మహోగ్రుడై మండిపడుచు నాకల్లిగొన్న బెబ్బులివలె నెదురుపడినవారినెల్ల నేలమట్టము కావించెను. ఆసమయమున నెత్తురు నదులై పొంగి పారినవి. వీరుల కళేబరములు నావలై ప్రయాణించినవి. అంతలో రణోత్తుంగు డంగరక్షకులతో నాతండ్రి మీదికురికెను. ఆయన చిత్ర విచిత్రగతులను దన గుఱ్ఱమును నడిపించుచు నంగరక్షకులను యమలోకమునకు పంపెను; రణోత్తుంగుతో కత్తియుద్ధమునం దెదురు నిలిచెను; అప్పటి కాయన శరీరమునందు పెక్కు గాయములు తగిలినవి. రక్తము కాలువలుకట్టి శరీరమునుండి ప్రవహించుచుండెను. బలముతగ్గిపోయినది; సమయమును గుర్తించి కళింగసేన లొక్కసారి వానిని చుట్టుముట్టినవి; మహారాజును బంధించినవి. స్వేచ్ఛగా రాజసౌధము ప్రవేశించి నన్ను నాతల్లిని

చుట్టుముట్టి గొనిపోయి శివరాజు చెఱబెట్టెను; గణోత్తుం గుడు మఱియు శివరాజధానియగు సింహకటకమునకు గొని పోయెను; అచట కారాగృహమునందుంచెను;

కారా గృహమునందు నాతండ్రిని పెట్టరానిపాట్లన్నియు పెట్టెను; అనరానిమాటలన్నియు ననెను; కొరడాలతో కొట్టించెను: ఆయన ధర్మస్వరూపుడు; ఆహింసలన్నియు సహించెను;

'ఓరీదుర్మార్గుడా! మదమున నొడలెరుంగక నాప్రాణ పదమగు సోదరిని మానభంగము గావించితివి: ఆమె ప్రాణ ములను హరించితివి; దానికి తగినదండన యనుభవింపుము నీకూతును నీకన్నులయెదుటనే యవమాన మొనరింతును; చూడుము' అని లేడిమీదికురుకు పెద్దపులివలెనాపైకివచ్చెను నాతల్లిదండ్రులయెదుట నన్నవమానపరుప ప్రయత్నించెను; వారా పరాభవము సహింపలేకపోయిరి; నేనాడుదానను; బంధీకృతను; నిరాధారను; నన్నుముట్టవలదని పలువిధముల ప్రార్థించితిని. పాదములపైబడి మ్రొక్కితిని. కాని నామా టలు వానిచెవికెక్కలేదు దుడుకుతనమున నన్నుపట్టి బలా త్కరించెను. నాగుండెలు చెదిరిపోయినవి నాప్రాణములెగిరి పోయినవి. నొక శవాకారమునైతిని. నేనుతేచి చూచునప్ప టికి నాతల్లి దండ్రులచ్చటలేరు. వారు మరణించిరనియు, వారిశరీరములు కోటవాకిట పారవేయబడిన వనియు వింటిని ఆరేయియంతయు నాకు నొడలు తెలియని యావేదనము కలిగి నది. నాదిక్కులేనితనమునకు లోలోన కుళ్ళి కుమిలిపోతిని. ఒకవైపున తల్లి దండ్రుల మరణము నింకొకవైపున మాన

భంగము, సహనశక్తి పోగొట్టుకొనివని. ఈనరకబాధ ననుభ వించుటకంటె మరణమే శ్రేయమని తలంచితిని. కారాగృహ మంతయు గాలించితిని. ఉరిపోసికొనుట కొక్క త్రాడైనను లభించినది కాదు. యమదూతలవంటి రాజకింకరులు నన్నను క్షణమదలించి బెదరించి పరిహాసము లొనరించిరి. నాజీవిత మొక మహానరకమైనది

రాజమాత మరిమాటలాడలేక పోయినది. ఆయాసము మితిమీరినది. నిశ్వాసమైన నెగసిపోయినది. ఆ పరితా పము భరింపలేకపోయినది. ఒక్కపెట్టున రోదనము గావించి నది. జరిగినదన్నియు నామె యిప్పుడనుభవించుచున్నట్టుల తోచినది. అది మరణవేదనముకంటె మరింత వ్యాకుల పెట్టి నది. ఆదిత్యవర్మ తల్లి దుఃఖమును చూడలేకపోయెను. ఎడ తెగని కన్నీటిధారలు వాని నయనములనుండి వర్షించినవి. రాజమాత కొంచెముసేపాగి మరల యిట్లు చెప్పినది.

కుమారా! ఆదిత్యా! నేను కష్టములకై పుట్టితిని. కష్టములకై పెరిగితిని. కష్టములతోడనే నాజీవిత మంతరింప వలసియున్నది. మరునాడు రణోత్తుంగుడునన్ను చూడ వచ్చెను. ప్రాణముండియు లేనిదాననై కన్నీటిప్రవాహములలో మునిగి తేలుచున్న నన్నుచూచెను. నన్ను పరిహాసించి పలువిధముల నిందించెను. మాటలతో హింసించెను. 'నీ జీవి తాంతమువరకు నీతండ్రి యొనరించిన మహాపాపమునకీ కారా గృహ శిక్ష ననుభవింపు' మని వెడలిపోయెను. నాకు దుఃఖమురాలేదు. గుండె రాయి యైనది. అది కరిగి ద్రవిం చుట మానివేసినది. నా కన్నీరంతరించినది. నా కన్యాత్వము

నశించినది. ఈ జీవిత మీ జన్మకింతేనని తోచినది. నాకిష్టమున్నను లేకున్నను సంతోషింపక చేసెడిదానను. ఇది దైవము నిర్ణయించినది. దీనికి వేరుగా చేయజాలనను నిశ్చయమునకు వచ్చితిని. ఆయన నన్ను వివాహమాడిన నాడనుండి ననునాకతడు భర్తయైయని యూహించితిని. మనోవాక్కాయకర్మలచేత నాయనకు శుభమును తలంచితిని. ఆయనపెట్టు బాధలన్నియు సహింపనెంచితిని.

దినములు గడచినవి. ఒకనాడు పద్మస్థ నన్ను చూడ వచ్చెను. ఆమెను చూడగానే నాకెక్కడలేని దుఃఖము పొర్లుకొనివచ్చినది. ఆమె తోటిస్త్రీ. రాజపుత్రిక. అందు కావలసిన బంధువురాలు మహారాణి. నాయగచాట్లకామె మనస్సు కరుగును నన్నామె రక్తబంధముచేతనాదరించు ననుకొంటిని. నాగోడంతయూ నామెతో మొరపెట్టుకొంటిని నాయనా! కష్టకాలములందు నాప్తులు సహితము విరోధులగుదురు. ఆమె నాయందు దయకలదానివలె నటించినది. ఆమెవంచన నాకు తెలియలేదు.

‘చెల్లీ! మహారాజుతో చెప్పి నే చేయగలిగినదంతయు చేయుదును. నీవు ధైర్యముకలిగియుండుము’ అని నాతో చెప్పి వెడలిపోయినది.

మరునాడు ‘మహారాజు నిన్ను తీసికొని రమ్మని’ రని యొకదాసి వార్త తెచ్చెను. నా ప్రాణములు కొంచెము లేచి వచ్చినవి. ఆశాంకురములు మొలకలెత్తినవి. పద్మస్థ నాకుపకారం మొనరించినది. ఆమెను నావగాచేసికొని యీకష్టసముద్రము దాటవచ్చును. నిజమునిలకడమీద బైటపడగలదు.

పరమేశ్వరుడు సాయమొనరించు' నని యాలోచించుచు మహారాజును దర్శింపనరిగితిని.

ఆయన నన్ను కడకంట జూచుచు ఓసీ! బానిసకూతురా నేటినుండియు నీకీశయ్యాగృహమే కారాగారము. దీనినుండి నీవు బైటికి పోకూడదు. నీచర్యలనన్నియు నిచ్చటివారు కని పెట్టుచుందురని హెచ్చరించి కొలువుకూటమునకరిగెను. అదియే మహాప్రసాదము. మండుటెండలో నెడారియందు పయనించు బాటసారిని. నాకుకొంచెము చలువనీడ లభించినది. దైవమొకదారిచూపించెనని మహారాజు మాటకనుగుణముగ నడుచుకొంటిని. పద్మష్ఠ ప్రతిదినము నన్ను చూచి పోవుచుండెను. నేనామెకు కృతజ్ఞురాలనై యుంటిని. ఆమెయే నా తల్లియు దండ్రియునని భావించితిని. ఇట్లారు నెలలు గడచినవి. నేనుగర్భవతినని పద్మష్ఠ గ్రహించినది.

'చెల్లీ! నీవదృష్టవంతురాలవు' అని వేనోళ్ళ పొగడినది. ఆరేయి మహారాజు నన్నుజూడవచ్చెను. నేనాయనకెదురు పోయి తీసికొనివచ్చితిని. అచ్చటి పరిచారికలందరెవరిదారిని వారరిగిరి. ఆగదియందు వేరేయాసనములేదు. పక్కపైననే మహారాజు కూర్చుండెను. ఆయనకేదో గుచ్చుకొని నటుల తోచినది. పక్కను తడిమిచూచెను. మహాకాలసర్పమువలె కైజారు కనిపించినది. అంతటితో నాగుండెలవిసి పోయినవి. నేనుకెవ్వున నరచినేలపైబడితిని.

మహారాజు కాలరుద్రునివలె మండిపడుచు 'ఓసీ! ఘాతకురాలా, నా ప్రాణములకే ఎసరుపెట్టితివిగా అవును

బుద్ధితో పుట్టిన గుణముతెక్కడికిపోవును.' అని గోంకించును లంపతానాని పిలిచెను

'నేను నిరపరాధిని, నే నేమియు నెరుగను' అనిమహా రాజు పాదములపైబడి వేడుకొంటిని. నన్నొక్కతాళ్లతో నవలకుపడద్రోసెను. లంపతా వాని చేత నన్ను కొరడాలతో కొట్టించెను. నాచర్మముచిట్లి రక్తముకారినది. గీతలు వాతలుగా నాశరీరమంతయు కమిలిపోయినది. అది యమదండనము. ఆబాధపడలేక పోయితిని పెద్దపెట్టున నేడ్చి గోడుపెట్టితిని. నాపై కనికరించు వారలు లేకపోయిరి. ఒక్కమారుగా నాకత్తితో నన్నుపొడిచి చంపుడని ప్రార్థించితిని. కాని యట్లు చేయలేదు. వారెంతకాలము నన్నట్లుకొట్టిరో నాకు తెలి యదు. నాకు స్మృతితప్పినది. నే నొకరాయినై నేలమీద పడి పోయితిని. ఎన్నిదినములా రీతినుంటినో యదియు తెలియదు.

ఒకనాడునాకు తెలివివచ్చినది. కన్నులు తెరిచిదాహము కొరకు సంజ్ఞచేసితిని సిద్ధామాత్యులు నాకు చల్లనిపానీయము నోటిలోపోసిరి. రాజవైద్యులు నాప్రక్కన కూర్చుండిరి. నాశరీరమందంతయు పసుపుపూతలు పూయబడెను. నేను లేవ యత్నించితిని వారువలదని వారించిరి. రెండుమాసములు గడ చినది. నాశరీరము కొంచెము స్వస్థత చిక్కినది. బలము మాత్రమురాలేదు. నన్ను రణోత్తుంగుడుచావకొట్టించెను. నా ముక్కున కొనప్రాణముండగనే కోటవాకిట పారవేయించెను. నాయోగక్షేమమరయుచు మారువేషమున తిరుగుచున్న సర్వ సేనాపతియగు వీరబలుడు రహస్యముగా నన్ను గొనివచ్చె నని యమాత్యులవారు తెలిపిరి. రణోత్తుంగునివలసి భయము

చేత హాసనమున్న పాతాళమందిరమున దాచియుంచిరి. నాగర్భ నాసమున నీవుజన్మించితివి. నీకొఱకై నేను జీవించితిని. రణో త్తుంగుడునీతండ్రి, భర్తపెంత కఠినుడైనను, దుర్మార్గుడైనను భార్యకాయన ననుగమించుట పతివ్రతలక్షణము కుమారా! పసుపు కుంకుమయే స్త్రీలకలంకారము. అదిలేకజీవించియు నిరర్థకము. ఇంక నీవేదనభరింపలేను. నాకు సహగమనమునకు ననుజ్ఞయిమ్ము' అని రాజమాత యడిగెను. అందుల కాదిత్య వర్మ అకంగీకరింపలేదు కాని రాజమాత పట్టుపట్టినది. ఎవరెన్నివిధముల బోధించినను నామె నిరాదరించినది. చితి పేర్చబడినది. అగ్నిదరికాల్పబడినది. రాజమాత యగ్నికి ప్రదక్షిణము కావించినది. 'పరమేశ్వరా కష్టభూయిష్టమైన యీ యాత్మకు శాంతిప్రసాదింపుమని ప్రార్థించినది. ఆమె యగ్నియందు దూకినది. ఆమె శరీరము సోకగానె యగ్ని చల్లారినది చితి పూలపానుపైనది. ఆకాశమునుండి గొప్ప ధ్వని వినిపించినది. అందరు నావైపునకుచూచిరి.

'కుమారీ! నీవు పూర్వజన్మయందు నలంబుషయను నప్సరసవు. పద్మస్థ విద్యుత్వ్రతియను విద్యాధరి. మీ రిరువురు భర్తలకొరకు గౌరీశంకరశిఖరమున పార్వతినిపూజింపవచ్చితిరి. ఆసమయమున విజయుడను ప్రమధుడచ్చటికివచ్చెను. మీరి ద్దరు నానినాకారరేఖలకు భ్రమసి వానిపై పూలను నెరపితిరి వాడును మిమ్ముచూచుచు తాను వచ్చిన కార్య మును మరచెను. 'నాసన్నిధి మాన క్రమమునుతప్పి వర్తించితిరి. మీరు భూలోకమునపుట్టుడు. విజయుడునుముందు విద్యుత్వ్రతిని చూచెను. ఆమెవానికి భార్యయగును. అలంబుష మోహా

దేశమున పూజా ద్రవ్యములను పారవేసినది. ఆమె విద్యుద్వర్తికి సవతియై పడరానిపాట్లుపడవలసి వచ్చినది. విజయుడు రణోత్తుంగుడై జన్మించెను. నివారింపలేక కొంతపడియున్నాను. నేను నిత్యం శ్రీ సింహాసనస్థను గౌరీమాతకు తెలుపుచుంటిని. నీకు కొలదికాలములో శాపమోచనము కలుగును' అను మాటలు వినిపించెను. రాజమాత తన ప్రయత్నములనుమానెను.

౪

ఒకనా డాదిత్యవర్మ కోహలునితో చాలదూరము ప్రయాణముచేసి తిరిగి రాజధానికి వచ్చుచుండెను. వారూరి వెలుపలనున్న స్మశానవాటికకు వచ్చునప్పటికి రాత్రియైనది.

కోహలుడు 'మహారాజా! స్మశానములందు రాక్షసులు, భూతములు సంచరించుచుందురు. రాజపురుషులను వారూరకుండరు. వారు బహు మాయావులు. ఏదోవిధముగా నపకారము చేయుటకు ప్రయత్నించుచుందురు. త్వరగా నీ స్మశానమును దాటిపోవుట మంచిది. పగ్గములను సడలించి గుర్రము నదలింపుడు. మీరు వెనుకకు చూడవలదు. నేను మిమ్ములను సంరక్షించుచు వెనువెంటనె వచ్చుచుందును' అని యనెను.

ఆదిత్యవర్మ 'కోహలా! భూతములు గలవను నమ్మకము నీకు కలదా?' యని యడిగెను.

కోహలుడు 'ప్రభూ! మీకీ యనుమానమేల కలిగినదో నాకు తెలియదు. పరమేశ్వరునియందు దృఢమగు భక్తిగల జీవి మరణమునుపొంది వెంటనే పైలోకముల కరుగును. అందరి కాయదృష్టము లభించదు. చాలమంది మరణకాలమున

మహావేగన యనుభవించుచుందురు. వారు పుత్రమిత్ర కళత్రములమీద ప్రేమ త్రెంచుకొనజాలరు. కావున వారిని కోరికలు పీడించుచుండును. వారు మరణించి ప్రేతరూపమున గాలిలో సంచరించుచుండును. భూలోకమును విడిచిపెట్టి పోరు. వారి కోరికలుతీరువరకు నక్కడక్కడ పలురూపములతో నుందురు. బహుబాధ లనుభవింతురు. మానవులనుబట్టి బాధింతురు. అని సమాధానము చెప్పెను. వారిట్లు మాట్లాడుకొనుచు కొంత దూరమువచ్చిరి. ఆ సమయమున వెనుకనుండి పెద్ద యేడ్పు వినిపించెను.

మహారాజా రోదనమును వినెను. 'కోహలా! ఆ యేడు పేమిటి?' అని ప్రశ్నించెను.

ప్రభూ! నేను ముందే చెప్పితిని, మనముత్వరగా ఇల్లు చేరుటమంచిది. యని యుత్తరమిచ్చెను. వారు కొంతదూర మట్లే సాగిపోయిరి.

'అయ్యో! దాహము దాహము' అనుమాటలు వినిపించెను. కోహలుడు ఆదిత్యవర్మ నాగనీయలేదు. రాజా మీరు వెనుకకు చూడవలదు. అని హెచ్చరించుచు గుర్రమును నడలించెను. రాజు నట్లేచేసెను. వారు ముందునకు మహా వేగమున పోవుచుండిరి.

'అయ్యో! నే నీ దాహబాధ భరింపలేకుంటిని. నాకు గుక్కెడు మంచినీరుపోసి పుణ్యము కట్టుకొను వారు లేరా!' అని బిగ్గరగా నేడ్పు వినిపించినది. ఆదిత్యవర్మ తన గుర్రమునాపెను. కోహలునకిష్టము లేకున్నను రాజు క్షేమమునుగోరి యాగెను.

'కోహాలా! ఎవరో దాహముచేత బాధపడుచున్నటు లున్నారు. ఆపత్తునందున్నవారిని సంరక్షించుట రాజులవిధి. వారెవరైన కానిమ్ము దాహముతీర్చి వచ్చునంతలో పోవున దేమున్నది. ఇంక కొంచెమాలస్యముగా కోటచేరుదును. అనెను.

ఆదిత్యవర్మ పట్టుదలకలవాడు. ఆరునూరైనను తనకు తోచినపనిని నెరవేర్చకమానడు. దానివలన చెడురానిమ్ము, వానికా పరిశీలనలేదు. దానికి ముఖ్యకారణ మతడు మహా ధైర్యశాలి, సాహసవంతుడు. మొక్కవోని బలపరాక్ర మము కలవాడు. దానికితోడు రణోత్తుంగుని వజ్రసారము వానిని మరింత సాహసవంతుని చేసింది. కాని యధర్మ మునకు అన్యాయమునకు మనసునచోటీయడు కోహాలునకు నాదిత్యవర్మ గుణములు పూర్తిగా తెలియును. అతడు కొలువులోచేరిన నాటినుండియు మహారాజు మనోభావములు గమనించుచుండెను. కోహాలునకు నాదిత్యవర్మయందు భక్తి విశ్వాసములు కుదిరినవి. ఆదిత్యవర్మకు కోహాలునియందు నమ్మకము చేకూరినది. కొలది దినములలో కోహాలుని ప్రధా నాంగరక్షకునిగా నియమించెను. నాటినుండియు నాదిత్య వర్మను సంరక్షించు భారమంతయు కోహాలునిమీద పడినది.

'ప్రభూ! ఈమాత్రమగు పనికి మీరు పూనుకొనవల యునా! నేనే పోయి తెలిసికొనివచ్చెదను. మీ రిచటనే యుండుడు' అని కోహాలుడు బయలుదేరాడు. అతడా రోధ నమునుబట్టి దక్షిణదిశగా కొంతదూరము పోయెను. అచట నొక వికారాకారమంగళ యువతిని చూచెను. ఆమె యొడ

లంతయు గాయములతో నిండియుండెను. వాని నుండి రక్తము ధారాపాతముగా కారుచుండెను. నల్లని ముఖములోనుండి నిప్పు తునకలవలె కన్నులు మెరయుచుండెను. విరబోసు కొనిన తలవెంట్రుకలు గాలిలో తూగాడుచుండెను. నల్లని నీలి చీరె కట్టుకొనెను. ఆమె కోహలునిగాంచి వికృతముగా ఏడ్చుచును 'దాహము దాహము' అని రెండు చేతులు చేర్చి నోటిదగ్గర పెట్టుకొని సంజ్ఞలుచేసెను. కోహలునకు జాలి పొడమినది. అనుమాన మొకవంక వానిని పీడించుచుండెను. అమ్మా! నీ వెవరవు? అని ప్రశ్నించెను.

ఆమె సమాధానము చెప్పలేకుండెను. దాహము దాహ మనుమాటతప్ప నామె నోట యింకొక మాటరాలేదు. కోహలు డాసమీపమందున్న నూతిలోనికిదిగి కుండతో నీరు ముంచి తెచ్చెను. ఆమె చేతికందించెను. కాని యామె త్రాగ లేదు. దాహము దాహమని మరింత పెద్దపెట్టున నరవనారం భించెను. కోహలున కేమియు తోచలేదు. ఆమె నాపాద మస్తకము పరిశీలించెను. వానికేదో యనుమానము తోచెను. ఒరనుండి కత్తినిదూసి 'ఓసీ! నీ వెవరవో చెప్పుము లేదా నీ ప్రాణములు తీయుదును' అని యదరించెను. ఆమాటలు నామె బెదరి లేచి పారిపోవయత్నించెను. కాని కోహలు డామెను పోనీయలేదు. చేతినిగట్టిగా పట్టుకొని ముందునకొకసారి లాగెను.

దానితో నామె నేలపైబడి యిట్లనెను. 'అయ్యో! నన్ను బాధింపకుడు. నేనుచేసిన మహాపాపమునకు ఫలితముగా నీరాక్షసరూపము నాకు కలిగినది. దీనికే నేను కుమిలిపోవు

చుంటిని. ఇంకను నన్ను పరీక్షింపబోకుము. నీవు నాయందు దయయుంచి దేని పతివ్రతయు పుత్రవతియునగు కన్యక చేతకొంచెము కుంకుమపట్టి నీవు నా నోటిలో పోయించుము. మీకు పుణ్యముండును. నా శరీరావస్థ పోవును. నేను దేవలోకమునకు పోగలుగుదును' అనెను.

కోహలుడాలోచింప మొదలుపెట్టెను. పతివ్రతయు పుత్రవతియు నుండిన నుండవచ్చును. పుత్రవతి కన్య యెట్లగును. కోహలునకు చిక్కుతీరలేదు. ఆమె యన్నిదో మోసము చేయుటకీ పన్నాగము పన్నియుండవచ్చునని యూహించెను

ఆ రాక్షసి 'అయ్యా! నీ కెవరు లభించునారు లేరా ?' అని యడిగెను.

ఓసీ! రాక్షసీ! పుత్రవతి కన్య యెట్లగును. నన్ను మోసగించుట కిట్లనుచుంటివి. నిజము చెప్పుము. నీ వెవరవు? అని మరల గద్దించెను. ఆ రక్కసి యిట్లు చెప్పెను.

అయ్యా! వినుము నేను కళింగరాజగు రణోత్తుంగుని భార్యను. పద్మస్థయను దానను. నా భర్త వంగరాజ్యాధిపతి యగు నాదిత్యవర్మతో యుద్ధమొనరించెను. ఆదిత్యవర్మ నా భర్తను చంపెను. ఆయన చేసిన శపథము ప్రకారము కళింగ రాజ్యము స్వాధీనము చేసుకొననాయెను. రణోత్తుంగుని సర్వసేనాపతి విజయోత్తుంగుడు. అతడు రణోత్తుంగునకు పినతండ్రి కుమారుడు. మాకు సంతతి కలుగలేదు. విజయోత్తుంగునకు మహారాజు మరణించినంతనే దురాశజనించినది. నన్ను నిర్బంధించి రాజ్యమపహరింప వలయునని యెంచెను. ఒకనాటిరేయి హఠాత్తుగా నన్ను బంధింపవచ్చెను.

నేను వాని కండక పారిపోయితిని. వాడు నన్ను వెంబడించెను. చివరి కాతడు నన్ను చివరి యంతస్థునిూది చంద్రశాలవరకు తరిమెను. నేను తొందరలో తబ్బిబ్బయితిని. చీకటిలో కన్ను కానరాలేదు. చంద్రశాలనుండి క్రిందికి రాతి దిబ్బమీాద పడితిని. నా యొడలంతయు గాయములైనవి. నా తల పగిలినది. నేను వెంటనే మరణించితిని అయ్యో! నే చేసిన పాపమునకు ఫలితముగా నాకీ రాక్షసిరూపము కలిగినది. వంగ దేశమునుసింహేంద్రవర్మ పరిపాలించెను. ఆమెకు గోమతియను కూతురుగలదు. ఆమె గుణములందు గోమతియే. నాభర్త సింహేంద్రవర్మనోడించి యాయనపుత్రికను బలాత్కారముగా తెచ్చెను. ఆమెను బలాత్కరించుటచేత గర్భవతి అయ్యెను. నాటినుండియూ రణోత్తుంగుని త్రికరణశుద్ధిగా దైవము వలె చూచుకొనెను. ఆమెను నమ్మించి నేను ద్రోహము చేసితిని. ఆ కారణముచేతనే స్త్రీరూపము నొందితిని. నేను పూర్వజన్మయందు విద్యాధరకన్యను. శాపముచేత భూలోకమున పుట్టితిని. గోమతి యప్సరకన్య. "అప్సరలకు వివాహములేదు. వారు సంతతిపొందినను వారి కన్యాత్వము నశించదు." ఆమె కన్యయు పుత్రవతియు పతివ్రతయు నగును. ఆమె తులసిజలమిచ్చినచో నాకీ రాక్షసిరూప మంత మొందును. నేను నాలోకమున కరుగుదును.

కోహలుడామాటలువిని, నీమాటలు నిజమైనచో నాకోరమ్మా. నే నామెకుమారుడగు నాదిత్యవర్మ కంగరక్షకుడను. మారాజునకు విన్నవించి నీకోరికతీర్తును' అనెను. అందులకారాక్షసి యంగీకరించెను. వారిరువురు నాదిత్యవర్మ

యున్నచోటునకు వచ్చిరి. కాని యచట నాదిత్యవర్మ లేడు. వానికై యా స్మశానమునందు వెదుకనారంభించెను. కొంత సేపటికి వానికొక దేవాలయము కనిపించెను. దానిబైట గుఱ్ఱమునిలబడి యుండెను. ఆదిత్యవర్మ యాలోపలకుపోయి యుండునని తలంచెను కోహలుడు తనగుఱ్ఱము నొకచెట్టు నకుకట్టి దేవాలయము లోనికరిగెను. గర్భాలయము లోనికి తొంగిచూచెను. ఎదుట మహాకాళి విగ్రహ మతిభయంకర రూపముతో కనిపించుచుండెను. ఆమెకంఠమునందు కపాల మాలికలుకలవు. నడుమునకు నెముకలు గ్రుచ్చి వేలాడవేయ బడెను. ఆవిగ్రహమునకు ముందు హోమకుండము వెలుగు చుండెను. దానిచుట్టు పుఱ్ఱెలు, నెముకలు, నెత్తురు, కల్లుకుండ లమర్చబడి యుండెను. ఆదిత్యవర్మ సాష్టాంగపడి యాకాళికి మొక్కుచుండెను. వానికెడమ ప్రక్కన నొకమనుజుడు కత్తి నెత్తి నిలుచుండెను. వానిమెడలో నెముకల పేరులుగలవు. వాడెఱ్ఱనిగోచిని పెట్టుకొనియుండెను. గడ్డమును మీసమును పెరిగి ముఖము కనబడనీయకుండెను.

కోహలుడాదృశ్యమును గాంచి భయపడెను. ఏదో మోసముజరిగినదని తలంచెను అంతలో నా కాపాలికుడు తనచేతిని రాజుమెడకు గురిచూచి విసరపోయెను కోహలుడు తటాలున కత్తిదూసి కాపాలికునితల కసుక్కుననరికెను. అది బంతివలె నెగిరి కాళిపాదములచెంత పడెను. మొండెమునేలపై కూలెను. ఆదిత్యవర్మ యాధ్వనికి కన్నులు తెరిచిచూచెను. కోహలుడాదిత్యవర్మను సమీపించి 'మహారాజా! యిదేమి?' అని యడిగెను.

ఆదిత్యవర్మ యిట్లనుడివెను. కోహలా! నీకొరకెదురు చూచుచు చాలసేపు నిలుచుంటిని. ఎంతసేపునకు నీవురా లేదు. ఇటునటు చూచుచుండగా నీకాపాలికుడు నాయొద్దకు పరుగుపరుగున వచ్చెను. అయ్యా! మీరెవరో వీరులవలె నున్నారు. నేనుకాళికి హోమముచేయుచుంటిని. దానివలన నా తపస్సుసిద్ధించును మహాకాళి నాకు ప్రత్యక్షమగును. అట్టి లాభముపొందనీయకుండ యీ స్మశానములోని రాక్షసిమూకలు నాహోమమునుపాడుచేయుచున్నవి. నాయందుకనికరించి దేవాలయమును కాచియుండుడు. నాపనితీర్చుకొందును' అని బ్రతిమాలెను. నేను 'సరే', యని వాని వెంటవచ్చితిని. నన్నుబైటనిలిపి గర్భగుడిలోహోమములుగావించెను. పిమ్మట నన్నుబిలిచి 'అయ్యా! యీదేవత సత్యరూపిణి. ఆమెకు చాగిలపడి మ్రొక్కుడు. ఈప్రసాదముతీసికొనుడు' అని నాతో ననెను. కాపాలికుడొసగిన ప్రసాదము కన్నులకద్దికొని నోటిలో వేసికొంటిని. నేనుభక్తితో కనులుమూసి చాగిలపడి మ్రొక్కితిని. ప్రసాదమునందేమి కలదోకాని నాకొడలు తెలియలేదు. మైకముక్రమ్మినది. అంతలో చప్పుడైనది. నేను లేచితిని. ఒడలుచూచుకొంటిని నామెడలిమీద బట్టలులేవు. రక్త చందనము, కుంకుమ పూయబడినది. అంతలోనీవు సమీపించితివి'.

కోహలుడు మహారాజును కౌగలించుకొని ప్రభూ! నేను మొదటనే చెప్పితిని రాక్షసులు మాయావులని. నా మాట మీరునమ్మరైరి. ఆ కాపాలికుడు మిమ్ముచంపుటకు కత్తినెత్తెను. నేనువానితలనరికితిని' అని చెప్పెను.

పిమ్మట మహారాజు 'నీవుపోయిన సంగతేమైనది?' అని అడిగెను.

కోహలుడు రాక్షసివృత్తాంత మంతయు వినిపించెను. ఆదిత్యునకామెను చూపెను. ఆదిత్యుడు వారితో కలిసి కోట దారిపట్టెను. ముగ్గురు నంతఃపురములో ప్రవేసించి గోమతికి రాక్షసివృత్తాంతము తెలిపిరి. ఆమె యానందముతో నొకపీట వేసి దానిపై ఆరాక్షసిని కూర్చుండపెట్టెను. తులసిజలమామె నోటపోసెను. వెంటనే యామె విద్యాధరియయ్యెను. ఆమెను దర్శించుటచేత గోమతి శాపముతీరి యప్సరస యయ్యెను. వారు మహారాజునుదీవించి తమలోకములకరిగిరి.

౨౫

గోమతి భూలోకమును విడిచి దేవలోకమున కరిగెను ఆమె శరీరమున కగ్ని సంస్కారములు గావించి యాదిత్య వర్మ మాతృఋణమును తీర్చుకొనెను ఒకనాడు మంత్రులు సామంతులు, మిత్రులు సేవించుచుండ కొలువుతీర్చెను.

'విజయోత్తుంగుడు రాజ్యమునం దాశగొని నా పెద తల్లిని చంపెను. వానికి తగిన నీతి నేర్పవలయును. రణోత్తుం గునితోడి చేసినయొడంబడిక ప్రకార మింతవరకు నూరుకొం టిని. రణోత్తుంగుడు మడిసెను. వాని భార్యయు మరణించి నది. కళింగరాజ్యము మనచేతిలోనిది. దానిని స్వాధీన మొన రించుకొనుటకు విజయోత్తుంగుడెవడు! కళింగదేశమువిూదికి దండెత్తిపోవలయును. దానిని మన యధీనముచేసికొనవల యును. ఇందుకు మీా రేమందురు' అని యాదిత్యవర్మ

మంత్రిసామంతుల నడిగెను. వారందరు నేకగ్రీవముగా సిద్ధపడిరి.

అంత కోహాలుడు 'మహారాజా! రణోత్తుంగునితోడి యుద్ధమునందు మన సేనలో చాలాభాగము నష్టపడియున్నది. మరల వానిని వేదపెట్టుట యుక్తము కాదు. నాకు శెలవు నొసగుడు. నేనుపోయి విజయోత్తుంగు నోడించి కట్టి తెచ్చెదను' అనెను.

ఆమాటలు విని ఆదిత్యవర్మ యాశ్చర్యపోయెను. సభలోని వారందరు కోహాలుని వేళాకోళము చేసిరి. ఆదిత్య వర్మ 'కోహాలా! నీవు విజయోత్తుంగుని పరాక్రమ మెరుగవు. అతడు రణోత్తుంగుని మించినబలవంతుడు. మహావీరసింహము. వాని పరాక్రమము విరోధుల గుండెలలోని గాలము' అనెను.

కోహాలుడు 'మహారాజా! దైవబలము విపరీతమైనగాని కోహాలుని గెలువగలవారుండరు. ప్రభూ! మీరు సందేహింప వలదు, నా కానతియిండు' అనెను.

రాజు సరేనని సమ్మతించెను.

రాజు లందరు విభ్రాంతులైరి. కోహాలుడు మరునాడు తెల్లవారకమునుపు లేచి సింధూరమను తనయశ్వము నెక్కి కళింగదేశమునకు రాజధానియగు సింహాకటకమునకు బయలు దేరెను. పిమ్మట నాదిత్యవర్మ తన దండనాథుని బిలిచి కోహాలుని మాటలయందు నాకంత నమ్మకముకలుగుటలేదు. అతని శక్తిసామర్థ్యములు మనకు తెలియవు. రాజభక్తి గల వాడనుటకు సందియములేదు. మనము సేనలతో వెంట పోవుటమంచిది. ఓటమివాటిల్లినచో సగౌరవమగును. కావున

సేనలను సంసిద్ధపరుపుము. రేపే ప్రయాణము కావలయును విజయయాత్ర సాగింపవలయును' అనెను. మరునాడు ఆదిత్యవర్మ సేనలతో సింహకటకమునకు బయలుదేరెను. రెండు దినములు ప్రయాణముచేసి యాదిత్యవర్మ కళింగరాజ్యము సరిహద్దులచేరెను ఆరేఱు యొక్క మైదానమునందు శిబిరముల నెత్తించి సేనలను విడియుంచెను. ఆదిత్యవర్మ దండనాథులతో ప్రొద్దుపోవునంతవరకు మాటలాడి యప్పుడే పక్కమీద పరుండెను.

అంతలో నొక సేవకుడువచ్చి తగురీతిగా నమస్కరించెను. 'మహాప్రభూ! ప్రధానాంగ రక్షకుడగు కోహలుడు మిమ్ములను చూడకోరుచున్నాడు' అని మనవి చేసికొనెను.

రాజు జరిగినసంగతి నూహించుకొనలేకపోయెను. కోహలుడా! లోపలికి కొసరమ్ము అనిసమాధానము చెప్పెను.

కోహలుడొకచేతగుఱ్ఱమును నింకొకచేత విజయోత్తుంగుని పట్టుకొని రాజును దర్శింపవచ్చెను. అశ్వమును గుడారము వెలుపలవిడిచి, సంకెలతోనున్న విజయోత్తుంగునితో లోనికివచ్చెను. వాని నొక్కత్రోపుతో రాజు పాదములమీద పడవేసెను. తనచేతనున్న చబుకుతో వానిని మోదుచు 'మహారాజు పాదములు పట్టుకొనుము' అని బలమంతయు నుపయోగించి చేయికొలంది మోదెను.

విజయోత్తుంగుడు రాజుపాదములు పట్టుకొని 'మహారాజా! నన్ను క్షమింపుడు. ఈ కోహలుడు నన్ను బ్రతుకనీయడు. రక్షింపుడని రోదనము చేసెను.'

కోహలునకు కోపావేశమున నొడలు తెలియలేదు. విజయోత్తుంగుని దేహమంతయు చీరుకొనిపోయెను. రక్తము వరదలు కట్టినది. కోహలుని కసితీరలేదు. మహారాజు కోహలునివంక చూచెను. వాని కనులనుండి నిప్పులు కురియుచుండెను. ముఖమున దయించుచున్న సూర్యబింబమువలె నెత్తురు చిమ్ముచుండెను. కోహలుడు తొల్లింటి కోహలునివలె లేడు. అతడు ప్రళయరుద్రునివలె కనిపించుచుండెను. అక్కడి వారెవరు వానివంక చూడలేకపోయిరి.

ఆదిత్యవర్మ 'కోహలా! నీ కోపమింకను తీరలేదా ?' అని చిరునవ్వుతో ననెను

'మహాప్రభూ! స్వర్గమందున్న నాతండ్రి'- అని యేదో చెప్పబోయెను. వానికి మాటరాలేదు. కన్నీరు జలజలరాలినది. అతడు రెండుచేతులతో ముఖముమూసికొని యేావురుమని యేడ్చెను.

'కోహలా! కోహలా!' అని మహారాజు కోహలుని బుజ్జగించెను. కోహలుని హృదయము నూలిరులు తెరినది. అది యుడుకెత్తి తుకతుకలాడినది. ఊదరలు క్రమ్మకొని యెడలంతయు సెగలురేగినది. అతడు దుఃఖాగ్నిని చల్లార్చుకొనలేకపోయెను. లోలోన వెక్కివెక్కి యేడ్చెను

కోహలు డాటవికజాతికిచెందిన మహావీరుడు. వాని తండ్రి పర్జన్యనాయకుడు. వింధ్యపర్వతారణ్యము నందలి యడవిజాతివారకు నాగులకు నది నాయకుడు. భిల్లజాతివారందరు వానిని పజ్జననాయకుడని పిలుతురు. వింధ్యపర్వతములందు వజ్రాలకొనయను నొక లోయకలదు. వర్షకాలమున

వింధ్యపర్వతముబమీాద కురిసినవాన సెలయేళ్లుగాపాఠి యెక్క-డెక్క-డనున్న జాతివజ్రాలు నా లోయలోనికి కొట్టుకొని వచ్చును అందుమూలమున దానికి వజ్రాలకోన యను పేరు వచ్చెను. ఆ సమీపమునందు పది పదిహేను గూడెములు గలవు. ఆ పల్లెలలో నాగజాతివారు నివసించుచుందురు. క్రమక్రమముగా గోండులు, భిల్లులు శబరులు వచ్చి యీ పల్లెలచుట్టు నివాసము లేర్పరుచుకొనిరి. అందుమూలమున గూడెములు పల్లెలైనవి. ఆ పల్లెలకు నధిపతి పజ్జననాయకుడు. వాని తాతముత్తాతలు పదితరములనుండి యచటి నాగజాతి వారు కొండవాలులలో వ్యవసాయముచేసుకొని యీ వచ్చిన ఫలసాయముతో జీవించుచుండిరి, ఎండాకాలములందు వజ్రాల కోనలోనికి దిగి వజ్రములు నేరుకొని తెత్తురు వానివి పగుల గొట్టి లోపలి ముడివజ్రములను తీసి నగరములలో నమ్ము కొనుచుందురు. సంతసమయములందు వెదురుముత్యాలు నేనుగుదంతములు, నెమలి కలపయు నమ్ముకొని తెచ్చిన డబ్బుతో బట్టలు పాతలు కొనుచుందురు. వారికి దొంగ తనములు దారిదోపుడులనిన గిట్టవు. వారందరు నమాయకులు. తెల్లవన్నియు పాలు, నల్లవన్నియు నీరని భావింతురు. వారిలో వారికి వివాదములు పోట్లాటలు లేవు. ఏవైన కలిగినప్పుడు వారి నాయకుడే వానిని పరిష్కరించును. వానిమాట వారికి ప్రమాణము. నాయకులు సైతము పక్షపాతములు లేక తమ పనులు నిర్వహించుచు వచ్చిరి.

పజ్జననాయకుని యేలుబడియందున్న కూటమితో నొక పర్వతముమీాద వింధ్యవాసిని యను పార్వతీ దేవాల

యము కలదు. అది చాల పురాతనమైనది. దాని నెవరు నిర్మించిరో, యెప్పుడు నిర్మించిరో యెందుకు నిర్మించిరో యెవరికి తెలియదు. పరమేశ్వరుడైన శివుడు గంగను పరిణయ మాడెననియు, ఆమె నెప్పుడు నెత్తిమీద నెక్కించుకొని గౌర వించుచుండెననియు, పార్వతి యదిచూచి సహింపలేక శివుడు తన్ను చిన్నచూపు చూచుచున్నాడని యలిగి కైలాసము విడిచి దూరముగానున్న వింధ్యపర్వతారణ్యములకు వచ్చె ననియు, ఆ మహాదేవికి నిత్యము నచటి యాటవికులు పండ్లు,దుంపలు పెట్టి పోషించిరనియు చెప్పుకొందురు. కొంతకాలమునకు శివుడు పార్వతిని వెదకుచు నచ్చ యచటచూచెను. ఆమెను ప్రతిమాలి కైలాసమునకు తీసి కొని పోయెనట. పార్వతి ఆటవికుల భక్తికిమెచ్చి తనరూపము నచట ప్రతిష్ఠించి, 'భక్తులారా! దీనిని పూజింపుడు. మీరు తలంచిన కోరికలన్నియు నెరవేరును. మీరెప్పుడు పిలిచిన యప్పుడు పలుకుచుందును' అనివరమిచ్చి భర్తతో వెడలి పోయెను. వారు ఆ మహాదేవికి నాలయముకట్టిరి. ఆ దేవికి వింధ్య వాసిని అని పేరుపెట్టిరి. నిత్యము వారా దేవతను పూజింతురు. సంవత్సరమున కొకసారి, కొలుపులు, బలులు, వుత్సవములు చేయుదురు. ఆదేవత వారికి పిలిచినపలుకును. ఆమెదయవల్లనే తామంతయభివృద్ధికి వచ్చితిమని వారినమ్మకము.

పజ్జ తాత తండ్రులా దేవికి ప్రాకారములు, మంటపము కట్టించిరి. వజ్రాలకోనలో లభించిన జాతి వజ్రములను సాన పట్టించి విలువగల కంఠహారాదియలంకారములన్నియుచేయిం చిరి. ఇప్పుడామె యొంటిమీద లక్షల విలువగల నగలు

కలవు. పజ్జన యాజగన్నాకు రక్షకవచము చేయించెను. దానికొక యక్షుని నియమించెను. దేవీమహోత్సవము లందు నాటవికు లే కాకనాగరకులుకూడ పాల్గొనుచుండిరి.

పజ్జన యేలుబడిలో రెండు సంవత్సరములు వర్షము కురవలేదు. పంటలు పండలేదు.

అడవులందు కార్చిచ్చులు రేగి వనసంపదలను కాల్చివేసి నవి. నాగుల స్థితిగతులు తలక్రిందైనవి. కళింగపతికి చెల్లింప వలసిన కప్పము పజ్జన చెల్లింపలేకపోయెను. రణోత్తుంగునితో నాగుల కష్టములను స్వయముగా మనవిచేసికొనెను. కాని రణోత్తుంగుడు వానిమాటలను నమ్మలేదు. విశ్వవాసిని మీద ప్రమాణముచేసి మొరపెట్టుకొనెను. మహారాజు కప్పము నెగ వేయుటకది పన్నినపన్నాగమని యుహోపడెను. పజనగూడె మునకు తిరిగివచ్చెను.

రణోత్తుంగుడు స్వయముగా కోపస్వభావుడు దానికి తోడు విజయోత్తుంగుడు వానికి దూపడు వేయుచుండును. దానితో రణోత్తుంగున కావేశముపుట్టును. వెనుకముందాలో చింపడు. తొందరపడి నిర్ణయమునకు వచ్చును ఆపనిని వెను తీయక చేయుచుండును. పజ్జన నాయకుడు వెళ్ళినతరువాత రణోత్తుంగుడు విజయోత్తుంగుని సలహాయడిగెను. అతడు 'ప్రభూ! ఆటవికులు పజ్జననాయకుని యేలుబడియందు చాల ధనవంతులైరి వారు ధనగర్వముచేత కప్పముకట్టక మాని వేసిరి. ఇప్పుడు మనమూరకుంటిమేని గోటితో పోవునది గొడ్డలితో నరకవలసివచ్చును. వారినిప్పుడే లొంగతీయుట మంచిది. మీ యనుమతియైనచో నే నాపనిచేసి ప్రభువులకు

కష్టపలసివున్న ధనము తెచ్చెదను' అనిపలికెను. రణోత్తుంగుడు 'సరే' యనెను. విజయోత్తుంగుడు సేనలు సమకూర్చుకొని యాటవికులబిలానికి దండు వెడలెను. వారిగూడెములను నానా బీభత్సగావించెను. ఇల్లిల్లు శోధించి యున్నదంతయు దోచెను. చేతికందిన వారినెల్ల నానా హింసలుపెట్టెను. పల్లవ నాయకుడు విజయోత్తుంగుని కాళ్ళ వ్రేళ్ళపడి బహువిధముల బ్రతిమాలెను. విజయోత్తుంగుడువినలేదు. ప్రభూ! 'నాయింటి నున్న సకలము కొనిపొండు. నా ప్రజలను హింసింపకుడు. మీకుపుణ్యముండును' అని యడ్డుపడెను. విజయోత్తుంగుడు వానిని కొరడాలతో కొట్టించెను.

విజయోత్తుంగుడెంత చేసినను వానికేమియు లభించలేదు. ఆటవికులు తిండికిలేక నానా బాధలుపడుచుండిరి. అదివరకు దాచికొనినదేమైననున్న దానినంతయు నీ కరువు దినములలో ఖర్చుచేసికొనిరి చివరికి చేరెడు గంజికైనను లేనిదినములువచ్చినవి. విజయోత్తుంగుని యత్నము విఫలమాయెనది. తిరిగి యుట్టిచేతులతో పోరాదు. పోయిన నగారవము రాజువలనతప్పదు. వానికి విధ్యవాసినిమీద కన్నుపడినది. ఆమె నిత్యకళ్యాణియై సువర్ణాభరణములతో రత్నహారములతో మెరసిపోవుచుండెను. విజయోత్తుంగుడు మహాదేవి యాలయమునందు ప్రవేశించెను. ఆ దేవతయలంకారము లన్నియు నొలిచివేయుడని సైనికులకాజ్ఞాపించెను. అంతటితో నాటవికుల కావేశముపుట్టినది. అందరు స్త్రీ పురుషు లొక్కపెట్టున నాయుధములను నెత్తిరి. విజయోత్తుంగుని సేనమీద' వింధ్యవాసినీ దేవికిజై ' యనిపడిరి. రెండువైపుల

వారికి కొంతసేపు యుద్ధముజరిగినది. విజయోత్తుంగుని సైనికు లాటవిక జనులను చిత్రవధకావించిరి. ఆలయముచుట్టు రక్త ము ప్రవహించినది. పీనుగులు దొప్పలోగినది. పజ్జవ నాయ కుడు దేవిగర్భాలయమునద్వారమునకు రెండుచేతులడ్డముపెట్టి నిలిచెను. విజయోత్తుంగుడువాని రెండుచేతులు నరికెను. కాళ్ల డ్డముపెట్టెను. విజయోత్తుంగుడు రెండుకాళ్ళను నరికెను. నాతల్లి యలంకారము తీయనియను' అని ద్వారమున కడ్డము గాపడెను. విజయోత్తుంగుడు వానితల నరికెను. లోనికిరిగి యాలోకజనని యలంకారములన్నియు గోతములకెత్తించి పట్టుకపోయెను. కోహలుడా సమయమున గాయములు తగిలి యొడలు తెలియని స్థితియుందుండెను. లేచి చూచునప్పటికి తండ్రి చిత్రవధ చేయబడియుండెను. కోహలుడు పెద్దపెట్టున యేడ్చెను. కన్నీటిధారలతో నా తుండెమునకు స్నానము చేయించెను. తండ్రికి నంత్యక్రియలు జరిపించెను. మరల వచ్చి వింధ్యవాసినీదేవి పాదములచెంత కూర్చుండెను. పట్టు దలతో నామె నన్నపానములువిడిచి ధ్యానముచేయ నారం భించెను. నెలలు గడిచినవి. దేవి ప్రత్యక్షముకాలేదు. వానికి మొండిపట్టుదల హెచ్చినది. ఆమె తనకోర్కె నెరవేర్చ నిచో నచటనే మరణింతునని నిశ్చయముచేసికొనెను. ఒక దినమున వానికి మూర్ఖత మరింతహెచ్చినది. 'తల్లీ! మహా దేవి! నీవు నాకుదర్శనమీయ తలంచలేదు. నా ప్రాణములు నీకర్పించుచున్నాను' అనుచు నామె పాదపీఠముమీద తలను మోదుకొన నారంభించెను. రక్తము గాయములనుండి పొరలి పారినది. వింధ్యవాసిని దేదీప్యమానమగు కాంతులతో

కోహలుని యెదుటకనిపించినది. 'కోహలా! లెమ్ము. నీకొరికి కొలదికాలములలో నెరవేరకలదు. ఇది సింహాసత్త్వమను గుఱ్ఱము. ఆకాశమునందు చరింపగలదు. ఇది వజ్రధారయను గండ్రకత్తి. ఈరెంటిని నీవుతీసికొనుము. వంగదేశమున కరిగి యాదిత్యవర్మ నాశ్రయించి యుండుము. సమయము వచ్చి నప్పుడు నేను నీ యందావేశింతును. నీపగతీర్చుకొనుము. అంతవరకు దినమునకు నూర్గురు బ్రాహ్మణుల కన్నవస్త్రములిచ్చి పోషింపుము. అపుణ్యము నీకతోడగును. అందు మూలమున నీకునైశ్వర్యము చేకూరకలదని వచించెను. కోహ డట్లే యాదిత్యవర్మ నాశ్రయించి దేవిచెప్పినటులుచేసెను. సమయమునకు మహాదేవి కోహలుని యందావేశించినది. విజయోత్తుంగుని సేనలను పరిమార్చి వానిని బంధించి తెచ్చెను. కోహలునకు కోపముతీరలేదు. తండ్రిమాట తలంపునకు వచ్చినది. వానికి పట్టరాని దుఃఖముకలిగినది. విజయోత్తుంగుని తన గుఱ్ఱమునకు బంధించెను.

'మహాప్రభూ! వీనిని మహాదేవికి బలియిచ్చునంత వరకు నాకు కోపముతీరదు.' అని యాగుఱ్ఱమునెక్కి యాకాశమున కెగిరిపోయెను.

## ౬

కోహలుడు విజయోత్తుంగుని వీరవ్యాఘ్రచలము నందలి పల్లెకు తీసికొనిపోయెను. ఆటవికులందరు కోహలుని చుట్టు మహోత్సాహముతో చేరిరి. వారికి తనపల్లెను విడిచి పోయిననాటినుండి యానాటివరకు జరిగిన విషయములన్నియు

పూసగ్రుచ్చినటుల చెప్పెను. విజయోత్తుంగుని వారికిచూపించెను.

'ఆటవిక జనులారా! నాతండ్రిని కారణములేక వధించిన యీ విజయోత్తుంగుని మన వింధ్యవాసినీదేవికి బలియీయవలయును. అప్పుడుగాని నాతండ్రి యాత్మకు నాకును శాంతిలేదు. బలికిసర్వము సిద్ధముచేయుడు' అని పలికెను.

పజ్జన నాయకుడనిన నాటవికుల కందరకు ప్రేమకలదు. వానియందు భక్తి విశ్వాసములు గలవారై వానిజీవితకాలమున వానిని సేవించిరి. అట్టిఉత్తమనాయకుని చంపిన విజయోత్తుంగునిమీద కసితీర్చుకొనుట వారందరికిష్టమే. కావున బలిమహోత్సవమునకు వారుక్షణములో నన్నియు తయారు చేసిరి. వింధ్యవాసిని దేవాలయము పూలతోను చిగురుటాకులతోడ నందముగా నలంకరింపబడినది. ద్వారములకు పసుపు కుంకుమలు పెట్టబడెను. స్త్రీలు, పురుషులు తగువిధముగా నలంకరించుకొనిరి. తప్పెటలు, కొమ్ములుభూరాలు, డోళ్ళు మద్దెలలు నొక్కపెట్టున మ్రోగినవి. స్త్రీలు పురుషులు చప్పటులు చరుచుచు పాటలుపాడుచు నాట్యములు చేయుచుండిరి. ఆనాడా వింధ్యవాసిని యాలయమంతయు మహానందముతో నిండిపోయెను. మహాదేవికి ధూపములు దీపములు వెలిగింపబడినవి. కోహలుడు వింధ్యవాసినీ దేవి యెదుట భక్తివినయములతో నమస్కరించి నిలుచుండెను. ఆసమయమున నలుగురాటవికులు విజయోత్తుంగు నలంకరించి దేవియెదుటకు కొనివచ్చిరి. వాని యొడలంతయు రక్తచందనము పూయబడెను. మెడనిండ పూలమాలిక లలంకరింప

బడెను తులసి పూలదండలు చుట్టబడెను. ముఖమున కుంకు మబొట్టు, చేతులయందు. వేపమండలు తాల్చిన విజయో త్తుని చూచినప్పుడు శోకవిషాదము భయము కలిగించు చుండెను.

విజయోత్తుంగుని ముఖమున దుఃఖమేఘము లావరించి నవి. వానికి మరణముతప్పనిది. వానిమనస్సునందు తనతొల్లిం టిమహావైభవము విజయ పరంపరలు నొకటివెంట నొక టిగా వచ్చినాలినవి. మహానందముగా గడపిన దినములు జ్ఞప్తికివచ్చినవి. వానిహృదయమును తునాతునకలుగావించి నవి. కనులవెంట నీరుకురిసినది. తానొనరించిన యకార్య ములు కనులయెదుట కనిపించినవి. ఒకనాడవి మహత్కార్య ములుగా తోచినవి. ఇప్పుడవి యవినీతి చర్యలనితోచినవి. ఆఘోరకార్యముల కిదేఫలమని వానికి స్ఫురించినది. ఏచోట పరాక్రమించి పజ్జన నాయకుని చిత్రవధ కావించెనో యచ టనే తనకీశిక్షవిధింపబడుటచేత చచ్చినచావయినది. వానికి ప్రాణాలమీద యాశ నశించినది. కాని తానొనరించిన ఘోర కార్యములకు దైవమెదుట నేమిసమాధానము చెప్పగలుగుదు ననువాలోచనలు రేగిన, దానితో విజయోత్తుంగునకు భయము వణకుకలిగినది. మృత్యుదేవతను ధైర్యముగా నెదుర్కొనుటకు శక్తినిమ్మని యా మహాదేవిని ప్రార్థింప మొదలుపెట్టెను. వానిగుండె రాయియైనది. వెంటవచ్చినవారు విజయోత్తుం గుని మోకరింపజేసిరి. విజయోత్తుంగుడు దేవినొక్కసారి చూచెను. ఆమె యలంకార శూన్యమగు రూపము వాని హృదయమును సమూలముగా భేదించినది. పూర్వము తాను

చూచిన దేదీప్యమానమగు నాకారను కనులయెదుట నిలిచినది. అవును నాకీశిక్షతగినదే' యని తలవంచెను.

కోహలుడు కత్తినెత్తెను 'కోహలా! కోహలా! అగు' అనుమాటలు వినిపించినవి.

కోహలుడెత్తినకత్తి యెత్తినట్లుంచి వింధ్యవాసినీ మహాదేవి వంకజూచెను. ఆమె కోహలా! జీవహింస మహా పాపముకాదా? యనెను.

నీప్రీతికొరకు నిచ్చుచున్నబలి జీవహింసయెట్లగును తల్లీ!

నాయనా! ఈ ప్రపంచములోని జీవరాసులన్నియు నాబిడ్డలు. ఏతల్లియైనను తనపిల్లలను బలికోరునా?

తల్లీ! తెలియనిమూర్ఖుడను. నాయపరాధముసహింపుము.

కోహలా! ఈతడు పూర్వజన్మయందు నీతండ్రికి సోదరుడు. అదెట్లు తల్లీ?

వినుము. కాంచీపురమునందు గాలవుడను నొక బ్రాహ్మణుడు కలడు. వాడు మిగులపిసినిగొట్టు. అబద్ధము లాడుటయనిన వానికి మహానందము. వంచన నిత్యకృత్యము. వాడు ప్రతిదినము పరులను మోసగించి యబద్ధములాడి యాయాచారము వలనడబ్బు సంపాదించుచుండెను. దానిని గోచికొంగునముడివేసి దాచియుంచెను. భార్యకుబిడ్డలకు పెట్టడు, తానుతినడు. అట్లుదాచినధనమును పరులకు వడ్డీల కిచ్చును వడ్డీలకు వడ్డీలుపెంచియార్జించిన యాధనముతో నిల్లువాకిలి - కట్టుకొని కొంతపొలమునుకూడ సంపాదించెను. ఇది తనజీవితమునకు సరిపోయినను తనవృత్తిని మానలేదు. ఇట్లుకొంత ధనమునుగూడ కూడపెట్టెను. ఆడబ్బుతో నాగువర్త

కమునారించెను. కొన్నిసంవత్సరములలో గాలవుడు లక్షాధికారి యయ్యెను. వానికి సునీతి,వినీతులనునిరువురుకుమారులుపుట్టిరి. వినీతి కుటిలస్వభావుడు. అన్నివిధముల తండ్రినిబోలినవాడు. సునీతుడమాయికుడు. తల్లిదండ్రులయందు భక్తివినయములు కలవాడు తమ్మునియందు ప్రేమభావముతో వర్తించుచుం డును. వినీతికడగొట్టుకుమారుడు. వానియందు తండ్రికిప్రేమ మెండు. వాడేమిచేసినను గాలవునకు సంతోషంగానుండును. అది కనిపెట్టి వినీతి సునీతునిమీద కొండెములుచెప్పుచుండెను. తండ్రి సునీతిని దండించుచుండును. సునీతునియందు వినీతిపైకి అధికమగుస్నేహముకనబరచుచు తండ్రిచర్యలకు వానిమీద జాలిపడుచున్నటులు నటించును

గాలవునకు ముసలితనం వచ్చినది. మరణకాలము సమీపించినది. వినీతికి తండ్రి యాస్తిపాస్తులను నపహరించవలయునను బుద్ధిపుట్టినది. సునీతియొద్దచేరి 'అన్నా! తండ్రి గుణములు నీకు తెలియునుగదా ఆయనదుర్మార్గుడు. బ్రతికి యున్నంతకాలం మనకుసరిగాతిండియైనను పెట్టలేదు. మనము యాచించి తెచ్చినడబ్బుకూడతీసుకొనిమనకుగవ్వైనచిక్కనీయ లేదు. ఆయనమరణించినను మనకీయాస్తిలభించదు. ఈయ ననుకనిపెట్టుకొని యుండుటవలన లాభములేదు. పైగా తన యాస్తి దానధర్మములకు వ్రాసియిత్తుననిబెదరించుచున్నాడు. వీనియాస్తిపాస్తులు మనకెందులకు. ఎక్కడికైనాపోయి జీవింతము' అనిబోధించెను. తండ్రివలనయగచాట్లుపడినవాడు గావున సునీతిసరేనని మీదబట్టతో పొట్టపోసుకొనుటకు పర దేశముల కరిగెను వినీతియు సునీతినితోపాటు గృహము విడిచి

పోయినట్లుపోయి యిల్లుచేరెను. గాలవునకు మరణకాలము వచ్చినది. వినీతిమరలతండ్రితో నాయనా! మూఢతివా! విరతి కాలమునందు సునీతి యిన్ని నానా విధముల నిందించిలేచి పోయెను. నేను వలదని నివారించితిని నన్నుతూలనాడెను. అట్టివానికి నీయాస్తిదక్కనిచ్చినను నిలుపుకొనడు. కష్టపడి సంపాదించినది, వాడు దుర్వ్యయముల పాలుచేయును నేను నీపేరుచక్కగానిలిపి యభివృద్ధిచేయుదును. ఆస్తిసర్వమునా వశముచేయుము. వాడు పితృద్రోహి, అని బోధించెను. తండ్రి యాస్తియంతయు తనవశముచేసికొనెను.

గాలవుడు కాలముమూడి మరణించెను. గ్రామాంతరమునందున్న సునీతి యామాటవిని యింటికివచ్చెను. వినీతి వానికెదురుపోయి తోడితెచ్చి అన్నా! మనతండ్రి మరణించి నాడు మరణకాలమునందునీవు దగ్గరలేవు 'మనసునీతి బీద వాడు. అమాయకుడు, కష్టజీవి ఎక్కడ యేపాట్లుపడుచున్న వాడో, కూటికి గుడ్డకు కరవై లేచిపోయెను. నాయనా! నాకు నీ యాస్తితో పనిలేదు. నా భార్య వలయునంత ధనముతో వచ్చినది. నీ సంపాదనంతయు సునీతికినిమ్ము' అని నే నెన్నో విధముల పాదములుపట్టుకొని బతిమాలితిని. నా మాట చెవిని పెట్టెను. నన్నుకాదని లేచిపోయినవానితో నాకేమి పని, వాడునాకుమారుడుకాడు నీవే నాయాస్తికంతయు వారసుడవు నీ వశము చేయుచుంటినని సర్వము నాకువ్రాసి యిచ్చెను. నేనువద్దనిన నామాటవినలేదు. నీవింకెట్లు జీవింప గలుగుదువు. నీమాటలు తలంచుకొనిన నా గుండెకరగుచు చున్నది. ఒకవేళ ఇదియంతయు నీకిత్తునుపోయిన తండ్రియాజ్ఞ

శాంతియుండదు. ఆ యావేదనతో నాయన నరకములపాల గును. మనము మనజనకుని క్షేమము కోరవలసిన వారము. అని కౌగలించుకొని లేనిదుఃఖము తెచ్చిపెట్టుకొనియేడ్చెను. సునీతి తండ్రికంత్యక్రియలు నిర్వర్తించెను. తానుకష్టములకే పుట్టినని తలంచి వానిదారిన వాడరిగెను

సునీతి మధురానగరమునకు చేరెను. అచటయాయ వారముచేసికొని జీవించుచుండెను. అతడు ప్రతిదినము సూర్యోదయమునకు ముందుగాలేచి సంధ్యావందనము కావించుకొనును. భార్యతోమిచ్చిన రాగిచెంబును పంచాం గము చేతపట్టుకొని మీనాక్షి యాలయములోని కరుగును. ఆ మెయెదుట పంచాంగమువిప్పి తిధినక్షత్రములు వరుసగా చదువును. భక్తితో నా దేవిని ధ్యానించి నగరమున కరగును. నడిజాము వరకు యాయవారముచేసికొని యింటికివచ్చును. తాను సంపాదించి తెచ్చిన దానిలో నాల్గవవంతు బ్రాహ్మణ భోజనమునకు నియమించును మిగిలిన దానితో భార్యబిడ్డలను పోషించుకొనును. ఇట్లు నలుబదిసంవత్సరము గడచినది.

మధుర యిరువదియామడల చుట్టుపట్టులయందు కరువు తటస్థించెను, నాలుగేడులు వర్షముకురియ లేదు పంటలు వేసినవి వేసినటుల మాడిపోయినవి. జనులుతిండిలేక మాడి పోయిరి. సునీతికి పిడికెడుబిచ్చమైనను లభించలేదు. భార్య బిడ్డలాకలికల్లాడిపోయిరి. సునీతియు ముసలివాడయ్యెను. వానికి నోపిక తగ్గినది. తనస్థితియు భార్యబిడ్డలగోడునుచూచి తనలో తానిట్లుతలంచెను "నాసొగసుమంచినీతి యుభక్తి ధనసంపన్నుడను. గుణవంతుడను. ఈ కాటకముపోవు వరకునన్ను-నా భార్య-బిడ్డ

లను పోషింపతగినవాడు వానినాశ్రయించి కొంతకాలమచ్చ
టనే యుండును. నన్నత డాదరించును.

సునీతినిట్లుతలంచి కంచికివచ్చెను. అచటి జనుల
వలన వినీతి నివాసముగుర్తించి యింటివాకిటికి పోయెను.

వినీతివానినిచూచి 'నీవెవరవు?' అని ప్రశ్నించెను.

సునీతి తమ్ముడా! నీవు నన్నుగుర్తింపలేదు. నేను నీ
యన్నను సునీతిని. బహుకాలమునకుచూచితిని అని సమా
ధానముచెప్పెను.

అంత వినీతి వానిని నిందించుచూ, నాకు సునీతి అను
సోదరుడేలేడు. నా తండ్రికి నే నొక్కడనే పుట్టితిని.
నావంటి ధనవంతునకు నీవు సోదరుడవగుదువా! పో పో,
అని విదలించెను.

సునీతి తనకధయంతయు వివరించి తన్నుకొంతకాల
మిచటనుంచుకొనమని బ్రతిమాలెను. ఆ మూర్ఖుడు వానిని
నోటికివచ్చినట్లెల్లతిట్టి తనచేతికఱ్ఱతో వానితలమీద నొక్క
పెట్టుపెట్టెను. అది యాయువు పట్టునతగిలి వాడు మరణించెను.
కొంతకాలమునకు వినీతిచేయు నవినీతిపనులకు సహింపనేరక
భార్యబిడ్డలు వానితోద్వేషించి యిల్లు వెడలుగొట్టిరి. వాడు
కాంచిపురములోని కామాక్షియాలయమునాశ్రయించియుండి
దేవిదర్శనమునకై వచ్చిపోవుభక్తులను ప్రార్థించి వారుపెట్టు
ప్రసాదముతో కడుపునింపుకొనుచుండెను. కడకు మృత్యువు
కాలము సమీపించినది. ఆదేవిసమక్షమున వాడుమరణించెను.

సునీతిచేసిన బ్రాహ్మణపూజాఫలముగానీజన్మయందు.
రాజకులమున బుట్టి రణోత్తుంగుని సర్వసేనాపతి యయ్యెను.

ఆ కారణముచేతనే నీవు బ్రాహ్మణారాధన గావించిన గాని వానిని జయింపలేవంటిని. నీపుణ్యము వాని పుణ్యముకంటె యుక్కువ మించినది. కావుననే వీడు నీచేత నోడింపబడెను నీతండ్రియే యీ విని. పాపఫలితముగా కిరాత కులమున బుట్టెను. నా ప్రసాదము భుజించుటచేత నీజన్మయందు నా భక్తుడయ్యెను. నా యాలయమునకు ప్రాకారమండపాదులు నిర్మించి పుణ్యలోకమున కరిగెను.

'నాయనలారా ! యీరీతిగా నొకరినొకరిమీద విరోధ మూను బూని చంపుకొనుచుండిన మానవుని కెప్పటికివిమోచనము! శాంతిసహనములు కలిగి పరోపకారులై తమ శక్తికొలంది పాటుపడవలయును పదవులు, ధనములు పరుల కపకారము చేయుటకుకాదు' అని వింధ్యవాసిని వచింపగా కోహాల విజయోత్తుంగు లాదేవికి సాగిలపడి నమస్కరించి 'అంబా! మమ్ము చీకటినుండి వెలుగులోనికి తెచ్చితివి. నీ సేవచేయుచు నిచ్చటనే యుందుము' అనిరి.

అందుల కామహాదేవి. 'బిడ్డలారా! మీరిచ్చట నుండుటకంటె మీ మీపదవులందుండిన లోకమున కెక్కువ మేలు చేకూర్పగలరు. ఆదిత్యవర్మకు తోడునీడలై వర్తింపుడు. దేశశాంతికి దేశోపకారమునకు పాటుపడుడు' అని వచించి యాదేవి మాయమయ్యెను. దేవి యాదేశము ననుసరించి విజయోత్తుంగ కోహాలు లాదిత్యవర్మను సేవింపనరిగిరి.

ఆదిత్యవర్మ సేనలను తరలించుకొని కళింగ దేశము నకు రాజధానియగు సింహకటకము చేరెను. సింహాసనము స్వాధీనము చేసికొని నగరమునందు శాంతిని నెలకొల్పెను. ఒకనాడాదిత్యవర్మ మంత్రులతో కలిసి కళింగరాజ్యపరిపాలనా విధానమును గురించి యాలోచించుచుండెను.

ఆసమయమున నొక సేవకుడువచ్చి తగురీతి మహారాజు నకు నమస్కరించెను 'మహారాజా! కోహల విజయోత్తుం గులు తమ దర్శనమునకై ద్వారముకడ వేచియున్నవారు' అని మనవిచేసికొనెను.

ఆదిత్యవర్మ కామాట లాశ్చర్యముకలిగించెను. విజ యోత్తుంగుడు జీవించి మరలవచ్చునని యాదిత్యవర్మ తలం పలేదు. వింధ్యవాసినికి తప్పక బలియై యుండుననియే యూహించెను. రాణివాసమునకు ద్రోహము కావించిన విజ యోత్తుంగుడు మరణశిక్ష ననుభవింపవలయునని వానినిశ్చ యము. కోహలుడుకాకపోయిన తానై ననాపనిచేయవలసిందే. కోహలుడే యాపనిచేయుటకు నిచ్చగించుటచేత కొంత భారము తగ్గినట్లైనది. అందుకనే కోహలు నడ్డుపెట్టలేదు.

విజయోత్తుంగుని ప్రాణములతో తిరిగి కోహలుడు వెంటపెట్టు కొనివచ్చెను. ఇందేదో విశేషముండి తీరునని తలంచెను

'వారిని ప్రవేశపెట్టుము' అని భటునకాజ్ఞాపించెను. భటుడు వెడలిపోయెను.

కోహల విజయోత్తుంగులు రాజును సందర్శించిరి. ఆదిత్యవర్మ కోహలుని వంకచూచి 'కోహలా! నీకోపము తీరినదా?' యని ప్రశ్నించెను.

కోహలుడు మహారాజా! అజ్ఞానమువలన నపరాధము చేసితిని క్షమింపుడు' అని సమాధానముచెప్పెను.

తప్పుచేసినవానిని శిక్షించుట యపరాధమెట్లగును?

కోహలుడు జరిగినదంతయు వినిపించెను ఆదిత్యవర్మ యబ్బురపడి వానివంకచూచెను.

విజయోత్తుంగుడు మహారాజునకు నమస్కరించి 'ప్రభూ! నేనుమహాపరాధిని. మీదండన కర్హుడను' అని చేతులుకట్టుకొని నిలిచెను.

విజయోత్తుంగా! నీవు స్వామిద్రోహము కావించితివి. దానికి మరణశిక్ష తప్ప యింకొక దండనము లేదు. కాని పశ్చాత్తాపము నిన్నుమార్చివేసినది. నీవు రెండవజన్మ మెత్తితివి. నీవు మరణదండనము పొందినటులనే యైనది. నీవు నీయధికారమును తొల్లింటివలె స్వీకరింపుము. కోహలా! నీవు నాకు ప్రాణరక్షణము కావించితివి. నీవు జయించినరాజ్యమునకు నిన్నే యధిపతిని చేయుచున్నాను' అనెను.

కోహలుడు ప్రభూ! నేనొకబోయవాడను మీవంటి క్షత్రియవీరు లేలవలసిన కళింగ రాజ్యమునకు నన్నభిషేకించుట నన్నుపరిహాసించుటయగును.' అని కోహలుడు వినయముగా బలికెను.

కోహలా! 'సంస్కారమునకు కులముతో పని లేదు. నీకు వింధ్యవాసిని సహాయమున్నది. ఆమెయే నీకు దారిచూపును' అని యాదిత్యవర్మ పలికెను. కోహలుడు మాటలాడ లేదు. మరునాడు ప్రజాసమక్షమున కోహలునికి రాజ్యాభిషేకము కావించెను. విజయోత్తుంగుడు సేనాపతియయ్యెను. నాటి నుండి కోహలునికి వింధ్యవాసినీ మహాదేవియందు భక్తిభావములు పెరిగిపోయినవి. ప్రతిదినము ప్రాతఃకాలమున లేచి సింహాసత్త్వముపైకిపోయి యాదేవిని దర్శించును. ఆమెకు షోడశోపచారములతో పూజలు జరిపించును. నాగులక్షేమములు విచారించును. పిమ్మట సింహాకటకమునకు వచ్చి కొలువుతీర్చును. మంత్రులు, నీతిబోధకులు. వింధ్యవాసి మార్గదర్శకురాలు విజయోత్తుంగుడు సేనాపతి ఆదిత్యవర్మ యాపర్యకుడుగా కోహలుడు కళింగరాజ్యము మహావైభవముతో నేలుచుండెను. వానిపేరు విఖ్యాతమయ్యెను.

ఒకనాడు కోహలుడు సింహాసత్త్వమును తన యశ్వము నెక్కి, వింధ్యవాసినియాలయమునకరిగెను. అచట తనపని నెరవేర్చుకొని సింహాకటకమునకు వచ్చుచుండెను. ఆనాడు మేఘము లాకాశమునంతావ్యాపించి నల్లని కారుచీకటులను

వ్యాపింపచేయుచుండెను మెరుపులు కనులను మిరుమిట్లు గొలుపుచుండెను. ఉరుములు హృదయభేదకములగు ధ్వనులతో వినపడుచుండెను. వర్షము కడవలతో నెత్తిపోసినటులు కురియనారంభించెను. కోహలుడు గుఱ్ఱమునదలించి మేఘమండలమును దాటి మింటికెత్తున పోనిచ్చుచుండెను. గుఱ్ఱము గుములకు మెరుపులకునదరి మరింత వేగముగా పరుగెత్తుచుండెను. గాలి సైతము దానిపరుగు నందుకొనలేకపోయినది. ఆసమయమున నొక రాక్షసస్త్రీ భయంకరాట్టహాసముతో నశ్వము నడ్డగించెను.

'ఓరీ! నీవెవడవు? మూడులోకములకు ప్రళయరూపుడనగు నన్ను నీ వెరుంగవు కాబోలు. నన్ను ధూమ్రాక్షుడందురు. ఇది నా నివాసము. నా యావాసముమీదుగా పోవుటకు నీకీ ధైర్యమెక్కడనుండి వచ్చినది.' అని పలుకుచు చేతియాయుధము కోహలునిమీదికి విసరెను.

కోహలుడా యాయుధమును తనకత్తితో తుత్తునియలుగా నరికెను. అశ్వము గుండెలదరునటుల సకిలించుచు తన ముందరిగిట్టలతో నొక్కతన్ను తన్నెను. ఆతన్ను వజ్రాయుధమువలె వానిరొమ్మున తాకినది. ఆ రాక్షసుడు బంతివలె నెగిరి నూరామడలదూరమునందున్న దేవి సరోవరతీరమునందు పడెను. అది పార్వతి చెలికత్తియలతో జలక్రీడలాడు కొలను. ఆసమయమున పార్వతి తనతోడి సఖియలతో గలిసి స్నానము చేయుచుండెను. ధూమ్రాక్షుడు శోకమహాశయుడు

నా మహాదేవియందమునుగాంచి బేలుపోయెను. ఆ దేవి వాని వికారచేష్టలను తిలకించి వానికి తగినబుద్ధి చెప్పవలయునని తలంచినది.

ఆ ధూమ్రమాక్షుడు కనులనుండి పొగలెగయ గ్రమ్మించుచు 'ఓ సుందరులారా! మీరెవరు? నేను భువనములను విలయకారకుండనయిన ధూమ్రమాక్షుడను నేను కోపమున కనులు తెరచి చూచినచో నిప్పుమంటలతో పొగలెగయును. లోకములను భస్మముకావింతును. నా ప్రతాపము బలము మీరెరుగరు కాబోలు. కొలను వెలుపడిరండు. రాకుంటిరేని నేనే యీ సరోవరమునందు చొచ్చి మిమ్ములను నా బాహువులతో బంధించి యాకాశమార్గమున నా నివాసమునకు గొనిపోయెదను' అని గద్దించి పలికెను.

ఆ లోకమాత వానిమాటలువిని జయవిజయులను తన చెలికత్తెలకు కన్నుకలిపెను. వారా సంజ్ఞను గ్రహించి పకపక నవ్వనారంభించిరి. ఆనవ్వులకు రాక్షసునిమొడలు మండిపోయెను. ఆ యుద్రేకముపట్టలేక సరోవరములోనికొక్కసారిగా దుమికెను. వారంతకంతకు వెనుకకుపోయిరి. రక్కసుడు ముందునకరిగెను. వానిరాకను కనిపెట్టి వారందరు నొక్కసారిగా నీటిలో మునిగిరి. వాడును నీటిలో మునిగి వారికొఱకు వెదుకనారంభించెను. అంతలో వారు తప్పించుకొని మాయమైరి. ధూమ్రమాక్షుండు కొలనంతయు వెదకెను. ఎచ్చట వారు కానరాలేదు. చివరికి గట్టుయొద్దునకుచేరెను. అతడు తన మొడలంతయు చూచుకొనెను. అది తొల్లింటి

వలెలేదు. వానికాడుకోతిరూపము వచ్చినది. పూర్వపు జన సత్వము నాకాశగమనము నశించినది. ఆ చుట్టుపట్టులందున్న చెట్లనాశ్రయించి యా రాక్షసుడు జీవించుచుండెను.

కోహలునకు గుఱ్ఱము చాలసేపటివరకు స్వాధీనము కాలేదు. అదిచాలదూరము వానినిగొనిపోయెను. ఎండవేడి మికి వాని శరీరము తుకతుకలాడినది. చెమటలుదిగపోసినవి. అలసట చేకూరినది. దాహముపొడమినది. కోహలుడు క్రిందికి చూచెను. అతడొకనగరముమీదగా బోవుచున్నటుల గ్రహించెను. గుఱ్ఱమును నెమ్మదిగా క్రిందికై పునకుదింపెను. అది మగధరాజ్యమునకు రాజధానియగు పాటలీపుత్రము. జనులందరు గుంపులుగుంపులు కూడియుండిరి స్త్రీలు, పురుషులు, మహాప్రవాహమువలె వచ్చుచుండిరి, పోవుచుండిరి. మేళములు–తాళములు భూనభోంతరాళమున మారుమ్రోగుచుండెను. ఆటకత్తెలనాట్యములు, పండితులవేదఘోషలు సర్చకుల పూజారాధనలు, మనోరంజకముగానుండెను. ఆ నాడు గౌరీమహోత్సవదినము. దేవాలయము కన్నులపండుగగానలంకరింపబడినది. లక్షలకొలంది దీపములుమిత్తెపుబేరుల వలె వెలిగింపబడినవి. యువతులాబాలికా వృద్ధము గౌరీ మహాదేవికి పూజాద్రవ్యములను ఫలములను సమర్పించి వందనములొనరించివచ్చుచుండిరి. కొందరు గుడిలోనికిపోవుచుండిరి. త్రొక్కిడొక్కిడిగానుండెను. ఆ తొత్తిడికి తాళలేక పసిపిల్లలు రోదపెట్టియేడ్చుచుండిరి. ఆలయమంతయు గానగోష్ఠ్య నులతో నిండిపోయెను.

ఆ సమయమున రాజకుమారి విద్యావతి యేనుగంబారి నెక్కి వచ్చుచుండెను. ముందుమంగళ వాద్యములుమ్రోగు చుండెను స్త్రీలువరుసలుకట్టి కుంకుమ పసుపుపూలు ఫలములు పత్రి మొదలగు పూజాద్రవ్యములు బంగారుపళ్ళెములంద మర్చుకొని చేతులందు పట్టుకొనివచ్చుచుండిరి. జనులలో కలకల మారంభమైనది. రాజకుమారి రాజకుమారి. విద్యావతి దేవియను కేకలు వినవచ్చినవి. జనులలో కొందరా యూరేగింపునకు కెదురుపోవుచుండిరి. కొందరు ప్రక్కకు తప్పుకొని దారియిండు దారియిండని యొత్తిగిలుచుండిరి. చోపుదారులు వెండిబెత్తములతో నదిలించుకొనుచు దారికడ్డమువచ్చినవారిని బరాబరులు చేయుచుండిరి. ఏనుగంబారిగుడివాకిటకువచ్చి నిలిచెను. స్త్రీ లొకరివెంటనొకరు గనిలొకరిగిరి మావటివాడంకుశముతో సంజ్ఞచేసెను. క్రమముగా నేనుగు వెనుకకాళ్ళనుంచి చతికిలపడినది. పనికత్తెలంబారికి నిచ్చెనను వేసిరి. ముందంబారి నుండి మహారాణి మందారమాల దిగినది. ఆమెవెనుకను రాజకుమారి విద్యావతి మేఘములోనుండి మెరపుతీగవలె బైటికివచ్చినది. జనులందరామెవంక చూచుచుండిరి. ఆమె కన్యక ప్రాయమునం దున్న యందకత్తె. అలంకారము నామెనుమరింత మెరపించుచుండెను. మగధసామ్రాజ్యాధిపతియగు శ్రీధర విద్యానాథ చక్రవర్తి కామె యొక్కతియే కూతురు. ఆగర్భ శ్రీమంతురాలు. అతిగారాబముగా పెంచబడినది ఆమె దర్శన మానాడు సంవత్సరమునకొకసారి లభించును. జనులందరు విరుగబడి యొడలంతయు కన్నులు చేసికొని యామెనుచూతురు.

అంతలో చీకటులవలె నల్లనికాంతు లలముకొనినవి 'హాతల్లీ! హాతండ్రీ' యను నేడ్పు వినిపించినది. జనులందరు నబ్బురపడి చూచిరి. ఎవరో యొక పెను రక్కసుడా కన్య నెత్తుకొని యాకాశమున కెగిరిపోయెను. కనుమూసి తెరచినంతలో నాతడు మాయమయ్యెను. జనులు పెద్దపెట్టున కేకలు నేడ్పులు సాగించిరి. దూరమునందుండి కోహలుడది చూచెను. గుఱ్ఱము నదిలించి వాని వెంటపడెను.

# జ్యోత్స్న పక్షి

'రాణీ! రాణీ!'

'ఆ'

'ఒకసారిటురా'

'ఎందుకు'

'వీరెవరో వచ్చారు'

'కూర్చుండమనకూడదా ?'

'అయ్యా దయచేయుడు'

రుద్రదమనుడు తలయెత్తిచూచెను. అది పంచెవన్నెల రామచిలుక. దాని రెక్కలు నీలకాంతులను మరపించుచుండెను. తోక బంగారువన్నెలకలదై తళతళ మెరయుచుండెను. దానిముక్కు బాగుగాపండిన దానిమ్మగింజరంగు కలిగియుండెను. మెడమీద తెల్లనిరేఖ, తలమీద నాకుపచ్చనిజుట్టు అది కొంచెము కొసలుకొసలు తిరిగుడిపై పునకువాలియుండెను. అది తనతోకను పింఛమువలె విప్పి రెక్కలాడించుచు 'రండు లోనికి దయచేయుడు' అనిపలికెను.

రుద్రదమనుడు వింతపడుచు లోనికరిగెను. అది విశాలమగు మేడ. గోడలు గరుడ పచ్చరాళ్ళతో కట్టబడినది. దానిద్వారములు బంగారముపోతపోసి రవ్వలు చిత్రవిచిత్రములుగా పూవులు కాయలు నాకులతోడి తీగెలవలె తాపపడినవి. దానిద్వారములు పద్మరాగమణులతో కూర్చబడినటుల నెఱ్ఱనికాంతులు వెలయించుచుండెను. ఆ మేడ యాకాశమునకంటుకొనుచున్నటుల నైదారంతస్థులు

కలదై యుండెను. రుద్రదమనుడు హజారముదాటి సావడిలోనికి బోయెను. అది విశాలమగు మేడభాగము. దాని కిటికీలలోనుండి చల్లని పిల్లవాయువులు వీచుచుండెను. అగరొత్తి ధూపము నాల్గువైపులకు వ్యాపించుచు చక్కనివాసనలను వెల్లిగొలుపుచుండెను. అందు వేదికలు చలువరాళ్ళతో కట్టబడి యుండెను. ఆ వేదికల కిరుప్రక్కల నీలాలతో పూబొదరిండ్లమర్చబడియుండెను. వానిమధ్యమధ్యలందు బంగారుప్రతిమలు గలవు. వేదికలన్నింటిమీద పట్టుకుచ్చులు వ్రేలాడుచున్న పచ్చని పరుపులు, వానినడుమ రతనాలుచెక్కిన కోళ్ళతోడ గద్దెయొకటి కలదు. అది చాలా యందముగాయుండెను. దాని రెండువైపులందు నెమళులు పింఛములువిప్పి యాడుచున్నటులు చిత్రింపబడిన బొమ్మలుండెను. రుద్రదమనుడా సావడి యందమునుచూచుచు నిలబడెను.

ఆ సమయమున పంజరములోనిచిలుక 'ఆర్యా! ఆ వేదికమీద కూర్చుండుడుమారాణి రాగలదు' అని వినయముంతో మనవిచేసుకొనెను.

రుద్రదమనుడు 'మీరాణి యెవరు?' అని ప్రశ్నించెను.

జ్యోత్స్నావళి.

ఆమె యెవరిపుత్రిక?

చంద్రునికుమార్తె.

చంద్రునికుమార్తెయా!

ఆ. అవును.

నే నేపురాణమునందు జదువలేదే!

పురాణములు పురాతనము. భూలోకమునందువలెనే దేవలోకమునందెప్పటికప్పుడువింతలు, వినోదములు, కథలు, గాథలు సంభవించుచుండును వానిని గ్రహించి వ్రాయుగల తపోధనులెవరు భూలోకమున లేరు. కావున నేగ్రంధము నందు చదివియుండరు.

ఈమె చంద్రునకెట్లు కుమార్తెయైనది

రాజకుమారా! వినుము. పూర్వమొకసారి పార్వతీదేవి పరమేశ్వరుని యెదుట వినోదముగా నాట్యమొనరించుచుండెను. ఆయన మహానందముతో దానినిచూచుచుండెను. ముఖమునందు రసమున కనుగుణముగా భావముకనిపించుచుండెను. అర్థమునకు తగినటుల నభినయము సాగిపోవుచుండెను. ఆమె ప్రతియంగమునందు లయానుగతముగా తాళవిన్యాసము గోచరించు చుండెను. పరమేశ్వరు డాయా విశేషములను కన్నార్పక విలోకించుచుండెను. మూడవకాలమున దేవి తాళమునుబట్టి యంగముల కదలిక నెరపుచుండెను. దానిని చూచునప్పుడు శివునకు మేనపులకలుపొడమినది. హృదయము పరవశమైనది. సంతోషాతిశయమున 'వహవ్వా' యని యొకవింతధ్వని యాయననోట నప్రయత్నముగా వెలువడినది. దానికామె మిగులనాశ్చర్యము నొందుచు శివునివంక చూచినది. ఆసమయమున అడుగు చెదరి తాళయుతప్పినది. దానికాయన పరిహాసముగా నవ్వుచు వేళాకోళముచేసెను. పార్వతికి తలవంపులైనది. ఆమె యున్నది యున్నటులనే మాయమైనది. శివునకు గుండెదడదడలాడినది. ఆయన విచారముతో నిటు నటుచూచెను.

పార్వతి కానరాలేదు. ఆయనకు నేమియు తోచలేదు. పిచ్చి వానివలె కైలాసమంతయు వెదకెను నదులు, లోయలు, గుహాలు, వనములు చూచెను పార్వతి కనబడలేదు. ఆయనకు నిస్పృహకలిగినది. నాపార్వతి యేమైనది. నేనామెను విడిచి యెట్లుండగలుగుదును. అయ్యో! యీ నాట్యము మాయెడబాటునకే కలిగినది కాబోలు. నేనేమిచేయను. ఎవరిని ప్రార్థింపను! ఎక్కడనున్నదని వెదకను.' అని పలువిధములుగా విలపించెను. పుట్టినింటి కరిగినదేమోయని పర్వతరాజు పురమునకుబచ్చెను. ఆమె యచ్చటలేదు. శివునకు భయము పుట్టినది. దాక్షాయణిని గోలుపోయి యెట్లోపార్వతిని పొందగలిగెను. మరియామెను పోగొట్టుకొనినచో గతియేమి. నాకుమారులేమగుదురు. అప్పుడు దాక్షాయణిని గురించి యడుగువారులేరు. కుమారుడుగాని గణపతిగాని నాతల్లికానరాదెక్కడికి పోయినది అని అడిగినచో నేనేమి సమాధానము చెప్పగను. నాగృహలక్ష్మియేలేనప్పుడునాకీకైలాసమెందుకు. ఈరత్నములతో వెలుగొందు గుహాలు సానువులు నాకెందుకు. ఎవరికొరకు నేనీ ప్రాణములను తాల్పవలయును.' అని యేడ్చుచు పార్వతికొరకు వెదకెను. చివరకుమానససరోవరతీరమున నొంటరిగా విచారముతో కన్నీరు దొనదొన కార్చుచున్న పార్వతిని గాంచెను. శివునకు ప్రాణములు లేచి వచ్చినవి. ఆమె శివునిచూచి మరింత దుఃఖమునయేడ్చుచు లేచిపోవ యత్నించెను. కానిశివుడామె చేయిపట్టుకొని,' నీకీ విచారమెందులకు. నేచేసినపరాధమేమి? నన్నువిడిచి రానేల యని బ్రతిమాలెను. అందులకు పార్వతి కోపముతగ్గిం

చుకొని.' చాలును నీమొగమిచ్చకపు మాటలు నాచెలుల ముందు నన్ను పరాభవించితివి. వారునన్ను వేళాకోళముగా చూచిపకపకనవ్విరి. నలువురిలో మొగముచిన్నబుచ్చిచాటున బ్రతిమాలుదురు మగవారిపనులన్నియు నిట్లే యుండును. నను ముట్టరాకుడని దూరముగా బోయెను.

శివుడు చేతులు గడ్డమునుబట్టి తనతప్పు క్షమింపుమని బ్రతిమాలుచుండెను.

ఆ సమయమున మానససరోవరమునందున్న కల్హార దేవియును కలువ కనురేకులను విచ్చి పార్వతీపరమేశ్వరులను గాంచెను. ఆమె యొడలు పులకరించినది. నూతన భావము లంకురించినది. 'అక్కటా! మాకులము వారందరికి చందమామ భర్తయని చెప్పగా వినియుంటిని నాబుద్ధి తెలిసిన నాటినుం డియు నొక్కనాడైన మాయునికి పట్టునకు వచ్చియెరుగడు. ఆకాశమున దాటులు పెట్టుచుండెను. ఒక మంచియు నొక మాటయు నాతో పలుకడు. నా కష్టసుఖములనుగురించి విచారింపడు. నన్నుచూచి తాను నవ్వును. అమృతము చిందించు నా నగవులకు నేను వికవికలగుదును. నా మనోభావము గ్రహించియైన దాపునకు చేరడు. ఆపార్వతి చేసిన తపమేమో శివుడామెను బ్రతిమాలుచున్నాడు. వారి దాంపత్య మెంతయు సంతోషము కలిగించుచున్నది. ఆ అదృష్టము నాకెట్లు లభించునోగదా? పార్వతి భర్తనుగురించి ఘోరతపముచేసినది. నేను నట్లుతపముచేసి నా భర్త యనుగ్రహము పొందెద' నని తలంచెను.

కల్హారదేవి నాకమొకలుగొని మంచు నీటికొలనునందు కంఠముసరకు మునిగి ఘోరముగు తపముగావింప మొదలు పెట్టెను. అమె చలి వానలకు చలింపలేదు. ఎండకు నోడల లేదు. ఆమె తప మొనరించునపుడు మంచురాళ్ళుకరిగి నీరయి నవి. చెట్లుయాకులు వాడి రాలిపోయినవి. ప్రకృతిరూపములు మారిపోయినవి. కాని యామె తనపట్టుదల మార్చుకొనలేదు. దేవతలుసైతము భయపడి యామె నివాసము మంచురాతి మయ మొనరించిరి. ఆ కల్హారదేవి ప్రాణములు చలింపనీయ లేదు. అల్లె పాషాణమధ్యమునందుండి మొగము నిగిడించి దీక్ష కొనసాగించినది. ఆమె తపమునకు చంద్రుడు ప్రసన్ను డైనాడు. ఒక శరత్కాలము నందలి పున్నమనాటిరాత్రి యామెకు చంద్రుడు ప్రత్యక్షమయ్యెను. కల్హారదేవి ముఖము విప్పారినది. ఆమె యంతరంగము సంతోషరసముచేత నుప్పొంగినది, కంటి రేకులల్లార్చినది. ఆచందమామ యంద 'చందమును ముఖమునంచక చూచినది. ఆయనకు మనసార నమస్కరించినది. పరవసత్వమున 'ప్రభూ ! యీ నాటికి నా తపము పండినది, దయచేయుము. నా హృదయపీఠము నలం కరింపుడు' అనిపాదములంటుకొని ప్రార్థించినది.

చంద్రుని హృదయము కరుణారసముతో నిండిపోయి నది. ఆయన సంతోషముతో కల్హారదేవిని చూచెను. తన కర ములనుచాచియామెను లేవనెత్తెను. 'దేవి నీమనస్సు నేను గ్రహించితిని, నీపరితాపము నెరిగికొంటిని. ఇందు నీ లోప మేమియులేదు. స్త్రీలు భర్తసేవను కోరుట వింతకాదు. అది సహజము. నేనుక్రూరుడనై నీకష్టము గుర్తించియు నిన్నాదరింపక

పోయితిని. నేనుపరాధీనుడను. పరమేశ్వరుడు మన యిద్దరను వేరుచేసెను. నీవు భూమియందును నేను గగనమందునుండ వలసివచ్చినది. నా యపరాధము క్షమింపుము. అని కల్హార దేవి నోదార్చెను. ఆరేయియంతయు మెతోగడపెను. కల్హార దేవికి సద్యోగర్భమున నొకకుమార్తె. జన్మించినది. ఆమె యప్పుడప్పుడే యౌవనవతియయ్యెను. తండ్రియామెకు కొలని గట్టుననే యీ రాజభవనమును నిర్మించెను. తెల్లవారుజామైనది. చంద్రుడు కల్హారవతితో

'దేవీ! నేనుపోయివచ్చెదను, ఇంకజాగుసేయరాదు. నా కనుమతినిమ్ము' అని వేడుకొనెను. కల్హారవతి భర్తను విడిచిపెట్టలేకపోయినది. కాటుకకన్నులనుండి నీరు కాలు వలు కట్టుచుండ తనముఖమును చంద్రుని వక్షమునందు చేర్చి యేడువనారంభించెను. ఆ కాటుకకన్నీరు. చంద్రుని వక్షమునపడి నల్లనైనది.

అదిచూచిచంద్రుడు'దేవీ! యేడువకుము నీవియోగము నాకును భరింపరానిదే. ఐనను తప్పనిది. నీయనురాగమునకు గుర్తుగా నీకాటుక కన్నీటిచేత నల్లనైన యీ మచ్చ నా. వక్షమునందెల్లప్పుడు చూచుకొందును నాకింక సెలవిమ్ము' అని యోదార్చి వెడలిపోయెను. ఆ మచ్చయే రాజ కుమారా! యిప్పటికిని చంద్రునిమధ్యయందు కనబడు చుండును. శుక మీ కథను చెప్పి చాలించినది.

పిమ్మట రుద్రమనుజు. 'శుకరాజమా! నీవుపక్షివై యుండియునింతవిజ్ఞానమెట్లుసంపాదించితివి. ఇంతస్ఫుటముగా

మానవులవలెనెటుమాట్లాడగలిగితివి. నాకువింతయగుచున్నది. రహస్యముకాదేని నాకుచెప్పుము.' అనియడిగెను.

అందుల కా చిలుక యిట్లు తన కథ చెప్పెను. ఆర్యా! నేను చిత్రప్రభయను విద్యాధరకుమారిని. నాట్యశాస్త్రమును నేర్చుకొనుటకు భూలోకమునకు వచ్చితిని. ఒకనాడు నేను మాగురువు లింటలేనపుడు గంగాతీరమునకు పోయితిని. అచట హరిహరసోమయాజియను నొకబ్రాహ్మణ పుంగవునిగాంచితిని. ఆయుత్తమునియందచందములు, రూపు రేఖలు నామనస్సు నాకర్షించినవి. ఎవరికి కనబడకుండ ఆయన వెంబడి నే యాయనయింటి కరిగితిని. అప్పుడే మరణించిన యా బ్రాహ్మణునిభార్య శరీరమునందు పరకాయ ప్రవేశమను విద్యచేత చొచ్చితిని. నా దేహమును పదిలముగా రత్నపురమునందలి నాయింట గుప్తపరచితిని. ఆ పురమును జ్వాలాజిహ్వుడను రాక్షసుడు జయించి స్వాధీనము చేసికొనెను. ఆ సమయమునరాక్షసులు నాయిల్లుచొచ్చి నా దేహమును కాల్చివేసిరి. నాకాసంగతి తెలియదు. కొంతకాలము హరిహరసోమయాజికి భార్యగావర్తించితిని. నాకు సుఖభోగములందాసలేని బ్రాహ్మణజీవితమునందు విరక్తి కలిగినది. ఆ శరీరమువిడిచి మరల నా నగరముకువచ్చితిని నా దేహము కొరకు వెదకితిని. అదియెచ్చటకానరాలేదు. రెంటికిచెడిన దాననైతిని. నేనుగాలిలో కొంతకాలము సంచరించుచుంటిని. ఒకచోట నీ చిలుకదేహమును గాంచి యందు ప్రవేశించితిని. నేనందందు తిరుగుచుండగా నొకవేటగాడు నన్నుచంపుటకు బాణమును గురిపెట్టెను. నేను భయమున పారివచ్చి యీ

మేడయందుచొచ్చితిని. జ్యోత్స్నావళి చేతిమీఁదఁ వ్రాలితిని. అప్పటినుండియు నే నామె పోషణలోనుంటిని.

౨

ఆసమయమున నిరువురు స్త్రీలు మేడమెట్లుదిగి రుద్రదమనునిదగ్గరకు వచ్చిరి. వారిరూపములతి విచిత్రముగానుండెను. ముఖములు మానవులముఖములను బోలియుండెను. అవి వెండివలె తళతళ మెరయుచుండెను. కనులు కోలగా లేక గుండ్రనై యుండెను. వానిలో తెల్లగుడ్డులేదు. అవి నల్లనయి చీకటులు ప్రసరించుచుండెను. నొసలసలున్నదో లేదో తెలియరాదు. ముఖముమీఁదనుండియే వెంట్రుకలు మొలిచి శిరోజములతో కలిసిపోయినవి. వారికి వెన్నునకిరువైపులందు చిన్న చిన్న రెక్కలు కలవు. ఆ రెక్కల లోనిమిడి చేతులున్నవి. అవి పొట్టివి. వారు రుద్రదమనుని సమీపించి 'రాజకుమారా! మా రాణి స్నానగృహముననున్నది. స్నానముముగించి యిప్పుడే వచ్చును. అంతవరకు నీ యాతిథ్యమును స్వీకరింపుడు. ఇవి యేఫలములు' అని చెప్పి తాము తీసికొనివచ్చిన బంగారుపళ్ళెములను వానిముందుంచిరి రుద్రదమనుడు వింతపడి వారిని చూచుచుండెను. వారికంఠస్వరములు విచిత్రముగానున్నవి. వా రాతనివంక పకపకనవ్వుచు చూచి ఏమట్లు చూచుచుంటిరి. మేము వింతగానుంటిమి కాబోలు అని వచించిరి.

అందులకు రాజకుమారుడు 'యువతులారా మీ రెవరు ? ఏ జాతికిచెందినవారు?' అని ప్రశ్నించెను.

'వారు మేము మత్స్యకన్యలము. మా రాణికి తండ్రియగు చంద్రుడు వరుణదేవునకు ప్రాణస్నేహితుడు. జ్యోత్స్నావళి వినోదముకొఱకు నిరువురను సముద్రవాసులను పంపుమని వరుణునడిగెను. వరుణదేవుడు సముద్రునకు కబురుపంపెను. సముద్రుడు మమ్మిచ్చటికి పంపించెను. అని సమాధానము చెప్పి వారిదారిని వారు వెనకవెనకకు చూచుకొనుచు వచ్చిన దారినే వెడలిపోయిరి.

రుద్రదమనుడు ప్రయాణపుబడలికచే చాలాయాకలి గొనియుండెను. మత్స్యకన్యలు తెచ్చిన ఫలములనుతీసి యొకొ క్కటి తిననారంభించెను. ఆఫలములొకదానికంటె నింకొకటి మరింత రుచికరముగానుండెను.

కొంతసేపటిలో నిద్దరుదాసీలువచ్చి 'ఆర్యా! మారాణి స్నానము ముగించినది. అలంకారగృహమునకు వెళ్ళినది. క్షణముసేపటిలో మీరు దర్శింపవచ్చును. అంతలోపున నీ పానీయములను త్రాగుడు' అని నీలమణులతో చేయబడిన రెండుగిన్నెలను రాజకుమారుని ముందుంచెను

రుద్రదమనుడు ప్రక్కకు తిరిగిచూచెను. వారిముఖ ములు లేడిముఖములనుబోలియుండెను. శరీరాంగములన్నియు మనుష్యులనుబోలియుండెను.

రుద్రదమనుడు వారితో యువతులారా మీరెవరు ? అని యడిగెను.

ఆదాసీలు అయ్యా! 'మేము జ్యోత్స్నావళికి పరిచారి కలము. నా పేరు కురంగి దీనిపేరు మృగాంగి. మేము వనలక్ష్మికి మొదట పరిచారికలము. చంద్రుడు మావనలక్ష్మికి మిత్రుడు.

ఆయన యొకనాడు మహారాణిని దర్శింపవచ్చెను. ఆమెచెంత వింజామరలు వీచుచున్న మమ్ముచూచెను. 'నాకుమా ర్తెయగు జ్యోత్స్నావళికి పరిచారికలుగా మమ్మొసంగుమని యడిగెను. ఆయనమాట కాదనలేక మమ్ము వానివెంట పంపెను. ఆనాటినుండియు మేమిచ్చట నే యుంటిమి' అని చెప్పిరి.

రుద్రదమనుడు పరిహాసముగా అమ్మలారా! మీరు చాలా యందకత్తెలు. మీకంటె నందకత్తెలుమర్త్యకన్యలు. మీ రాణి మీయందరినిమించిన యందకత్తె కావలయును. ఆమె నలంకారగృహమున నే యుండనిండు త్వరపెట్టకుడు. మీ యాతిధ్యమునకు నేను కృతజ్ఞుడను. నాకాయాసము తీరినది. పోయివత్తును' అని లేచెను.

అంతలో సర్పముఖియను నొకదాసి యచ్చటకు వచ్చెను.'రాజకుమారా! మహారాణి యలంకరించుకొనుట పూర్తియైనది. ఆమెను ముదవనమునవున్నది. మిమ్ము వెంట బెట్టుకొని రమ్మనది పోవుదమురండు అని వినయపూర్వకముగా ప్రార్థించెను. రుద్రదమను డామె నెగాదిగచూచెను. ఆ వికృతరూపమును లోలోన ఏవగించుకొనుచుండెను. ఆమె మాటలపొందిక యందముగానున్నను కంఠస్వరము కర్ణకఠోర మనిపించినది. వీరు పిశాచములో దయ్యములోయైయుందురు. వారు వికారాకారములతో నుందురని వినియుంటిని. ఆవికృత రూపులతో వీరు కొందరు కావచ్చును. ఈమె యాకారమతి భయంకరముగా నున్నది.' అని యాలోచించుచుండగా సర్పముఖి అయ్యా! యేమిటి. యట్లాలోచించుచునారు దయచేయుడు' అని బలవంతపరచెను.

రుద్రదమనుడు 'అమ్మా! నన్ను వదిలిపెట్టుము నేను పోవలయును' అని పలుకను మునుపే కరిగెను ఆమెయూర కుండలేదు. 'మా రాణి మిమ్ము తీసికొని రాకున్న మమ్ము దండించును. దయచేయుము' అని చేయి పట్టుకొనెను. రుద్రదమనుని యొడలు జలుజల్లుమనినవి. రోమములు నిక్కపొడుచుకొనినవి. కంపమెత్తినది.

రుద్రదమను డామె చేయి విదలించుకొని త్వర త్వరగా గడపదాటిపోయెను. సర్పము వానిని వెంబడించినది. ఆమె మరల తన్నెక్కడ పట్టుకొనునో యని పరుగెత్త నారంభించెను. ఆమె రాజకుమారా! అను మాగుమని వెంటపడెను. అతడు మరింత వేగముగా వెనుక వెనుకకు చూచుకొనుచు పరుగెత్తెను. ఆ సమయమున నతడొక కొండ చీలికల నడుమ నతివేగముగా ప్రవహించుచున్న సెలయేటి గుండములో పడెను. అత డెన్నిదినము లట్లు ప్రయాణము చేసెనో వానికి తెలియదు. రుద్రదమనుడు కన్నులు తెరచి చూచెను. అత డొక యందమగు దేవాలయమునందున్న టుల గ్రహించెను. అత డాలయములోనికి శిల్పములను ప్రతిమలను విగ్రహములను చూచుచు లోనికిపోయెను.

అది పాతాళేశ్వరుని యాలయము. అందు దగదగ మెరయుచున్న స్ఫటికలింగము ప్రాణముపోసిన శివస్వరూపము వలె నుండెను. దానిని చుట్టుకొని విప్పిన పడగలతో నాగరాజు గొడుగు పట్టియుండెను అవి నీలస్వేతవర్ణముతో నిజముగా నాగరాజేమో యనిపించుచుండెను. ఆ లింగమున కెదుట నొక యౌవనవతి పద్మాసనము వేసికొనికూర్చుండెను

ఆమె ముఖమండలమునుండి వెన్నెలవంటి తేజస్సు బైలు వెడలి నలువైపుల వ్యాపించుచుండెను. ఆమె కనులర్ధ నిమీలితములు. కుడిచేతియందు స్ఫటికాక్షమాల కలదు. సన్నని యామె ధరించిన కాషాయాంబరములోనుండి వెలువడిన శరీరకాంతులు కాషాయవర్ణముతో కలిసి వింతరంగుచు చుట్టుపట్టులకు ప్రసరించుచుండెను మరుట సింధూరతిలకము చందమామలోని మచ్చను తలపించుచుండెను. సన్నని కోన తేరినముక్కు. విశాలమైన చెవిని తాకుచున్నకనులు, నామె యతిసుందరమూర్తిని గావించుచుండెను. ఆమె నల్లని తల వెంట్రుకలలు మీది కెగదువ్వి ముడివైచినది. దానిచుట్టు చిరుతరుద్రాక్షలపేరు బిగించి కట్టినది. మెడలో నొంటిపేట రుద్రాక్షలు ధరించినది. ఆమెను గాంచినతోడనే పశుపతి కొఱకు తప మొనరించుచున్న పార్వతి రూపము రుద్రదమను నకు జ్ఞాపకమువచ్చినది.

రుద్రదమనుడు పాతాళేశ్వరునకు సమస్కరించెను. కొంచెముసేపు శివధ్యానముచేసికొనుచు నచట కూర్చుండెను. అంతలో నాయోగిని ధ్యానమును ముగించెను. చెలికత్తె తెచ్చిన పుష్పములచేత పరమశివుని పూజించెను. పిమ్మట నమస్కరించి 'పరమేశ్వరా! ఎంతకాల మీ వియోగమును భరింపమందువు తండ్రీ. నీకు నాపై దయరాకున్నది. నే నే యపరాధ మొనరగనిదానను. నాకీకఠినశిక్ష యేల విధించితివి. ప్రభూ! అని కన్నీరుకార్చెను. చెలికత్తె యామె యశ్రువు లను తుడుచుచు అమ్మా! ధైర్యము చిక్కపట్టుము. కష్టసుఖ ములు శాశ్వతములు. సమానసమయములు కావు. కష్టము

తీరిన వెంటసుఖములు రాకమానవు' అని ధైర్యముచెప్పెను. ఆ యోగిని హృదయభారముతో వెనుకకుతిరిగెను.

రుద్రవర్మ వారిని సమీపించి అమ్మా ! మీ రెవరో దేవతా స్వరూపులవలె కనిపించుచున్నారు. దేవతలు భోగపరులని వినియుంటిని. వారిని దుఃఖమంటదని నేను తలంచెదను. మీ రీ చిన్నతనమునందు విరక్తిపొందుటకు కారణమేమి. ఈ తాపసివేషము నేల ధరింపవలసి వచ్చినది. నాకు చెప్పనగునేని చెప్పుడు' అని యడిగెను. అంత నామె దాసి రుద్రదమునితో నిట్లనెను.

అయ్యా ! యీమె వాసుకియను నాగరాజుపుత్రిక. ఉపన్మాలయను నామె. ఈమెభర్త స్వసేనుడను నాగరాజు. అతడొకసారి విద్యాధరలోకమున సంచరింపనరిగెను. అచట విద్యుల్లేఖయను విద్యాధరాంగనను చూచెను. ఆమె త్రిలోకసుందరి. బ్రహ్మసృష్టికి ప్రతిసృష్టిగా సరస్వతి యామెను సృజించెను. ఆమెను స్వసేనుడు ప్రేమించెను. కాని యామె యందమునకు తాను లోలోన నుబికిపోవుచుండును. లోకములోని యువతులెవరు తనతో సమానులుకారని యామె గర్వమునమిడిసి పడుచుండును సత్యమున కామెయంతయందకత్తె యనుటలో సందేహము లేదు ఎవరియందమునువారు పొగడుకొనుట తన్నుతాను పొగడుకొనుటకంటె నసహ్యముగా నుండును. ఎదుటివారుచూచి నుతించుట లోకసహజము. ఒకనాడు స్వసేనుడు విద్యుల్లేఖ ను కొంటరిగాచూచెను. తన ప్రేమ సంగతి యామెకు వెల్లడించెను. ఆమెవికారముగాతలనడ్డము త్రిప్పి ముఖము చిట్లించుకొని 'నాగరాజా ! నీయందచందము

లకుతోడు నేను నీకు భార్యనుకావలయునా? ఎవరైనా విని నవ్విపోవుదురు. నీ చీమకళ్ళు చికిలిముఖముచూచి నేనేకాదు లోకములో నే యువతియు వరింపదు. చీకటికోనయగు భోగవతియందు పడియుండలేక దేవలోకమునకువచ్చియు నీవంకరదనము మానవైతివి. చాలుచాలునింక నడువుము' అని నిందించెను.

ఆమాటలు స్వసేనునకు కోపకారణములైనవి. అవమానమువలని కలిగినరోషముతో బుసలుకొట్టుచు నానాటికి తిరిగిపోయెను. కాని స్వసేనుడు విద్యుల్లేఖయందు పగపట్టియుండెను. ఆమె నెట్లయిన సాధింపవలయునని తలంచెను. విద్యుల్లేఖను విడువక మాయారూపములతో వెన్నాడనారంభించెను. విద్యుల్లేఖ కళాకరుండను నొక గంధర్వరాజకుమారుని వరించెను. ఆయనయు విద్యుల్లేఖను మనసార ప్రేమించెను. అతడతిలోకసుందరుడు. వారిరువురు ప్రతిదినము మందాకినీ తీరమున నొకవనములో కలిసికొనుచుందురు. ఆసంగతి స్వసేనుడు గ్రహించెను. వారిసంకేతస్థలమున నొక మందార వృక్షముకలదు. దానితొఱ్ఱలో స్వసేనుడు దాగియుండును. వారిసంభాషణమాలకించును. వారిచర్యలు గమనించును. ఆ వినోదములను చూచినప్పుడెల్ల స్వసేనుడు కోపమున విషజ్వాలలు గ్రక్కుచుండెను. ఆ విషాగ్నికి మందారము మాడియాకులు పూవులులేక మొండిచెట్టయినది. ఒకనాడు విద్యుల్లేఖాకళాకారులు మహావినోదమున మరిగి గానమాలపించుచుండిరి. ఆ గాన రసపారవశ్యమున నొడలు తెలియలేదు. స్వసేనునకు దుర్బుద్ధిపుట్టినది. కళాకరుని చంపినచో విద్యుల్లేఖ తన్ను

సరించుననీ యూహించెను. మందారవృక్షములోనుండివచ్చి కళాకరునదరంటకాటువేసి మాయమయ్యెను. కళాకరుడు మరణించెను. అది స్వసేనునిచర్యయని యూహ్యోగ్రహించినది. వాని కళేబరము భద్రముగా దాచియుంచెను.

కళాకరుడు భూలోకమున నొక కారణముచేత పుట్టవలసివచ్చినది. విద్యుల్లేఖ గాంధార దేశాధీశ్వరుడగు వైద్యుతికి కుమార్తెయై పుట్టినది. ఆమెకు తండ్రి రత్నప్రభ యను పేరుపెట్టెను. ఆమెకు యుక్తవయస్సురాగానే స్వయంవరము చాటించెను. దేశములలోని రాజులందరువచ్చిరి. ఆమె యెవరినివరింపలేదు. స్వసేనుడు మానవరూపమును ధరించి భూలోకమున కరిగెను. విద్యుల్లేఖను కలిసికొనెను. ఆమెకు పూర్వజన్మజ్ఞానముకలదు. స్వసేనుని గుర్తించినది. వానినొక కరండమున బంధించినది. ఆనాటినుండి యీనాటివరకు స్వసేనుడు తిరిగిరాలేదు. ఆనాగకుమారునితో పోయిన పింగాక్షుడను భటుడీసంగతి మాకు తిరిగివచ్చిచెప్పెను. స్వసేన కుమారునెట్లైన విడిపింపుమని వానిని మరల భూలోకమునకు మాదేవి పంపినది. అతడుమాయావి. అతడు పాములవాని వేషముతో రాజుగారి విషతాంత్రికునింట నుండెను. ఒకనాడు రత్నప్రభ విషతాంత్రికుడగు కపాలకుని కొఱకు కబురంపెను. అతడింట లేడు. వానిరూపముతాల్చి రత్నప్రభను దర్శించెను. సుసేనుని పింగళాక్షుని వశముగావించెను. ఎవరికెరుకరాకుండ స్వసేనుని విడిపించెను. కాని వానికోపము మితిమీరినది 'పింగళాక్షుని తనపురమునకు పొమ్మనియానతిచ్చెను. సభయందు గానాలాపముననున్న రత్నప్రభను కాటువేసెను. ఆమె మరణిం

చిన కథయంత మఱునని వానితలంపు. అదిచూచివచ్చి పింగళాక్షుడు మాదేవితో చెప్పెను. తరువాతేమిజరిగినదో తెలియదు. స్వసేనుడురాలేదు. మాదేవి యావియోగము భరింపలేక తాపసివేషముతాల్చి యీ పాతాళేశ్వరుని సేవించుచుండెను.

3

రుద్రదమనుడాదినమున నాగరాజకుమారి యింట నుండెను. ఆమె యొసగునాతిథ్యమును స్వీకరించెను. భోజనములైనవి. యువన్మాల రుద్రదమనుని సుగుణ సంపదకు మెచ్చుకొని.

'అయ్యా! మీరుభూలోకపు వాసులని తలంచెను. మీరు ప్రవేశింప నసాధ్యమగు. పాతాళనగరమున కెట్లు రాగలిగితిరి. మీరు మహారాజకుమారులవలె నగపడుచున్నారు' అనెను. రుద్రదమను డిట్లుచెప్పెను.

భరతదేశమునందలి సామ్రాజ్యములలో మగధ సామ్రాజ్యము మిగులవిఖ్యాతమైనది. దానిని శ్రీధరచక్రవర్తి పరిపాలించుచుండెను. ఆయన సకలశాస్త్ర విద్యావిధుడు. కావున రాజులందరు నాయనను శ్రీధర విద్యానాధ చక్రవర్తి యని పిలుచుచుందురు. ఆ మహారాజునకు మందారమాల యను దేవేరి కలదు. ఆ రాజదంపతులకు రుద్రదమనుడను పేరుగల నేను, విద్యావతియను నాసోదరియును జన్మించితిమి. నాతండ్రి నాకుసకలవిద్యలు చెప్పించెను. గౌతమునియొద్ద నేను వేదములను శాస్త్రములను చదివితిని. ఒకనాడు శరత్కాలములోని పౌర్ణమిరేయి నేను చంద్రశాలయందు చంద్రకాంతపు

వేదికమీద పరుండియుంటిని. నాచూపంతయు చంద్రబింబముపైపు ప్రసరించినది దానిని కన్నార్పక చూచుచుంటిని. ఆ రూపములోని యందమునకు నామనస్సుప్పొంగినది. ఆ కాంతి పుంజమునుండి ప్రవించు నమృతము నాశరీరమును చల్లపరచినది. ఆ వెన్నెల నాకొకవింత చైతన్యము కలిగించినది. నాలోనే వేవో భావములుపుట్టినవి ఈ చంద్రునికీయందము బ్రహ్మయేల కల్పించెను వానినవ్వులలో నింతకాంతి యేల పుట్టవలయును. కిరణములో నమృతముండునని విందును. ఆ యమృతమూలముననే యీ చలువతనము వికాసము కలిగియుండవచ్చును. ఈ వెన్నెలనంతయు నొకపోగుగాచేసి యమృతముతోకలిపి సర్వాంగసుందరియగు నొక స్త్రీ నేల బ్రహ్మదేవుడు సృష్టించకూడదు. బ్రహ్మమతిమాలినవాడు. వాని కీయాలోచన తోచలేదుకాబోలు. ఆయనకు తోచకపోవచ్చును. ప్రక్కన సర్వతియున్నది కదా! ఆమెయైన నేల చెప్పకూడదు. అవును చెప్పినచో బ్రహ్మసృష్టించును. భార్య మీరని భర్తయుండడు. అందులో నాయన ముసలివాడు. సరస్వతి. వయసునందున్న భార్య తప్పక యామెచెప్పినటుల చేయును. చేయగానే యీముసలి యీరూపురేఖలకు బెదిరిపోయి యీ యువతివెంట పడునని భయముకాబోలు. స్త్రీలసూయగలవారు. తమకంటె నందకత్తెలుండకూడదు, తమ భర్త యింకొక స్త్రీని వరింపకూడదు.' అని యిట్టియాలోచనలు పొడమినవి ఆ యాలోచనలలో కొంచెమునిద్రపట్టినది. ఆ సమయమున చంద్రబింబమునుండి యొక తేజము వెలువడినది. అది భూలోకమునకుదిగివచ్చుచున్నటుల తోచి

నది. ఆ తేజమంతకంతకు పెద్దవెలుగుగా మారినది. అది చంద్రునిలోనుండి యూడిపడిన యమృతపు ముద్దయో లేక వెన్నెలకునకర్మైయుండు నని యూహించితిని. అది నావైపు నకే వచ్చుచుండెను. అదిమరుక్షణమున నొకమూర్తిని దాల్చినది. మొదట నాకంటవివరముగానగుపించలేదు. రాను రాను సకలాంగములు విశదముగానగుపించినవి. తెల్లతామర వంటిముఖము దానిలోతూగాడు తుమ్మెదలవలె గాలికి చెదరి యాడుచున్న నల్లనిముంగురులు, వానిపదుము,కుంకమబొట్టు, విశాల మగునుదురు, ఉబికి చంద్రఖండములవలె నున్న చెక్కిళులు. ఆమెనిజముగా చంద్రునకు చెల్లెలో కూతురో యగుననిపించినది. ఆమె నగవు ముఖమునుండి వెన్నెలలు ప్రసరించినవి. వానిలో చల్లని యమృతము తొణికిసలాడు చుండెను. ఆమెశరీరమంతయు తెల్లనై వెన్నెలతళుకులను వెలువరించుచుండెను. ఆ మోహనమూర్తి నాకిప్పటికి కన్ను లలో మెసలుచున్నది. గులాబివన్నెగల బంగారుతీవంచు చీరెనుధరించినది. ఆమె క్రమక్రమంగా చంద్రశాలలోనికి వచ్చెను. చంద్రకాంతపు శిలావేదిక దగ్గరగా నిలచినది. నా వంకనదేచూపులు వెల్లికొలిపినవి ఆ చూపులలో పాల సముద్రపుతరంగములుపొంగి, పొరలి వరదనినించినవి. నేను నిద్రమత్తులోనుంటిని కనులు తెరుపుట పడలేదు. ఆమె నెమ్మదిగా నడుగులిడుకొనుచువచ్చి నా ప్రక్కనకూర్చు న్నది. ఆమె లోలోన నేమోయనుకొనినది ఆమెపెదవులు కదలినవి. అంతలో నాకు కన్నులు తెరుపుడు పడినవి ఆమెను చూచి తటాలున లేచితిని. ఆమె సిగ్గుపడి యాకాశమువైపున

కేగిరిపోయినది. నేనామె 'గిరి యామెపాదమందుకొంగిని దాని నామె వదలించుకొని పోయెను. కాని యామెపాదమంజీరము నాచేతచిక్కినది

సుందరుడా! నాకాలియందెమూలమున నన్ను గుర్తించ గలవు' అనిపలికి యామె వెడలిపోయినది. 'ఇదియే యామె కాలియందె' యని రుద్రదమనుడొక యందెను నాగరాజ కుమారిచేతికందిచ్చెను. మొదటనదికలయని తలంచితిని. ఈ యందెనుచూచి నిజముగా నంతయు జరిగెననినమ్మితిని.

జరిగినసంగతి నామిత్రుడగు గ్రీవేయునితో చెప్పితిని. అతడు 'మిత్రమా! రాజులకోటల నాశ్రయించి యక్షిణీదేవతలుందురు. వారు కామరూపులు ఏ యాకారమైన ధరింపగలరు. వారు రాజులను రాజకుమారులను తమవలలో వేసికొనుటకు ప్రయత్నించుచుందురు. వారినినమ్మరాదు. వారు మాయలుపన్ని ప్రాణములు తీయుదురు. అట్టివారిలో నీమె యొకతెయై యుండవచ్చును. నీవామెసంగతి. మరచిపొమ్ము' అని నాకుబోధచేసెను. కాని నామనస్సామెనుండి మరలించుకొనుటకు తిరస్కరించినది. ఆమె ప్రభావమో లేక నాభావనావిశేషమో నాకు తెలియదు. కన్నుమూసినను తెరచినను నామె రూపమే నాకనులయెదుట కనిపించినది. ఆమె చిరునవ్వులలోని వెన్నెలలే నాకుగోచరించినవి ఆమె దేవతా లోకమున విహరించు సుందరియనియు. నన్నువరించియే యిటువచ్చి యుండుననియు' నామనస్సు గట్టిగా బోధించినది. నేనామె యెడబాటు సహింపలేక పోతిని. మరల నామెనుచూడగలుగుదు నేమోయని నేనారేయిచంద్రశాలయందే

నిద్రించితిని. ఆమె నన్నువదలి బోవుచున్నపుడు నాకిచ్చిన ఈ నూలుచీరను చూచుకొనుచు నామెను తలంచుకొనుచు కాలముగడిపితిని.

నాస్థితి గ్రెవేయుకు గమనించుచునే యుండెను. నేను నానాట సుఖములందు నన్నపానములందు విముఖుండనైతిని. ఒకనాడు గ్రెవేయుకు 'మిత్రుడా! నీవ స్త్రనము బాపుకొనలేవు. కలలోచూచిన దానికై కలవరపడుట నీవంటివానికి తగినది కాదు, నామాటవినుము. హిమాలయములలోని కోనలు గుహాలు దేవతలకు విహారభూములు. ఆ యక్షిణి యచటకనపడ నచ్చును. వేటనెపమున మీతండ్రి యానతిపొందుము' అని యుపాయము చెప్పెను. నామిత్రుని మాటలు పాటించి మా తండ్రియనుమతిని బడసితిని. కొంతమంది వేటకాండ్రతో హిమాలయమునకు వచ్చితిని. అచట నొకవిశాలమగు మైదానమున గుడారములను వేయించి యందారేయి సుఖముగా గడిపితిని. మరునాడు కొందరు బలవంతులు ననుభవము కల వారు నగువేటకాండ్రతో నడవికి బయలుదేరితిని. ఆనాడు మధ్యాహ్నమువరకు పులులను వేటాడుచు బహుదూరము పర్వతాటవులందిరిగితిని. ఆసమయమున నాకు బహువిచిత్రములగు రెండుమృగములు కనిపించినవి. అట్టిజంతువులను మున్నెన్నడు నేను చూచియుండలేదు. వానిముఖము మానవుల ముఖములను పోలియుండెను. వానికనులు లేడికనుల కంటె నందమయి కాటుకరేఖలు దిద్దినటుల నుండెను. వాని ముక్కులు కొసలుతేరి నిడివిగలిగియుండెను. వానిలోనొకటి యాడుది రెండవదిమగది. ఆ యాడుమృగమునకు తలపై నిట్టు కలు తుమ్మెద రెక్కలవలె నల్లనయి వంపులుతిరిగియుండెను.

సుఖము నందమునకనుసరిం తేనిటీగలవలె . ముంగురులు గాలికి చెదరి విశాలమగు నుదురునందు తూగాడుచుండెను. మగమృగములకు శిరోజములంతపొడవుగాలేవు. వానిముఖము చంద్రబింబమువలె గుండనై బంగారు తళుకులను వెద చల్లుచుండెను. ఆ మృగముల కంఠమునందు నవరత్నహార ములు తళతళ మెరయుచుండెను. వాని ముందుపాదములు మానవుల చేతులనుబోలి యతిమృదులములుగానున్నది. అవి కూర్చుండినపుడు చేతులనగబట్టి యుంచుకొనును. నడుచు నప్పుడు వెనుకపాదములమీదనే నడుచును పరుగెత్తునప్పుడు నాల్గుపాదము లుపయోగించుకొనును. వానికి తోకలులేవు.

నేను గుట్టమునుండిదిగి మెల్లగా పొదలచాటున పొంచి పొంచి వానిసమీపమున కరిగితిని. వానిముఖములను పరిశీ లించి చూచితిని. మానవులందైన నంత యందమగు ముఖ ముల నేనుచూచియుండలేదు. ఆమృగదంపతులు వినోదముగా మాట్లాడుకొనుచు క్రీడించుచుండిరి. వారిమాటలు నాకర్థముగా కాలేదు. అవి మృగభాషవలె నరుపులుకావు, కిచకిచధ్వనులు కావు, అక్షరములు స్ఫుటముగా వినిపించినవి. వానికంఠ స్వరములు కిన్నరీతంతువుల నాదములనుబోలి వినసొంపుగా నుండెను. వాని శరీరములబట్టి వానొకయడవిజాతి స్త్రీ పురు షులైయుందురని కొంటిని. పాదములను నడకలనుబట్టి వింత రకములగు దేవతామృగములని యూహించితిని. వానిచర్యలు మానవచర్యలను బోలియుండుటచేత వానే జాతి మృగములో పోల్చుకొనలేకపోతిని. కొంతసేపు వారిని పరికించుచు నచటనేయుంటిని. వానినిపట్టుకొని మా నగరము

నకుకొనిపోవలయునని బుద్ధిపొడమినది. నేను వారిముందువచ్చి నిలచితిని. నన్నుచూచి యా మృగదంపతులు వెనుకకాళ్ళ మీదలేచి గుప్పించిముందునకురికి చేతులానేలను నానించి పరుగిడనారంభించెను. నేను వారివెంట తరుముకొనిపోయితిని. అవిచాలాదూరము న న్నొలయించుకొని పోయెను చివరికొక పొదరింటియందుదూరెను. నేను వానివెంటఆపొదరింటియందు దూరితిని. నెక్కడ వెదకిన నామృగదంపతులు గానరాలేదు.

అప్పటికి మధ్యాహ్నముదాటినది. ఎండ తీవ్రముగా నుండెను. నేను బడలికచెందియుంటిని. ఒడలంతయు చెమటలు దిగపోసినది ఆకలి మితిమీరినవి. అచట కొలనునందు స్నానముచేసి అచ్చటచ్చటనున్న ఫలములనుకోసి భుజించితిని. అంతలోనాకు కొంచెమునిద్రమత్తుగా వచ్చినది. కనులు మూసికొనిపోయిన మనుక్షణములో నా యొడలు నాకు తెలియలేదు చల్లగా యడవిచెట్లనీడయందు మేనువాల్చితిని. నిద్రాదేవి నాకష్టము మరపింపచేసనది. నేను లేచునప్పటికింకబారెడు ప్రొద్దున్నది. నాకు మనస్సులో తొందరపుట్టినది. నాపరివారము నా కొఱకెంత వ్యధపడుచుండిరో! నా యశ్వరాజ మెచ్చటనున్నదో యనుయాలోచనలుకలిగినవి. నేను లేచి మరలపోవలయునని బయులుదేరితిని. నే నేదారివెంట వచ్చితినో తెలియలేదు. ఎటుపోవలయునో గోచరింపలేదు. దారులన్నియు నగమ్యగోచరముగానుండెను. నే నిటు-నటు తిరగాడితిని. ఆ సమయమున నాకొక కేకవినిపించినది. ఎవరో నాకొఱకు వెదకుచు కేకలుపెట్టుచుంటిరని తలంచితిని. ఆ ధ్వనిని పట్టిముందునకుపోయితిని. ఆపిలచినవారెవరు కనుపించ

లేదు. కానున్నది కాకమానదని యీ దారివెంటనరిగితిని. కొంతసేపటికి నే నొకవిశాలమగు నుద్యానవనముచూచితిని. దానియందు వివిధవర్ణములగు పూలు వికసించి కనులకువిందు గొలుపుచుండెను చల్లనిమలయమారుతమువీచి నామేనిచెమట లార్చినది. నే నాతోటయందు ప్రవేశించితిని. అందు నానా విధములగు ఫలవృక్షములుకలవు. పండ్లబరువుచేత కొమ్మలు వంగియుండెను. నేను వానిని పరికించుచు ముందునకరిగితిని. ఆ పూదోటనడుమ నొక చలువరాతి మేడనుగాంచితి. అది గగనమంటుచున్నటులుండెను. అందలిశిల్పము నతివిచిత్రము. నే నావినోధములకు నానందించుచు నామేడలోనికరిగితిని. అప్పుడొక బంగారు పంజరమునందుండి పంచవన్నెల చిలుక నాకు స్వాగతమిచ్చినది.

అని యీరీతి రుద్రదమనుడు మేడలోజరిగిన సంగతియు తానచ్చటకు వచ్చినవిధమును నాగరాజకుమారినితో వివరించెను. అంత నాగరాజకుమారి చిరునవ్వుతోకించుచు నోర కంట వానినిగాంచి యిట్లనెను. రాజకుమారా! నీవు మొదట చూచిన యీ మృగములు కిన్నర మృగదంపతులు: హిమాలయంబున కుత్తరదిశయందు కిన్నర నగరమొకటికలదు, అది వారి నివాసము. అప్పుడప్పుడు వారు విహారముకొరకు మానస సరోవరప్రాంతమునకు వచ్చుచుందురు.

రాజకుమారు డేదో యడుగనెంచెను. ఆసమయమున నొక చేటివచ్చి 'అమ్మా! మీతండ్రి వాసుకి మీకై యెదురు చూచుచున్నాడు' అనిచెప్పెను. నాగపుత్రిక రుద్రదమను నొద్ద సెలవుతీసికొని తండ్రిని చూడనరిగెను.

ఐన పనియెమో మైనది. మిగిలినదికూడనీచేతిమీదనే కానీయకూడదా పార్వతీ!

ఏమైనది?

ఆడువా రసాధ్యులు. చేయవలసినది చేసి యేమి యెరుగ నట్లుందురు.

మగవారు ఇంటిలోనుండి గమనించుచుందురు.

తెలివిగలభార్యయున్నచో. భర్తకిదియే లాభము.

అవును. అయినదానికి కానిదానికి నాడుదాని నప్ప గించి మగవారుచూచుచు నూరకుందురు. ఇదియేగదా లాభము.

తప్పించుకొను నుపాయము తెలియకపోయినదిగదా.

ఆకార్యము చెడినచో వేళాకోళము, వెకచెకాలు.

నీవు సర్వసమర్థురాలవు. నిన్ను వేళాకోళము చేయు వారెవరు?

మీరే.

నే నెప్పుడైనా పరిహాసించితినా?

ఇదియంతయు నేమిటో?

పరిహాసముకాదు పార్వతీ. ప్రార్థన.

ప్రపంచ నాటకసూత్రధారులు మీరెంతకైనా సమర్థులు.

పోనిమ్ము. మనకీవాదన మెందుకు. నే చెప్పినపని చేయుదువా?

ఏమది. మరల చెంచితవేషము ధరింప మందురా?

లేదు. ఎరుకలవేషము వేయమందును.

ఎరుకల వేషమా?

అవును అప్పుడుకాని కొరతపని పూర్తికాదు.

ఏమా కొరతపని.

కోతిరూపమున నున్న ధూమ్రాక్షుని వానరాసురునితో చేర్పవలయును. వాడిప్పుడు హరిద్వారమునకు సమీపమున నున్నశితగిరి గుహాయందున్నాడు.

వానరాసురుని మీరేగదా సృజించినది.

అవును.

మీరునాటిన మొక్కనుమీరే పెంచి మీరేనరుకుదురా?

అది విషవృక్షమైనప్పు డేమిచేయవలయును?

పూర్వము విశ్వామిత్రుడు బ్రహ్మఋషి కావలయునని ఘోరమగుతపము గావించెను. ఆ తపమునకు భయమంది యింద్రుడు మేనకయను నప్సరసను రావించి విశ్వామిత్రుని తపము భంగముకావించిరమ్మని పంపెను. ఆమెను మలయ మారుత, వసంతులనుతోడిచ్చెను. వసంతుడు ముందుగా విశ్వామిత్రుని తపోవనమునకేగెను. అచటి వృక్షములు ద్రుమములు, లతలు వసంతుని మహిమచేత చిగిరించిపూలు పూచినవి. మలయమారుతుడు మనోహరముగా వీచెను. ఆ గాలికి పూలవాసనలు వ్యాపించి యడవితుమ్మెద లన్నియు తపోవనముచుట్టు చేరి పూలలోని మకరందముత్రాగి మదించి మత్తుచెందినవి. ఆచోటు విడువలేక తుమ్మెదలు తేనతుట్టెలను చెట్టునకు వందలు-వేలునిర్మించుకొని యచటనే నివసించినవి.

మేనక విశ్వామిత్రుని తనయాటపాటలచేత లోబరచుకొనెను వానితో నా వనమునపెక్కేండ్లు నివశించెను. విశ్వామిత్రునకు మేనకమీద ప్రేమచేత నొకనాడు 'మేనకా! నీకేమి కావలయును? అడుగుము అనెను.'

మేనక యాలోచించి 'స్వామీ! యీవనముమన ప్రణయమునకు గుర్తుగా నెల్లప్పుడు నిట్లేయుండునట్లుల వరమిండు' అనెను. విశ్వామిత్రుడు 'యట్లే' అనెను.

నాటినుండి యా వనమట్లేయుండెను. ఆ తుమ్మెదలు సహితము నానాట నభివృద్ధిపొందెను. ఝంఝం అని రొద చేయుచు నల్లని కారుచీకటులు క్రమ్మినట్టుల తేనెటీగలు వ్యాపించెను. అవి హిమాలయములోని క్షేత్రముల దర్శింప వచ్చుయాత్రికులను కుట్టిచంపుచుండెను. అవి నానాట పెరిగి బదరికావనముదాక బారులుకట్టియుండెను శివుడదిచూచెను. యాత్రికుల బాధలను మునులకష్టములను నడంపనెంచెను. తేనెతుట్టెలను శిధిలముగావించి, తుమ్మెదలనుచంపుటకు వానరాసురిని సృష్టించెను. అతడు తేనెపట్టులనుపిండి తేనెను త్రాగును. తుమ్మెదలనుపట్టి తినివేయును. కొలదికాలములో వనమంతయు తుమ్మెదలుబాధ లేకుండచేసెను. వానరాసుడు మధుకోశములనుతిని బలిసిపోయెను. క్రమక్రమముగా వానికి తిండి తరిగిపోయినది. ఇంక మునులమీదను యాత్రికులమీద పడి నానాహింసలు కావింప మొదలుపెట్టెను. అతడు చాలా బలవంతుడు. మానవులకు వానినిబంధింపనలవికాలేదు. వాడు కొండగుహాలలో నివసించుచుండెను. హటాత్తుగావచ్చి ప్రజలపైబడును. శివుడు వాని చర్యలను బరిశీలించెను. వానిని

పుట్టుపెట్టనుపాయము వెదుకుచుండెను. సమయమునచ్చినది. పార్వతి సహాయము కోరెను.

శివుడు పార్వతితో ప్రేయసీ! వానరాచరుడు బ్రహ్మచారి. వానిచెంత కేకోతియు పోజాలదు. భయమున వణకి పోవును. ఆడకోతిరూపమున మన్మథూ మాఘునిచూచినదాని వెంబడిపడును. వారిరువురును కాంభోజదేశమునకు రాజధాని యగు కంధోరనగరమునకు గొనిపొమ్ము. ఇప్పుడా నగరము పాడుపడియున్నది. అచటకిచేరగానే వారిరువురుశిలారూపము గొల్దురు. అంతటితో మనపని తీరిపోవును, అని నుడివెను.

కాంభోజరాజకుమారియగు రత్నప్రభాదేవిని స్వసేనుడు కసికొద్ది కాటువేసెను. ఆమె స్పృహతప్పి పడిపోయినది. దానినోటినుండి భయంకరములగు విషజ్వాలలు కోపాగ్ని జ్వాలలతో మిన్నుముట్టినది. అవి యా పూరికోట నలుదిక్కుల వ్యాపించినవి. అందుమూలమున నచటి వృక్షములన్నియు నోడిమాడిపోయినవి. సభలోనివారందరు విషవాయువులకు ప్రాణము లుక్కిరి బిక్కిరై నలుమూలలకు పారిపోయిరి. కొందరా విషకలుషిత మొలైన వాయువునుబీల్చి యచటనే మూర్చలో మునిగిపోయిరి. వారు బ్రతికియుండిరోమరణించిరో తెలుసుకొనలేకపోయిరి. రాజవాసమున జరిగిన యీ సంగతి నాలకించి జనులందరు భయపడిరి. నాలుకనరము లేనిది. ఎప్పటి కప్పుడు సమయానుకూలముగా తిరుగుచుండును. మంచిరోజులలో వేయువిధములుగా పొగడిన యీ నాలుకయే చెడు రోజులురాగానే మానవుని నిందించును. ఏ యెండకాగొడుగు పట్టుట దానిస్వభావము.

మహారాజపుత్రిక రత్నప్రభను నింతవరకు సరస్వతి యపరావతారమని, యందములకు కాణాచియని, కాంభోజ రాజ్యమును సిరిసంపదలతో నింపుటకు పుట్టిన లక్ష్మియని. ఆమెను దర్శించినచో సకలశుభములు కలుగునని కంధార పురవాసులందరు దినదినము పొగడుచుండెడివారు. కాలము తప్పివచ్చినది. ఇప్పుడు ప్రజలామెను నిందింప నారంభించిరి.

'ఎంత సౌందర్యమున్ననేమి గుణముండవలయును. అందమునుజూచుకొని మిడిసిపడి నాగరాజును నగౌరపరచి, కరండములో బంధించినది. నాగులకు కోపమువచ్చిన నూరకుందురా ? అంతముచూతురు. వారు దేవతాస్వరూపులు. వారియెడ నపరాధముచేసినది. గానపగపట్టి నాగరాజు కాటువేసినాడు. ఇప్పుడు మిడిసి పాటడగినది. చచ్చినది యామెచావక తనతోబాటు చాలామందిని చంపినది. రాజసౌధము పాడుపెట్టినది. మమ్ముకూడా కష్టములపాలుచేసినది. ఆ నాగరాజింతటితో నూరకుండడు. పట్టణము రాజ్యము సర్వనాశనముచేయును. మన మీనగరమునందుండిన మనకు వినాశముతప్పదు. ఎక్కడికైనా పోవుదము' అని జనులందరు కూడా పలుకుకొని నగరమును విడిచిపెట్టిపోయిరి. ఊరంతయు పాడుపడెను. కొందరు రాజ్యమునే విడిచి పారిపోయిరి.

సరస్వతి యానాడెడ తెగని కన్నీటిధారలతో విలపించినది. వేడినిట్టూర్పువిడిచినది. హృదయవేదనతో కొన్ని దినములవరకు మౌనముగా కాలముగడిపినది. దానికి తగినంత కారణము లేకపోలేదు. ఆమెకు మనోవేదన బ్రహ్మదేవుడు నైతము గ్రహించెను. పలువిధములుగా సరస్వతినోదార్చ

యత్నించెను. కాని యామె శాంతించుటకు బదులంతకంత కెక్కువైనది. వెక్కి వెక్కి యేడ్చినది. లాభము లేదని యా ముసలితాతయు ప్రాణమువిసిగి యూరకుండెను. వేదకుంభుడు హృదయమునకు యానందమును కలిగించి భక్తుడు. భక్తులకు కష్టమువచ్చినప్పుడామె యెట్లూరకుండగలదు. ఆమె మనస్సు పరితపించినది. ఆమె కరుణాస్వరూపురాలు. వేదకుంభుని తాను స్వయముగా సంరక్షింపకలిగియు నూరకుండవలసివచ్చినది. తానుస్వతంత్రించుట భర్తను తిరస్కరించుటయగును. అది ప్రతివ్రతలక్షణముకాదు. అటు భర్త యిటు కుమారుడు భక్తుడు రెండువైపుల రెండుచితుల తూచినది. భర్తవైపు నతల మొగ్గినది. కుమారుని బలిపుచ్చుటయేనా ? అందులకు తల్లి మనస్సు తాళలేదు. ఉపాయమూలోచించినది హంసవాహనమును పిలిచినది. దానిమీద నెక్కి కంధారనగరమునకు వచ్చినది. ఒక్కసారి గగనమునందుండి చూచినది అంతఃపురోద్యానమునందన్నియు శవములే. తలవంచుకొనినది. సరెననుకొనినది. వీరి కేహానిరాకుండా కాపాడవలయును. దురాత్ముడగు నాగరాజును దండింపవలయును. నవరత్నకంకణాంగుళీయకములచే మనోహరమగు కుడిచేతినెత్తి 'కుమారుడు సజీవుడగువరకు ఈ దరిదాపులకు వచ్చినజీవులు శిలారూపములగుదురు' అని శపించెను. నాటినుండియు జీవరాసులేవియు వైద్యుతిదుర్గ ప్రాంతములకు పోనొల్లవు అని దేవరహస్యము. మానవులెవరికి తెలియదు. దాపునకుచేరిన వారందరు శిలలగుచుండిరి. కాంభోజ గాంధార దేశములకు నిరంతరమగుపోరాటములు గలవు ఆపోరాటములు యుద్ధములుగా పరిణమించి ఒకపక్షము

గాంధారమును కాంభోజము కబళించి పురుగులను తినినబల్లి వలె పొట్టపెంచుకొనినది. మరొకప్పుడు కాంభోజము గాంధారమును పొట్టనింపుకొని కొన్నిమృగములనుతిన్న కొండచిలువ వలె నిమిడించుకొనలేక పోయినది. ఇప్పుడిప్పుడు రెండురాజ్యములుకొంచెము పొత్తుకలసి సవతిబిడ్డల ప్రేమ కలిగియుండిరి. ఇంతలో నీకథజరిగినది. గాంధారరాజకుమారుడు పాడుపడిన కంధారనగరమున కసులారచూచి యానందింపవలయుననియు ఆ రాజ్యమును వీలయినచో నపహరింపనలయుననియు వచ్చెను. దైవమువిపరీతమైనది. అతడు సపరివారముగా కోట వెలుపలలనే శిలారూపముదాల్చెను. ఇక్కెవెక్కుమంది మోసపోయిరి, పాతికేండ్లుగడచినవి కోటయంతయు చెట్లు-చేమలు జిల్లేడుమొలచి చిన్నయడవివలె తయారయినది. ఇప్పుడాదరి దాపుల కెవరుపోనొల్లరు. పోయిన తిరిగిరాజాలరు.

పార్వతీకి - పరమేశ్వరు డీవృత్తాంతమంతయువిశద పరచెను. పార్వతి శివునియానతి ననుసరించెను. యెరుకలవేషము దాల్చెను.జయ-విజయలామెకు చేతోడుగావచ్చిరి. వారు ముగ్వురు మానససరోవరము చేరువకుచేరిరి. ఎరుక లడవిజాతులలో నొకజాతివారు. వారుకోతులను కొండముచ్చులను బట్టుకొందురు. వానికి విద్దెములునేర్పి నగరములలోనికి కొనివత్తురు. వానినాడించి జీవనోపాధిసంపాదించుకొందురు. వారికి కోతులనుపట్టుకొనుటలో విచిత్రమగు నేర్పుకలదు. పార్వతి చెలికత్తెలతో నావనమంతయుగాలించి యొకచోట కనుపుసండుతని పడుకొనియున్న ఘూర్ణమానాక్షునిగాంచిరి. ఆ వానరము వీరినిచూడగానే గర్జించుచు లేచినది. పార్వతియు

మేశ్వరుడు 'దానవరాజా! నీవు తత్తరపడుటచే తనకు గదలం చినది. మరచితివి. నేనేమిచేయగలను' అని పోబోవుచుండెను

పాతాళకేతువు కొంత తెప్పరిల్లి 'నేను కోరికొనిన రూపము నాకువచ్చునట్లుచేయుము' అని అడిగెను.

శివుడు 'అట్లేజరుగును' అనిచెప్పి వెడలిపోయెను.

పిమ్మట పాతాళకేతువు తన యవివేకమును గురించి తలపోసికొని విచారించెను. 'కానిమ్ము శివుడు నన్ను మోస గించెను. వానిమోసమును వానిమీదనే యుపయోగించెదను అని యోచించెను. ఒకనాడతడు శివుని రూపతాల్చి కైలా సమునకరిగెను. ఆసమయమున శివుడు భిక్షాటనమున కరిగెను. పార్వతి జయ విజయలతో వినోదముగా మాటలాడు చుండెను. జయ విజయులు పాతాళకేతువునుగాంచి తప్పు కొనిపోయిరి. పార్వతి వానివిచూచినది. సర్వము గ్రహించి నది. తన తొల్లింటి యాకార రేఖలను కోటిరెట్లుగా పెంచి నది. తలపై మణికిరీటము కోటిసూర్యుల కాంతికలదియై తన కిరణ జాలములను దానవుని కనులలో పొడిచినట్లు ప్రసరించి నది. వానికనులు మూసుకొని పోయినవి. అంత లోక మాత 'పాతాళకేతూ! రెండుకనులు మూసుకుపోయిన మూడవకన్ను తెరువవచ్చునుగదా' అనెను.

వాడునిర్ఘాంతపోయి 'నీమగడునన్ను మోసగించినాడు. నేను మానవులకు జయింపరాని బలమును పొందవలయునని తపముచేసితిని. నాకు కోరినయాకారము తాల్చుటకు వర మిచ్చెను. అట్లయ్యెను మూడవకన్ను నాకురాలేదు. నావ రము వ్యర్థమైనది. తపమునిరర్థకమైనది' యని నిందించెను.

అంత నామహాదేవి. 'మహాదేవు డొసంగిన వరము చక్కగా నుపయోగించుకొంటివికదా? నీకంత విచారమెందులకు. నీకు కావలసినంత బలసత్వముల నిచ్చితిని. పొమ్ము' అనెను.

పాతాళకేతువు. ఆమగనిపొందిన మగనాలివి. నిన్ను మాత్రమెట్లు నమ్మవచ్చును. ఆరునెలలు స్నేహముచేసిన వారు వీరగుదురు. నావరమును నే నిక్కడనే తెల్పుకొనవలయును నీవే నాతో యుద్ధమునకురమ్ము, మాకులము నాగినిచంపిన మహాశక్తివి. నీశక్తి నేను చూచెదను' అనెను.

పార్వతి పరిహాసముచేయుచు 'ఇప్పుడుకాదు. సమయము వచ్చినప్పుడు చూతువుకాని' అని సమాధానపరచు చుండెను. అంతలోశివుడు భిక్షాటనమునుండి తిరిగి కైలాసమునకు వచ్చెను. తన యాకారనందున్న పాతాళకేతువును చూచి నిర్ఘాంతపోయెను. పార్వతి ఒకనాటకమాడతలంచినది. ఆమె యేమియునెరుగనట్లు నటించుచు భయమున బెదురు చూపులు చూచుచు 'జయా! విజయా! త్వరగారండు త్వరగారండు' అని పిలచెను

వారు వచ్చి యిరువురను చూచి యబ్బురపడిరి. భయమునవణకుచు 'అమ్మా యిదేదోమాయగానున్నది. పరమేశ్వరుని రూపముతో వచ్చెను.

'వీనిని వెడలగొట్టింపుడు' అనివారుపార్వతితోనసిరి.

ఆమెశివునివంకచూచి 'ఈతడెవగో మాయగానివలె కనిపించుచున్నవాడు. వీనికంఠములో విషమున్నది. వీని నవ ల గెంటిగొట్టుడనియానతిచ్చినది.

శివునకు భయముకలిగినది. అంత పరమశివుడు 'ప్రేయసీ! నన్నేనీవవమానించుచుంటివా? చూడుము నీవనినట్లు నా కరములో హాలహాలరేఖ కనుపించుచున్నది. వీడెవడో మాయావి'యని పార్వతిదాపునరిగి చేయిపట్టుకొని పోయెను.

'ఓయీ ధైర్యముచేసినన్ను తాకవచ్చుచుంటివా? నిన్నేమిచేయుదునో యెరుగవు. నీమాయవటలులిచ్చటసాగవు. దూరముగాపొమ్ము. పోకుంటివా' అనుచుండగా పాతాళ కేతువు పార్వతికి తనపైన మనసుపారిననని తలంచి ధైర్యం తెచ్చుకొని యిట్లనెను.

'ఓరీ! పాపి లోకంటకుడవు నీవుదుడుకుతనము చూపక యావలికి పొమ్ము పోకుంటివేని నాత్రిశూలముతో నీ శిరము ఖండించెదను' అని యుద్రేకముతో ఆనెను.

పార్వతి యా ప్రతాపోక్తులకు సంతోషించుచున్న టుల నటించుచు 'ఔను చేసినతప్పు చేసితివి. ఇకనైన తెలివి తెచ్చుకొమ్ము. సర్వాంతర్యామియగు మహాదేవుడు విజృంభించెనా లోకములేనాశనమగును. దానికితోడు నన్నులిగింప కుము. వచ్చినదారి పట్టిపోమ్ము' అనిగద్దించుచు లోనికరిగెను పాతాళకేతువనినదినిజమనినమ్మెను. వాడుపరమ మూర్ఖుడు. పార్వతిమాటలలోని సత్యమువానికర్థముకాలేదు. పాతాళ కేతువు పార్వతివెంటలోన కరుగవలయునని రెండడుగులు ముందునకువైచెను. జయ-విజయులు వానికడ్డము వచ్చి 'అయ్యా! మీలోమీకు సత్యస్వరూపమును తెలుచుకొనుసంత వరకు లోనికిరారాదు. అచ్చటనే నిలువుడు' అని ద్వారము నొద్దనిలిపిరి.

పరమేశ్వరుడు దిగాలుపడి 'పార్వతీ!' అనుమానుము. మననందీశు డుకలడు. వాడు నన్ను గుర్తించగలడు. వానినడిగి చూతము. నిజము తేలును. అంతవరకు తొందరపడకు. నీవు లేని దీ ప్రపంచమెందులకు' అని నందిని పిలచెను.

నందియు వారిరువురనుచూచి గుర్తించలేక 'స్వామీ! లోకమాతయగు పార్వతియే సత్యము తెలిసికొనలేక తబ్బిబ్బగు చున్నది. నేను పశుప్రాయుడను. తమవాహనముచు. నే నేమి గుర్తింపగలుగుదును. ఇరువురు నాకొకటిగానే కనుపించు చుండిరి. ఒకవేళ నేనవన్నైనా పొరపాటున నీరేటుని నిర్ణయించి నచో నేమగునో తెలియ' దనెను.

అంతట కుమారస్వామిని! వినాయకుని పిలపించిరి వారట్లేయనిరి. పార్వతి సకల ప్రపంచసూత్రధారణి; శివుడు సూత్రధారుడు. ఒకరినిమించినవారొకరు.విచిత్రనాటక మాడు చుండిరి

శివుడు'సరేపార్వతీ! కనకముకాంతయూరెండు ప్రపంచ నందు పోట్లాటకు కారణములు. యుద్ధములు పొసగించి రక్త పాతము కలిగింపనేల. దాక్షాయణిమరణము నాటినుండియు నేను సర్వసంగపరిత్యాగినై తపముచేయుచుంటిని. మధ్యన వచ్చిన నీ కొరకు కొంతకాలము మరలసంసారినైతిని. ఈ విరోధము నాకెందులకు. నేను దరిద్రుడను. బిక్షాటనము నా వృత్తి. కట్టుకొనుటకు బట్టయైన లేదు. నా బిక్షముతో నిద్దరి భార్యలను భరింపలేను. ఏనాడో యొకదానిని విడువ వలయునని నిచ్ఛయించుకొంటిని. ఇప్పుడు సమయము దొరికి నది. నేనింక పోయువచ్చెదను. బిడ్డలు చేతికక్కరకువచ్చిరి

కదా, నీవు సుఖపడుము. నేను తపోవనమున కరిగెదను. ఈ సంసారబంధము నాకెందుకు' అని భిక్షాపాత్ర చేతపట్టుకొని వెనుకకు తిరిగెను.

పార్వతిగుండె యీమాటలకు దడదడ కొట్టుకొనినది. కాళ్ళు తడబడినవి. నోటమాటరాలేదు. ఏదోనాటకమారంభించినదేకాని దానినెట్లు తుదముట్టింపవలయునో యామెకు తోచలేదు. జయ విజయులామెకు తోడయిరి. జయ పరమేశ్వరున కడ్డమువచ్చి 'అయ్యా! నిజము తేల్చక నిష్కారణముగ నాటకమలత ముందించుట సాంప్రదాయముకాదు.

నాదేవి మనస్సల్లకల్లోలమగుచున్నది. మగువలమనస్సు మగలుగుంజాటనతో వదిలిపెట్టరాదు. ఎవరు మా దేవి కధిపతులో తేల్చి మీరుతపోవనమునకు పోవచ్చును. మా దేవికూడ మీతోవచ్చును. ఆమె సపర్యలు చేయుచుండును. మీరు కామదహనము చేయవచ్చును. ఇట్లు పరులచేతిలో పడతిని విడిచిపెట్టిపోవుట పురుషుల లక్షణముకాదు' అని వెనుకకు మరలించెను.

'మీ రందరు నొకటైన నే నేమి చేయగలుగుదును' అని శంకరుడనెను. మంచియుపాయము పన్నినది జయ, అని గౌరి లోలోన మెచ్చుకొనెను. 'జయా! పోయినపోనిమ్ము. అతడు మాయాశంకరుడు. నాయెదుట నిలచుటకు బయపడి పోవుచున్నవాడు. ప్రాణములు దక్కించుకొని యెచ్చటికి పోగలుగుడు. నా శూలముతో పీనినిపొడిచి ప్రాయుచిత్తము చేయుదును.' అని ముందునకువచ్చి పాతాళకేతువు తనచేతి శూలమునెత్తెను. శంకరుడుకోపమాపుకొనలేక చేతిశూలముతో

దానిని భస్మముచేసి దానిని పాతాళకేతువుపై విసరెను. అది యగ్నిజ్వాలలు క్రమ్ముచు వానివెంటపడెను. అతడు ప్రాణభయముచేత పారిపోయెను. వానిని పాతాళమువరకు తరిమి శూలము తిరిగివచ్చెను. శివుడు పార్వతితో నప్పుడిట్లనెను. 'నీ సందేహము తీరినదా పార్వతీ?' యనెను.

'దుర్మార్గులకు వరములిచ్చిన ఫలితము తెలిసినదా స్వామీ!. అని పార్వతి సమాధానము చెప్పెను.

నన్నేమి చేయమందువు.

ఇదే చేయమందును,

వాడుఘోరతపము గావించెను.

అట్లని యడిగిన వెల్లయిచ్చినచో మాటి మాటికి విష్ణువెక్కడనుండి వచ్చును. ఆయనకు మాత్ర మలుసుగా నుండదా?

అలుసా! పిచ్చిదానా? నేనెవరిని? విష్ణువెవరు? యిద్దర మొకటి కాదా, యనుచు పార్వతిని కౌగలించుకొనెను.

పార్వతి అవును. పేదవాడు గొప్పవానిని నా చుట్టమని చెప్పుకొనినట్లున్నవి మీమాటలు. శ్రమపడితిరి రండు. భిక్ష లభించినదా! అని పరిహాసించెను.

అన్నపూర్ణవు నీ వుండగా కొరతపడునా ? అని శివుని దెప్పిపొడిచెను.

పాతాళకేతువు పార్వతివలన మహాబలమునుపొంది, భూమియందలి ప్రజలను హింసింపమొదలుపెట్టెను. ఏ సమయమునకు తగినరూపమువాడు ధరించును. ప్రజలను మోసగించి యంతమొదించుచుండును. జనులెవ్వరు వానినివాసము

కనుగొనకుండ పాతాళమున సింహకేతుపురమను పేర నొక పట్టణము నిర్మించెను. దానిచుట్టు ఎత్తైన గోడనుకట్టించెను. దానికి రాక్షసబలము కాపుంచెను.

ఒకనాడు పాతాళకేతువు సంచారముకొరకరిగి తిరిగి వచ్చుచుండగా పాటలీపుత్రము కనిపించెను. అచటి గౌరీ మహోత్సవము చూచుచు నాకాశమున నిలచియుండెను. శ్రీనర సార్వభౌముని పుత్రిక విద్యావతిని గాంచెను. హఠాత్తుగా నా కన్నియను గ్రద్దవలెతన్నుకొని యాకాశమార్గమున కెగసెను. దాపుననున్న కొలనులో గుఱ్ఱమునకు నీరు పెట్టుచున్న కోహలుడదిచూచెను గుఱ్ఱమునెక్కి వానిని వెన్నంట తరిమెను. వాడు పాతాళగుహయందు ప్రవేశించెను. కోహలుడువానిని విడువలేదు. వాని వెంట పడెను. పాతాళకేతువు తనపురమున ప్రవేశించెను కోహలుడు పురద్వారము చేరునప్పటికి తలుపులు బంధింపబడినవి.

౨౩

సంధ్యా! సంధ్యా! ఒకసారియిటురా. సంధ్యావతివచ్చినది. ఆమె చాలాయందకత్తె. యౌవన విలాసములన్నియు నామె ప్రతియంగమునందు నద్దమునందువలె ప్రతిఫలించుచుండెను. ఆమెను ప్రత్యేకముగా చూచినవారందరు దేవకన్యకయని భ్రాంతిపడుచుందురు. తండ్రికూడా యామె యందమునకు తగినట్లు సంధ్యావతియని పేరుపెట్టెను. మాటలలో గుణములలో తండ్రిపోలికగాని,తల్లిపోలికగాని రాలేదు. ఆమె

రత్నభూషణములు ధరించి నిలిచినచో నిజముగా సంధ్యారాగ కాంతు ... మెరూపమునుండి వెలువడుచుండును. లేత గులాబి గలశరీరము. రక్తముచిమ్ము కోమలములగున రుణారుపాద ములు లేచిగురాకులవంటి వ్రేళులు. కందినటుల నెఱ్ఱనై తళుకులు వెదచల్లు నిండుబుగ్గలు, నామె నవీనలావణ్యము నకు లావణ్యము; యౌవనమునకు యౌవనము, అందమున కందము నొదవించుచుండెను. ఆమెమందగమనములో నంద మున్నది. మాటలలో మకరందమున్నది. పాతాళకేతువు నామెను లాలించి వినసొంపగు పలుకులకొరకు నూరించు చుండును. పాతాళకేతు విట్లనెను.

అమ్మా! నీతల్లి మరణించిననాటినుండియు మానవ కన్యలను వరించి వివాహమాడవలయునను తలంపుకలిగినది. రాక్షసకన్యలు క్రూరస్వభావులు. వారు నిన్ను పలుహింసలు పాలుగావింతురు. నీక్షేమముకొరకే నే నిట్లు విచారించితిని. అందులకై నేను రాజకుమారుని రూపముదాల్చి మగధ రాజును తనకుమార్తెను నాకిమ్మని యొకప్పుడు యాచించి తిని. ఆమె విద్యావంతురాలు సౌందర్యవతి గుణవంతురాలని వినియుంటిని. ఆమెతండ్రి శ్రీధర విద్యానాధచక్రవర్తి నా ప్రార్థన మంగీకరింపలేదు. నా మోసమును కొంతవరకు గ్రహించి నాపై కత్తిదూసెను. వియ్యమునకుపోయి కయ్య మొనరింపనేలయని యప్పటి కూరకుంటిని. నే డామెనుచూడ కలిగితిని. వెంటనే బలవంతముగా నెత్తుకొని వచ్చితిని. ఇప్పు డామె మూర్ఛయందు దొడలు తెలియకపడియున్నది. నన్నొకవీర కుమారుడు తరుముకొనివచ్చెను. గమనవేగముచేత మిగుల

బడలియున్నవాడను. కొంచెము అలసటతీర్చుకొని యీ వీరు నితో కయ్యమునకేగెదను. అంతటితో చీకటిపడును. నాకు బలమునచ్చును. అంతవరకు రాజకుమార్తెను కాచుకొని యుండుము' అని వచించెను.

ఆ మోహ్యాదయము రాజకుమారి పరిస్థితి చూడగానే వెన్నవలె కరిగిపోయినది. జాలిపొడమినది. పాతాళకేతువు విద్యావతిని సంధ్యావతికప్పగించి విశ్రమింపనరిగెను. సంధ్యావతియు నామెచెలికత్తెలు విద్యావతికి నుపచారము చేసిరి. కొంతసేపటికామె వొడలు తెలిసెను. చుట్టునున్నవారినిచూచి భయముతో పెద్దపెట్టున నేడుననారంభించెను. సంధ్యావళి రాజకుమారి నోదార్చి అక్కా! నీవు భయపడకుము. నీ ప్రాణములు నేనుకాపాడెదను నామాటలు నమ్ముము. నీ కే యాపద రానీయను. శోకముమానుము' అని పలువిధములుగా మంచిమాటలతో నామెనోదార్చెను. విద్యావతి యామెను మొదట నమ్మలేదు. ఆమె దేవిపై ప్రమాణముచేసెను. విద్యావతి యామెనుకౌగలించుకొని చెల్లీ! కష్టమునందున్న నాకు నిన్నుదైవముతోడుగా చూపించినాడు. నన్ను హానిరాకుండా కాపాడుము. ఆ జన్మాంతము నీయుపకారము మరువను' అని కౌగలించుకొనెను. సంధ్యావతిచెలికత్తెలతో నీమెను నాగది లోనికి కొనిపొండు. నేనిప్పుడే వచ్చెదను'' అనిచెప్పి వెడలి పోయెను. చెలికత్తెలు విద్యావతిని సంధ్యావతిగదిలోనికి కొనిపోయిరి. ఆమెకు సన్నపానాదు లొసంగిరి. ఆమె నలంకరించి మంచిమాటలతో ధైర్యముచెప్పిరి.

సంధ్యావతి తండ్రియొద్దకుపోయెను. వానిని వినోద మగుమాటలతో సంతోషపెట్టెను. కడుపునిండ కల్లుత్రావించెను. నాయనా! విద్యావతి విషయము నాకు విడచిపెట్టుడు. ఆమె మనస్సు వ్యాకులపడియున్నది' మూర్ఛనుండి తేరుకొనగానే యామెకు నిన్ను గురించి బోధింతును. రాజకుమార్తెలు పరాక్రమవంతుడగు భర్తనువరింతురు. వారేకులమువారైనను లక్ష్యముచేయరు. నే నామెనొప్పింప చూచెదను. నేను కబురంపునంతవరకు మీరామెకంటపడరాదు' అనియొప్పించెను.

పాతాళకేతువు మత్తు తలకెక్కి కన్నుమూసెను. సంధ్యావతి కోటదాటి కోహలుని కలిసికొనెను. అతడు తనగుఱ్ఱమును చెట్టునకు కట్టివేసి కోటలోనికరుగుటకు దారికై వెదకుచుండెను. కోహలుడు సంధ్యావతిని చూచెను ఆమె తన యందమును వెలయించుచు నాతనిని గమనించనియటుల వాని ప్రక్కనుండి యరుగుచుండెను. వాని యాకార రేఖలను గమనించుచుండెను కోహలుడామెను సమీపించి నీవెవరవు? అనియడిగెను.

ఆ యువతి రెప్పలల్లాడ్చుచు చిరునగవుతో కనబడుచుంటినికదా, కన్యకను.

ఏ కన్యవు? నాగకన్యవా ?

కాదు.

దేవకన్యవా?

కొంతవరకు తెలిసికొంటివి.

మిగిలినది.

సమయమునుబట్టి తెలిసికొనగలను. మీ పేరు ?

మానవుడను.

కాక దేవతవను కొందునా! పేరు?

కోహాలుడు.

ఇచ్చటికెట్లువచ్చితిరి. ఇది పాతాళలోకము.

ఒకదానవుని తరుముకవచ్చితిని,

ఎవ్వరా దానవుడు

తెలియదు.

మంచిసమాధానము పేరు తెలియలేదు. దానవునిని తెలిసినది. ఇదెవరైన నమ్మెదురా ?

కోహాలుడు జరిగినదంతయు చెప్పెను. సంధ్యావళి యేమి యెరుగునటుల వినినది.

కోహాలుడు సుందరీ:నీవీ కోటలోని దారి చెప్పగలవా? అని ప్రశ్నించెను.

చెప్పిన నాకేమి లాభము ?

మాలోకములోని యొకమహావీరుని సాధింతును.

ఇంతేనా!

తప్పుచేసిన వారిని దండించకూడదా!

మీకది తప్పుగా తోచవచ్చును. వారికి నొప్పుగా తోచవచ్చును. తప్పొప్పుల నిర్ణయింప గలవారెవరు! ఐన నాకదియంతయు నేటికి. దారి చూపినచో నే చెప్పినటుల చేయుదురా!

ఆ.

మాటను తప్పకుకదా.

తప్పను.

ప్రమాణము

సంధ్యావతి చేయిచాచినది. కోహాలుడు దేవిమీద ప్రమాణముచేసి చేతిలో చేయివేసినాడు. ఆమె యాచేతి నట్లే పట్టుకొనినది. దానిని తన రొమ్మునకు హత్తుకొనినది. కోహాలుడామెను మనసారచూచెను. అత డింతవరకు నే కన్యను కన్నెత్తిచూడలేదు.

నేను ధన్యురాలను అన్నది సంధ్యావతి.

నేను నట్లే తలంచుచుంటిని నీకొరకే దైవమువన్నిట్లు తీసికొని వచ్చెను. అని కోహాలుడనెను.

సంధ్యావతి పరవశత్వము నొందినది. కోహాలుని చేయి పట్టుకొని యొక రహస్యప్రదేశమునకు తీసుకొనిపోయెను. వారిరువురొక చలువరాతి వేదికమీద కూర్చుండిరి. సంధ్యావతి తనవృత్తాంత మిట్లు చెప్పనారంభించెను.

ఆర్యా! మలయపర్వతమను పేరు విని యుండిరికదా. అది లోకమునందు పేరు పొందిన పర్వతములలో ప్రధానమైనది. అందు మంచి గంధపు వృక్షములు పెరిగి యొక దానితో నొకటి దట్టముగా నల్లుకొని చలువనీడలను ప్రసాదించుచుండును. మారుతము లెగబడి సువాసనలను వెదజల్లుచుండును. దాని సానువులందలి చంద్రకాంత శిలాసముదాయములు వెన్నెలరేలలందు చెమరించి గ్రీష్మకాలము నందు సైతము చల్లదనమును కలిగించుచుండును. ఆ గిరి యందుపెరిగిన గొజ్జగపూపొదిరిండ్లనుండి కురియుపన్నీరు కాలువల మూలమున ప్రవహించి యచటి వృక్షముల పెరుగు

దలకు సహాయపడుచుండును అచటి జ్యోతిర్లతలు చీకటిరేల యందు వెన్నెలను ప్రసాదించును. ఆ పర్వతము సిద్ధులకు, సాధువులకు, విద్యాధరులకు నివాసము. వారిలో విద్యున్మాలి యను విద్యాధరపతికలడు. వానికి విద్యుద్వతి యను కూతురు కలదు. శరీరకాంతిచేత మెరపుతీగెలను గెలుచుటచేత నామె కా పేరు సార్థకమైనది. ఆ కన్య చిన్నతనమునుండియు గౌరీదేవిని పూజించుచుండెను. ఆమె యౌవనవతియై విద్యాధర కన్యలలలో నందచందములకు, గుణములకు, సంగీత సాహిత్యములకు పేరు పొందిన యువతియైనది. ఒకనాడాకన్య తోటిబాలికలతో గలిసి కైలాసమున పార్వతిని దర్శింప నరిగెను అవి మహోత్సవ దినములు. దేవతలందరా మహాదేవినిదర్శించి పూజించుచుండిరి. విద్యుద్వతియు భక్తి తాత్పర్యములతో నామె పాదములు పూజించెను. కొంతసేపా పర్వత సానువులందలి మందారవనము నందాడుచు పాడుచు కాలమును గడిపెను. అప్పటికి మధ్యాహ్నకాలమైనది. అచట నురుగులుగట్టి యుప్పొంగుచు ప్రవహించుచున్న మందాకిని యందు జలకమాడవలయునని తోడిబాలికలతో నా నదీ తీరమున కరిగెను. అచట దట్టముగా పెరిగిన పూపొదల మధ్య నొక సిద్ధుడు పద్మాసనాసీనుడై శివధ్యాన మొనరించుచుండెను. వాని తల వెండ్రుకలు జడలుకట్టి క్రిందివరకు వ్రేలాడుచుండెను. గడ్డము మీసములు పెరిగి ముఖమంతయు కప్పివేసినవి. కనులు, ముక్కు, నోరు కానరాకుండెను. అతడు బక్కచిక్కి యస్థిపంజరమువలె నుండెను. అతడు మరిగుజ్జు రూపమువాడు.

మే మంసరము వానిచుట్టు చేరితిమి పలువిధముల పరిహాసములు గావించుచు, చప్పటులు చరచుచు, వికవిక నవ్వుచు వాని గడ్డము తల వెండ్రుకలు పీకుచు పలువిధ ముల బాధపెట్టితిమి.

ఆ సిద్ధుడు కనులు తెరిచిమముచూచెను. ఆచూపులలో కోపము గాని యుద్రేకముగాని కనిపించలేదు. మేము వాని విధమునుచూచి యసమర్థుడని తలంచితిమి. వానిని మరింత వేళాకోళముచేయుచు దాపుననున్న లతలనుండి పూవులను రెమ్మలను కోసి వానిమీద విసిరితిమి. అతడు చిరునగవు లతో నావంకచూచి యువతీ! నీ వెవరి కూతురవు ? యని ప్రశ్నించెను.

నేను నవ్వులాటలకు "పాతాళకేతువుకూతురను" అని యంటిని.

పాతాళకేతు వెవరో నాకునిజమునకు తెలియదు. నా నోటికా పేరువచ్చినది. అది చెప్పితిని. అతడు చిరునవ్వుతో 'యౌవనవతీ! నీకెంత మోజుకలదో యట్లే కానిమ్ము" అని పలికి వెడలి పోయెను. వానిమాటలు నాకర్థముకాలేదు. నేను నా యకృత్యములనప్పుడొక్కసారిగా తలంచుకొంటిని. నాకు పెద్ద పెట్టున దుఃఖమువచ్చినది. ఆమహాత్ముని పాదములమీద పడ వలయునని యిటునటు చూచితిని. కాని యాయన మాయ మయ్యెను. నా దేవియే నాకురక్షణయని తలంచితిని. నా యకృత్యము నివేదించితిని. నా యజ్ఞానము సహింపుమని కాళ్ళంబడి ప్రార్థించితిని.

ఆ లోకమాత "విద్యుద్వతీ! విలపింపకుము. కర్మఫల మనుభవింపక తప్పదు. నీవు పాతాళకేతువునకు పుత్రికవై రాక్షసకులమున పుట్టుదువు నన్ను పూజించిన కారణముచేత నీకు పూర్వజన్మస్మృతి కలుగును. నీవొక మానవురాలిని రక్షించి యొక మానవుని వరింతువు వానితో సకలైశ్వర్యముల ననుభవింతువు" అనివచించెను. నేను పాతాళలోకమున పాతాళకేతువునకు పుత్రికనై జన్మించితిని.

కోహలున కనుమానముతోచినది. రాక్షసులు మాయలువన్నెడురు అబద్ధములాడుదురు. వారిని నమ్మరాదు. ఈమె రాక్షసునిపుత్రిక, అందు విరోధునికూతురు. ఈమెను నమ్ముటెట్లు? ఈమె నన్ను మోసముచేసి ముందుగా దేవి మీద ప్రమాణముచేయించుకొనినది. దాని నబద్ధముచేయుటెట్లు! అని గుంజాటనపడనారంభించెను. అంతలో వానికేదో ధైర్యముతోచినది. అయినదికాకమానదు. రాజపుత్రికనెట్లైన రక్షింపవలయును ఆలస్యముచేయరాదు. అన్నిటికా వింధ్యవాసినియేకలదని తలంచుకొనెను.

౬

'సంధ్యావతీ! యింతవరకు నీకథయే చెప్పితివి. రాజకుమారిసంగతి చెప్పవైతివి' అని కోహలుడడిగెను.

రాజా! రాజకుమారిని నాతండ్రిపాతాళకేతు వెత్తుకొనివచ్చెను. ఆమెకేమియు భయములేదు. నాయంతఃపురము నందున్నది. కొన్నిదినములవరకు నామెమాట తలంపవలదని నాతండ్రికి చెప్పితిని. ఆయన యందులకంగీకరించెను. అని

సంధ్యావతి సమాధానము చెప్పినది.

కోహాలునకు రాజకుమారిని చూడవలయునని కోరిక కలిగినది. ఆమాట ప్రసంగించినచో నామెమనస్సు కల్లోల పడునని యు నందువలన మొదటికే మోసము రావచ్చునని యు నాలోచించి యూరకుండెను. కోహాలు డామె ప్రాణములు రక్షింపవలయునని తహతహపడెను.

ఇప్పుడామెను రక్షించుటెట్లు? అని కోహాలుడు ప్రశ్నించెను.

ఆమె కోహాలునింక కన్నార్పక నొక్కక్షణము చూచెను. కోహాలుడు నట్లేచూచెను. కాని వారిచూపులలో భేదమున్నది. సంధ్యావతి ప్రేమపూరితములైనవి లోకన ములు. కోహాలు నిది యాలోచనా పూరితములైనది. ఆమె యేమి సమాధానము చెప్పునోయని యెదురుచూచుచుండెను. సంధ్యావతి కోహాలునిచేతిని తన వక్షముమీద నుంచుకొని నది. ఆమెముఖములో దీనతయు వినయము నగుపించినది. కోహాలు డది గ్రహించెను. ఆమె మనోభావము గ్రహించెను. అతడు ధైర్యశాలి. ఏమైన ననినమాటతప్పుట వానిజీవితచరి త్రమునందు లేదు. సంధ్యావతి యేమియు పలుకలేదు. ఆమె కనులలో నీరు సుళ్లుతిరిగినది. దానియర్థము కోహాలుడు గ్రహించెను. కాని యొకమూల ననుమానపురేఖలు చీకటిమచ్చలను కలిగించుచుండెను. కోహాలుడు మాట లాడలేదు.

సంధ్యావతి ఏమి నన్ననుమానించు చుంటిరా? యని దీనముగా నడిగెను.

లేదు సంధ్యా! లేదు.

మరి యెందుకాలోచన?

అదియు లేదు.

అయిన నాతోరండు.

సంధ్యావతి లేచినది కోహలుడుకూడ లేచెను. ఆమె ముందునడిచినది. కోహలుడు మాటలాడక వెంబడించెను. గుఱ్ఱము వారి ననుసరించినది. అప్పటికి చీకటు లావరించుచుండెను. వారు రహస్యమార్గమున కోటలోనికి ప్రవేశించిరి. విశాలమగు పూదోటనడుమనుండి కోహలుని తన యంతఃపురములోనికి తీసికొనిపోయెను.

రాజకుమారి యెక్కడ?

మీ రామెను ప్రేమించితిరా?

లేదు. నే నామెను చూడనేలేదు.

మీ కెందుకింతతొందర.

ఆమెను చూడవలయుననని.

చూచిన వివాహమాడుదురా!

కోహలు డామె యనుమానము గ్రహించెను. లేదు సంధ్యా లేదు. ఏమైనను నిన్నే పరిణయమాడతలంచితిని. సంధ్యావతి యుబ్బిపోయినది.

సత్యమా!

నిజము. కోహలునిమాటకు తిరుగులేదు.

సంధ్యావతి పరవశమైనది. కోహలుని పాదాలమీాద పడి కన్నీటితో వానిని కడిగినది. కోహలుడామెను లేవనెత్తెను.

'స్వామీ ! నాతపము ఫలించినది' అని యాతని పాదములు కనులకద్దుకొనినది. కోహలుని వెంటనిడుకొని విద్యావతి యొద్దకు తీసికొనిపోయెను. పరిచారికలామె కిరువంకల నిలిచి పరిచర్యలు చేయుచుండిరి. ఆమెముఖమున విషాదరేఖ లస్తమించినవి.

సంధ్యావతి 'స్వామీ ! ఈమెయే రాజకుమారి' అని చూపెను.

కోహలు డామెవంక తలవాల్చి చూచెను. కోహలుడిప్పుడు మానసికముగా వివాహితుడు. రాజకుమారి కన్యయైనను వానితలంపులో నామె పరస్త్రీ. కావున నామెవంక పూర్తిగా చూడలేకపోయెను. రాజకుమారియు కోహలునోరకంట చూచినది. తల వంచినది. అతడు సంధ్యావతి భర్తయనియే యామెతలంపు. ఆమె తన్ను కష్టమునందు తెప్పవలె నాదుకొనినది. కోహలుడామెకు నాప్తురాలివిభుడు. తాను కన్యయైన నాతనిని కన్నార చూడలేదు. విద్యావతి కోహలునిగాంచి లేచి నిలిచినది.

కోహలుడు 'సరే' యని సంధ్యావతివెంట వెడలిపోయెను.

తరువాత విద్యావతి సంధ్యావతి చెలికత్తెల నడుగవలయునని తలంచినది. కాని యామెయున్నది పరప్రదేశము. వారన్యవిధములుగా తలంతురని యూహించి యూరకుండెను. అదియుగాక వారిమనోవృత్తు లామె యెరుగదు. సంధ్యావతి యొకపనికై తనుపిలిచి యేదో చెప్పిపంపెను. ఆమె మిగిలినవారికి చాటుగా నామాటలు వినిపించినది.

సంధ్యావతి కోహలుని తన శయ్యామందిరమునకు తీసికొనిపోయెను. కావలసిన సపర్యలన్నియు తాను స్వయంగా చేసినది. మరల విద్యావతిని చూడవచ్చినది. కోహలున కా రేయి నిద్రపట్టలేదు. సర్వమయోమయముగా తోచినది ఏది సత్యమో ఏది మోసమో గ్రహించలేకపోయెను. సంధ్యావతియందొకవిధముగా నమ్మకము కుదిరినది. జన్మమునుగురించియు తండ్రినిగురించియు తలంచినపుడు మోసమేమో యనిపించినది. ఆరేయి యంతయు నాలోచనలతో గడచినది. చివరకు వింధ్యవాసినీదేవిమీద సకలభారము మోపి విశ్వాసముతో కనుమోడ్చెను ఆమె వానికి స్వప్నమున్నందు కనిపించినది.

'కోహలా! సందేహింపకు సంధ్యావతి చెప్పినదంతయు నిజము. ఆమెను వివాహమాడి సుఖింపుము. పాతాళకేతునృపు నీలోనుండి నేనుమడియింతును. విద్యావతిని వదలింపుము నినామె వరింపగలదు' అని బోధించెను.

కోహలుడులికిపడి లేచెను. అప్పటికి తెల్లవారుజామైనది. సంధ్యావతి కోహలుని చూడవచ్చెను. కోహలుడామెను గాంచినంతనే వికసించినముఖముతో నామెకెదురుపోయెను. ఆమె వానిపాదములకు నమస్కరించినది.

ఆర్యా! రాత్రి సుఖముగా నిద్రపట్టినదా? యని ప్రశ్నించెను.

వాని సందేహములన్నియు తీరిపోయినవి. హృదయము స్ఫటికమువలె నిర్మలమైనది. సంధ్యావతి సుందరాకృతి దానియందు స్ఫుటముగా ప్రతిఫలించినది.

ఆమెను చేతిలోనికి తీసుకొని సంధ్యా! నీవు జేసినది నాకు నిద్రయెక్కడిది? అని సమాధానము చెప్పెను.

ఆమె కావచనములు మహానందము కలిగించినది.

ఇప్పటికి నాపై యనుమానము తీరినదికాబోలు.

నిజము సంధ్యా నిజము. వింధ్యవాసిని నాకు కనిపించి యంతయు చెప్పినది.

ఏమని?

సంధ్యావతి చెప్పినదంతయు నిజము. ఆమెను పరిణయ మాడుమని.

అట్లయిన నామాట నమ్మలేదన్నమాట!

సంధ్యా నీవేచెప్పు క్రౌర్త్తదానవు అను రాక్షసుని పుత్రికవు. నీతండ్రిని చంపవచ్చినవాడను నేను. ఇక్కడంతయు నగమ్యగోచరముగా నున్నది. నే నెట్లు నమ్మగలుగుదును. నీవే నాస్థితియందున్నచో నీమనస్సెట్లులుండునో చెప్పు' అని యామెయున్న స్థితియంతయు విశదపరచెను.

వాని సత్యవచనములకామె సంతోషించెను. వానికి కావలసినవన్నియు గడపినది 'స్వామీ! నాండ్రి యిప్పటికి నిద్ర మేల్కొనియుండును ఆయనను చూచివత్తును' అని కోహలునియనుమతి తీసికొనితండ్రిని చూడనరిగెను. కోహలు నకుహృదయభారమంతయుతీరినది. సంతోషము చేకూరినది. వింధ్యావాసినీదేవిని ననేక విధముల నుతించుచు ముందు నగరీను సూలోచించుచు స్వేచ్ఛగా నుండెను.

ప్రాతఃకాళకేతున్ను నిద్రమేలుకొనెను. అలవాటుచొప్పున సంధ్యావతిని చూడవలయునని తలంపున బయలుదేరెను. ఆమె

ప్రతిదినము తెల్లవారగానే తండ్రిని చూడవచ్చెడిది. నాడు రాలేదు. విద్యావతితో ప్రొద్దుపోవువరకు కాలము గడిపియుండవచ్చును. ప్రొద్దెక్కినను నిద్రలేవలేదు కాబోలు. ఆమెను చూచివచ్చెదగాక యని తలంచి సంధ్యావతి మేడలోనికి వచ్చెను. అచట నామె కొఱకు వెదకెను. ఎచ్చట కానరాలేదు. ఆమె చెలికత్తెల నడిగెను. వారందరు నిప్పుడే యెచ్చటికో పోయెనని చెప్పిరి. గదులు వెంట గదులు వెదకెను. ఆమె కానరాలేదు. గొంతెత్తి పిలిచెను. సమాధానము లేదు. చివరి కామె పడకగది దగ్గరకు వచ్చెను. అది లోపల బంధింపబడి యుండెను పాతాళకేతువు 'అమ్మా! సంద్యా! సంధ్యా' యని పిలిచెను.

గోపాలుడు ధైర్యముగా గడియతీసెను. వానికి వింధ్యవాసినీదేవి శ్రీరామరక్షయని తెలియును. ఆమె యభయమిచ్చినది. వానికి భయమెక్కడిది గోపాలుడు రెండు చేతులుచాచి తలుపులు తెరచి నిలిచెను. పాతాళకేతువు వానినిగాంచి యాశ్చర్యపోయెను. క్షణమువరకు తెరచిన నోరుమూయలేదు. పెట్టినకాలు కదలించలేదు. మరల మరల వానిని నాపాదమస్తకము పరిశీలించెను. 'అవును అదే రూపము: అనుకొనుచు కనులునులుముకొని మరలచూచెను.

'సందేహములేదు అదే ముఖము, అవే కనులు. అదే కిరీటము. అదేయాకారము ఆనాడు కైలాసమున చూచితిని. నేను మరలచూచితిని.' అనుకొనుచు కొంతమనస్సు నిబ్బరము తెచ్చుకొనెను

నీ విక్కడి కేలవచ్చితివి? అని కోహలుని ప్రశ్నించెను. కోహలునకు వానిచర్యలు విచిత్రముగా తోచుచుండెను. వానిమాటలు వింతగానుండెను. తలను తడుముకొనెను. కిరీటము లేదు. వీనికి పిచ్చియెత్తియుండవచ్చుననియూహించెను. కైలాసమేమిటి. కిరీటమేమిటి. వానికర్థముకాలేదు. కైలాసవాసినియగు మహాదేవి కోహలునావేశించినది. వానియందు పాతాళకేతువు నామహాదేవి రూపము కనపడుచుండెను. ఆ మహాశక్తి 'నీకొరకే వచ్చితిని' అని సమాధానము చెప్పెను.

నా కొరకా?

అవును.

ఎందుకు?

నీవు కోరితివికదా?

పాతాళకేతువు పొంగిపోయెను తనపంట పండినదను కొనెను కాని మహాదేవి మనోభావము వాడు గ్రహించ లేదు. వాడు ముందడుగువేశను.

'ఇది యంతఃపురము. కన్యకలుండునది. వారందరు బెదరిపోవుదురు బైటికిరానిమ్ము, అటుపోదము' అని పార్వతి ముందు దారితీసెను. దానవు డామెను మహానందముతో వెంబడించెను.

శంభునిల్లాలు వానిని మేడవెలుపలికి కొనిపోయెను. అచటవానివైపు ముఖమై నిలిచెను. తొల్లింటియారూపమామె యందు కనిపించలేదు. ముఖము రక్తారుణకాంతులను ప్రసరించుచుండెను చెవులనంటి వెలయు కనులెఱ్ఱకమలములవలె విప్పారియుండెను. పద్మరాగమణి ఖచితమైనకిరీట ముదయ

భానురుచులను ప్రసరించుచుండెను. పాశమునంకుశము గద ఖడ్గములతోడ నాల్గుభాహువు లతిభయంకరములై కనిపించెను సంధ్యారుణమైన చీరెను సవరించి పైటపడుకునును బిగించి యా యాదిశక్తి ప్రాణకంటకమై వానిముందు నిలిచినది. పాతాళకేతువు మేనుఝల్లుమనినది. గుండె దడదడ కొట్టుకొనినది.

'మూర్ఖుడా! అట్లుచూచెదవేమి. బలగర్వమున నాతో యుద్ధము చేయుదునంటివిక దా? నీబలము పరీక్షించుకొనుము. నేటితో నీకు ఋణముతీరినది' అని వానిమీదకి ఖడ్గమునెత్తెను. వాడు నధైర్యము తెచ్చుకొని యాదేవి నెదిరించెను. రాక్షసు లందరా యలజడికి చుట్టుమూగిరి. అందరకు నాదేవియాకృతి కోహలుని రూపమువలెనె కనిపించినది. పాతాళకేతువునకు మాత్రమాదిశక్తిగా గోచరించినది. రాక్షసులు ఖడ్గములను ధరించి యాభయంకరమూర్తిపై నురికిరి. అందరి కన్ని రూపుల నగుపించుచు వారినందరిని వధించెను. అంతలో విద్యావతియు సంధ్యావతియు నచటికినచ్చిరి. ఆయుద్ధమును కోహలుని పరాక్రమముచూచి యాశ్చర్యపడిరి. ఆ మహాశక్తి చివరకు పాతాళకేతువుశిరమునుఖండించి. తనయుగ్రరూపము నుపసంహరించుకొనెను. సంధ్యావతి యింత జరుగునని తలంపలేదు. తండ్రికొరకు గొల్లుగొల్లున నేడువనారంభించెను. కోహలుడామెను నోదార్చి లోనికికొనిపోయెను. రాక్షసు లెక్కడి వారక్కడ పారిపోయిరి.

నాగరాజకుమారీ! నీ విషాదకలుషితమగు ముఖము చూచునప్పుడు నాహృదయము సమూలముగా కదలిపోవుచున్నది. మీవంటి యుత్తమవనితలకు నే నేయుపకారము చేయలేని నా యసమర్థతకు నేనే లోలోన సిగ్గిలుచుంటిని. అమ్మా!యెంతకాల మీ విషాద సముద్రము నీదగలరు. ధైర్యము నవలంబింపుము.

రాజకుమారా! ధైర్యమును వహింపక చేయగలిగిన దేమున్నది. సర్వమునరయుచున్న యాపరమేశ్వరుడే నాకుపకారము చేయలేనప్పుడు మానవు లేమిచేయగలరు. జన్మాంతరపాపఫలము వడ్డీతో వేయిరెట్లనుభవింపక తీరదు. నాకై మీరు విచారింపకుడు. నాకీ మరణవ్యథతప్పనిది.

నాగరాజకుమారి కనులనుండి యెడతెగని కన్నీటి దారలు ప్రవహించినవి. ఆమెస్థితి గారకట్టినపుండు రేపినటులైనది. ఆమె భరింపరాని మనోవేదన యనుభవించినది. చెలికత్తెలామె నోదార్చిరి. వరదలుకట్టి నురుగులు గ్రక్కుచు నుప్పొంగివచ్చు నదీప్రవాహమున కెవరడ్డుకట్ట వేయగలరు. ఒకవేళ వేసినను దానిని త్రెంచుకొని మరింతపొరలివచ్చును. నాగకుమారి వివేకముగలది. **మనోవేగము**నడచుకొనగలశక్తి యామెయందున్నది. ఐననేమి? శోకవాహిని యాశక్తి నతిక్రమించినది. ముఖముచేతులలో దాచుకొని యేడువనారంభించినది. ఆ యావేదన రుద్రదమనుడుచూడలేకపోయెను. వాని కనులవెంట నీరుకారినది. నాగకుమారి నీవు **వూరడిల్లుము.**

నేనా కంధారనగరమునకుపోయి పుట్టలు, గుట్టలు గాలించి నీ విభుడెక్కడున్నను కొనివత్తును.

రాజకుమారా! అది నీకుసాధ్యముకానిపని నాగరాజుల గుర్తించుట మానవుల కసాధ్యము.

అట్లయిన నాతో నెవరినైన పంపకూడదా ?

పోయినవారు తిరిగిరాలేదు మీరు తిరిగివత్తురని నమ్మకము నాకులేదు. వారిట్లు మాట్లాడుకొనుచుండగా నొక దూతిక యచటికివచ్చెను. ఆమె నాగకుమారికి నమస్కరించి యిట్లుచెప్పెను 'చెలీ! ఉపనాగ్మలా మనలోకములు, మేనులు కులములు, వేరయ్యును ప్రాణములొకటిగా జీవించితిమి. నీవు పతివియోగమున క్రుంగికూనమగుచుంటివి. నేను మోహాబంధములందు తగులుకొని కృశించుచుంటిని ఇరువుర పరిస్థితు లొకటిగానున్నవి. నీవింక నయము. నిన్ను శోకాగ్ని యొకటియే కాల్చుచున్నది. నాసంగతి నేమిచెప్పుదును. నాతండ్రి కరములే నన్నుచిదాగ్నివలె దహించివేయుచున్నవి నాపెంచిన చిలుకల పలుకలలో దావాగ్ని ప్రజ్వరించుచున్నది. వసంతారామము కాలానలమును వెడల గ్రక్కుచున్నది. ఈ పంచాగ్ని మధ్యమున నేనింక బ్రతుకజాలను. నా ప్రాణములు విడుచుటకుపూర్వము నిన్నొకసారి చూడవలయునని యున్నది. నా చెలి వెంటరావలసినది. నిన్నుచూచి ప్రాణములు విడుతును.'

రుద్రదమను డావార్తవినెను. నాగరాజకుమారిని 'నెవ రాచెలి' యని ప్రశ్నించెను.

ఆమె నవ్వుచు 'మాచెలి మీవలెనే యెవరో పేరులేని పెద్ద రాజకుమారుని వరించి వలపుగొన్నది. ఐన నొకసారి

చూచిరావలయును మీరు నావెంట వచ్చినచో నిరువురి మనోరథములు తీరవచ్చును' అనెను.

రుద్రదమను డంగీకరించెను. వారు రథములనెక్కి పాతాళమునుండి బయలుదేరిరి వాయువేగముతో పాతాళ మునుదాటి రథములు భూలోకమునకు వచ్చెను. అవి హిమ వత్పర్వతములమీదుగా మానససరోవర ప్రాంతములకుచేరెను. రుద్రదమను డాదారిని గుర్తించెను. తొల్లి జ్యోత్స్నావళిసౌధము నకు పోయినమార్గమది. కొంతసేపటికి రథములురెండు జ్యోత్స్నావళి సౌధమెదుట నిలిచినవి. రుద్రదమనుడాశ్చర్య ముతో నాగరాజకుమారిని సమీపించి యిట్లనెను.

నాగరాజకుమారీ! ఇదిజ్యోత్స్నావళి నివాసముకాదా!
అవును.
మీచెలి జ్యోత్స్నావళియా !
అవును.
రుద్రదమనునకు తొల్లింటి కథజ్ఞాపకమునకు వచ్చినది.
అట్లయిన నే నింకనామెను చూడవలసిన పనిలేదు.
ఎందుకని ?
అదివరకే మీకు చెప్పితినికదా !

రాజకుమారా ! నీవు పొరబడుచున్నావు. వినోదాకృ తులనుచూచి నాయకురాలి రూపరేఖలూహించుట పొరపాటు.

ఏమీ నేను చూచినవన్నియు వినోదరూపములా ?

అవును. ఆమెతండ్రి యొకొక్కచోటునుండి యొకొక్క దానిని తెచ్చి యామెకిచ్చెను. అవి యామె ప్రొద్దుపోక

ఉపయోగించుచున్నది. అవి కామరూపములు. కోరినరూపము దాల్చగలవు.

ఉషస్నాల రుద్రదమనునితో సౌధమునందు ప్రవేశించినది. ముంగిటనున్న రామచిలుక రెక్కలల్లార్చుచు 'రాణీ! ఉషస్నాల వచ్చినది. రా యక్కా' అని స్వాగతమిచ్చినది.

లోపలనుండి కొందరు పరిచారికలువచ్చి ఉషస్నాలను లోనికి గొనిపోయిరి.

జ్యోత్స్నావళి యెక్కడఅని యామె వారినాతురతతో ప్రశ్నించినది.

వారు చంద్రశాలలో నున్నది, యని సమాధానము చెప్పిరి.

రుద్రదమనుని పరిచారికలు పరిశీలించి తమలో నేమేమో గుసగుసలాడుకొనిరి నాగరాజకుమారి రుద్రదమనునితో 'రాజకుమారా! నీవిచ్చట నేయుండుము. నేనిప్పుడే వచ్చెదన్.' అని లోనికరిగెను

ఆమెచంద్రశాలయందున్న జ్యోత్స్నావళినిగాంచెను. ఆమె చంద్రకాంత శిలావేదికమీద తామరపూల సెజ్జమీద పరుండెను. చుట్టు చెలికత్తెలు పచారము చేయుచుండిరి. కొందరు మంచి గంధపుపూతలను పూయుచుండిరి ఆమె యావేదన భరింపలేక యిటునటు పక్కపై పొరలుచుండెను. వేడినిట్టూర్పులు విడుచుచుండెను. ఉషస్నాల జ్యోత్స్నావళి మొకలంటిచూచెను దేహము నిప్పువలె కాలిపోవుచుండెను.

చెలికత్తెలు జ్యోత్స్నావళితో 'రాణీ! మీ చెలి ఉషస్నాల వచ్చినది. ఒకసారి కన్నులు తెరచి చూడుము' అనిరి.

ఆమె తెరువలేక తెరువలేక కనులు తెరచినది. అవి చింతనిప్పులవలె నెఱ్ఱగానుండెను. 'సఖీ! జ్యోత్స్నా! ఒక సారిటు చూడుము' అనెను. ఆమె నాగరాజకుమారినిచూచెను. వచ్చితివా! చెలీ యని తటాలున లేచి కౌగలించుకొనెను. ఆమె యొడలివేడికి ఉపన్యాల యొడలంతయు నుడుకెత్తి పోయెను.

'చెలీ వగవకుము. నీ కొరకొకవైద్యుని తీసికొనివచ్చి తిని. ఆయన ధన్వంతరివంటివాఁడు. నీ జ్వరమును క్షణములో పోగొట్టగలడు' అనెను.

చెలులు కొందరు అవునమ్మా! అవును మే మాయన నెరుగుదుము అని. నాగరాజకుమారిరుద్రదమనుని పిలిపించెను.

అయ్యా! 'ఈమె మాచెలి జ్యోత్స్నావళి. ఈమెచేయి పట్టుకొని నాడి పరీక్షింపుడు' అనెను.

రుద్రదమను డామెనుచూచి నిర్ఘాంతపోయెను.

అయ్యా! అట్లు చూచెద రేమి. నాడి పరీక్షింపుడు అని చిఱునగవుతో ననెను.

రుద్రదమనుడు చేయివంక చూడనారంభించెను.

అయ్యా! 'నాడిచూడమంటిని. మీరు గాజులు పరిశీ లించుచుంటిరి. ఇదేమివైద్యము' అనెను.

వాని కామాటలర్థమైనవి. రుద్రదమనుడు జ్యోత్స్నా వళి చేయిపట్టుకొని నాడి పరిశీలించుచుండెను.

నాగరాజకుమారి వానితో అయ్యా! ఎట్లున్నది? అని ప్రశ్నించెను.

'భయపడకుడు. సరిగా ప్రక్కనకూర్చుండుడు. మీ యనుమానము తీరినదా ?' అనెను.

జ్యోత్స్నావళి కనులు విప్పిచూచినది. ఆమెతాపజ్వరము సగము మాయమైనట్లైనది

నాగరాజకుమారి నవ్వుచు జ్యోత్స్నా! వైద్యులు వచ్చినవారేనా యనెను.

ఆమె సిగ్గున తలవంచినది. ఆమె చూచివరించిన రాజకుమారుడే రుద్రదమనుడు. జ్యోత్స్నావళీ రుద్రదమలు మహానందమునొందిరి. మరునాడు నాగరాజకుమారి చంద్రమునకు కల్హారదేవికి కబురుపంపించెను. వారిరువురు వచ్చిరి. జ్యోత్స్నావళీ రుద్రదమనులకు వివాహము మహావైభవముగా జరిగినది. ఉషస్స్వప్నల జ్యోత్స్నావళితో రెండుమూడు దినము లుండెను. పిమ్మట వారందరు కలిసి పాతాళేశ్వరుని దర్శింప వచ్చిరి. ఆ సమయముననే కోపాలుడు విద్యావతి సంధ్యావతు లను వెంటపెట్టుకొని, యచటికి వచ్చెను. రుద్రదమనుడు విద్యావతిని చూచెను. విద్యావతి రుద్రదమనుని గాంచెను. వారికనులను వారే నమ్మలేకపోయిరి.

రుద్రదమనుడు విద్యా! నీ విచటికెట్లు వచ్చితివి? యని ప్రశ్నించెను.

ఆమె జరిగినదంతయు చెప్పినది. కోపాల సంధ్యావతు లను వారికి పరిచయముచేసెను.

# దీపకము

దేవి ! ఎంతకాల మీవిచారము?

నే నున్నంతకాలము.

అట్లయిన ప్రపంచము లేమికావలయును?

నాకు కావలసినది లేనప్పుడు నా కీప్రపంచముతో పనియేమి !

నీ విట్లుండుటచేత వేదములు విఘాతమగుచున్నవి. శాస్త్రములు శిథిలమగుచున్నవి. పండితహృదయములు పాడు పడినవి. కవి, గాయకులనోరులు కట్టుపడినవి.

సృష్టికర్తలు మీరున్నారుకదా?

ప్రేయసీ ! నీవులేనిది నే నేమిచేయగలుగుదును.

పుట్టించినవారికి శాపములు నిర్ణయింపగలరు.

అది నాదోషమా!

కాదు నాదోషము. ఉన్నవారూరకుండక తథాస్తనుట మీవంతైనది. కష్టము నావంతైనది ఇప్పుడనుభవింపక యేమిచేయుదును.

ఇప్పుడు నన్నేమిచేయమందువు

నన్ను మాట్లాడింప వద్దనుము.

అది నాసాధ్యమా శారదా !

ఒకటి సాధ్యమైనప్పుడు రెండవది సాధ్యముకాదా ? పురుషులెంతకైనను సమర్థులు. 'అమాయకలనుచేసి స్త్రీల నాటలాడింతురు' అని సరస్వతి కన్నీరు విడచినది. బ్రహ్మను దేవున కేమియు తోచలేదు. 'నన్నొంటరిగా నుండనిండు' అనుచు నామె లేచి పోబోయినది.

బ్రహ్మ యాదేవిని చేయిపట్టుకొని బ్రతిమాలెను. బ్రతిమాలినకొలంది ముఖము ముడుచుకుపోయినది. దుఃఖము పొంగివచ్చినది. ఆమె తల్పముమీదపడి రోదనము గావించినది. బ్రహ్మ యామె ప్రక్కన కూర్చుండెను. వానిమనస్సు ఆలోచనలకు ప్రారంభించినది. ఉపాయము తోచినది. ముఖము పైకెత్తి గడ్డముక్రింద చేయిచేర్చి యొక్కసారి వెనుకటికథ జ్ఞాపకమునకు తెచ్చుకొనెను.

ఒకనాడు సరస్వతి వైకుంఠమునందున్న యత్తగారిని చూడబోయెను. బ్రహ్మయు నామెవెంట తల్లిదండ్రులను దర్శింపసరిగెను. అంతకుముందే పార్వతి పరమేశ్వరులచటికి వచ్చియుండిరి. పార్వతి లక్ష్మితో వినోదముగా మాట్లాడుచుండెను. సరస్వతి యత్తగారికినమస్కరించి యొదెనగారికుశల మడిగినది. పిమ్మట లక్ష్మిచూపిన యాసనముమీద కూర్చుండెను. లక్ష్మిపరిచారికులందరు ముచ్చటగా ముగ్గురనుచూచి మురిసిపోవు చుండిరి. నిజముగా నది మురియవలసిన సమయము. ముగ్గురుమూర్తుల యిల్లాండ్రు నొక్కసారిగా నొక్కచోట కలిసినదినము లేదు. అది హటాత్తుగా సమకూడినది. మూడు కొప్పులుకలసిన విలయమో, ప్రళయమో రాక తప్పదని విష్ణువు తలంచుచునేయుండెను.

ఊరకున్నది యూరకుండక పార్వతి లక్ష్మితో 'అమ్మా! ప్రపంచము సృష్టించినదాది యింతవరకు మనముముగ్గర మొక్కచోట నెన్నడు కలువలేదు. ఈనాడు నాకు పండుగగానున్నది. తండ్రిగారి వినోదము కొరకేదైన మనమొకటి ప్రదర్శింపవలయును' అనెను.

లక్ష్మి యతిగరిష్ఠురాలు. సరస్వతి ముగ్ధురాలు. పార్వతి యన్ని తెలిసిన ప్రౌఢురాలు.

లక్ష్మి పార్వతీ! 'నీవన్నిటిలో సమర్థురాలువు. నీవేమైన చేయగలవు. నీయిష్టమైనది కానిమ్మ' అని క్లుప్తముగా సమాధానము చెప్పినది.

సరస్వతి మీయిష్టము వదినే, యని యత్తగారివంక చూచినది.

పేదరాలి కాలోచన లెక్కువ. ధనికురాలికి నీతెక్కువ. విద్యావతి కౌదార్యమధికము. పార్వతి లక్ష్మివంకచూచి 'అమ్మా! మనలో పెద్దదానవు నీవుకదా. నీ పరిణయ మెప్పుడైనదో మేము చూడలేదు. త్రిలోకములలోని వారతి విచిత్రముగా చెప్పుకొందురు అది నాటకముగా ప్రదర్శింతము. మయమూర్తుల కది వినోదముగా నుండును. నేను విష్ణువునై నటింతును. నీవు మోహినివేషము వేయుము. సరస్వతి లక్ష్మిగా నటించును.' అనెను. లక్ష్మి సమాధానము చెప్పలేదు. సరస్వతి యత్తగారియాడిపోతలన్ని బైటపెట్టవచ్చు గదా యని యంగీకరించెను. పార్వతి లక్ష్మికి కన్నకూతురు కాకపోయినను లేని స్వతంత్రమును తెచ్చిపెట్టుకొని లక్ష్మిని వేధించినది. ఆమెపోరుపడలేక 'సరే' యనినది. ఈసంగతి త్రిమూర్తులకు చెప్పవలయును. వారు ప్రేక్షకులు. ఎవరుపోయి చెప్పుదురు. అన్నిటికి నేనుంటినికదా యని యా బరువుకూడ తన భుజములమీద ధరించినది. బ్రహ్మ, విష్ణు, మహేశ్వరులు ముచ్చట లాడుకొనుచుండగా వారియొద్ద కరిగెను.

మహావిష్ణువుతో 'నాయనగారూ నేటి సంఘటనము లన్నియు క్రొత్తవి. మున్నెన్నడూ జరిగినవి కావు. ఈ సన్ని వేశ సమయమున 'లక్ష్మీపరిణయము' ప్రదర్శింపదలచితిమి. మీరందరు దయచేయవలయును' అని యాహ్వానించెను.

'నాటకముపేరు చెప్పితివి కాని నటీ నటులపేరు చెప్ప నైతివి?' అని విష్ణుమూర్తి నవ్వుచు అనెను.

'చూచి తెలిసికొనవలసినదే కాని ప్రకటింపవలసినది కాదు.'

పోనిమ్ము మా యల్లునితోనైనా పనియుండునందువా?

లేకేమి. వారు హాలాహలము తినుటకు, మీరమృతము పంచిపెట్టుటకు, అని పార్వతి సమాధానము చెప్పెను. మరదలిమాట నేర్పరితనమునకు మెచ్చుకొని నేనుకూడనుంటి నమ్మాయని బ్రహ్మ పార్వతీ నాకేమిపనిలేదా? అనెను.

పార్వతి 'అన్నగారు పెద్దవారు, పనికల్పించతలంచుకొన లేదు' అని చతురతగా సమాధానము చెప్పినది' ఆమె మాట కారి, పనులకు పెద్దది. బ్రహ్మముఖముచిన్న పుచ్చుకొనెను. అదిపార్వతి గ్రహించినది.

'అన్నగారు. అల్లుని కూర్చుండబెట్టెదమని కాదు. గంటలో నాటకము తయారు కావలయును. అది మీావంతు. రంగాలంకరణ యైపోవుచున్నది. రాత్రికి నాటకము. త్వరగా మొదలుపెట్టి త్వరగా ముగించవలయును' అనుచు బ్రహ్మ కుత్సాహము కలిగించినది.

ఏనాటకమో చెప్పలేదు. ఆయనయడుగ లేదు. అసలేమతి మరపు. బ్రహ్మనవ్వుచు శివునివంక చూచి బావా; 'మా చెల్లెలు

చాల యసాధ్యురాలు. మూలనుండి ముక్కు మూసుకొన నీయకుండా యీపని పెట్టినది' అని నాటకరచన కుపక్రమించి నాడు బ్రహ్మ. ఆయన వేదవిధుడు. కవితకు రశికత్వము భావ కల్పన కథాచమత్కార ముండవలయును. అది వేదశాస్త్ర పండితుల పొట్టకోసి కంచుకాగడాలుపెట్టి వెతికినాకనపడదు. గంటము చేతపట్టి తాళీపత్రాలమీద వ్రాయుటకు మొదలు పెట్టినాడు. శ్రీరామతో మొదలుపెట్టినాడు. ఆ కాగితమంత టితో మునిసినది. కాగితా లొకటివెంట నొకటి తిరిగిపోవు చుండెను. ఒకటివెంట నొకటి చిలిపివేయుచుండెను ఎప్పటి కప్పుడు శ్రీరామయే మిగిలినది. పాతపురాణాలలో బట్టి పెట్టిన పద్యాలన్ని వల్లెవేసినాడు. దాచి పరలుమార్చి నాటకము తయారుచేసినాడు. దానిని పార్వతి యంగీకరించవలయును. ఆమె దర్శకురాలు. గంటకాగానే తిరిగివచ్చినది.

అన్నగారూ! అయినదా ? అని దీర్ఘముపాడిగించి యడిగినది. బిక్కముఖముతో బ్రహ్మ ప్రతిని చేతిలోపెట్టి నాడు.

మొదలుకొని చివరివరకా దేవి చూచినది. 'అన్ని ప్రాతపద్ధతులేగాని క్రొత్తలులేవు' అని పెదిమెవిరిచినది.

నేను ప్రాతవాడను కథ పాతది. క్రొత్త వెక్కడనుండి వచ్చును ?

'తీగె ప్రాతదైనను పూచెడు పూవులతో క్రొత్తగా కని పించును, అని యా ప్రతిచేతపట్టుకొని పార్వతివెడలిపోయినది. నాటకరంగము తయారయినది అలంకారములుపూర్తియైనవి. పాత్రలెవరా యని త్రిమూర్తుల యాలోచన. కూడపలుకు

కొనుటకు నావకాశము లేను. ఎవరి మనస్సులో వారే సీళ్ళు నమలనారంభించిరి విష్ణువు లక్ష్మినిపిలిచి యడుగవలయునని తలంచెను వచ్చినవారికి మర్యాదలు చేయుచుండెను. ఆమె పనికి భంగపరుపనేల యని యూరకుండెను. మీదుమిక్కిలి లక్ష్మిని నున్నచోటునుండి కదలనీయలేదు పార్వతి. ముసలి మగని ముద్దుభార్య సరస్వతి. ఆమె యడుగుటకే యవకాశ మిచ్చినదికాదు బ్రహ్మకు. 'తినుచు రుచి యడుగనేల' యని మూతిత్రిప్పుకొని పోయినది.

శివుడిదంతా నాకెందుకు, నేను సర్వసంగ పరిత్యాగిని అని యూరకుండెను. అష్టదిక్పతులకు, ముక్కోటి దేవతలకు నాహ్వానములు పంపబడినవి. మహాదేవి పిలువ పంచినది. ఎవరి కెన్నిపనులున్నను మానుకొని నాటకమునకు నందరు హాజరైరి. నాటకశాలయం దడుగడుగునకు మణి దీపములు వెలిగింపబడెను. రంగమంతయు విద్యుత్తీగలు మిలమిల మెరసిపోవుచుండెను. క్రొత్త క్రొత్త వింతరకపు జవని కలమర్చబడినవి. సకాలమునకు నాటక మారంభమైనది. నాంది నడచినది. నటీసూత్రధారులు రంగమున ప్రవేశించిరి. వారి మాటల చతురతకు సభికులందరుపొట్టలుబ్బనవ్విరి. పేరు లేని నాటకమట, కవిలేని కావ్యమట, ఎవరికి వారే రచయితలు, రసికులు నవ్వరాకేట్లుండును?

పార్వతి లోకోత్తర సౌందర్యవతి, యందాలకాణాచి. విష్ణువు వేషమును స్వయంగా నలంకరించుకొనిన వలయు సామగ్రులన్నియు నాయన నడిగితెచ్చుకొనినది. సాక్షాత్తు విష్ణుమూర్తివలె, నంతకంటె రెట్టింపందముగా నగుపించినది;

మగవాడాడవేషమువేసినను, ఆడదిమగవేషము వేసిననుచూడ ముచ్చటగానుండును. ప్రక్కనసరస్వతిలక్ష్మివేషముతాల్చినది. అత్తగారెది ముదుసుముఖము లేతవయస్సునందున్నదిశారద. అత్తగారి నందములో తలతన్నినది. లక్ష్మినారాయణుల వేషములుతయారైనవి. సరస్వతియద్దముముందునిలుచుండి చీరసవరించుకొనుచుండెను. పార్వతి లక్ష్మివేష మెంతవరకు వచ్చెనో చూడవలయునని మిషపెట్టుకొని సరస్వతివద్దకు మెల్ల మెల్లగా వచ్చినది. ఆమె వెనుకనైపుననిలిచినది. విష్ణురూపముననున్న పార్వతి, యాకార మద్దమునందు గోచరించినది. సరస్వతి యారూపమును కన్నార్పక చూచినది. ఆమూర్తిని మనస్సులో హత్తుకొనినది, ఏమేమో తలంచినది. కోరికలు తలచూపి కొమ్మలు, రెమ్మలు సాగి మనస్సంతయు నాక్రమించినది. ఆమె యొడలు పులకరిచ్చినది, సిగ్గువేసినది. విష వామె వెనుక నిలిచినాడనుకొనినది.

'ఆహా! ఏమా మనోహరాకారము' అనుమాటలు నోటవెడలినవి.

పార్వతి యఖండమగు తెలివికలది. అంతయుగ్రహించినది. 'ఎవరది?' అని భుజములమీద చేయివేసినది.

పార్వతి నిమించిన తెలివికలది. సరస్వతి. వెనుకకుతిరిగి నీవేషదిరా? అన్నది సరస్వతి. కనురెప్ప లల్లార్చుచు అందమనిన నీదేయుండను. 'నీవు మగవాడవైన నెంతబాగుండెడిదానవు' మరల మరల చూచినది సరస్వతి, పార్వతిని.

ఆమె చిరునవ్వు చిందించుచు, చెక్కిలికొట్టి చిలిపిగా 'యేమి? నీవు నన్ను వరించెడిదానవా?' యనినది.

సరస్వతి యాసమయమున త్రిలోకమోహినివలె గోచరించినది పార్వతికి. తాను నిజముగా విష్ణువనను నూహ యావేషములో నామె పరవశతచేత ననిపించినది. సరస్వతి యందమునకు మురిసిపోయినది.

సరస్వతి పార్వతివంకనే చూచుచు 'వదినె యంతకంతకు చిలిపిదగుచున్నది' అని సిగ్గుతో తలవంచుకొని యవతలకు పోయినది.

నాటకము పూర్తియైనది. సరస్వతి చూపు మనస్సు పార్వతివేషముమీదనే యుండెను. ఆమె సత్యలోకమునకరిగెను. ఆరేయి నిద్రపట్టలేదు. పార్వతివేషముమీదనే భావములు ప్రసరించినవి. ఎంతమరల్చుకొన్నను తరలిరాలేదు. కొంచెము కునుకుపట్టినది. స్వప్నములో నదేరూపము కనుల యెదుట కనిపించినది. ఆమాటలే వినిపించినవి.

'ఏమి నీవు నన్ను వరించెదవా ?'

తప్పక.

ఎందుకు ?

మదనివంటి కుమారునికొరకు.

'తథాస్తు'

ప్రక్కనున్న బ్రహ్మయు తథాస్తనెను. అతిసుందరుడగు కుమారుడామె పక్కలోనుండెను. ఆశిశువు గుక్కపెట్టి యేడ్చెను. సరస్వతి నిదమేలుకొన్నది. ఆమె శిశువునుగాంచి యబ్బురపడినది. 'ఇదేమిటి?' అని బ్రహ్మవంక చూచుచు నడిగినది.

'నీవు కోరినదే. తథాస్తు' అంటిని అనెను.

ఆ బాలుని సరస్వతి యానందముతో నెత్తిముద్దాడెను. ఆమె మింట చంద్రునివంక చూచినది, కొడుకును చూచినది. ఇరువురకు భేదముకనిపించలేదు. కళాధరాయని వానిని పిలిచినది.

౨

బ్రహ్మ ప్రపంచమునందలి సుకుమారములు సుందరములునగు వానిలోని యందమును నువ్వుగింజంతలుగా తీసికొని యొక యప్సరసను సృష్టించెను. ఆమెయందము మరే యచ్చరకుగాని దేవతాస్త్రీలకుగాని లేదు. ఆమె యింక భూమియందలి యువతుల తలతన్నినదని చెప్పనక్కరలేదు. ఆమెకు తిలోత్తమయను పేరు పెట్టబడెను. దేవేంద్రుడామెకు తన సభాభవనమునందు ప్రత్యేకస్థానము నిచ్చి రంభాది యప్సరసలకంటె చాల గౌరవించుచుండెను. ఒకనాడు తిలోత్తమ తనమేడకు వెనుకనున్న వసంతారామములో కూర్చుండెను. అది వసంతకాలము. తీగెలు, చెట్లు పూలను పూచి కనులకు జూడముచ్చట కలిగించుచుండెను. అస్తమించుచున్న సూర్యుడు కిరణములను కుంచెలతో వానికిబంగారు రంగులను దిద్దుచుండెను. తుమ్మెద వానిసౌందర్యముచేత నాకర్షింపబడి యెండతాకున దాహానముకై చలివేంద్రము లోనికెగబడిన జనసముదాయమువలె తేనెటీగలు గుంపులు గుంపులుగా చెలరేగి తేనెకొఱకు పూలలో వ్రాలుచుండెను. అవియు కాదనలేక శక్తికొలందిగా వానిదాహము తీర్చుచుండెను. మలయమారుతుడు రాజభటులవలె పూలనదిలించి

తుమ్మెదలను తరిమివేయ చూచుచుండెను. సుగంధమును సేకరించి దిక్కులకు వెదచల్లుచుండెను.

తిలోత్తమ వనమంతయు నొక్కసారి తిరిగివచ్చినది కొలనిదాపున రత్నవేదికమీద కూర్చున్నది. అటనుండి తోటనలువైపులు చూచినది. ఆయందమునకు మురిసిపోయి నది. మాలతి మధురవాసనలు వెదజల్లినది. సంపెగతావులు విరపోసినది. మల్లెసుగంధము మీదచల్లినది. ఆమె పరవశము చేత ముక్కురంధ్రములను విశాలముచేసి సగముకనులు మూసికొని 'ఆహా' యని యావాసనల నెగపీల్చినది. ఆమె యొడలేకాదు, హృదయము నూపిరితిత్తులు ప్రతియంగము వసంతవాసనలతో నిండిపోయినవి. 'వసంతకాలము రాకచేత నీ వనమింత రమణీయమైనది. అసలువసంతుడే యిచటకు వచ్చిన యెట్లుండునో' యనుకొనినది.

దేవతలు తమ్ముతలంచుకొనువారియెదుట ప్రత్యక్షము కాగలశక్తి వారికున్నది. వారిభక్తుల మనస్సులు వారు గుర్తించగలరు. తిలోత్తమ తలంపునకు వసంతు డెదుటనిలి చెను. తిలోత్తమ వానిని కనులెత్తిచూచినది. అతడు మూడు లోకములు మోహింపచేయు రూపముకలవాడు. ప్రాణము లేనిచెట్లను, చేమలనే యలరించును ప్రాణులను మైమరపించు టలో ననుమానమేముండును. తిలోత్తమ యారూపము చూచి బేలుపోయినది. పూవువలె కోమలమగు శరీరము, పుష్పాడివలె మెత్తనగు నవయవములు, చిగురులవంటి పాద ములు, పలురకముల పూవువాసనలనించు నిశ్వాసములు, విచ్చిన కలువరేకులు. వానినిచూచినకొలంది చూడవలయు

నని యామెకు కోరికపుట్టినది. కోరిక కోరికకు భావములకు మొలకలెత్తినవి. ప్రతిభావమును చల్లగాలికూనలు రెచ్చకొట్టి నవి. ఆమెమేను గగుర్పొడిచినది. ప్రక్కనున్న గండుకోయిల కుత్తుక సవరించుకొని 'కో' యనినది. తిలోత్తమ సిగ్గుపడి లేచి నది. సమీపమునందలి గున్నమావితోట్లోనుండి మొగము నిగిడించి శుకము మంగళగీతము పాడినది. జలయంత్రము మీద నెక్కి నెమలి తథాస్తనినటుల బిగ్గరగా కేకలు పెట్టినది, పింఛము నిండార్గవిప్పి.

అంత వసంతకుమారుడు నవ్వుచు 'తిలోత్తమా! నేటి కీదాసునిమీద దయకలిగినదా?' యనెను.

ఆమె తనతప్పిదమును జ్ఞప్తికి తెచ్చుకొనినట్లు నాలుక కరచుకొనినది. 'నా యపరాధము క్షమింపుడు' అనిదీనముగా నన్నది.

ఆనాడు విజయోత్సవము ముమ్మరముగా జరుగు చుండెను ఇంద్రుడు రాక్షసుల మీదదండెత్తి వారినోడిం చెను. రాక్షస కులములను పాతాళమునకు పారదోలెను. అందు కా విజయోత్సవములు, దేవతలందరుకూడి చేయుచుండిరి. ఇంద్రుడు మహానందముగా నుండెను. అప్సరసలు వానిచుట్టు చేరి యాడుచు పాడుచు, వీణెలుమీటుచు నింద్ర విజయమును గురించి గానముచేయుచుండిరి దేవతలు కల్పవృక్షముల నుండి తీసినమధువులు ద్రావి వివిధవినోదములందు మునిగి యుండిరి ఆసమయమున తిలోత్తమ యింద్రుని యెదుట నాట్యముచేయుచుండెను. వసంతుడామెను చూచుటకదియే మొదటిసారి. ఆమెయు వసంతునిగాంచినది. వారిచూపులలో

ప్రేమరసము తొణికిసలాడినది. తిలోత్తమ యింద్రుని చేతి లోని కీలుబొమ్మ. ఆయన చెప్పుచేతలలో నామె మెలగవల యును. వానికి తెలియకుండ కాలు కదిలించుటకువీలు లేదు. కన్ను మలుపుటకు నవకాశములేదు. వసంతున కాసంగతి తెలియును. అయినను కదలించి కాలుమలపించ వలయునని తిలోత్తమ సరసకుచేరెను. ఇంద్రుడది చూచుచుండెను. తిలోత్తమ యదికనిపెట్టినది. తటాలునలేచి యవలకుపోయి నది వసంతుడది పరాభవముగా పరిగణించెను. ముఖము చిన్న పుచ్చుకొనెను. కాని తిలోత్తమ మనస్సులోని మర్మము గ్రహించుకోలేదు. కొంచెము సేపటులనేయుండి లేచిపోయెను. తిలోత్తమ యదిపరికించినది. తానొనరించినపని కామె మన స్సులో గుంజాటన పడినది. ఏమిచేయగలను. ఎంతవినోద సమయమైనను స్వామిని మోసపుచ్చుట యవివేకము. అసమ యమటువంటిది. మరల వసంతునిచూడలేదు. ఆనాటికీనాడు తిరిగిచూచినది తిలోత్తమ.

వసంతు డామెవదనము పరికించుచు అదినీతప్పుకాదు. నిన్ను అస్వతంత్రురాలిగాచేసిన యా బ్రహ్మదేవునితప్పు' అనెను.

నేనొక దేవదాసిని. ఇంద్రుడు దయాదాక్షిణ్యములు లేనివాడు'

అది నాకుతెలియును. అందుకనే నే నచటనుండి వెడలి పోయితిని.

మంచిపనిచేసితిరి. లేకున్నచో...

లేకున్నచో ?

ఇంద్రుని శాపమునకు గురియయ్యెడివారము.

అవును. తిలోత్తమా ! అవును. సేవకావృత్తి నీచమైనది. అధికారుల యడుగులకు లోనుకావలయును. తిట్టినను కొట్టినను చిత్తము చిత్తమనవలయును. అతడు నీచాతినీచుడైనను 'నీవింద్రుడవు చంద్రుడవని' పొగడవలయును. అధికారమదముచేత మహాపండితులను నిందించుచు తనంతటివారు లేరని వారుబ్బితబ్బిబ్బులగుచుందురు. ఇది యందరకున్న జాడ్యము. తామే బ్రహ్మ విష్ణు మహేశ్వరుల మనుకొందురు. ఆ యధికారము కొంచెము నూడినతరువాత వాని పనులు తలంచుకొని క్రిందనూయని వారుండరు.

'నిజము. వసంతకుమారా ! నిజము.'

తిలోత్తమా వసంతు లాపూదోటలో చాలాసేపు విహరించిరి. వసంతసమయమున ప్రకృతియందమును చూడవలయుననుకోరిక కలిగినది. వారచ్చటచ్చట తిరుగుచు రత్నకూటమునకు వచ్చిరి. అందొకచోట సుందరమగు సరోవరమును గాంచిరి. అది చాలా విశాలమైనది. దానిచుట్టు పూలచెట్లు పెరిగియుండెను. పలురకములగు తీవెలావృక్షములమీద కెగబ్రాకి వ్రేలాడు పూగుత్తులతో కనులపండుగ కావించుచుండెను. ఆసరోవరము నలువైపులందువిశాలమగుపూబొదరిండ్లు కలవు. ఆ యారామము తిలోత్తమావసంతుల మనస్సునకానందము కలిగించినది. వారాచోట నాడుచుపాడుచు పరుగులిడుచు వినోదముగా కాలమును గడిపిరి. చివరకు కొలను గట్టున కూర్చుండి యలలమీదుగావచ్చు చల్లని పిల్లవాయుల ననుభవించుచుండిరి.

లోకము చిత్రమైనది. ఒకడు మహానందమును పొందు చుండగా చూచి సహింపలేనివారు పెక్కుమంది యుందురు. తాము సహింపలేకపోవుట, యట్లుండు వారికపకారము కాపింప చూచుచుందురు ఊర్వసి యొకయప్సరస. ఆమె తానందరి కంటె నందకత్తెనని గర్వించుచుండును. విష్ణువొకసారి ఘోర మగు తపమొనరించుచుండెను. వానితపమువలన దేవేంద్రుడు భయపడెను. విష్ణువుతపమును పాడుచేసిరమ్మని రంభను పంపెను. ఆమెకు వసంతునితోడిచ్చి పంపెను. వసంతుని రాకచే చెట్లు చిగురించి పూలుపూచి తపోవనమంతయు నతి మనోహరముగా నుండెను. రంభ వీణాతంతువులను సవరించి యొక గున్నమావితిన్నెమీద కూర్చుండి గానమారంభిం చెను. ఆమెపాటకు రాళ్ళుకరిగినవి. కాని విష్ణువు మనస్సు కరగలేదు. అటుకాదని రంభ మేళతాళములతో నాట్యమా రంభించినది. ఆయలజడికి విష్ణువు కనులుతెరిచిచూచెను. రంభ మరింతవిలాసముచూపినది. విష్ణువు సర్వముగ్రహించి రంభకు గర్వభంగము చేయవలయునని యూహించెను తన తపశ్శక్తిచేత రంభకంటె వేయిమడుంగులధిక సౌందర్య వతిని తన యూరువునుండి పుట్టించెను. ఆమె యందమును గాంచి రంభసిగ్గుచెందెను. ఆమె యభినయము, నాట్యము, గానమును కనివిని తలవంచుకొని పోయెను. ఆమె దేవేంద్రు నితో జరిగినదంతయు మనవిచేసికొనెను కొంతసేపటికి ఊర్వ సియే వచ్చెను. ఆమెను దేవేంద్రుడుచూచి ఆశ్చర్యపడెను. ఊర్వసి యింద్రునికినమస్కరించి 'త్రిలోకాధిపతులగు తమకు నాతండ్రివిష్ణువునన్ను కానుకగా సమర్పించెను, అనినుడివెను.

నాటినుండి యూర్వసి యింద్రుని సభలో నాట్య కర్తగా నియమింపబడెను. ఆమె తనయందము చేత నింద్రుని మనస్సులోగొనెను. ఆమె రంభదాపున నున్నవసంతుని గాంచినది. వానిమీద యనురాగము కలనయ్యెను. కాని వసంతుడామె ప్రేమను నిరాకరించెను. ఒకటి రెండుసారులు వసంతుని నందనవనమునందు చూచెను. తనప్రేమను వెళ్ల బుచ్చెను. వసంతుడామెను నిరాదరణతో చూచెను. ఆనాటి నుండి యూర్వసికి వసంతునిమీద నసూయాకోపములు పొడ మినవి. వానిని తీర్చుకొనుటకు సమయము కనిపెట్టియుండెను. తిలోత్తమయు వసంతుడునుల్లాసముగా విధ్యాధరోద్యానమున తిరుగుచుండుట చూచెను వారివిలాసము ఉల్లాసములు చూచి యోర్వలేక పోయినది. ఉన్నవిలేనివి కల్పించి యింద్రున కూర్వసి తిలోత్తమా వసంతులమీద పితూరీలు చెప్పినది. ఇంద్రుడు మొదటనమ్మలేదు. ఊర్వసి స్వయ ముగా చూపింతును రమ్మనిపచించెను. ఇంద్రుడూర్వసిని వెంట పెట్టుకొని విమానముమీద రత్నకూటోద్యానమునకు వచ్చెను. ఆసమయమున తిలోత్తమ వసంతుని యొడిలో దల పెట్టుకొని మీదువంక చూచుచుండెను. ఆమె ఇంద్రుని విమానమగుపించినది. ఆమె తటాలునలేచి గుండెలు తట తట కొట్టుకొనుచుండ ఇంద్రుడింద్రుడు, అని కొలనులోనికి దుమికెను. ఇంద్రునకు కానరాకుండ బంగారుకమలపుతీగెగా మారిపోయెను. ఆమె ముఖము సుగంధమును వెదజల్లుచు విప్పారిన కమలమైనది. వసంతుడుపాయమూహించి వెంటనే గండుతుమ్మెదగా మారి కమలములోనికి చొరబడెను.

ఇంద్రుడు పైనుండి యిదియంతయు గమనించెను. అక్షయముండుము అని వచించెను

అంతటితో నూర్వాపి యక్కస్సుతీరినది. ఈసంగతి తిలోత్తమా వసంతులకు తెలియును. తిలోత్తమ ముఖకమలము చుట్టుతిరుగుచు ప్రణయగీతములాలపించుచు వసంతుడు మహానంద పరవశత్వమున దానియందుచేరి మకరందమును త్రాగుచుండెను. ఆ కమలము తుమ్మెదయందున్న ప్రేమ విడువలేక తనరేకులతో దానిని తనలో నణచుకొనుచుండెను. మారురూపములందు సైతము తిలోత్తమావసంతుల ప్రేమ యమితముగా నుండెను. కొంతకాలమునకు కమలముయొక్క యండకోశమునుండి యొక ఆడశిశువు జన్మించెను. ఆశిశువును తనరేకులే పొత్తులుగా నొనరించి యాకమలము సంరక్షించుకొనుచుండెను. పగలంతయు నెండవేడిమి తగులకుండ రేకులతో బాలికను కప్పియుంచుచు రేలువిచ్చుకొనియుండును. చంద్రుని కిరణములందలి యమృతమును త్రావి యాబాలిక దినదినము పెరుగుచుండెను. ఒకనాడు విద్యాధర చక్రవర్తి యాకొలనియొద్దకు వచ్చెను చంద్రుని కాంతులలో తళతళమెరయుచున్న యా శిశువునుగాంచెను. అతడు సంతానములేనివాడు. ఆశిశువుమీద మమకారమున శిశువునుగొనిపోయి పెంచుకొనెను. ఆమెకు విద్యుల్లేఖయని పేరునుపెట్టెను. ఆబాలికకుసకలవిద్యలు నేర్పించెను ఆమెపెరిగి పెద్దదయ్యెను ఆమెకుతత్వభేదిమంత్రోపదేశమునుబోధించెను. చాలకాల మామంత్రమును జపించెను. సరస్వతి ప్రత్యక్షమై

నది. విద్యుల్లేఖ తనకు సకలవిద్యలు వరముగా కోరెను. సరస్వతి యామె యందమునకు గుణమునకు మెచ్చుకొని తనతో కొనిపోయెను. తన శిష్యురాలిగా స్వీకరించెను.

# 3

కళాధరుడు క్రమక్రమముగా పెరిగి పెద్దవాడగుచుండెను సకల విద్యాధిదేవత సరస్వతి ఆమెస్వయంగావాని కక్షరాభ్యాసము కావించినది. బ్రహ్మ ప్రపంచమునందలి సకలవిద్యలు నీనోట నటించుగావుతమని యాశీర్వదించినాడు. సరస్వతి కళాధరునకు వేదములు పాఠములు చెప్పినది, వల్లె వేయించినది. స్వరసంయుతముగా వేదములు చదువునప్పుడు, సామగానమొనరించునపుడు, మహానందమును బొందుచుండెడిది. ఆ కంఠ మతిమధురమైనది. ఆ స్వరములో నమృతము తొణికిసలాడు చుండును. అది యాదేవికి చెవుల పండువ గావించును. కళాధరుడు వేదపఠన మారంభించెను. ఆ దేవి కచ్ఛపిశ్రుతులుసారించి వీణావాదనము కావించును. మధ్యలో కళాధరుని కంఠమాధుర్యమును వినుటకు వీణనాపివేయును. ఆ స్వరమువిని మురిసిపోవును. కచ్ఛపి నీవలనుంచి గడ్డముక్రింద ముంజేయి నుంచుకొని మోచేయి తొడలమీద నానించి ముందునకువంగి ముఖముచూచుచు చిరునగవుతో చెవులు విచ్చుకొని వినును. ఊరించి యూరించి వానివలన సామగానము వినును. లోలోన పరవశత్వమునొందును. 'కళాధరా! నీవు నిజముగా కళాధరుడవు' అని దగ్గరకుతీసి ముద్దుపెట్టు

కొనును వేదములు పూర్తియైనవి. శాస్త్రములు క్రమక్రమముగా వాదోపవాదములు సర్వరహస్యములు బోధించిన దా దేవి. దేవలోకములోని పండితులతో వాక్యార్థవాదములు చేయించి యలరినది. సకల విద్యారహస్యములు నెరిగించినది. 'నాయనా! నీకు సాటి యెవరు లేరోయి' యని కళాధరుని పొగడినది.

అమ్మా! సంగీత సాహిత్యములులేని శాస్త్రపాడింత్యమైదవతనము లేని యాడుదాని వంటిది. సరస్వతిదేవి కుమారుడట ప్రధానములగు సంగీతసాహిత్యములు శూన్యమటయని నవ్వుదురు. ఆ లోటుకూడా తీర్పుము తల్లీ! యని కళాధరుడు తల్లిని ప్రార్థించెను.

అవును నాయనా! అవును. చక్కగా వివరించితివి. రేపే లలితకళలకు విఘ్నేశ్వరపూజ కావించియారంభింతును. అని సరస్వతి వాగ్దానము చేసినది.

అప్పటికి కళాధరు డిరువదేండ్ల వాడయ్యెను. అతడు సర్వాంగ సుందరుడు. దేవలోకములోని యందగాండ్రందరు కళాధరుని ముందు నిలువలేకపోయిరి. మదనుడ మాయమయ్యెను. వసంతుడు చెట్లనుపట్టెను. చందమామ చిక్కిపోయెను. కళాధరుడు సకల కళాధరుడయి దేవలోకమున కలంకారమై యొప్పెను. మరునాడు వాణీమహాదేవి, విద్యు లేఖా కళాధరులను చెరియొకవైపున కూర్చుండబెట్టుకొనినది గాంధర్వ విద్యారంభమునకు వారిచేత వినాయకపూజ చేయించినది. వారు మహాదేవి పాదకమలములకు నమస్కరించిరి వాణి మనోభీష్ట సిద్ధిరస్తు అని దీవించినది.

ప్రక్కనుండి యదియంతయు చూచుచున్న బ్రహ్మ తదాస్తు అని యక్షతలు వారిపై చల్లెను. దేవి ముసిముసి నగవులు పచరించినది.

'ఆడువారి యంతరంగములు నిగూఢములు' అని బ్రహ్మ యొకమాట విచిత్రముగా విసరెను.

'మగవారిమాటలుమర్మసహితములు' అనిసరస్వతిసమాధానం చెప్పినది. సరస్వతి వారికి గాంధర్వవిద్య ప్రారంభించినది. విద్యుల్లేఖ శాస్త్రాభ్యాసమంతయు దేవగురువునొద్ద జరిగినది. ఆమె మహాపండితురాలనని తలంచుచుండెను. నిజము నందు సత్యములేదు. షట్ఛాస్త్రములు, బ్రహ్మసూత్రములు నుపనిషత్తులు, నారణ్యకములు పరిపూర్ణముగా కంఠస్థముచేసెను. వివిధ విద్యలునేర్చెను. కళాధరు డవిమెరుగడని యామె యూహ. కావున వారివంక సగర్వముగా చూచినది. విద్యుల్లేఖ కళాధరునకు విద్యయందుతప్ప యితరములందు చూపు లేదు. విద్యుల్లేఖచూపులోని పరమార్థమాతడు గ్రహింపలేదు. అది వానికంతుపట్టలేదు. ఆనాటికి పాఠము ముగిసినది. కళాధరుడు తల్లియానతి తీసుకొని లోనికరిగెను. వీణాసాధనమున కుపక్రమించెను. సరస్వతి కటాక్షమాతనియందున్నది. క్షణములో సాధన విధానమంతయు గ్రహింపగలిగెను.

ఆనాడు సరస్వతిచిత్త మమితానందమున తాండవించినది. ఆమెకు చిత్రవిచిత్రభావములు మలయమారుతము తాకున పొడసూపు కొలనులోని చిరుతరంగములవలె మొలకెత్తినవి. అవిదేవి చెవిపుటముల చెంతచేరి యేమేమో మంతనములారంభించినవి. ఆమెముఖమున చిరునవ్వు వెన్నెలలు

మోసులెత్తినవి. కళాధర విద్యుల్లేఖ లాదేవిమనఃసీమలో ప్రతిబింబించిరి. 'అవును కళాధరుడు జగన్మోహనాకారుడు. విద్యుల్లేఖ యమితసౌందర్యవంతురాలు, విద్యావతి, గుణములకు రత్నాకరమనుటలో సందేహములేదు. ఈజోడులు సరిపోయినవి' అని యేమేమో యాలోచించినది. ఆ యాలోచనలలో నామెయొడలు మరచినది. బ్రహ్మవచ్చి తన ప్రక్కన నిలిచినసంగతియు నామె పరిగణించలేదు.

ఆలోచనలు పూర్తియైనవా ? అని పలుకరించినాడు బ్రహ్మదేవుడు.

ఆమె చటాలున లేచినది. పైట సవరించుకొనుచు పొరపాటుమన్నింపుడు అని వల్లభునిసగౌరవముగా కూర్చుండపెట్టిన దా దేవి .

ఇది పొరపాటుకాదు, లోకముపరిపాటి.

అయినను మీ యభిమతముకూడ నేకముకావలయునుగదా ?

అది యెప్పుడో యేకమైనది.

అట్లయిన ధన్యురాలను.

కాని ?

కాని యేమిటి.

కొంత యంతరాయమున్నది

మీరు తలంచుకొనిన నంతరాయములన్నియు క్షణములో పటాపంచలగును.

సరి యందరకు పెద్దవాడు,మీమామ గారున్నారుకదా? అయినను కళాధరుడు బాలుడు. విద్య పరిపూర్తికాలేదు.

ఇంకా గాంధర్వము, చిత్రలేఖనము, నృత్యము నేర్పించ వలయును.

దానికేమి. క్షణకాలములో సర్వకళాపరిపూర్ణుడగును.

నీవు తలంచుకొనిన కాకేమగును? అన్నియు నీచేతి లోనివి.

మొదటివాడు త్రిలోకసంచారియై, పెండ్లి పేరంటము లేక యున్నవాడు. వీడైనా నొకయింటివాడైన చూచి యానంది చవలయునని యున్నది.

నేనుమాత్రము కాదందునా? బ్రహ్మ సమాధానమునకు సరస్వతి మురిసిపోయినది. చిత్రలేఖాకళాధరుల వివాహమైనట్లే తలంచినది. పెండ్లిపనులన్నియు జరుగుచున్నటులనే యూహాంగినది. కాలము జరిగిపోవుచుండెను. కళాధరుడు లలితకళయందు ప్రజ్ఞావంతుడయ్యెను గానవిద్యాసారమంతయు వానికి పిండిపోసినది సరస్వతి. కళాధరుడు దానిని దాహము తీరునట్లు త్రాగి జీర్ణించుకొనెను సరస్వతి కళాధర విద్యుల్లేఖల నొక్కచోటచేర్చి గాంధర్వకళారహస్యములను బోధించినది. వారిరువురొకరినిమించిన వారింకొకరైరి. ఒక్కొక్కప్పుడు సరస్వతి వీణవాయించును. వారిరువురు గాత్రములనుజోడించి గానమొనరింతురు. వారి కలయికనాలించి మహానందము నొందును మరొకప్పుడు కళాధరువీణసారించును. విద్యుల్లేఖ పాడును. ఆమెస్వరకల్పన యమోఘమైనది వానివీణావాదనములో నమృతము కురియును. దానినాలించి వాణి నమితసంతోషమందును. విద్యాప్రదర్శన సమయములందు పరస్పరము వారికి మనస్పర్థలేర్పడును. వారికి సరస్వతి తీర్పుకర్త్రి. ఆమె

ముందు తమవాదనలు నెల్లడించుచు. ఆదేవి వారికి తీర్పు చెప్పును. గెలిచినవారోడించినవారిని వెక్కిరింతురు ఓడిన వారికక్కసు్ుస సహింపరానిదగుచుండును ఒకదానిలో-కాకున్న నింకొకదానిలో గెలుపు సాధించుకొందురు ఇట్లీసవురు దిన మునకొక్కక్షణమైన బీసుపోసియరు. సరస్వతికి వారివాదోప వాదములు, పోట్లాటలు తీర్పుటతోడ తీరిక లేక పోయునని. ఆమె కొకవిధముగా నది సందడియు సంతోషము ననిపించినది. పార్వతి వారికి లాస్యము, నృత్యము, నభినయము నేర్పినది. వారు సంపూర్ణ విద్యావివేకములు గలవారయిరి. దేవలోక మంతయు వారిపాండిత్యము వేయిముఖ ల ప్రశంసించుచుం డెను. నారదుడు, తుంబురుడు వారిగానవిద్యాకౌశలముతలంచు కొని యబ్బురపడుచుందురు. అప్పటికి వారు సంపూర్ణయౌవ నము గలవారైరి.

కళాధరు డొకనాడు గృహమునందొంటరిగా కూర్చుం డెను. అతడేదో యాలోచించుచు విప్పారిన కనులతో కటి కీలోనుండి బైటికి చూచుచుండెను. వాని కొకవైపున శ్రుతి మేళవించిన వీణయుండెను. గాలితాకున తంతువులు పరిస్ఫుట నాదములతో నవీనస్వరకల్పనలు గావించుచుండెను. రెండవ ప్రక్క మృదంగము స్వరకల్పన కనుగుణముగా తాళమతికి తగినటుల వాయిద్యమును నెరపుచుండెను ముందు గ్రంథ ములు తెరువబడి పత్రమువెంట పత్రములు తిరగబడు చుండెను. కళాధరుని మనస్సు కల్పనా ప్రపంచములోనూగు టుయ్యాలలమీద నూగులాడుచుండెను. అదే సమయమున వెనుకనుండి యందెలచప్పుడువినిపించినది. అదియూరడంతగా

పట్టించుకొనలేదు. అది క్రమ క్రమముగా నగ్గరకు చేరి నటుల గోచరించినది. వాని యాలోచనా పరంపరలలో దానికి స్థానములేకపోయినది. అతడట్లే చూచుచుండెను.

కళాధరా! అను పిలుపు. ఆపిలుపుపైన వాని హృదయ కవాటమును చేరలేదు. అది రేకులు ముడిచికొని లోని తేనె తీగలలో రహస్యము దాచుచుండెను.

కళాధరా! ఏమిటీ పరధ్యానము.

అనుమాటలు వినిపించినవి. కళాధరుడు ప్రక్కకు చూచెను. మరల వెనుకకు చూచెను విద్యుల్లేఖ సంపూర్ణాలంకారములతో దాల్చి త్రిజగన్మోహినివలె సాక్షాత్కరించినది. అతడాన క్షణముపాటు మూర్తివంక చూచెను. అతని మనస్సు చిబ్బిబ్బైనది. క్షణము కనులు మూసికొని హృదయపుటములు విప్పి చూచుకొనెను. రెండు మూర్తులు సరిపోల్చుకొనెను. మరల కనులు తెరచెను.

ఏమీ! నిద్రవచ్చుచున్నదా కళాధరా? అని ప్రశ్నించినది.

కాదు మూర్ఛ వచ్చుచున్నది. విద్యుల్లేఖా! అని కళాధరుడు సమాధానము చెప్పెను.

అబ్బా! యెప్పుడూ ఒక జీవితము.

కాక నేడేమైన విశేషము కలదా?

నేను నీతో వాదించుటకు రాలేదు.

మోదించుటకు వచ్చితిని.

ఇంక నావలన నీకే బాధయునుండదు. నీవు సుఖముగా నుండవచ్చును విద్యుల్లేఖ కనుల వెంట ముత్యాలవలె కన్నీటి బిందువులు రాలినవి. కళాధరునిగుండె నీరయినది.

ఈ కన్నీరేమిటి. నేను నిన్నేమియు ననలేదుకదా?

ఏమియు ననలేదు. నిన్ను చూచునదృష్టము నాకు లభింపదు.

ఎందుకని?

నే నింటికిఁబోవుచున్నాను.

ఎప్పుడు?

నేడు.

మా యన్నయానతి యైనదా?

'అవును'. అని విద్యుల్లేఖ వెక్కి వెక్కి యేడువనారంభించినది. కళాధరునిగుండె జల్లుమనినది. నాసికనులనుండి నీరు కారినది. విద్యుల్లేఖకు నోటమాట రాలేదు. అంతలో 'కళా' యని పిలుపు వినపడినది. కళాధరుడాచోటు విడిచి పోయెను.

నాయనా! రేపు నీవు గంధర్వరాజ్యమున కభిషిక్తుడవు కావలయును. అని సరస్వతి కళాధరునితోఁ బలికెను.

నాకు రాజ్యము లెందుకమ్మా?

కాదునాయనా! ఇది తప్పకనిది.

నిన్నటివరకు చదువు పరిశ్రమ, రేపు రాజ్యపాలనాపరిశ్రమ, ఇంక నాకు స్వతంత్రము స్వేచ్ఛ యెక్కడిది తల్లీ?

నీమనస్సు నాకు తెలియును. అదియు త్వరలోనే చేకూరును విద్యుల్లేఖా! ప్రయాణమునకు వేళ యతిక్రమించుచున్నది. ఇంక బయలుదేరవలయును' అని విద్యుల్లేఖను పిలిపించినది మహాదేవి సరస్వతి. విద్యుల్లేఖ వచ్చినది. ఆమెకు దుఃఖమాగలేదు. అమ్మా! అని యేదేవో చెప్పబోయినది.

నాకు తెలియును లేఖా! నివారింపకుము. నీకోరిక నెల్లో యెల్లె యగును. అని మోదార్చినది సరస్వతి. విద్యుల్లేఖా కళాధరులు సరస్వతిపాదములకు నమస్కరించిరి.

ఆమె 'కళ్యాణమస్తు' అని వారిని దీవించి లేవనెత్తెను.



కళాధరుడు గంధర్వరాజ్యమున కధిపతి యయ్యెను. కళాధరుడు సకలవిద్యల నెరింగిన మహాపండితుడు. ప్రజలను న్యాయము తప్పక ధర్మము ననుసరించి పరిపాలించుచుండెను. గంధర్వులందరు వానిని మిగుల ప్రేమించుచుండిరి. విద్యుల్లేఖను విడిచి వచ్చిన నాటినుండియు కళాధరునకు నామె రూపురేఖలు జ్ఞప్తికి వచ్చుచునే యుండెను. చివరి నామెతో మనసార మాట్లాడుటకైనను సావకాశము లభించినదికాదు. ఇన్ని దినములు నామెతో కలిసిమెలిసి విద్యల నభ్యసించెను. కాని యామె కులగోత్రములను గురించికాని, తల్లిదండ్రుల గురించి కాని తానడుగలేదు. అడుగుటకు సావకాశము లభింపలేదు. ఎప్పుడామె నొంటరిగా కలిసికొనలేదు. అట్లు కలిసికొనుటకు కళాధరుడు ప్రయత్నింపలేదు అతనికి విద్యయందు పిపాస మెండు. దానిని తీర్చుకొనుటకు కాలమంతయు విద్యావ్యాసంగములతో గడిపెను. వానిమనస్సునందితరాలోచనలకు తావులేదు. దానికి తోడు తల్లి వానెల్లప్పుడు వెంటనిడుకొని సంగీతమని సాహిత్యమని శాస్త్రములని యేవేవో బోధించుచుండెడిది. విద్యుల్లేఖ కళాధరు నొంటరిగా కలిసికొనవలయునని బహు ప్రయత్నములు గావించినది. ఎప్పుడు

చూచినను తల్లి సమక్షముననందే యుండును. ఒకవేళ నామె పలుకరించినను ముక్తసరిగా మూడు ముక్కలు మాటాడును. ఆమెకు కసిపుట్టి యేకోయొక్క గిల్లికజ్జాసుదిగును. అంతటితో వాదోపవాదాలుగా ప్రబలును. ఆ సమయమున నొకనికంటె నొకరికి పట్టుదల హెచ్చిపోవును. అన్నపానములుండవు. ఆకలి దప్పులుండవు. పూర్వపక్ష సిద్ధాంతములు పెరిగిపెరిగి సరస్వతి యొద్దకు పోవుదురు. ఆమె వారికి తీర్పు చెప్పును. ఓడినవారు తలవంచుకొని పోవును. విద్యుల్లేఖ కది చాల సారులు జరిగినది. ఆమె కోరచూపులు కలాధరునివంక చూచుకొనుచు పోయెడిది. ఏనాటి కానాడామె వచ్చిన పని యొకటి. జరిగిన పని యొకటి యగుచుండును. ఇంక నామె కలాధరునికి తిన్నరిగించుట యెప్పుడు. ఛాత్రులందామె తన యవివేకమును నిందించుకొనును. కలాధరున కేయాలోచనలు లేవు. విద్యుల్లేఖను ముఖములో ముఖముంచి చూచిన దెన్నడూ లేదు. చూచిన నాచూపు క్షణికము. ఆమెయందమునం దప్సరసల తన్నినదని వానికి తెలియదు. ఆమె యందముతో వానికెంతకాలము పనిపట్టలేదు. ఆమె వాదములతోడనే పని. విద్య పూర్తియైనది మీరు సకలవిద్యావేత్తలైనారని సరస్వతి యానతిచ్చినది. వారామెపాదములకునమస్కారము చేసి లేచిరి. మహానందముతో సగర్వముగా నొకరినొకరు మనసారచూచుకొనిరి. ఆనాడు విద్యుల్లేఖయందము కన్నుల కగుపడుతర చూచెను. సరస్వతి యది చూచినది. విద్యుల్లేఖ సిగ్గుచేతతల వంచినది. అదే వారికడసారిచూపు. తరువాత యెడబాటు. తుది ఘడియలయందు తాను చూచిన విద్యుల్లేఖయే వాని

హృదయము శోకమున్మూర్ఛ చిత్రితమైనది. ఆనాటుకదిద్దిన వాలు కనులు, ముత్యాలపరుగములవలె దిగజారిన కన్నీటిధారలు, వియో గినుడికి తుట్టతుదలాడి వెలువడిన ప్రేమరసముమీదియావిరి పొగలవంటి నిట్టూర్పులు కళాధరుని మనస్సున గాఢముగా తీర్చిన రేఖలైనవి. విద్యుల్లేఖకొఱకు కళాధరుడు కలవరింప నారంభించెను. తన యొంటరిపాటునకు లోలోన తపించెను. ఆమె నెచట కలిసికొనగలుగుదునా యని యాలోచించెను. దేవలోకములన్నియు గాలింప మొదలుపెట్టెను.

ఒకనాడు కళాధరుడు రత్నకూటనందు సంచరించుచు విద్యాధరోద్యానమునకు వచ్చెను. అచట నొకయిసుకతిన్నె మీదకూర్చుండియాలోచించుచుండెను. ఆసమయమున వానికి గానమొకటి వినిపించినది. తలయెత్తి చూచెను. ఆ గాన మెదుటి మేడమీదినుండి వచ్చుచుండెను. వానికేదో స్ఫురించి నది. ఎచ్చటనో యాగానమాధుర్య మాలకించినటులస్ఫురించి నది. కళాధరుడు జ్ఞాపకశక్తికి తెచ్చుకొని అది దేవగంధారిరాగ మనివానికి గుర్తున్నది. ఒకనాడు విద్యుల్లేఖ యారాగము వీణమీద నాలపించినది. ఆ మీటులోని చెణుకులు కళా ధరుని మనుకరించినది. అదే రాగము, అదేపాట అదే విధా నము కళాధరుడులేచెను. ఆమేడవైపున కరిగెను. అంతలో గానమాగిపోయినది. కళాధరుడు నిరాశచెందెను. ఆ దారినే మనస్సుపోయినవాడై ముందునకు నడచెను. మరల గానము వినిపించలేదు.

'వాణీ కుమారా!'

'వాణీకుమారా!' అనుపిలుపు వినిపించినది కళాధరుడు వెనుకకుచూచెను. ఆమె విద్యుల్లేఖ. కళాధరునకు పట్టరానియానందము కలిగినది. ఒక్కసారి యామెను కౌగలించుకొనవలయునను బుద్ధిపుట్టినది. ఆమె స్త్రీ. అది బహిరంగప్రదేశము. ప్రేమకు సమయాసమయములున్నవి. అతికష్టమునిలిచెను. విద్యుల్లేఖకు ప్రాణములు లేచివచ్చినట్లయ్యెను. పోయిన పెన్నిధి లభించినటులైనది. ఆమె త్వరత్వరగా కళాధరునిసమీపించెను. ఒకకంట నానందాశ్రువు లింకొకకంట దుఃఖాశ్రువులు తూగాడినవి. వారిరువురు వసంతవైపునకరిగిరి. ఆనాడు మొదలు వారిరువురు ప్రతిదినమూవనమున కలిసికొనుచుండిరి. కళాధరుడు విద్యుల్లేఖనువివాహమాడనెంచెను. విద్యుల్లేఖ యస్వతంత్రురాలు. తల్లిదండ్రుల యానతి కావలయును. వారియనుమతిని పొందుమనియు సరస్వతీబ్రహ్మలనడిగింపుమనియు విద్యుల్లేఖను బలవంతపెట్టుచుండెను. ఆమె యాడుది. తనపరిణయమునుగురించి తల్లిదండ్రులనడుగుటకు సిగ్గుపడుచుండెను. తల్లిదండ్రుల కామెయొక్కతియే సంతానము. ఆమెకు వివాహమొనరించిన తమ్ము విడిచిపోవునని బెంగ. కావున నెవరెంత యొత్తిడిచేసినను 'పిల్ల యిష్టపడిన మాకేమి?' యని సమాధానము చెప్పుచుండిరి.

దాదాపొకసంవత్సరము గడచినది. దేవలోకము నందానాడుగాదిపండుగ. మహావైభవముగా జరుగుచుండెను. ప్రతిగృహము నందముగా నలంకరింపబడెను. దేవలోకము లోనివారందరు క్రొత్తక్రొత్తవిధములుగా నలంకరించుకొని మనోవికాసముతోపాటు ముఖవికాసము కలవారై యుండిరి.

ఆదినమున త్రిలోకాధిపతియగు దేవేంద్రుడు నిండుకొలువును తీర్చును. దిక్పతులు, విద్యాధర, కిన్నర, గంధర్వ యక్షప తులా సభకు రావలయును. సముచితములగు కానుకలర్పింప వలయును. అప్సరసలునాట్యమొనరింప నారదతుంబురాదులు గానమొనరింతురు. సరస్వతీపుత్రుడగు కళాధరుడు సకల విద్యావంతుడనియు గాంధర్వవిద్యయందు వానితో సమాను లెవ్వరు లేరనియు నింద్రుడు వినెను వానిగానము విననలయు ననునాస వానికికలిగెను. దేవేంద్రుడు కళాధరునకు వర్తమా నము ప్రత్యేకముగా పంపెను. కాని యీసంగతి కళాధరునకు తెలియదు. అతడు విద్యాధరోద్యానమున విద్యుల్లేఖను కలిసి కొనపోయెను. సభప్రారంభమైనది. వందిజనములు పలు ముఖముల దేవేంద్రుని పొగడిరి. రంభాద్యప్సరసలు వినో దముగా నాట్యాభినయములు ప్రదర్శించిరి. సభయంత నపరి మితానందమున మునిగిపోయినది. తరువాత కార్యక్రమము కళాధరుని వీణాగానము. దేవేంద్రుడు నలుమూలలు పరికిం చెను కలాధరచక్రవర్తి కానరాలేదు. బృహస్పతి యింద్రుని మంత్రి. కలాధరునికొరకు వెదికించెను. ఆయన సభకు రాలేదు. దేవేంద్రుడు అమితముగా కోపించెను. ప్రళయ రుద్రునివలె గర్జించెను. కలాధరుడు దేవేంద్రునకు సామంత రాజు. స్వయముగావచ్చి పాదప్రణామాచరింపవలయును. కానుకలర్పించిపోవలయును. అట్లు కళాధరుడు చేయలేదు. మీదు మిక్కిలి ప్రత్యేకముగా పిలువనంపినను రాలేదు. ఆ సమయమున చిత్రధరుడు తన దివ్యదృష్టిచే నంతయుగ్రహించి శారదాకుమారుడు సర్వస్వతంత్రుడు. త్రిలోకాధిపతులకువినతు

డగువాడు కాడు. మీ యానతికంటె విద్యాధర రాజకుమారి యందలి ప్రణయవిహారము ముఖ్యముగా తలంచెను అతడు రత్నకటకమునందలి వసంతవనమున విలాసములో మునిగిపోయి యున్నవాడు' అని వచించెను.

ఆమాటలు దేవేంద్రుని కోపాగ్నిలో నెయ్యిపోసినట్లు యినది. దేవేంద్రుడు దివ్యదృష్టితో చూచెను. వసంతవనమున వీణాగానమొనరించుచున్న విద్యుల్లేఖ కళాధరులను పరికించెను సర్వము గ్రహించెను

ఎవతెను ప్రేమించి నాయానతిని తిరస్కరించెనో యామెను వరించిన స్వసేవకునిచే కళాధరుడు కరవబడి భూలోకమున విద్యావిహీనుడైన జూదరిగా జన్మించుగాక. నా సన్నిధానముచే వాని శాపము మరలుగాక' యని శపించెను. అది యట్లే జరిగినది. విద్యుల్లేఖ చెలికత్తెలు రంభాదులవలన జరిగినసంగతులన్నియు తెలిసికొనివచ్చి యామెతో చెప్పిరి. ఆమె యావేదనమున కంతులేకపోయింది. పొరలివచ్చు దుఃఖమునకు పట్టపగ్గములు లేకపోయినది. దానికి కోపముతోడైనది. ఆమె కళాధరుని కళేబరమును నోడియందుంచుకొని గగనయానంబున నింద్రసభకరిగెను. దాని నింద్రునిముందుంచి యెడతెగని కన్నీటిధారలతో నిట్లనెను.

'దేవేంద్రా! నేవు త్రిలోకాధిపతివి. సకల జీవరాసుల సుక్షేమము కోరవలసినవాడవు. ధర్మాధర్మము లెరింగిన వాడవు. పరులకు బోధపడుటకు మానవుడవుగాని పశులచేత చెప్పించుకొన తగినవాడవుగావు కంచయే చేనినిమేయబూనినచో కాపేమి చేయగలుగును. ప్రజ్ఞాసంరక్షణ చేయవలసిన

నీవే యహంకార గర్వంబున ప్రజావినాశనమునకు బూను కొంటివి. త్రిలోక సామ్రాజ్యాధిపత్యమన్యాయముగా పురుషు లను శపించి వారిని వధించి సుఖింపదలంచు కన్నియల నధో గతిపాలు కావించుటయే కాబోలు. నీ పనులు కావింపనంత మాత్రమున మరణశాప మొసంగుదువా? దేవేంద్రా! ప్రేమ మానవప్రకృతి కామాంధుడవై కన్నుగానక గౌతమునిల్లాలిని వరింపబోయిన నాటి వృత్తాంతము మరచిపోయితివి కాబోలు. నావల్లభు డేపతివ్రతను వంచింపలేదు. తాను వరించిన యిల్లాలితో సుఖముగా వినోదముల గాలము గడుపుచుండెను అది తప్పా! పరిపాలిత జనంబుల కపకార మొనరించు నీపాప ఫలం బనుభవింపకపోవు. పతివ్రతలగు నుత్తమ యిల్లాండ్ర కన్నీటిధారలు మున్నీరయి, పొంగిపొరలి నిన్నును నీ రాజ్య మును ముంచివేయునను మాట మరచిపోకుము. తనపతి ప్రాణ ములు కొనిపోయిన యముని గతి యేమైనదో తలంపుము. పతి మరణింప శపించిన మాండవ్యుని శాపమువకు ముల్లో కముల నంధకారమున ముంచి సూర్యోదయము కాకుండ చేసిన సుమతి వృత్తాంత మొకసారి జ్ఞాపకము చేసికొనుము. మహేంద్రా శక్తికలదు కదాయని నోటికివచ్చినట్లున శపించు వారి గతులేమైనవో యూహించుకొను. ఒక్క యబల నే కారణముగా ననాథనొనరించి వైధవ్య బారడిగావించిన యా పాపంచకము నీమీన నలయుకొని జన్మజన్మాంతములందు పట్టి పీడింపకమానదు. నాభర్తృవియోగతాపానలము నన్ను వలెనే నిన్నుమాడ్చి మసిచేయుననుటకు సందేహము లేదు. దురితాత్ముడవై నాభర్త నకాలమున సర్పము కాటున

శాపాహుతిచేసి నాసుఖమును మంట కలిపితివి. నాభావి సుఖ సౌధమును కూలద్రోసితివి. నాజీవిత సర్వస్వమూ నాశనము చేసితివి. దానిఫలిత మనుభవింపుము నీవును నాపతితోపాటు భూలోకమునే జన్మించి రాజ్యమునుబాసి మతిచెడి దేశదిమ్మరివై గతిలేక పరిభ్రమింపుము. నాపతి దేవలోకమునకుమరల ప్రాణములను పొంది వచ్చునంతవరకు నీవట్లే యుందువు.

ఆ మాటలకు సభాసదులందరు నాశ్చర్యమునొందిరి. దేవేంద్రుడు సైతము నోరు మెదల్పలేకపోయెను. సముద్రమునందలి బాడబాగ్నివలె నామె కన్నీటిధారలలో ప్రళయకోపాగ్ని పొగలురాజి మంటలు మండినది. దానిశాశల కచ్చటివారు తపించిపోయిరి. దేవేంద్రుడు తొందరపడెనని కొందరూహించిరి. కాని యెవరు నామాట వెలిబుచ్చుటకు సమర్థులుకాలేదు విస్మృల్లేఖ ముఖమునందే వారి చూపులు నిలిచిపోయెను. ఆమె రోదనములు వారి శ్రవణపుటములను గింగురు లెత్తించినవి. ఆమె శాపోక్తులు వారి హృదయమునకు భయము కొలిపినది. వారు ప్రాణములులేని ప్రతిమలవలె నిలువబడిరి. ఇంతవరకు నింద్రు నెదిరించి యిట్లు మాట్లాడ సాహసించినవారులేరు. ఆమె విద్యావంతురాలు, అభిమానవతి, సరస్వతీ కటాక్షమును బొందిన యువతి. కన్యక యయ్యును. సత్యముగా తన పతిని దైవమువలె తలంచిన యిల్లాలు. వానిని మనసార నాదినుండియు ప్రేమించినది. పరిణయమాడ తలంచినది. వాని సుఖములనే త్రికరణశుద్ధిగా కోరినది తపస్వినిరాలు ఆమెమాట నెరవేరకేమగును.

విద్యుల్లేఖ శాపోక్తులు శూలములవలె నింద్రుని చెవులందు చొరబడి హృదయమును మహావ్యాకులమును కలిగించినది. సభామధ్యమున తనకడ వినయ గౌరవమునకు నింద్రుడు తలవంచెను. విద్యుల్లేఖనేమియు ననలేకపోయెను. ఆమె కళాధరుని కళేబరమునుతీసుకొని సత్యలోకమునకరిగెను. జరిగినదంతయు సరస్వతీ బ్రహ్మలకెరిగించెను. వారు పట్టరాని యావేదన ననుభవించిరి

౨౩

అమ్మా! భూలోకములోబుట్టి కష్టములనుభవింపమందువా ?

తప్పదు వైశ్యదేవా! తప్పదు. నాకొరకునైనా నీ కష్టము పడవలయును. నాకుమారుడు సకలశాస్త్రవిదుడు. పవిత్రమూర్తి, గుణములకు దారాశి. అట్టివాడు మానవులకు జన్మించుట నా కిష్టములేదు.

ఇంకెవరినైన యాజ్ఞాపింపకూడదా ?

అట్లుకాదు. నీవు యజ్ఞరూపుడవు,పావనుడవు. వేదములవలన జన్మించినవాడవు. అట్టి నీకు కళాధరుడు కుమారుడై జన్మించు.. వానిని రక్షించుభారమంతయు నీయందిడితిని. నాకింకొకరియందు నమ్మకములేదు.

అమ్మా! మీమాట కాదనుటకునాకునోరురాకున్నది. కాని...

అదినాకు తెలియును. నీభార్య సువర్ణ ప్రభను కపిలుని యాశ్రమమునవిడిచిపొమ్ము.ఆ మహాతపస్వినీవచ్చునంతవరకు

నామెను సంరక్షించుచుండగలడు. ఆమె యదటనుండుట వలన నొక ప్రయోజనము కలదు.

ఏమది ?

అది దేవరహస్యము.

నాకు చెప్పరాదందురా !

నీకుచెప్పిన రహస్యమెట్లగును !

వైశ్యదేవుడు సరస్వతియానతిని శిరమున దాల్చెను. వా నిల్లాలిని కపిలమహర్షి యాశ్రమమునందుంచెను. భూలోకమున హరిహర సోమయాజినై జన్మించెను. సువర్ణ ప్రభను విద్యాధర రాజవమానింపబోయి శాపమును బొందెను. రక్కసుడై చరించుచు పుత్రికను వధింపనున్నతరి వేదకుంభుడు సంరక్షించెను. వానిమూలమున శాపవిముక్తిని బొందెను. తత్త్వభేదిని వానికుపదేశించెను. అందువలన వేదకుంభుడు సకల విద్యావంతుడయ్యెను వేదకుంభుడే కళానరుడుగా హరిహరునికి జన్మించెను.

వైశ్యదేవుడు విశ్వేదేవతల యంశతో జన్మించినవాడు. మహాతేజస్వి. అగ్నిదేవునివలె ముఖమండలమునుండి ధగదగ కాంతులు వెడలుచుండును. అతడు బ్రహ్మయొద్ద వేద విద్యలభ్యసించెను. శాస్త్రములను నేర్చెను అతడు నిరంతరము సరస్వతీ బ్రహ్మలను సేవించుచుండును. వాని తేజోమూర్తులకు తగినయిల్లాలిని సృజింపవలయునని సరస్వతి బ్రహ్మను ప్రార్థించినది. ఆయన వినోదముకొరకు నొక యతిరూపవతిని సృష్టించెను. వాణియామెను వైశ్యదేవునకిచ్చి వివాహము కావించెను. వైశ్యదేవుడు విష్ణుభక్తుడు. ప్రతిదినము ప్రాతః

కాలమున లేచి కాలకృత్యములు నిర్వర్తించుకొని విష్ణుపూజ యొనరించును. నందనవనమునకరిగి పారిజాతపుష్పములతో మాలికలుకట్టి విష్ణువునకుసమర్పించి వచ్చుచుండును. ఒక వసంతసమయమున వైశ్యదేవుడు ప్రతిదినమువలె నందనవనమునకరిగెను. బాగుగా విప్పారిన పారిజాతసూనములను కోయవలయునని యొకపువ్వును గోళ్ళతో చిదిమెను. ఆ సమయమున నావృక్షమునుండి 'అబ్బా' యను ధ్వని వినిపించెను. వైశ్యదేవుడదివిని యెక్కుడు దారోదమని యాశ్చర్యపడుచు చెట్టువంక చూచుచుండెను. ఆచెట్టునుండి యొకసౌందర్యవతి బైటికివచ్చి వైశ్యదేవునియెదుట నిలువబడెను.

'మీామూలమున నాయొడలెంత గంటుపడినదో చూడుడు' అని యామె వైశ్యదేవునిదగ్గరకువచ్చి చిగురాకులవంటి తన వ్రేలిచివరను చూపించెను అది యెఱ్ఱగాకంది రక్తము కారుచుండెను. అతడు దానినిచూచి యిట్లనెను.

ఏమిటిది?

రక్తము.

ఎట్లు వచ్చినది?

మీారు గిల్లితిరిగదా ?

నేనా ?

అవును.

ఎప్పుడు ?

ఇప్పుడే !

నేను గిల్లలేదే !

అబద్ధము. మీా రాపువ్వును పుణికితిరిగదా ?

అవును.

దానివలననే నీ గం టేర్పడినది. ర క్తము వచ్చినది.

నీవెవరవు ?

నందనలక్ష్మిని.

వైశ్యదేవుడు నందనలక్ష్మివంక చూచెను. ఆమెశరీరమునుండి వెన్నెలవంటి తెల్లనికాంతులు వెలువడుచుండును. ఆమె ఈల్లిపూరవంటి తెల్లని చీరెధరించెను శరత్కాలము నందలి చంద్రబింబముఖిాందజీరాడు నీలమేఘములవలె నామె నల్లనివెంద్రుకలు గాలికిచెదరి యిటునటు తూగాడుచుండెను. ఒడలంతయు చక్కని పారిజాతపుష్పములనే నలంకరింపబడి యుండెను. వైశ్యదేవుడామెను కన్నార్పక నొక్కక్షణమటు లనేచూచెను. ఆమెకు సిగ్గుపొడమినది.

తలవంచి ఏమట్లు చూచుచుంటిరి?

ఏమియులేదు.

కారణములేనిది కార్యము కలుగదుకదా.

అదియే నేను తలంచుచుంటిని. ఒక స్త్రీ పురుషుని యెదుట నేకతముగా మాట్లాడుట కేమికారణమాయని ?

ఆర్యకుమారా ! మీా రీవనమునకు ప్రతిదినము వచ్చుచుంటిరి. నేను చూచుచుంటిని. పెక్కుమంది నా యలరులను చిదుముచుందురు. వారియందు నాకు కోపము కలుగుచుండును. మీారు పూలుకోయుచో నాయొడలు పులకరించినటులగును. మీాకు నా స్వరూపమునుచూపి మాటాడనెంచుచుందును. కాని పలువురుండుటచే సావకాశము కలుగలేదు. ఇప్పుడది లభించినది.

నందనలక్ష్మి ! నీవందని ప్రమానిపండ్లకు ప్రాయత్నించు చుంటివి.

ఆర్యా! మీరు పురుషులు.

నేను ఏకపత్నీ వ్రతుడను. ఈజన్మయందది యసాధ్యము.

నందనలక్ష్మి కన్నీరు కార్చినది. వైశ్వదేవుడచట నిలువలేదు. తనసెలవునకు వచ్చెను. ఆనాటినుండి యాతడు నందనవనమునకు మరలపోలేదు వనలక్ష్మి వానినితలంచుచు వియోగమున కుందుచుండెను సరస్వతికాసంగతి తెలియ వచ్చినది. ఆమె నందనవనలక్ష్మిని తలంచినది. వనలక్ష్మి సర స్వతియెదుట నిలిచెను

వనదేవీ ! నీవు వైశ్వదేవుని వలచియుంటివికదా ? యని యడిగెను.

ఆమె సిగ్గున బొటనవ్రేలు నేలనువ్రాయుచు అవునని తలయూచెను. సరస్వతి యిట్లనెను.

'కాశీనగరమున వైశేషికభట్టాచార్యులను మహాపండి తుడు కలడు. అతడు సకలవిద్యావేత్త వానికి కుమార్తెవై జన్మింపుము. వైశ్వదేవుడు భూలోకమున కాశీనగరమున జన్మించెను అతనిపేరు హరిహరుడు అతడు తండ్రియొద్ద విద్యల నభ్యసించుచున్నవాడు. వానికిభార్యవై యిష్టసుఖము లనుభవింపుము'.

నందనవనలక్ష్మి యందులకంగీకరించెను. వైశేషిక భట్టాచార్యునకు కూతురై జన్మించి హరిహరునకు భార్యయై వేదకుంభుని గనెను. ఆమెకుమారుడు చిన్నవాడై యుండగానే

వనదేవతల యాదేశమున పాముకరచి మరల నందనవనము చేరెను. ఆమెశరీరమును వనదేవతలు గొనిపోయిరి.

దేవేంద్రుడు విద్యుల్లేఖశాపమును పొంది శిలాదిత్యుడను పేరున కాశీరాజ్యమునకు రాజుగాజన్మించెను. అతడు నీతివేత్త. పరాక్రమవంతుడై ధర్మముతప్పక రాజ్యపరిపాలనము గావించెను. వానికనులకు జ్యోతివలె హరిహరభట్టోజీ నీతిబోధకుడై యుండెను. హరిహర సోమయాజికొలువును బాసిననాటినుండియు శైలాదిత్యునకు బెంగపాడమినది. పగలంతయు వానిమాటలనే తలంచును, వానికథలనే స్మరించును, వాని ప్రసంగములనే తెచ్చును. రాత్రులందు వానిని గురించి కలవరించును తిన్నగా కొలువుకూటమునకైన మాని వేసెను. ప్రజలకు ధర్మమిచ్చుటలేదు. రాయబారుల మనవు లాలించుటకుకూడ యంతరాయములు నాటకములు కలిగించుచుండెను. రాజులకంతయూ వేదన తగదనియునందుమూలమున రాజ్యము పాడగుననియు నొక్కప్పుడు రాజునకే ముప్పుగలుగ వచ్చుననియు మంత్రు లనేకవిధముల బోధించిరి. శైలాదిత్యుడు వారిమాటలు పెడచెవిబెట్టెను. కాలక్రమమున నీసంగతి విరోధిరాజుల చెవినిబడినది. వారు కాశీరాజ్యమున కబళింపవలయునని యువ్విళూరుచుండిరి. ఐనను శైలాదిత్యుని పరాక్రమము తలంచుకొని క్రుంగిపోవుచుండిరి. అంరాజు అగ్రసేనుడు. అతడు మహాతేజస్వి ధైర్యసాహసములుగల రణవీరుడు. అతడొకసారి శైలాదిత్యునిమీదికి దండెత్తుకొని పోయెను. వానితో నిరువదిదినములు హోరాహోరీగా పోరాడెను. కాని చివరికోడిపోయి తనరాజధానికి వచ్చెను. ఆనాటి

నుండి యుగ్రసేనుడు శైలాదిత్యునకు సామంతుడై, సంవత్సర మున కిరువదిలక్షల వరహాలు కప్పము కట్టుచుండెను. అతడు తన పరాభవము మరచిపోలేదు. నానాటికి తన సేనలను పెంచి బలవంతుడగుచుండెను. శైలాదిత్యుని మనోవైకల్యమును గురించి చారులు వారికెరిగించిరి. ఉగ్రసేనుడు చుట్టుపట్టుల నున్న రాజుల సహాయమును సంపాదించి యపారమగు సేనను సమకూర్చెను. శైలాదిత్యుని మీదికి దాడివెడలెను.

శైలాదిత్యునకు మంత్రులుగ్రసేనుని దురాగతమును గురించి వివరించిరి. రాజునకిష్టము లేకున్నను, మంత్రుల ప్రేరేపణమున నుగ్రసేనుని రణమునందెదిరించుటకు సేనలతో నరిగెను. శైలాదిత్యునియందు తొల్లింటి తేజముగాని, బల పరాక్రమములుగాని కనబడలేదు. దండనాథులే యుద్ధమును చాలవరకు నిర్వర్తించిరి. ఎంత పెనుగులాడినను విజయ ముగ్రసేనునే వరించెను. శైలాదిత్యు డడవులపాలయ్యెను. ఉగ్రసేనుని భటులు వానిని యమదూతలవలె వెంబడించు చుండిరని తెలిసి, భార్యతో పాంచాల రాజ్యమును దాటి గాంధారమున ప్రవేశించెను. వారొక మహారణ్యమున నడచి పోవుచుండిరి. ఆసమయమున మహారాణి శ్రమలకు సహింప లేకపోయినది. ఎండకొండలు వాడలంతయు వేడెక్కెను. తగునాహారము లేకుండుటచే నాకలిదహించుకొని పోవుచుం డెను. ఆమెకొక నాడతితీవ్రమగు జ్వరమువచ్చెను. దాహ ముచే నోరెండిపోయినది. శైలాదిత్యుడు చల్లని జలమును తీసికొనివచ్చుటకై వెళ్ళెను. వానికి జలము లభింపలేదు. ఆమె నోరెండి మరణించెను. ఆమె మరణము శైలాదిత్యు

నకు మరింత మతి భ్రమణము కలిగినది. నాటినుండియు పిచ్చి వానివలె నశ్వత్థంబట్టి తిరుగనారంభించెను.

బ్రహ్మదేవ్రు నీ వృత్తాంతము నాకలింగకు తెచ్చెను. నేను శైలాదిత్యుని వేదకుంభునికలిసికొనవలయును. విద్యుల్లేఖ యొసంగిన శాపమునుబట్టి శైలాదిత్యుడు వేదకుంభునిగాంచి నంతనే శాపవిముక్తి నిరాగలదు. దానికి తగునుపాయమాలోచింపవలయును. బ్రహ్మదేవుడు సరస్వతితో నిట్లనెను.

దేవీ! మనకుమారునకు శాపవిముక్తి పొందుకాలము వచ్చినది శైలాదిత్యుడు మతిచెడి కంధారప్రాంతము నందు తిరుగుచున్నాడు. నీవా నగరముపై నిడిన శాపము మరలింపుము. నేను వారికే:యోపదరాకుండ శాపముడుపును, అనెను. సరస్వతి యందులకు సమ్మతించెను.

పిమ్మట వరలుడను నొక దివిజునిబిలిచి బ్రహ్మ యిట్లనెను. వరలా! అటుచూడుము. అతడు శైలాదిత్యుడను కాశీదేశమునకురాజు. వానిని నీవుకలిసికొనికంధారదుర్గమునకు గొనిపొమ్ము. అచట వేదకుంభాదులు స్వసేనుని విషధూమముల చేత నొడలు మరచియుండిరి. వారియొద్దకు శైలాదిత్యుని గొనిపొమ్ము.

వరలుడు వరాటుని రూపమున నచటనుండి వెడలి పోయెను.



'నీ వెవరవు?

'నేను భూలోకవాసిని'

'పేరు'

'వేదకుంభుడు'

'వచ్చినపని'

'నాగమణికొరకు వచ్చితిని'

'నాగమణి కొఱకా?'

'అవును'

'అసాధ్యమగు దానిని కోరితివి'

'నాగరాజా! తపస్వులకసాధ్యముకాని దేదియు లేదు.'

'అవి కృతయుగపుమాటలు'

'కలియుగమైనను వేదవులు తమవీర్యమునుగోల్పోవ లేదు.'

'ఏమీ నన్ను భయపెట్టుచుంటివా?'

'లేదు. యాచించుచుంటిని'

'చంకదుడ్డు శరణార్థియన్నటులున్నవి నీమాటలు'

'అందను మానము లేదు. సామమువలన నెరవేరనపుడు దండమే మిగులును.'

'ఓయీ బ్రాహ్మణుడా నాపరాక్రమము నీ వెఱుగవు కాబోలు'

'ఎఱుగకపోలేదు. అకారణముగా నాగలోకమునకు విలయము తెచ్చుకొనవలదని నా మనవి'

'ఏమీ? నాగలోకమునకే విలయము కలిగింతువుగా!'

'అలిగించినచో సంతయు జరుగక మానదు.'

'మా యలుకలు మాకు తెలియనివికావు.'

'నాగరాజా మరిచితివి కాబోలు పౌష్యమహాదేవి కుండలములను తక్షకుడు హరించిననాటి వృత్తాంతము'

'నీవు ఉదంకుడవు కావు'

'అని నీవే తెలిసికొనగలవు'

'భూలోకవాసికింత పొగరా?

నాగలోకవాసికింత కన్నుగానని తనమా? అకారణముగా కుసుమపేశలములైన శరీరములను విషజ్వాలల కాహుతి కావించు మీ కుటిల ప్రవర్తనము మీరెరుంగనేరక మానవులను నిందించు నీస్వభావము పొగడతగినది. వాసుకీ! నీయనుచరులు కావించు ఘోరకార్యములు నేను విశదము గుట్టేని దేవతలతో సమానులను గావించి మీకర్ఘ్యపాద్యాదులొసంగుచు పూజలుగావించు మానవులను ప్రమదించు మీకృతఘ్నతకు పరిహారము లేదు. శంకరునకు కంఠభూషణంబని గర్వపడుచుంటివి కాబోలు. మీజాతి దురాగ్రహమును శంకరుడైనను సహించడని తెలిసికొనుము. శంకరుడు భక్తపరాధీనుడు. భక్తుల అపకార మొనరించు తనకుమారుడైనను మన్నింపడు. నాగరాజా! ఆసంగతిప్పుడైనను గ్రహించుకొనుము.

వాసుకి యమితకోపమున కన్నులెఱ్ఱబార మెడ నూగించుచు, పూత్కార మొనరించెను. వాని పూత్కారములనుండి విషవాయువులు క్రమ్ముకొనెను. అవి గ్రీష్మవాయువులవలె వేదకుంభు నావరించినవి. వానికోపా తపాలము ముందు విషానిలము హిమమువలె చన్ననైనది. తనసేవకును పిలిచి వేదకుంభుని బంధింపుడని యాజ్ఞాపించెను. కాని

వారాతని సమీపమునకైనను రాజాలరైరి. అంత వేదకుంభుడు. 'నాగరాజా! నీగర్వమునకు ప్రతీకారమనుభవింతువు' అని యాచోటు విడిచిపోయెను.

వరలుడు వనాటరూపమున శైలాదిత్యునికలిసికొనెను. శైలాదిత్యునకు మతిభ్రమణము కలిగినది. చెట్టులను పుట్టలను పట్టుకొని పలువిధముల విలపించుచుండెను. అన్నపానీయములను మానియుండుటచేత చిక్కిశల్యమై, చర్మముకప్పిన యెముకల గూడువలె నుండెను. వస్త్రములు మురికిపట్టి వాలికలైనవి. తల జడలుకట్టినది. ఒడలు దుమ్ముగప్పినది. నడుచుటకైనను శక్తిచాలని స్థితియందుండెను. ఐనను రాజ్యము మీదను, సంసారముమీదను కల వ్యామోహము వానినివిడిచిపెట్టలేదు. అతడొక చెట్టుమీద కూర్చుండి యది తనసింహాసనమనియు, చెట్టుచేమలు తనప్రజలనియు, నడవిజంతువులు తనసేనలనియు, నడవి తనరాజ్యమనియు తలంచుచు వారికి తన యానతులెరిగించును. వారు తనయానతులు నెరవేర్పకుండుటచే మహోగ్రుడై మండిపడుచు తీగెలను ద్రుమములను మోదును. అడవిమృగములను రాళ్ళతోడను రప్పలతోడను రువ్వును. అవి రోషోద్ధతులై తిరిగినప్పుడు ప్రాణభయముచేత చెట్లపైకెగ బ్రాకును. ఒక్కొక్కప్పుడు పెద్దగానేడ్చును. సోషచెంది నేల మీదపడిపోవుచుండును. వరలుడు శైలాదిత్యునిగాంచి జాలినొందెను.

అతడు వానిని అయ్యా! మీరెవరు? అని ప్రశ్నించెను.

శైలాదిత్యుడు చాలసేపటివరకు నే సమాధానము చెప్పలేకపోయెను. వానికొకవిధముగా భయము నొకవిధముగా

దుఃఖమును వెల్లబిరవచ్చినని. నోటిమాట రాలేదు. వరలుడు వానిని శాంతవచనములతో డదుఃఖము నుభయమునుమాపెను. శైలాదిత్యుడు తనకథనంతయు వరలునకు చెప్పెను.

వరలుడిట్లనెను. రాజా ! మానవులు కష్టజీవులు. వారు కష్టములలోపుట్టి కష్టములలో పెరిగి కష్టములలోనే మరణింతురు. కుమ్మరిపురుగు మురుగు గుంటలలోనుండి తాను సుఖపడుచున్నానని, తలంచుచుండును. అట్లే మానవుడు కష్టములతో చుట్టుకొనబడియు.సుఖమనుభవించుచున్నటుల భ్రమించును. కాని నిజముగా సుఖమనుభవింపజాలడు. అట్లుండియు పలువిధనముల మానవుని గర్వాంధుని చేయుచున్నవి. వానినాధారముగా చేసికొని యమాయికులు నసమర్థులనైన ప్రజలనుపట్టి పీడించి హింసించుట అలవాటైనది. అందు మూలమున వారిజీవితము శోకముల పాలుకావించుచున్నారు. వారితో సరిపోల్చుకుని తాను సుఖపడుచున్నానని యున్నపదవియందున్నవాడును, ధనవంతుడును కలలు కనుచుండును. రాజా! సుఖము భోగభాగ్యము లనుభవించుటలో లేదు. తన తోటివారి నాదరించి యానందించుటలోనున్నది. అసూయా ద్వేషములను మనస్సులోనుంచుకొని పరులనుపీడించు రాక్షసరూపులగువారికి సుఖమెక్కడిది. పూరిగుడిసెలలో వసించు పేదవానికి, నున్నతసౌధములందువసించు రాజులకును ధనపదవులుతప్ప మరేతారతమ్యముకలదు ? పేదయు రాజువలెనే జన్మించును. రాజువలెనే మరణించును. మధ్యకాలమున వచ్చిన ధనమునుచూచుకొని మురిసిపడుచుండుట, యజ్ఞానము. సూర్యచంద్రదు లొకరియింటిపై పూలవాన కురిపించి

యింకొకరి యింటిమీద నగ్నివర్షము కురిపించరు. సమానముగా ప్రకాశించుచుందురు. రాత్రింబగళ్ళు రాజుకొరకు తానువారికావు గనిచినను ప్రసాదించును నా ఫలపుష్పాదులనే ప్రకృతి పేదవానికిని ప్రసాదించును. అదికానక కడుపుకాలుచున్న పేదవానినిచూచి ధనమంతుడసహ్యించుకొనును. తనకలిమికి కులుకుచుండును పరమేశ్వరుడు మానవునకు ధనసంపదలు, పదవులు, పరులను బాధించుచు తాను గర్వించుటకొఱకీయలేదు. పరులకుపకార మొనరించుటకొఱకొసంగెను.'

వరలుడు మంచిమాటలతో శిలాదిత్యునకు నీతియు ధైర్యము బోధించెను. వానిదుఃఖమును చల్లార్చెను వానిని వెంటపెట్టుకొని కందారదుర్గమునకు కొనిపోయెను. కందారదుర్గము మహోన్నతమైనది. ఎత్తగు బురుజులతో నున్నతములగు ప్రాకారములతో బలిష్ఠమైయుండును. అది శత్రువుల భేదింపరానిది. అది మిగుల యంత్రముకలదై కనులకు నింపుగొలుపుచుండును కాని యిప్పుడది తుప్పలు తుమ్మలు జిల్లేడులు మొలిచి చిట్టడవిగా మారినది. దానిని పరామర్శించువారులేరు. బాగుచేయువారు లేరు. వరలుడు శైలాదిత్యునితో నా యడవియందు దారిచేసికొని దుర్గముదాపునకరిగెను. శైలాదిత్యునకు హృదయముపొంగినది. దుర్గదర్శనముచే మరల తానొక మహారాజునైతినని యానందించెను. పదవులందు వ్యామోహముకలవారికి మానాభిమానములుండవు. ఒకమారి చవిమూచినతరువాత పదవిని విడిచిపెట్టజాలరు. ఎవరేమనుకొనినను వారికి లక్ష్యముండదు.

శైలాదిత్యుడు కోటయందు ప్రవేశించెను. నరలుడు వానిని వెన్నంటిపోయెను. వీధులన్నియు పాడుబడినవి. గృహములు తాళములు పెట్టబడినవి. రాజభవనములన్నియు తెరచినతలుపులు తెరిచినట్లులనే యున్నవి. వేసినపక్కలు వేసినట్లులనే యున్నవి కాని యన్ని దుమ్ముకొట్టుకొనియుండుటచే కళావిహీనములై కనబడుచుండెను. శైలాదిత్యుడు రాజసౌధమంతయు పరిశీలించెను. నరలుడా సౌధమునందొకభాగమును శుభ్రపరచి శైలాదిత్యునందుపరుండనియమించెను. నడచిన బడలికచేతను మెత్తనిపక్క లభించుటచేతను శైలాదిత్యుడు నరలుడుపెట్టిన ఫలములనుతిని యొడలు తెలియక నిద్రించెను.

శైలాదిత్యుడింతవరకు కన్నార నిద్రించి యెరుగడు. ఆనాడాతనికి మైకము క్రమ్మినట్లైనది. అంతలోపున నరలుడు రాజభవనమంతయు పరిశీలించెను. దారులు వెదుకుకొనుచు నుద్యానవనములోని కరిగెను. అచట నిద్రించుచున్నవారివలె వేదికలపై పడియున్న రత్నప్రభను వేదకుంభుని గాంచెను. మహారాజు వైద్యుతి సింహాసనమున తలవాల్చియుండెను. వానిచుట్టు పరివారములు కత్తులను విడువక పట్టియుండిరి. పండితులు గాయకులు నెచ్చటివారచ్చటనే కొయ్యబొమ్మలవలె బిగుసుకొని పోయిరి. వారి ముఖలక్షణములను నరలుడు పరిశీలించెను. వారియందు మరణించినవారి చిహ్నములు కనిపించలేదు. నాడులు పరిశీలించెను. అవి వానికి గోచరించలేదు. వారినందరినితీసి యొక్కొక్కరినిగా

రాజభవనమందు చేర్చి... వరలుడు. అప్పటికి సాయంకా లము కావచ్చినది. శైలాదిత్యుడు నిద్రనుండి మేలుకొనెను.'

'మహామంత్రీ! అని కేకవేసెను.

'వరలుడు మహారాజా! యిదిగో వచ్చుచుంటిని' అని పరుగు పరుగున రాజును సమీపించెను.

'ఏమి ప్రభూ!'

నేను ప్రభువునా? రాజ్యములేని యీ ప్రభుత్వము దేనికి.

లేకేమి ప్రభూ! యిదియంతయు మీరాజ్యమే. ఇది మీకోట. మీరిప్పుడు రాజసౌధము నందున్నారు.

'రాజసౌధమునందా!

'ఆ. అవును'

మా మహారాణియేది? ఇంకెక్కడి మహారాణి మరణించెనుకదా! శైలాదిత్యుడు వెక్కి వెక్కి యేడ్వనారంభించెను.

మహారాణి యంతఃపురమునందున్నది. ఏల విలపించెదరు?

'అంతఃపురమునం దున్నదా? మరణింపలేదా?

'లేదు ప్రభూ! లేదు.

'అబద్ధము. మహామంత్రీ యబద్ధము'

అబద్ధముకాదు ప్రభూ! మీరు చూడవచ్చును.

ఏది యెక్కడనున్నది. అచ్చటికి నన్నుకొనిపొమ్ము.

వరలుడు శైలాదిత్యుని వెంటపెట్టుకొని, యంతఃపుర ములోనికి గొనిపోయెను. అందొక గదిలో మంచముమీద

పకుండబెట్టిన గోకకుంభగని చూపించెను. శైలాదిత్యుడు మిగాదిగు గుసకు బిట్టి వానిముఖమును పరిశీలించెను. అంత వానికి కాంతి పూర్వ స్మృతి కలిగినది. శైలాదిత్యుడు దేవేంద్రుని వెంట వచ్చిన వానికార్యమునకు లోలోన సిగ్గిలెను. కళవళపడెను. విషాదమునొందెను. వాని వేయి కన్నులనుండి ధారలు గానదిని ప్రత్యక్షముగా తిరిగిచూచెను. ఆటంకముడులేదు. అతడు సకలుడుగానుండెను? వరుండు సర స్వతి గొనన్తిని సం దానను తెలిపెను. దేవేంద్రుడు వేదకుం భుని ప్రక్కన కూర్చుండి ముఖము నిమురుచు కంటిరెప్పలను తెరచెను. కనీనికలందు తేజమున్నదన్ని ఇంద్రునిరూపము వానియందు గోచరించెను. క్రమక్రమముగా వేదకుంభునకు జీవములు వచ్చినవి. అతడు లేచి కూర్చుండెను. వానికి పూర్వ జ్ఞానము కలిగినది.

'అయ్యా! మీరెవరు? అని ప్రశ్నించెను.

నేను దేవేంద్రుడను అని యింద్రుడు సమాధానము చెప్పెను.

నా విద్యుల్లేఖయేది. వారు రత్నప్రభను చూపించి జరిగినదంతయు తెలిపిరి.

కళాధరా. వాసుకి శిరమున నాగమణికలదు. దాని కాంతి పకుటచేత విషము దిగి వీరందరు బ్రతుకగలరు, అని యింద్రుడు పలికెను. వానిని పాతాళమున దిగవిడిచి యింద్రాదులు మాయమైరి.

౩

వేదసంభవుడు వాసుకిచేత తిరస్కరింపబడి పాతాళేశ్వరుని యాలయమునందు ప్రవేశించెను. వేదోక్తముగా నా దేవదేవుని ప్రార్థించెను. సర్వశక్తిని స్తుతించెను. సన్నిధిని శారదను మనసారతలంచెను. పద్మాసనము వేసికొని సుఖాసీనుడయ్యెను. దీపక రాగాలాపనను ప్రారంభించెను. కొంత కాలము గడచినది. శివుని మహాదేవ నేత్రమునుండి సన్నని నల్లనగు పొగలు బయలుదేరినది. అది యంతకంతకు దట్టమై నల్లనివర్ణము దాల్చినది. అది దేవాలయమునందంతటను నిండి కారుచీకటులు వ్యాపింపచేసెను. అనతిక్షణములో పాతాళలోకము నందంతటను వ్యాపించినది. వాసుకి నివాసమునందు నల్లని కారుచీకటులు క్రమ్మెను. రత్నదీపములు మలినములయ్యెను. కన్ను పొడిచికొనినను కానరాలేదు. వాసుకి భయభ్రాంతుడయ్యెను. విలయమేఘము లావరించినట్లు తోచెను. నాగజాతి వారందరు, నెక్కడివారక్కడ నిర్ఘాంతపోయి నిలిచిరి. హృదయములు దడదడలాడినవి. ఈ కారుచీకటులెక్కడివి. ఈపొగ లేమియని పైవంక నరసిరి. ఘడియ కాలము గడచినది. దేవదేవుని కంటి సన్నని నిప్పుమంటలు, రక్తకాంతులతో బయలుదేరినవి. అవి సూర్యకిరణములకంటె వాడియయి కారుచిచ్చుకంటె వేడియయి, పాతాళమున నలువైపులు చుట్టుముట్టినవి. ఆ తీవ్రతకు నాగుపాముల యొడలు మంటలెక్కి కాలినటులు బొబ్బలు తేరినవి ఆ బాధను భరింపలేక వాసుకిని చేరి తమబాధలను మనవిచేసికొనినవి. వాసుకి యొడలంతయు పుళ్ళమీద కారము వ్రాసినటుల, భగభగమండి

పోవుచుండెను. మరుక్షణమున విలయాగ్నివలె మంటలెల్లెడల నావరించినవి. వాసుకి ప్రాణభయముచేత పాదములనుండి తలవరకు వణకిపోయెను. ఇది వేదకుంభుడు కొనసాగించిన యవమాన ఫలితమని తలంచెను. తనభటులబంపి వేదకుంభుని పెడకేలుకట్టికొనిరండని యాజ్ఞాపించెను.

వేదకుంభుని ముఖమున బ్రహ్మతేజము వెలుగొందుచుండెను. అరమోడ్పు కనులతో ప్రసన్నమగు ముఖముతో స్వరయుతముగా దీపకరాగ మాలపించుచుండెను. పరమశివుని లలాటనయనమునుండి స్వరముపోకడల ననుసరించి, నిప్పుమంటలు వెడలుచుండెను. వాసుకిభటు లదిగాంచి భయకంపితులైరి. వేదకుంభుని పలుకరించుటకైన వారికిధైర్యము చాలలేదు. తిరిగివారు వెడలిపోయి, వాసుకికి ఆసంగతి తెలియచెప్పిరి. వేదకుంభుని శక్తిసామర్థ్యములు మొదట వానికి తెలియలేదు. ఇప్పుడు బాగుగా గోచరించినది. ఆలస్యమొనరించినచో తనకులమువారందరు నగ్నికీలలలోపడి మగ్గిపోవుదురను భయముకలిగినది. తన పరివారములతోలేచి వేదకుంభుని కడకరిగెను. వానిపాదములమీదపడిరక్షింపుమని ప్రార్థించెను. తన తలపైనున్న నాగమణిని వేదకుంభుని యెదుటనుంచెను.

బ్రాహ్మణులకోపము క్షణభంగురము. వేదకుంభుడు రాగాలాపమును మాని కనులు తెరిచెను. క్షణములో నగ్నికీలలంతరించిపోయినవి.

వాసుకి బ్రాహ్మణోత్తమా! నీప్రభావ మెఱుగక నేకారులరచితిని, నన్నుక్షమింపుడు. ఈ నాగమణిని గైకొనుడు. మీపని కాగానే నాకు మరలదయచేయుడు, అని వేడుకొనెను.

వేదకుంభుడు శాంతచిత్తుడయ్యెను. వాసుకి తోగూడ నాగకుమార్తెయు, సోమాలుడు, జోత్స్నావళి మొదలగువారం దరు నచటికివచ్చిరి. నాగరాజకుమారి వేదకుంభుని వృత్తాంత మంతయు వారికి తెలిపెను.

శారదాకుమారా! అజ్ఞానముచేత నాభర్త నీకు,విద్యు ల్లేఖకపకారము గావించెను వానినిక్షమించి నన్ను కనికరిం పుము. నాకు భర్తృభిక్ష పెట్టుము. అని కన్నీటితో ప్రార్థిం చెను.

అమ్మా! నాగరాజకుమారీ! బ్రాహ్మణులు పరులను బాధించుటకిష్టపడరు తమకపకారముచేసిన వారికి సైతము ఉపకారముగావింతురు. నావలన నీభర్తకేయపకారము కలు గదు. సుందరమగు దానిని ప్రేమించుట ప్రతిజీవికి సహజ గుణము. కాని స్వలాభముకొరకు పరులకపకారము కావిం చుట రాక్షసకృత్యము. తనకు లాభింపదని సౌందర్యమును వినాశమొనరించుటకంటె, ఘాతకమింకొకటి యుండదు. నీభర్త రత్నప్రభను కిరిచి ఘోరపాపము గావించెను. దానికి శిక్ష యా పరమేశ్వరుడే యొసంగవలయును. నేను కావింపగల దేమియులేదు. అని యామె నోదార్చెను.

వాసుకి సర్వవిషయము లవగతములైనవి. అతడు స్వాసీ నుడొనరించిన యాకార్యమునకు లోలోన విచారించెను. వేదకుంభునితోగలిసి కంధారదుర్గమునకు వచ్చెను. అచటి పరిస్థితులనన్నింటిని చూచెను. నాగమణిప్రభావమున నచటి వారిని విషవిరహితుల గావించెను వైద్యుతి జరిగినదంతయు వేదకుంభునివలన వినెను. రత్నప్రభాదులు మరల జీవించుటకు

మహానందము నొందెను. కంధారదుర్గమంతయు లెగువిధముగా బాగుచేయబడెను. ప్రజలు యథారీతిగా వారివారి యిండ్లకు చేరుకొనిరి. స్వసేనుడు తానొనరించిన ఘోరకృత్యములకు పశ్చాత్తాపమునొందెను. అచటికివచ్చి రత్నప్రభా వేదకుంభులను క్షమింపుమని ప్రార్థించెను.

అనంతరము వాసుకి స్వసేనునిగాంచి స్వసేనా ! నీ వింతకాల మెచ్చటనుంటివి ?' అని ప్రశ్నించెను.

స్వసేను డిట్లు చెప్పెను.

'రత్నప్రభ నన్నాజ్ఞాపించినటుల మందారవృక్షమును విషపూరితముకావించితిని. అది దావాగ్నిచే మలమలమాడిన యడవిచెట్టువలె మాడిపోయినది. తరువాత కపాలిక వేషమున నన్ను విడిపింపవచ్చిన నాగభటుడు' నాగరాజ కుమారి, నీకయి యన్నపానములను నాహారవిహారములను మాని కడు విలపించుచున్నది. నిన్ను వెదకికొని తెమ్మన్నది. నీయెడబాటు భరింపలేక మరణింపయత్నించుచున్నది. ఆమెను నీవుపోయి బ్రతికించుకొనుము'అని నన్నుపిడిపిపుచ్చెను కాని నామనస్సునందలి కోపమణగలేదు. అది క్షణక్షణము నన్ను ప్రతీకారమొనరింపుమని యుసికొలుపుచుండెను. ఇంతటితో నీకథ పరిసమాప్తికావలయునని తలంచితిని. ఎవరికి కానరా కుండవచ్చి మల్లికాజోంపమున దాగియుంటిని. సమయము కనిపెట్టి రత్నప్రభను కాటువేసితిని. ఆమె చెలికత్తెలు నన్ను గాంచి యరువనారంభించిరి. నా ప్రాణములకు భయపడి విషానలకీలలను వెడలించుచు, పూత్కారములు చేసితిని. వారలు

రేగినవి. విషవాయుప్రభ. నానాప్రాణులలో చొరబారి యుం
నను మూర్ఛిల్లితిని. నేను రాజోద్యానమును దాటి బైటపడ
వలయునని త్వరత్వరగా నడుచుచుంటిని. అంతలో కపాలికుడు
నాకెదురయ్యెను. నా యవస్థను గ్రహించి నన్ను పట్టుకొన
నెంచెను. గారుడమంత్రముచేత నన్ను నిర్విషగావించెను. నాపై
తన యుత్తరీయమును వేసి పట్టుకొనెను తనయింటికి తీసుకొని
పోయి నన్నొక బుట్టయందు బంధించెను రాజోద్యానమున
జరిగినసంగతులు పురజనులవలన వినెను. దానికి కారణము
నేనే నైయుందునని పరిగ్రహించెను. నన్ను చంపవలయు
నని ప్రయత్నించెను

నేను వానితో నిట్లంటిని 'కాపాలకా! మీరు నాకప
కారముకావించిరి. నేను స్వసేనుడను సర్పరాజును. దీనికి
చాల కథకలదు అది నీకు చెప్పరాదు. రత్నప్రభా వేదకుం
భులు దేవాంశమున పుట్టినవారు. శాపవశముచేత నిట్లు
జన్మించిరి. కొంతకాలమునకు శాపవిముక్తి కలుగును.
అప్పుడు వారికి మేలుకలుగ గలదు. నేను మరణించినచో నప
కారమగును. నన్ను చంపవలదు' అంటిని.

వాడు నన్ను చంపక బంధించియుంచెను. అతడు
నన్ను తనతో ప్రక్కనమున్న గ్రామమునకు గొనిపోయెను.
గావిషమునంతయు పిండి కోరలూడతీసెను. నిన్న కాపాలిక
శ్రీచట జరిగినదంతయువిని; నన్నిచ్చటకు కొనివచ్చెను. నేను
జరిగినంతయు వివరించి యిచ్చుటకై వచ్చితిని. అదిగో యతడే
కాపాలికుడు' అని చూపెను.

వైద్యుతి రాజపురోహితుని బిలిపించి, రత్నప్రభా వేద కుంభుల వివాహమునకు శుహూర్తములు పెట్టించెను. రాజుల కందరకు వార్తలు పంపెను. శ్రీధరుడు సైతము వచ్చెను. తన కుమారుని కుమార్తెనుజూచి యానందించెను. రత్నప్రభా వేదకుంభులకు వివాహము జరిగెను. శ్రీధరుడు కోహాలునకు తన కుమార్తెనిచ్చి పెండ్లి గావించెను. అనంతరము రత్నప్రభా వేదకుంభులు దేవలోకమున కరిగెను.

స మా ప్త ము